శ్రీరామ శ్శరణంమమ.

చత్వారింశద్రామాయణసారభూతం

# ఆశ్చర్యరామాయణం

శ్రీ రామాయణకేసరీత్యాదిబిరుదాంకితేన

విజయవాటికా హైందవోన్నతాంగ్లకలాశాలా

ప్రధాన సంస్కృతోపాధ్యాయేన

## లక్ష్మీవఝుల వేంకటకృష్ణశాస్త్రిణా

సంగ్రథితం

ప్రకటీకృతం.

బెజవాడ,

శ్రీ రామా ముద్రాక్షరశాలాయాం

ముద్రాపితం.

౧౯౩౫.

 [మూల్యం. రు 1—4—0.



గ్రంథరచయిత,

లక్కావఝుల వేంకట కృష్ణశాస్త్రి.





# అంకితసమర్పణం



శ్లో॥ శ్రీభద్రాచలరామచంద్ర! చరణద్వంద్వే త్వదీయే మయా।
లక్ష్మావఝుల కృష్ణనామక భవద్దాసేన సంగుంభితం॥
భక్త్యా చాఽంకితరూపతోఽర్పిత మిదం త్వాశ్చర్య రామాయణం।
జీయా దారవిచంద్ర తారక మలం మచ్ఛ్రేయసే భూయసే॥

శ్రీరామార్పణమస్తు-
శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః



ఈబాలకాండ ప్రథమభాగ గ్రంథముద్రణమునకు విరాళములనొసగుపోషకవర్గమువారి నామములు ప్రకటింపఁబడుచున్నవి.

## మహారాజపోషకులు.

| | | |
|---|---|---|
| మ॥ రా॥ శ్రీ. | వల్లభజ్యోశ్యుల పరబ్రహ్మశాస్త్రిగారు, రిటైర్డు డిప్యూటీకలెక్టరు, బందరు. | 116-0-0 |
| ,, | అంబడిపూడి రామకృష్ణశాస్త్రుల్లుగారు, అగ్రహారీకులు, మాటూరు. | 45-0-0 |
| ,, | వద్దిరాజు వెంకటరంగారావు దొరగారు, దేశముఖులు మట్టివాడ. | 25-0-0 |
| ,, | రాళ్లబండి హనుమంతరావుగారు, భూస్వాములు బందరు. | 20-0-0 |

## రాజపోషకులు.

| | | |
|---|---|---|
| మ॥ రా॥ శ్రీ. | రావుబహుద్దూర్ కృత్తివెంటి నాగేశ్వరావుగారు, రిటైర్డు డిప్యూటీ కలెక్టరు, బెజవాడ. | 15-0-0 |
| ,, | కొండారు రామారావుగారు, M.A L.T Head Master, H. H. School Bezwada | 15-0-0 |

మ॥ రా॥ శ్రీ. భాగవతుల లక్ష్మీనారాయణగారు
B. A. B. L. ప్లీడరు, బందరు. 15-0-0

,, భాగవతుల నారాయణరావుగారు
రిటైర్డు సబ్ మేజస్ట్రీటు, బందరు. 15-0-0

,, కంభంమెట్టు సత్యనారాయణశర్మగారు
B. A., Manager, Institute of commerce, బెజవాడ. 15-0-0

,, పర్వతం కోటయ్యగారు,
గ్రామాధికారి, వీరవల్లి. 15-0-0

,, పర్సా పట్టాభిరామయ్యగారు,
దేశముఖ్, కారేపల్లి. 15-0-0

పర్సా రామనాథంగారు దేశముఖ్ ,, 15-0-0

,, జొన్నలగడ్డ శేషాచలశర్మ, బెజవాడ. 15-0-0

,, పెరిశేపల్లి కుటుంబరావుగారు,
సబ్ ఓవర్‌సీర్, బెజవాడ 15-0-0

,, శివరాజు వీరభద్రరావుగారు, మడిపల్లి. 15-0-0

,, సబ్ డివిజనల్ ఆఫీసరు తుర్లపాటి చలపతిరావుగారి తల్లి పున్నమ్మగారు బెజవాడ. 15-0-0

# ప్రధాన పోషకులు.

మ. రా. శ్రీ. శేట్టలూరి వెంకటరాఘవయ్యంగారు, M. A. L. T. టీచరు, హిందూ హైస్కూల్, బెజవాడ. 10-0-0

మ॥ రా॥ శ్రీ. కట్టమూడి రామకృష్ణారావుగారు, టీచరు హిందూహైస్కూల్, బెజవాడ 10-0-0

,, కరిపినేని రాజయ్యగారు, కొరిమెర్ల. 10-0-0

,, మకరాల లక్ష్మీకాంతయ్యగారు, తిరువూరు. 10-0-0

,, గుడిపాటి పుండరీకాక్షశర్మగారు తేలప్రోలు 10-0-0

,, బొమ్మారెడ్డి అప్పిరెడ్డిగారిభార్య సుబ్బమ్మగారు పామర్రు. 10-0-0

## పోషకులు.

మ. రా. శ్రీ. Ch. వెంకటసుబ్బారావు, కంభంపాడు. 5-0-0

,, వెంపటి వెంకటేశ్వరశాస్త్రిగారు, బోర్డుహైస్కూలు పండితులు, గుడివాడ. 5-0-0

,, యల్లంరాజు వుమామహేశ్వరావు గారు, Over seer, బెజవాడ. 5-0-0

,, కురుమద్దాలి కొండంరాజుగారు, బెజవాడ. 5-0-0

,, వీరుభొట్ల శీతారామయ్యగారు, బెజవాడ. 5-0-0

,, దొంతరాజు హనుమంతరావుగారు,
కంట్రాక్టరు, బెజవాడ. 5-0-0
,, ప్రతాప రాఘవయ్యగారు, బెజవాడ. 5-0-0
Hindu High School, B. A., B. E. D. Teachers.
,, దుర్గి వేంకటరాజేశ్వరరావుగారు, ,, 5-0-0
,, బులుసు సుబ్రహ్మణ్యంగారు, ,, 5-0-0
,, నిట్టల నరసింహంగారు, ,, 5-0-0
,, పూళ్ళ వల్లభరాయుడుగారు, ,, 5-0-0
,, పిడూరు శ్రీరాములుగారు, ,, 5-0-0
,, అయనారపు వెంకటరమణయ్యగారు,
రిటైరుడు సబ్ డివిజనల్ ఆఫీసర్, మధిర. 5-0-0
,, కందిబండ వెంకటపురుషోత్తమరావు
గారు, హైకోర్టు వకీలు, మధిర. 5-0-0
,, జి. అనంతపద్మనాభశాస్త్రిగారు,
హైకోర్టు వకీలు, మధిర. 5-0-0
,, మాటూరి రంగారావుగారు, ఫ్రూవర్ శీర్ ,, 5-0-0
,, గోగు రామయ్యగారు, బెజవాడ. 5-0-0
,, కసిలంక వెంకట్రావుగారు, ,, 5-0-0
,, వేటూరు సత్యనారాయణరావుగారు, 5-0-0
,, పుళ్ళకండం సత్యనారాయణగారు, మధిర. 5-0-0
,, మాటూరి నారాయణరావుగారు,
మాటూరు, 5-0-0
,, తోలేటి శీతారామానందరావుగారు,
మొఖాసాదారు, పెంగోలను. 5-0-0
,, పూటుకూరి వెంకటరామారావుగారు, ,, 5-0-0

,, కోట వెంకయ్యగారు, పెంగోలను. 5-0-0
,, వేముగంటి రామకృష్ణారావుగారు,
హైకోర్టువకీల్, కంభంమెట్టు 5-0-0
,, జమలాపురపు వెంకటేశ్వరారావుగారు,
హైకోర్టు వకీలు, కంభంమెట్టు. 5-0-0
,, సర్వదేవరభట్ల వెంకటరాజయ్యగారు,
సబ్ రిజష్ట్రారు, కంభంమెట్టు. 5-0-0
,, కావూరి సూర్యనారాయణశాస్త్రి
గారు, కంభంమెట్టు. 5-0-0
,, దాచేపల్లి వెంకటరామనర్సయ్యగారు,
కంభంమెట్టు. 5-0-0
,, కనకదండి సూర్యనారాయణగారు, ,, 5-0-0
,, నిట్టల కుమారస్వామిగారు, యక్సైజు
సబ్ యినస్పెక్టరు, పామర్రు. 5-0-0
,, రాళ్ళబండి శీతారామయ్యగారు, ,, 5-0-0
,, కే. శ్రీనివాసరావుగారు, డాక్టరు, ,, 5-0-0
,, వడ్డి లక్ష్మీనృసింహంగారు.
సబ్ రిజిష్ట్రారు, పామర్రు. 5-0-0
,, తుర్లపాటి వెంకటహనుమంతరాయ
దీక్షితులుగారు, చేర్మెన్, పామర్రు. 5-0-0
,, తమ్మారెడ్డి రంగారెడ్డిగారు, బియ్యే
బియ్యెల్, పామర్రు. 5-0-0
,, తుర్లపాటి వీరరాఘవయ్యగారు, ,, 5-0-0
,, తుర్లపాటి కృష్ణమూర్తిగారు. ,, 5-0-0

,, గుడిపాటి కృష్ణమూర్తిగారు, తేల్ప్రోలు. 5-0-0
,, డి. వెంకటేశ్వరావుగారు ,, 5-0-0
,, కోట వెంకటనారాయణ
వీరభద్రయ్యగారు ,, 5-0-0
,, ఆతుకూరు రామసుబ్బారావుగారు
యీ వెంకటనర్సయ్యగారు తేల్ప్రోలు,, 5-0-0
,, మాడుగుల చలమయ్యగారు ,, 5-0-0
,, అమ్మనమంచి కామయ్యగారు, మధిర. 5-0-0
,, గొట్టుపర్తి సుబ్బారావుగారు,
హైకోర్టువకీలు, సింగరేణికాల్వరీ. 5-0-0
,, వద్దిరాజు రామరంగారావుగారు,
దేశముఖి, మట్టివాడ. 5-0-0
,, ఆదిమూలం వెంకటామూరావు,
దొరగారు దేశముఖి కమలాపురం. 5-0-0
డాక్టరు వి. రామమోహనరావుగారు హనుమకొండ 5-0-0
,, బి. ఉమామహేశ్వరశాస్త్రి,
డాక్టరు, కొల్లిపర. 5-0-0
మానేపల్లి వుమామహేశ్వరంగారు కామవరపుకోట. 5-0-0
,, కొమరగిరి వెంకటనరసమ్మగారు,
గండేపల్లి 5-0-0
,, కరిపినేని శేషమ్మగారు, కొరిమెర్ల. 5-0-0
,, కరిపినేని చిలకమ్మగారు ,, 5-0-0

పై పోషకవర్గములో విరాళములనిచ్చినవారు కొలదిమంది మాత్రమేకలరు. ఈమునివారలు వెంటనేయీయఁబ్రార్థితులు.

# బాలకాండము.
## (ప్రథమ భాగము.)

# విషయసూచిక.

శ్రీ ర స్తు — శు భ మ స్తు.

# ఉ పో ద్ఘా తః

భో భో విద్వద్బృందారకాః స్వీక్రియతామియం విజ్ఞప్తిః రామాయణం రామాయణమితి శిరోభిరుహ్యతే కిలాఽబాల గోపాలం, రఘువంశప్రశంసాపతాకికా లోకపావనీ కాచి త్కథాసుధా-స్పష్టమేవ విదుషాం- తత్ప్రపంచోఽపి వ్యాస వాల్మీకివిశ్వామిత్రాదికవిసత్తమై ర్మహాత్మభి స్స్వస్వభక్తి పారవశ్యాద్బహుధా వర్ణితఇతి.తత్రాప్యస్తి భిదా పరస్పరం రామాయణానామితి రణరణకం కృత్వా మూలస్యాప్య ప్రమాణతాం సంపాదయంతిస్మాధునికాః-తదపనోదమిచ్ఛుభి శ్శ్రీరామాయణతీర్థేత్యాదిబిరుదాంకితైఃలక్కావఝుల వెంకట కృష్ణశాస్త్రిభిః పరిశీల్యచత్వారింశద్రామాయణాని పరి గృహ్య సారం పరిభావ్య పరభావం దిలీపచరితశాంతా జననస్వయంవరాదిచిత్రకథాకలనేన స్వకృతే రాశ్చర్య రామాయణమితి నామ నిర్వాహ్య వేదోపబృంహణాయే దమితిహాసమితి వాల్మీకిప్రతిజ్ఞావివేచనాయ తత్రతత్ర పదగతధర్మప్రవృత్తింసూత్రాదిభిఃప్రమాణయద్వ్యాఖ్యాయ, గీర్వాణభాషానభిజ్ఞానా ముపకారాయ ప్రతిశ్లోక మాంధ్ర వచనరచనయాఽనుగృహ్య పరిష్కృతం పరితోఽధునా పర ముపకురుతఇదం పుస్తకం పండితపామరాణాం,అపిచ భవిష్య పురాణానుసారేణ ద్వాపష్టైః రామపూర్వాణాం రాజ్ఞాం పరిపాలనకాలవిశేష శ్చ నిరధారి - తత్తత్కథాఽనోన్యస్య

శ్రీరస్తు — శుభమస్తు.

# ఉపోద్ఘాతము.

ఓ పండితశ్రేష్ఠులారా! ఈ విన్నపమును స్వీకరింపుడు. రఘువంశ ప్రశంసకుం బతాకమగు, లోకపావనమగు రామకథామృతమును, రామాయణము రామాయణమని యాబాలగోపాలము తమ శిరములచే వహించుచుండెననియు, నా కథాప్రపంచమును, వ్యాసవాల్మీకి విశ్వామిత్రాది కవిసత్తములగు మహాత్ములు తమతమ భక్తిపారవశ్యముచే ననేకవిధములుగ వర్ణించిరి యనియుం బండితులకుం దెలిసినవిషయమే యైయున్నది. ఆ రామాయణములకునుం బరస్పర భేదమున్నదియని యాధునికులు మూలములకుం గూడ నప్రామాణ్యమునుం గల్పించుచుండిరి. వాని నన్నిటినిం బోగొట్టదలచి రామాయణతీర్థత్వాదిబిరుదాంకితులగు లక్ష్మణార్యుల వేంకటకృష్ణశాస్త్రిగారు నలుగురు రామాయణములనుం బరిశీలించి వానిలోని సారమును గ్రహించి సద్భావమునుం బరిభావించి దిలీపచరితము, శాంతాజననము, శాంతాస్వయంవరము, మొదలగు చిత్రకథాసంకలనముచేం దనగ్రంథమున కాశ్చర్యరామాయణమను నామమును నిర్వహించి, రామాయణము వేదోపబృంహకమనెడి వాల్మీకిప్రతిజ్ఞను నిరూపించుటకు నచ్చటచ్చట పదములయందలి ధర్మప్రవృత్తికి సూత్రాదులనుం బ్రమాణములనుగాం జూపుచు వ్యాఖ్యానమునుం జేయుచు, సంస్కృతభాషను గుర్తెఱుంగనివారల యుపకారమునకై ప్రతిశ్లోకమునకుం దాత్పర్యమును వ్రాయుచు వారిచేం బరిష్కృతమైన యీపుస్తకము పండితపామరులకు మిక్కిలి యుపయోగకరమై యున్నది. మఱియు రామచంద్రమూర్తికిం బూర్వులగు నలువదియిద్దరు రాజుల పరిపాలనకాలనిర్ణయములను భవిష్యపురాణానుసారముచే నిర్ధారణము చేసిరి. ఆ మూలకథలకుం బరస్పరసంబంధము పూర్వజన్మవృత్తాంతముల వర్ణనము, మనస్సును మిక్కిలి యాశ్చర్యరసములో మునుగునట్లు చేయుచున్నందున నీగ్రంథమున కాశ్చర్యరామాయణమని నామకరణమునుం జేయుట యుక్తమని తలచెదను.

సంబంధః పూర్వజన్మాదివర్ణనం చాఽతీవ మన ఆశ్చర్యరస
మగ్నం తనోతీతి యుక్తమస్యాశ్చర్యరామాయణత్వ మితి
మన్యే — తత్తద్ఘట్టేషు తత్తదృషిప్రణీతై శ్శ్లోకై స్సంధాన
ప్రయోజనై స్స్వకీయై శ్చాఽన్యైస్సంగ్రథితోఽయం గ్రంథః.
సంప్రత్యేన మానుపూర్వ్యా చిరకాలాభిలషితం రామాయ
ణకథాసందేహకంటకశోధనంకుర్వంత్వార్యా ఇతి ప్రార్థ
యామహే- తత్రభవంత శ్శాస్త్రివర్యాః కృష్ణామండల
లాంతర్గతపామర్రుగ్రామవాస్తవ్యా శ్చిరకాలాధ్యుషిత
విజయవాటికాహైందవాంగ్లకలాశాలాప్రధానసంస్కృ
తోపాధ్యాయపదవీకా స్తర్కవేదాంతజ్యోతిరాదిశాస్త్ర
తత్త్వపారదృశ్వాన స్సప్తచత్వారింశత్సమాః యోవిభాజితా
స్తత్రతత్ర ప్రణీతస్వరామాయణానువచనేన సంపా
దితానేకబిరుదా రారాజంతే సర్వవిధయా సమృద్ధ్యా-
ఇతఃపరంవిశేషాన్గ్రంథరాజఏవాఽవగమయితేతి విరమ్య
తాదృశమహాకృతిసంతానవిరచనాయ శ్రీమతో ఽ
భ్యర్థయే తేషాం దీర్ఘాయురారోగ్యాదిప్రదానాయ భగ
వంత ముమాకాంతం రమాకాంతం చ ధ్యాయే బహుప్ర
యాసాసాదితస్యైతస్య గ్రంథస్య ముద్రణాదిద్రవ్యసాధ్యప్ర
యోజనేషు సర్వేఽపి సహాయా భవంత్వితి। ప్రార్థయ న్నితో
విరత ఏవాహం-అనసూయాగ్రహగ్రస్తహృదయేభ్యస్సర్వే
భ్యోఽపిరోచత ఏవాఽయంకోశః-రోచత ఏవాఽయంకోశః-

25—8—35,
బెజవాడ.
ఆల్మకాం.

ఇత్థం, పండితవిధేయః
తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రీ.
శతావధానీ, చందవ్రోలు.

ఆయాఘట్టములయందు నాయామహర్షి ప్రణీతములగు శ్లోకములను పరస్పరశ్లోకసంధానముకొఱకు మధ్యమధ్యంబున స్వయంకృతశ్లోకములను మఱియు నితరములగు శ్లోకములను గూర్చి యీగ్రంథము కూర్పఁబడినది. ఈగ్రంథము నానుపూర్విగాఁ బఠించినచోఁ జిరకాలమునుండి యభిలషింపఁబడు రామాయణకథాసందేహకంటకశోధనము నార్యులు చేయుదురు గాకయని ప్రార్థించుచున్నాఁడను.

పూజ్యులగు శాస్త్రిలవారు కృష్ణామండలములోని పామఱ్ఱుగ్రామ నివాసులును, చిరకాలమునుండి బెజవాడపురమునందలి హిందూహైస్కూల్‌లో ప్రధాన సంస్కృతోపాధ్యాయపదవి నలంకరించినవారును తర్క-వేదాంతజ్యోతిశ్శాస్త్రాదిశాస్త్రతత్త్వములనుఁ బాగుగఁ జూచిన వారలును. నలుబదియేడు సంవత్సరముల వయస్సుచే నొప్పువారునుఁ దమచే రచింపబడిన యాశ్చర్యరామాయణమును నచ్చటచ్చట వినిపించి బిరుదములను సంపాదించినవారునై సర్వసమృద్ధిచే నొప్పుచుండిరి. ఇంతకంటె విశేషములను నీగ్రంథరాజమే తెలియఁజేయుగలదని విరమించి యిటువంటి యుద్గ్రంథములను రచించుటకు శ్రీ శాస్త్రిలవారిఁ బ్రార్థించుచు వారికి దీర్ఘాయురారోగ్యాదుల నిచ్చుటకు భగవంతుడైన యుమాకాంతుని రమాకాంతుని ధ్యానించుచు, బహుప్రయాసముచే సంపాదింపఁబడిన యీగ్రంథముయొక్క ముద్రణము మొదలగు ద్రవ్యసాధ్యములగు కార్యములయందు నందఱు సహాయులగుదురు గాత యని ప్రార్థించుచు నింతటితో నేను విరమించుచుంటిని.

అసూయాగ్రహగ్రస్తహృదయులు కానివారలందఱకును నీగ్రంథము రుచించును. ఈగ్రంథము రుచించును.

25—8—35,
బెజవాడ
ఆల్‌మకాం.

ఇట్లు పండితవిధేయుడు,
తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి,
శతావధాని, చందవోలు.

# ఆంధ్రదేశీయ విద్వత్పరిషదభిప్రాయః–

శ్రీమద్భిః రామాయణకేసరీత్యాదిబిరుదాంకితైర్విజయ వాటికాహిందూన్నతాంగ్లకళాశాలాసంస్కృతప్రధానోపాధ్యాయై ర్లక్కావరుల వేంకటకృష్ణశాస్త్రిభి స్సంగ్రథిత శ్రీమదాశ్చర్యరామాయణవిషయే విజయవాటికాసమాగతై రఖిలాంధ్రరాష్ట్రసనాతనధర్మద్వితీయవార్షికసభాంతర్భూత విద్వత్పరిషదధ్యక్షైః కార్యదర్శిభి రితరైః పండితవర్యైశ్చ ప్రకటితోఽయ మాశయః -

శ్రీమద్భి శ్శాస్త్రివర్యై ర్మహతా ప్రయత్నేన చత్వారింశద్రామాయణేభ్యః పురాణాదిభ్య శ్చాఽపూర్వాన్ కథావిశేషాన్ సంగృహ్య పండితానాం పామరాణాం చ సుబోధకయా శైల్యా, ఆశ్చర్యరామాయణంనామ గ్రంథవిశేష స్సంగ్రథితః - గ్రంథోఽయం సర్వేషామాస్తికానామాదరణీయ ఇతి మన్యామహే" తత్రత్యాన్ కథావిశేషానపూర్వాన్ దృష్ట్వా ప్రముదితావయం- సర్వథేదమాశ్చర్యరామాయణం సార్థకసమాఖ్య మితి మన్యామహే- శాస్త్రిణాముదీర్ణోద్యమ శ్చాఽచిరకాలేన సఫలో భవత్వితి ఆశాస్మహే-

హరినాగభూషణః, విద్వత్పరిషదధ్యక్షః

"తర్క వేదాంత విశారద"
ముదిగొండ వెంకటరామశాస్త్రీ,
అఖిలాంధ్రదేశీయపండితపరిషత్ కార్యదర్శీ.

"వేదాంత వ్యాకరణశిరోమణి"
లంక నరసింహశాస్త్రీ.

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రీ,
పీఠికాపుర వర్ణాశ్రమధర్మోద్ధారక సభాధ్యక్షః.

చెరువు బాపన్నశాస్త్రీ,
సాహిత్యవిద్యాప్రవీణః ఉభయభాషాప్రవీణశ్చ.

లంక లక్ష్మీనారాయణశాస్త్రీ,
సంస్కృతగ్రంథ పౌరాణికః.

లేళ్ళపల్లి వెంకటశాస్త్రీ, వేదాంతశాస్త్రాధ్యేతా.

శిష్టా లక్ష్మీకాంతశాస్త్రీ,
ఉభయభాషాప్రవీణః, అష్టావధానీ.

అవ్వారి రామమూర్తిశాస్త్రీ,
శంకరమఠస్థ సంస్కృత పాఠశాలా ప్రధానపండితః. ది 20—6—1935

---

ఓమ్.

# పండితాభిప్రాయాః

బ్రహ్మశ్రీ రామాయణతీర్థ రామాయణకేసరి లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిచర్యై ర్విరచిత మాశ్చర్యకథోపేత మాశ్చర్యరామాయణ మాశ్చర్యకరమితి చేన్నకస్యాప్యాశ్చర్యంభవతి. ధర్మవిప్లవసమయే ధర్మోద్ధరణార్థ మేతాదృగ్గ్రంథావిర్భావ స్సర్వజనోపయోగ ఇతి మన్యామహే.

లంక సాంబశివశాస్త్రీ,
పల్నాడు తాలూకా వర్ణాశ్రమధర్మోద్ధారక సంఘకార్యదర్శీ.
ది 21—6—35.

ఓం

## శ్రీ ధర్మో జయతుతమామ్.

# సమ్మానపత్రికా.

అద్వైతమతస్థాపకనందిరాజుపూర్ణచంద్రశాస్త్రి, కార్యదర్శి.
వర్ణాశ్రమధర్మోద్ధారకసభా, రేపల్లె. ది 23-2-34.

శ్రీమద్రేపల్లెపురీస్థవర్ణాశ్రమధర్మోద్ధారకసభా కార్యదర్శిభి రితరైఃపండితవర్యైః లౌకికైశ్చ సాదరం దత్తేయం సమ్మానపత్రికా-శ్రీమచ్ఛ్రీముఖవత్సరేమాఖశుక్లసప్తమీం దివసే స్వయంకృత శ్రీమదాశ్చర్యరామాయణగ్రంథ ప్రచారార్థం సమాయాతాఃఆంధ్రదేశ్యాః కృష్ణామండలాన్తర్గతవిజయపురీవాస్తవ్యాః, రామాయణతీర్థబ్రహ్మశ్రీలక్ష్మీవఝలవేంకటకృష్ణశాస్త్రివర్యాః అస్మదీయాభ్యర్థనావశేన రామకథావిషయేమాసమేకంస్వయంకృతమ్చత్వారింశద్రామాయణసారభూత మాశ్చర్యరామాయణం, రామాయణస్థతత్తత్పాత్రపూర్వజన్మవృత్తాంతైః, తత్రత్యపూర్వపక్షసిద్ధాన్తోపన్యాసైస్సహసమ్యక్ప్రావయిత్వాశ్రోతౄన్, ఆనందనిర్భరాంశ్చక్రుః-అస్యాశ్చసభాయాః బహవఃవైదికసనాతనధర్మశ్రద్ధాళవః లౌకికాః పండితప్రకాండాశ్చసమాయాతాః-బ్రహ్మశ్రీశాస్త్రివర్యాణాం ప్రవచనశైలీ నకేవలం పండితవర్గాన్ అపితు లౌకికానపిసర్వానానందనిర్భరాంశ్చకార-శాస్త్రిణాం విషయవివేచనపాటవం, ఉపపాదనమహిమా, రామకథాసంగ్రహణే అతీవ కౌశలం, సర్వమేతదతీవరమణీయం, హృదయంగమం, శ్లాఘాస్పదంచ'' రామకథాప్రవచనే ఏతావత్

జ్ఞానం, తత్రత్యవిశేషవచనానాం మఙ్క్షీకరణంచ, అత్యన్తం సభ్యానాంవిస్మయాపాదకమజని- తేషాందత్తపూర్వం రామాయణతీర్థబిరుదమనుమోద్య **రామాయణ కేసరీతి**-బిరుదాన్తరేణ బ్రహ్మశ్రీ శాస్త్రివర్యాన్ భూషయితుమభిలష్యతత్పదంసాదరందిశామఇతిశమ్—

1. అద్వైతమతస్థాపకనందిరాజుపూర్ణచంద్రశాస్త్రి-కార్యదర్శి
2. చిట్టి సూర్యనారాయణమూర్తి, కార్యదర్శి.
3. గొల్లపూడి హనుమంతరాయశర్మ, ఉపాధ్యక్షః.
4. చిట్టి వీరరాఘవయ్య }
5. చిట్టి వెంకటకృష్ణయ్య } సంఘసభ్యాః—



పామర్రు సనాతనవర్ణాశ్రమ ధర్మసంఘము

# పండితసన్మానము

---

విజయవాటికా హైందవాంగ్లకలాశాలా సంస్కృత ప్రధానపండితులగు బ్రహ్మశ్రీ లక్కావఝుల వేంకటకృష్ణ శాస్త్రిగారికి

5-9-32 తేదీనుంచి నేటి శ్రీరామపట్టాభిషేకసమయ పర్యంతము శ్రీవేణుగోపాలస్వామియాలయమున సకల రామాయణసారమైన యాశ్చర్యరామాయణమును సర్వజన మనోరంజకముగ ననేక నూతనవిశేషాంశములతో పూర్వపక్ష సిద్ధాంతములతో తమరు మాకువినిపించిన పౌరాణికోపన్యాసములకు మాకుగల భక్తిసూచకముగ తమకు "రామాయణతీర్థ" అను బిరుదమును భక్తిపూర్వముగ సమర్పించుచున్నాము.

స్వీకరింపప్రార్థితులు.

ఇట్లు సనాత సంఘపక్షమున

1 ఘడియారం వేంకటాచలం (సభాపతిః)

2 తమ్మా వేంకటాద్రిరెడ్డి (పూర్వపురపాలకాధ్యక్షః)

3 వేమూరి సీతారామశాస్త్రి

పామర్రు 27=10=32

శ్రీ మత్పరదేవతాయై నమః.

# ప్రశంసాపద్యములు.

మ॥ పదియేఁడుల్ పలుపొత్తముల్ చదివి, సంపాదింపఁగా రాని పు
ణ్యద చిత్రాతివిచిత్ర రామకథనన్నా! రెండుమాసమ్ములన్
మృదుగంభీరవచోవిశేషముల నెమ్మిన్విచ్చి గ్రామస్థులన్
ముదమొందించితి వెట్లు తీర్తురో! ఋణమ్మున్ కృష్ణవిద్వన్మణీ॥

మ॥ అనుఁగుంబుత్రిక యుర్వదేండ్ల పయిప్రాయంబందఁ గ్రూరంపు
దైవనియోగమ్మున జేసి కాలగతికిం బాలైన నాదుఃఖమున్
మనమందుంచక కృష్ణపండితుఁడు సన్మాన్యుండు, రామాయణం
బును విన్పించె గలంపఁ జాలునె సుఖమ్మున్ దుఃఖమున్ విజ్ఞులన్॥

చం॥ అనదినవేగుఁదెంచి విననాత్మకుతూహలమందరాఁగాని జీ
వనమనధీనమాట నటుపొల్పఁడ యెన్న; గాక శ్రేయమున్
వెనుకొనియుండు విఘ్నమసి పెద్దలు వాకొన చంద్రుఁగాదనె
మ్మనమిదె యింత కేతసిసె మాయభివాదమిదే గ్రహింపుమా॥

మ॥ ప్రజకెల్లన్ శుభమబ్బుగాక, నెల మువ్వానల్ పడుంగాక ని
త్యజయంబబ్బుత సత్యధర్మములకున్ దారిద్ర్యముల్ క్షోభముల్
రుజలున్ బాయునుగాక, లోకమునఁ గూరుంగాక యన్యోన్యసౌహా
ర్దజ, ముద్యచ్ఛుభ మైకమత్యము మహాత్మా రామచంద్రప్రభూ॥

ఇట్లు
విద్వద్విధేయః
వేమూరి సీతారామశాస్త్రి. 27-10-32.
పామఱ్ఱు బోర్డుహైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయః

శ్రీరస్తు.

శుభమస్తు.

# విజ్ఞప్తిః.

భోభో విపశ్చిద స్తత్రభవద్భిర్భవద్భి ర్విదితమేవైతత్, యత్పరాధీనేఽపి భారతే వర్షే, సనాతనధర్మవిచ్ఛేదాయ విరుద్ధాచరణై ర్బహుభి ర్బహుధా కృతేఽపి క్రియమాణేఽపి కరిష్యమాణేఽపి యత్నే, వాల్మీక్యాదిమహర్షికృపాసముల్లసద్ధర్మావబోధకరామాయణాదీతిహాసప్రచారప్రచలన పర్యంతం వర్షేఽస్మిన్కథమపి కదాఽపి నహిధర్మలోపస్సంభవేదితి" చిరాద్భారతవర్షరక్షకో ధర్మః ధర్మరక్షకో భారతవర్ష ఇతిచ" కింబహునా" ధర్మో రక్షతి రక్షితఇతి మహావాక్యం తు నహి కదాఽపి మిథ్యాఽభూవ, నభవతి, నభవితా చేతి, దృఢంవక్ష్యే-తతఆదితోఽపిభారతీయా మహాజనాస్సంత్యజ్య సాందృష్టికాఽపరవిద్యాః గిరికందరవిపినాంతరాద్యేకాంతస్థలేష్వనన్యచిత్తతయా పరవిద్యాసాధనేనాఽనుపమధర్మసాధకా ఏవాఽభవన్, యతః" అథపరా యయా తదక్షర మధిగమ్యతే" యేనాఽహం నాఽమృతా స్యాం కి మహం తేన కుర్యా మితిశ్రుతీ, క్రమా దక్షరప్రాపకవిద్యాయాఏవ పరాత్వ, మనక్షరప్రాప్తిహేతూనామనర్థతాం చ బ్రూతః'

ఏవంచ బహువిధేషు సత్స్వప్యక్షరప్రాప్తిసాధనేషు కలిమలవిజృంభితే కలికాలే చిరాయురనుష్ఠేయతపోయోగ

శ్రీరస్తు.

శుభమస్తు.

శ్రీరామశ్శరణం మమ.



# విజ్ఞప్తి

ఓవిబుధులారా! భారతవర్షము పరాధీనమైయుండెను, సనాతన ధర్మవిచ్ఛేదనమునకై విరుద్ధధర్మాచరణముగల యనేకులనేకవిధములుగఁ బ్రయత్నములనుఁ జేసిననుఁ జేయుచున్ననుఁ జేయనున్నను వాల్మీక్యాది మహర్షుల కృపారసముచే విలసిల్లుచున్న ధర్మబోధకములగు రామాయణము మొదలగు నితిహాసముల ప్రచారమున్నంతపర్యంతము, భారతవర్షమున ధర్మలోపమెప్పుడు నెట్లుగానుఁగానేరదనియుఁ జిరకాలమునుండి భారతవర్షమును ధర్మము, ధర్మమును భారతవర్షము రక్షించుచున్నదనియుఁ బూజ్యులగుతమకుఁ దెలిసినవిషయమే. ధర్మము మనలచే రక్షింపబడినచో ధర్మము మనలను రక్షించుచుండునను మహావాక్యము పూర్వమెప్పుడు నసత్యము కాలేదనియు, నిప్పుడు నగుటలేదనియు ముందును గాదనియు నేను దృఢముగఁ జెప్పగలను.

ఏవిద్యవలన బ్రహ్మప్రాప్తి కలుగునో యదియే పరవిద్యయనెడి శ్రుతివాక్యముచే, బ్రహ్మప్రాపకమగు విద్యకుఁ బరత్వమును, ఏధనముచే నేను ముక్తినిఁ జెందనో యాధనముచే నేమిప్రయోజనము, అను శ్రుతివాక్యముచే బ్రహ్మప్రాప్తికి సాధనము కానిపదార్థములకు నిరర్థకత్వము చెప్పబడినదిగనుకనే, మొదటనుండియు భరతఖండవాసులగు మహాజనులు దృష్టఫలకములగు నపరవిద్యలనువిడిచి పర్వతగుహలు, వనమధ్యప్రదేశములు మొదలగు నేకాంతస్థలములయం దనన్యమనస్కులై పరవిద్యను సాధించుటచే ధర్మసాధకులైరి. బహువిధములగు పరమపురుషార్థసాధనము లుండినను పాపభూయిష్ఠమగు నీ కలికాలమున చిరాయుష్కులచే ననుష్ఠింపఁదగిన తపోధ్యానయోగకర్మానుష్ఠానముల నల్పాయుష్కులకాచరింప నశక్యమని తలచి కృపారసముకలవారును, లోకహితార్థియు నగు శంకర

కర్మప్రవర్తాద్యనుష్ఠాన మచిరాయుషా మాచరితు మశక్య మితి కృపాళునా లోకహితకామేన శంకరభగవత్పాదపూజ్యేనాఽపి" "రామస్మరణా దన్యోపాయం నహి పశ్యామో భవతరణే" ఇత్యభిహితం-తదాచరణరూపేణ ప్రవర్తయితు కామానా మివ, ధర్మవిప్లవసమయేఽప్యస్మి న్నహర్నిశం రామో రామో రామఇతి రామభజనరూప మద్యాప్యాపంచమానాం జనానాం కలకలం శ్రూయమాణమేవ నివేదయతి రామకథామహిమాన మభిరుచిం చ జనానామితి, సర్వవ్యాపకస్య శ్రీరామచరితాత్మకస్యైకైకాక్షర మాత్రశ్రవణకృతామపి సకలదురితక్షయంకరస్య రామాయణస్యాఽబాలగోపాలవిదితస్య మహిమానువర్ణనే సహస్ర వదనేన వినా నకోపి క్షమ ఇత్యుక్తి రతిశయోక్తి ర్నభవతీతిమన్యే.

కింబహునా, రామాయణ మితి స్వనామైవ స్వమాహాత్మ్యం ప్రకటయతీత్యత్రాపి నకశ్చి దప్యతిశయః॥ (కుత ఇతి చేదుచ్యతే) రామ మయతి ప్రాపయతీతి రామాయణం, యద్వా రామః అయ్యతే ప్రాప్యతే ఽనేనేతి రామాయణం, 'అథవా' రామ మయతి జ్ఞాపయతీతి రామాయణం. ఉత" రామం రామకథా మయతి జ్ఞాపయతీతివా రామాయణ మితి, యద్వా రామస్యాయనం స్థానమితి రామాయణమితి, వ్యుత్పత్త్యా తస్య స్వనామనిర్వచనేనైవ రామచంద్రప్రాప్తి రూపపరమపురుషార్థతా ప్రతిపాదనాత్సిద్ధైవ రామాయణస్య సర్వోత్కృష్టతా సకలశిష్టాచరణీయతా నిశ్శ్రేయసస్సాధనతాచ- తాదృశం రామాయణం" మహర్షీణాం ప్రవృత్తయో

భగవత్పాదపూజ్యునిచే, సంసారసముద్రమునుఁ దాటుటకు రామనామ స్మరణముకంటె వేఱు సాధనములేదని చెప్పబడినవాక్యమును సదాచారరూప ముగఁ బ్రవర్తింపఁజేయఁగోరికచేననఁబంచమములవరకుగలజనులచే నీధర్మవిప్లవ సమయమందును రాత్రింబవళ్ళయందుఁ జేయబడుచున్న రామ, రామ, రామ, అను రామభజనరూపకమగు కలకలధ్వనియే రామకథామహిమను జనులకు గల రామకథాభిరుచినిఁ దెలియఁజేయుచున్నది. కాన సర్వవ్యాపక మును, నొక్కొ-కయక్షరమాత్రమును, శ్రవణముఁజేసినవారలకును సకల దురితక్షయమునుఁ జేయునదియును, నాబాలగోపాలవిదితము నగు రామ చరితరూపకమగు రామాయణముయొక్క- మహిమను వర్ణించుటకుసహస్ర ముఖములుగల యాదిశేషునికంటె నితరుడెవ్వడు సమర్థుడు కాడని చెప్పుట యతిశయోక్తి కానేరదని తలచెదను.

రామాయణమునునామమే తనమాహాత్మ్యమునుఁ బ్రకటించుచున్నదని చెప్పుటయు నతిశయముకాదు. (ఏలనన) రామాయణమనగా రామునిఁబొం దించునదిగాన రామాయణమనియర్థము లేక, రామాయణమన రామునిఁ దెలియజేయునదిగాన రామాయణమనియర్థము. లేక, రామ, అనుశబ్దమునకు రా మకథయనియర్థమును, లాక్షణికముగా- జెప్పినచో రామకథనుఁదెలియఁజేయు నదిగాన రామాయణమని యర్థము. లేక రామునకుస్థానముకాన రామాయ ణమని యర్థము. కాన రామాయణము స్వనామనిర్వచనముచేతనే రామ చంద్రప్రాప్తిరూప పరమపురుషార్థమునుఁ దెలియఁ జేయుచుండుటవలన రామాయణము సర్వోత్కృష్టమనియు సకలశిష్టాదరణీయమనియు మోక్షసాధనమనియు స్పష్టమయ్యెను.

మహాత్ములప్రవృత్తులు లోకహితార్థమేయని లోకమునఁదెలియజేయ

లోకహితాయైవ భవంతీతి లోకే బోధయితుకామేనేవ శ్రీరామచరితమూలాచ్ఛిష్టాచారం లోకేఽనువర్తయితుమనసేవ పరమకృపాళునా శ్రీవాల్మీకినామహర్షిణాధర్మతాత్పర్యేణ కావ్యరూపేణ ప్రతిపాదితమితి విదితమేవ- నను రామాయణే ధర్మతాత్పర్యప్రతిపాదన మనుపపన్నం సర్వత్ర రామాయణే రామచరితస్యైవ వర్ణితతయా ధర్మతాత్పర్యే ప్రమాణాభావా దితి చేన్న.

,,రామో విగ్రహవా న్ధర్మః,, ఇతి, రామస్య ధర్మస్వరూపత్వప్రతిపాదకధర్మద్వేషిమారీచవచనేన,, యస్మిన్నచలతే ధర్మో యోధర్మం నాతివర్తతే. ఇతి. యుద్ధకాండే శుకవాక్యేన,,(చాతుర్వర్ణ్యం చ లోకేఽస్మి న్స్వే స్వే ధర్మే నియోక్ష్యతీతి నారదవాక్యేన,,) అయోధ్యాకాండే,, విద్ధిమాం ఋషిభి స్తుల్యం కేవలం ధర్మ మాస్థితం,, ఇతి,రామవాక్యేన, ధర్మాత్మా సత్యసంధ శ్చ రామో దాశరథి ర్యది పౌరుషేచాఽ ప్రతిద్వంద్వః శరైనం జహి రావణిం॥ ఇతి ధర్మస్వరూపత్వప్రతిపాదకశపథరూప లక్ష్మణవాక్యేన,,

యుద్ధకాండే,, లోకానాం త్వం పరో ధర్మః, ఇతి బ్రహ్మవచనేన,, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే, ఇతిసర్వేషాం విష్ణ్వవతారాణాం ధర్మప్రతిష్ఠాపకత్వ ప్రతిపాదకగీతాస్థభగవద్వచనేన చ,, ధర్మజ్ఞత్వ ధర్మానుష్ఠాతృత్వధర్మస్వరూపత్వ విశిష్టస్యైవ రామస్య చరితం వర్ణిత మిత్యవగమ్యతే-తస్మా ద్ధర్మే తాత్పర్య ముపపన్నం-అతఏవ భట్టాచార్యై రుక్తం,రామవ ద్వర్తితవ్యం సధర్మః రావణవ ద్వర్తితవ్యంసోఽధర్మఇతి-కించ " వేదః ప్రాచేతసాదాసీత్సా

వలయుననియో శ్రీరామచరితమూలమున సదాచారమును లోకమునందను
వర్తింపజేయవలయుననియో కోరికకలవాడై కృపతో వాల్మీకిమహర్షి, రామా
యణమును ధర్మతాత్పర్యముతో కావ్యరూపముగ రచించెనను విషయ
మందఱకు దెలిసినవిషయమే, (ఇందుపై) రామాయణమునందుధర్మతాత్పర్యము
యుక్తము కాదనియు, రామాయణమునందంతటను రామచరితము వర్ణింప
బడినది యగుటచే ధర్మతాత్పర్యమునందుఁ బ్రమాణములేదనియుఁ గొంద
ఱాశంకించెదరు. అందునకు సమాధానము చెప్పఁబడుచున్నది. అరణ్యకాండ
మున, ఆకారమునుధరించినధర్మము, రాముడు, అని రాముడు, ధర్మస్వరూపుడని
చెప్పినధర్మద్వేషియగు మారీచుని వచనమువలనను. యుద్ధకాండమున, ఎవని
యందు ధర్మముచలింపదో యెవఁడు ధర్మము నతిక్రమింపడో యారామునితో
విరోధము తగదని రావణునితోఁ జెప్పిన శుకునివాక్యమువలనను, అయో
ధ్యాకాండమున, నేను ఋషితుల్యుడననియుఁ గేవలముధర్మము నాశ్రయించిన
వాడననియుఁ జెప్పిన రామవచనమువలనను, యుద్ధకాండమున, రాముడు
ధర్మాత్ముడును సత్యసంధుడు నైనపక్షమున, ఓ బాణమా! మేఘనాదుని
సంహరింపుము, అని రాముడు ధర్మస్వరూపుడని తెలియజేసిన శపథరూప
మగు లక్ష్మణునివచనమువలనను, యుద్ధకాండమున, నీవు పరమధర్మమూర్తివి,
అనిచెప్పిన బ్రహ్మవచనమువలనను, ధర్మసంస్థాపనమునకై ప్రతియుగమున
నేనవతరించెదను, అను ధర్మసంస్థాపకత్వమునుఁ దెలియఁజేయు భగవద్గీతా
వచనమువలనను ధర్మజ్ఞుడును, ధర్మస్వరూపుడును, ధర్మానుష్ఠాతయు నగు
రామునిచరితమే వాల్మీకిచేవర్ణింపబడినదని తోచబడుచున్నది. ఆహేతువు
వలన రామాయణమున ధర్మమునందు తాత్పర్యము యుక్తమే, కావున నే
రామునివలెఁ బ్రవర్తించుట ధర్మమనియు, రావణునివలెఁ బ్రవర్తించుట యధ
ర్మమనియును, ధర్మాధర్మస్వరూపమును బోధించు భట్టాచార్యుడు చెప్పియుం
డెను. వేదము రామాయణరూపముగా నయ్యెననియెడి మహర్షి వచనము
వలనను, రామాయణము వేదరూపమని కూడఁ దెలియుచున్నది. “వేద

ష్టాద్రామాయణాత్మనా,,ఇత్యనేన రామాయణస్య వేదరూ
పత్వ మవగమ్యతే-వేదో ధర్మమూల మితి, గౌతమవచన
పర్యాలోచనయా వేదస్య ధర్మమూలత్వా దేతస్యాఽపి
ధర్మమూలత్వ మవ్యాహతం" తాదృశధర్మ శ్చ దేశకాలాధి
కార్యవస్థాభేదేన వర్ణాశ్రమాదిభేదేన చ బహుధా స్మృతిషు
నిబద్ధః॥ వేద స్మృతి స్సదాచారః స్వస్యచప్రియ మాత్మనః।
ఏత చ్చతుర్విధం ప్రాహుః స్సాక్షా ద్ధర్మస్య లక్షణ మితి
మనువచనేన సదాచారస్యాఽపి ధర్మతా ప్రతిపాదితా-
తథాచ శ్రుతిః ,,అలూక్షా ధర్మకామా స్స్యుః యథా తే
తత్ర వర్తేరన్ తథా తత్రవర్తేథాః'' ఇతి॥ యత్త్వార్యాః
క్రియమాణం ప్రశంసంతి సధర్మః యద్గర్హంతే సోఽధర్మ
ఇతి-సతు సదాచారః శ్రుతిస్మృతీతిహాసపురాణాదిష్వేకైకో
విశకలితతయా తేనతేనాఽచరితః తేనతేన తత్తత్ఫలం
ప్రాప్త మితి ప్రతిపాదితః-ఏకస్య పురుషస్య కృత్స్నం చరిత్ర
మాఖ్యాయికారూపేణ క్రమేణ క్వాఽపి నప్రతిపాదితం-తత్తు
కస్యచి త్పురుషధౌరేయస్య సమగ్రధర్మానుష్ఠానకర్తు శ్చరిత్ర
మేకేన నిబంధేన కర్తవ్యం తేన సర్వోఽపి సదాచారః ప్రద
ర్శనీయ ఇత్యభిసంధాయ లోకోపకారాయ రఘువరచరితం
కావ్యరూపేణ కృతం వాల్మీకినా మహర్షిణా-తత్ర శ్రీరామ
చరితవర్ణనేన సదాచారలక్షణో ధర్మ స్తాత్పర్యేణ ప్రతిపా
దితః- నను కావ్యే అసద్వస్తునిరూపణం. అసద్వస్తున స్సద్వ
స్తుత్వేన ప్రతిపాదన, మర్థవాదబాహుళ్యం,కావ్యాలాపాంశ్చ
వర్జయేదితినిషేధ శ్చేత్యేవమాదిదోషజాతే స్థితే, ధర్మాధర్మ
వివేచనం కథం కావ్యరూపేణక్రియత ఇతి చేత్ ,నిషేధస్యాఽ

ము ధర్మమూలము." అను గౌతమవచనము నాలోచించిన రామాయణము వేదరూపముగాన వేదము ధర్మమూలమైనందున, రామాయణము ధర్మమూలకమనుట సమంజసము. అట్టిధర్మము దేశకాలాద్యవస్థాభేదములచేతను, వర్ణాశ్రమాదిభేదములచేతను బహువిధములుగ స్మృతులయందుఁ జెప్పబడినది.

వేదము, స్మృతియు, సదాచారము, ఆత్మసంతుష్టి, అను నాలుగును ధర్మస్వరూపములని మనువు చెప్పియుండుటచే సదాచారము ధర్మరూపమనియే తెలియుచున్నది. అవ్విధముననే శ్రుతియును చెప్పెను. ధర్మమునభిలషించెడిశిష్టులెవ్విధమునఁ బ్రవర్తించెదరో యవ్విధమున నీవు ప్రవర్తింపుము, అని గురువు శిష్యునకు శాసించినట్లు తైత్తిరీయోపనిషత్తునందుఁ జెప్పఁబడినది. మఱియు, ఆర్యులచేఁగొనియాడఁబడునట్లు చేయబడినది ధర్మమనియు నార్యులచే నిందింపఁబడునట్లు చేయబడినది యధర్మమనియు శిష్టులుచెప్పియుండిరి. ఆసదాచారరూపమగు ధర్మము నొకఁడు ప్రత్యేకముగ నాచరించినట్లును తత్ఫలమును నా యా మనుజుఁడొకఁడు పొందినట్లును, ఇతిహాసపురాణాదులయందుఁజెప్పబడినది. కాని యొకపురుషునియొక్క సమగ్రమైనచరిత్ర మాఖ్యాయికారూపముగ నెచ్చటనుఁ జెప్పబడియుండలేదనియు సర్వధర్మములను సంపూర్ణముగ నాచరించిన యొకానొకపురుషోత్తముని సంపూర్ణచరిత్రము నొకప్రబంధముగఁజేసి సమస్తసదాచారములను లోకమునకుఁ దెలియజేయవలయుననియు నాలోచించి లోకోపకారమునకై శ్రీరామచరితమును వాల్మీకిమహర్షి కావ్యరూపముగఁజేసి శ్రీరామచరిత్రవర్ణనమూలకముగ సదాచారరూపధర్మమునుఁ దెలియఁజేసెను.

ఇందుపైఁగొందరీక్రిందివిధముగ నాశంకించెదరు. (ఏమన) వాల్మీకి, రామాయణమును కావ్యరూపముగాఁ జేసెనుగదా! కావ్యమునందసద్వస్తువుల నిరూపించుటయు, అసద్వస్తువును సద్వస్తువునుఁగా నిరూపించుటయు, అర్థవాదబాహుళ్యము (అనగా స్తుతివాక్యములధికముగనుంనట) కావ్యాలాపములను విడువవలయునని నిషేధము, ఈమొదలగు దోషములు కావ్యమునందుండును కదా, అట్టి దోషభూయిష్ఠము కావ్యమైనపుడు ధర్మాధర్మవివేచనము కావ్యరూపముచే నెటులఁజేయబడునని యా శంకరాగా సమాధానము చెప్పబడుచున్నది. కావ్యాలాపములను వర్జింపవలయుననెడి

సత్కృతాఽసన్నాయకప్రతిపాదకాఽధర్మప్రతిపాదకప్రాకృత కావ్యవిషయత్వాత్, మహాకవిభిః కావ్యాని సన్నాయక ప్రతిపాదకాని పురుషార్థసాధకాని కృతాని సద్భిః పరిగృహీ తాని చ" అతఏవ కాళిదాసకృతానాం కావ్యానామపిస్మృతి త్వేన మహతా మంగీకారః, ఏవంస్థితే మహర్షిణా పరమ పురుషస్యచరితవర్ణనంధర్మప్రాధాన్యేన వేదోపబృంహకత్వేన పరమపురుషార్థసాధకత్వేన చ కృతం స్మృతితుల్య మిత్య వివాదం- తాదృశధర్మప్రతిపాదకేషు శబ్దమధురేష్వర్థగంభీ రేషు వాల్మీక్యాదిమహర్షికృతేషు రామకథానకేషు బహుషు సత్సు కిమర్థ మపూర్వోఽయ ముద్యమ ఇతి చే దత్రోచ్యతే- శ్లో॥ యది క్షుణ్ణం పూర్వై రితి జహాతి రామస్య చరితం గుణైరేతావద్భిర్జగతి పునరన్యోజయతి కః॥ ఇతి భట్టమురారి వచనేన తాదృశలోకోత్తరగుణవిశిష్టనాయకస్యేతరస్యా భావాత్తద్రామచరితమేవస్తోత్తరణార్థం సర్వైర్వర్ణ్యత ఇతి సార్వకవిజనీనోద్యమో మామకీనోద్యమశ్చ-అపిచ, తత్తద్రా మాయణానాంమధ్యే కానిచిద్భక్తిప్రధానాని, కతిచిదధ్యాత్మ ప్రధానాని, కానిచి ద్ధర్మప్రధానాని కానిచి ద్విచిత్రకథా విశేషవిలసితానీతి బహుధా ఽవర్తంత, తానిసర్వాణ్యపి, చతుశ్శతాయుషాఽ పిద్రష్టుమశక్యానీతి, కించ, నవంనవ ప్రియోలోక ఇతి న్యాయేన నవనవప్రీతిమతా మధు నాతనానాం, హరికథాదావివ విచిత్రకథాదావభిరుచిమతాం మాధ్యమికానాం, కేవల ధర్మతత్పరాణాం మహాజనానాం చ భక్త్యపేక్షకానాం రామభక్తానాం, చారిత్రకామానాం, నాగరికాణా మధ్యాత్మకామానాం జ్ఞానినాం సర్వేషాంచ

నిషేధము,అయోగ్యులచేఁ జేయబడినట్టియు, అసన్నాయకులను నధర్మమును జెప్పునట్టియు ప్రాకృతకావ్యముల విషయము కాని, యానిషేధము, మహాకవులచే రచింపబడి యోగ్యులగు నాయకులఁగల్గి ధర్మమునుఁ దెల్పునట్టి పురుషార్థసాధకములగు సత్కావ్యముల విషయముకానేరదు. కావుననే మహాకవులచేఁగావ్యములు రచింపబడుచున్నవి. అసత్కావ్యములు సత్పురుషులచేఁ బరిగ్రహింపఁబడుచున్నవి. కావుననే కాళిదాసుడు చేసిన కావ్యములను స్మృతితుల్యములనుగాఁ బెద్దలంగీకరించిరి.

(ఇట్లుండ) వాల్మీకిమహర్షిచే రచింపఁబడిన శ్రీరామచరిత్రరూపకమగు రామాయణము ధర్మప్రధానమనియు, వేదోపబృంహకమనియుఁబరమపురుషార్థసాధకమనియు స్మృతితుల్యమనియుఁ జెప్పుట నిర్వివాదవిషయము- ఇందుపై నొక యాశంక కలుగుచుండెను. (ఏమనగా) అట్టిధర్మప్రతిపాదకములై శబ్దమాధుర్యము, అర్థగాంభీర్యముకలిగి రసముచే నొప్పు వాల్మీకిరామాయణము మొదలగు రామాయణములనేకములుండగా నీయపూర్వోద్యమ మెందుకని (యాశంకరాగా) మురారికవియే యందునకు సమాధానమునుఁ జెప్పియుండెను. (ఏమన) పూర్వులచే రామచరితము క్షుణ్ణముగా వర్ణింపబడినదని యా రామచరితమును విడిచినచో నట్టిసద్గుణపరిపూర్ణుడగు నాయకుడితరుడెవ్వడుండెనని చెప్పెను. కాన నట్టిసద్గుణపరిపూర్ణుడగు నాయకుడితరుడు లేనందుననే మహాకవులందఱును, తాముతరించుటకు వారామునిచరితమునే వర్ణించుట కుద్యమించిరి. నాయుద్యమమును నందునకేయని యెఱుంగనగును. (ఇదియునుంగాక) కొన్ని రామాయణములు భక్తిప్రధానములుగాను మఱికొన్ని రామాయణముల ధ్యాత్మప్రధానములుగాను, మఱికొన్ని రామాయణములు ధర్మముప్రధానముగాఁగలవిగాను, మఱికొన్ని రామాయణములు విచిత్రకథావిశేషములచే నొప్పునవిగాను బహువిధములుగ నుండుటవలన వానినన్నిటినిఁ జూచుటకు వందల సంవత్సరము లాయుర్దాయము కలవాడును నసమర్థుడనియు, మఱియు,లోకము క్రొత్తక్రొత్త వస్తువులయందుఁ బ్రీతికలిగియుండునని లోకోక్తిచే క్రొత్తక్రొత్తగ్రంథములయందుఁ బ్రీతిగల యాధునికులకును హరికథలయందువలె విచిత్రకథలయందభిరుచి కలవారికని" కేవలధర్మమునందే యాసక్తికల మహాజనులకును, భక్తినపేక్షించు రామభక్తులకును, చరిత్రలయందభిరుచికల నాగరికులకును, ఆత్మతత్త్వము నపేక్షించుజ్ఞానులకును

యథాయథ మిదముపకురుత ఇత్యాశయేన చ ధర్మ
భక్త్యాదిబోధకతత్త్వద్రామాయణస్థిత తత్కథావిశేష సార
మేకత్ర సంగ్రథ్య మయాఽయం గ్రంథో నిరమాయి.
అత్ర రామచంద్ర వంశావళిః, రామపూర్వాణాం రాజ్ఞాం
పరిపాలన కాలనిర్ణయః,కౌసల్యా కైకేయ్యాది వివాహవర్ణనం,
ఋష్యశృంగజననక్రమః, విశేషతః తత్రతత్ర ధర్మవిశేష
నివేదనం, శాంతాజననస్వయంవరాదివర్ణనం, పాయస
విభాగవిచారః, శ్రీరామజన్మఘట్టః, రామనామనిర్వచనం
రామలీలావిశేషవర్ణన మిత్యేవమాదివిశేషాస్తు నిష్కృ
ష్యైకత్రప్రదర్శితా ఇత్యస్తి మహాన్విశేషః ప్రాక్తనరచ
నాభ్యః ప్రకృతరచనాయాః, తమేత మామూలచూడం
పఠతాం శృణ్వతాంచ సకలరామాయణకథావిశేషధర్మా
వగమ స్సుగమ శ్చ ధ్రువంభవితేత్యే తావాన్ ప్రయాసః.
సంస్కృతాంధ్రహింద్యాదిభాషా స్వనేకథాఽనేకై ర్మహర్షి భి
ర్మహాకవిభి రధునాతనై శ్చవర్తి తేషు తత్తత్కథావైచిత్ర్యేషు
సార మాదాయ తత్రతత్ర ప్రాచీనాధునికమహాకవిశ్లోకా
న్నిబద్ధమధురా నర్థగంభీరాన్ రసవిలసతాన్సంగ్రథ్య గ్రంథోఽ
యంనిబద్ధః న కేవలం పరకీయానామేవ పద్యానాం పరిపాలనే
మయా భూయసీ శ్రద్ధా వ్యధాయి- పరంతు తత్రతత్ర
స్వకీయాన్యప్యర్థాధికాని పద్యగద్యవివరణాని వర్తంతఇతి
విజ్ఞాప్యతే- అత్రరామాయణగత మాశ్చర్యం కీదృశమితి
ద్వాపరోఽపి సంజాయేతైతద్గ్రంథనామ శ్రుతి మతా,
మత్రోచ్యతే- „ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేనమితి„ ఆశ్చర్యో
వక్తాకుశలోఽస్యలబ్ధా„ ఇతి శ్రుతివాక్యానుసారేణ ధర్మ

నందలికును నీగ్రంథముపకరించునను నభిప్రాయపడియు రామాయణ మందలి వాల్మీకిధర్మతాత్పర్యమును బోధింపవలెననియు నేనీగ్రంథమును నిర్మించితిని.

ఇచ్చట రామచంద్రవంశావళియు, 'రామచంద్రపూర్వులగు రాజుల పరిపాలనకాలనిర్ణయము, కౌసల్యాకైకేయ్యాది వివాహవర్ణనము ఋష్యశృంగజననాదివర్ణనము, అచ్చటచ్చట విశేషధర్మములనుఁ దెల్పుటయు, శాంతాజననశాంతాస్వయంవరములవర్ణనము పాయసవిభాగ విచారము, శ్రీరామజన్మఘట్టము, రామనామనిర్వచనము, రామలీలా వర్ణనము, ఈ మొదలగు విశేషములన్నియు నీయొకచోటఁ బ్రదర్శింపఁ బడినందునఁ బూర్వగ్రంథములకంటె నీగ్రంథమునందు విశేషముండెను. ఆయీగ్రంథమును నామూలాగ్రముగఁ జదివినవారలకును వినినవారలకును బహురామాయణములలోని కథావైచిత్ర్యములును విశేషధర్మములును సుగమములు కాగలవని యీప్రయాసము.

సంస్కృతాంధ్రహిందీభాషలయందనేకులగు మహాత్ములు మహాకవులు నాధునికులునగుకవులచేననేకవిధములుగ వర్ణింపఁబడిన యాయాకథా వైచిత్ర్యములయందలి సారమును గ్రహించి యచ్చటచ్చట శబ్దమధురములు నర్థగంభీరములగు ప్రాచీనాధునికమహాకవిశ్లోకములనుఁ గూర్చియు సంస్కృతభాష నెఱుగనివారల యుపకృతికై యాంధ్రతాత్పర్యయుతముగ నీగ్రంథము రచింపఁబడెను. కేవలము పరకీయశ్లోకములనుసమకూర్చియేయీ గ్రంథము నిర్మింపఁబడలేదు. ఇక నేమన. స్వకీయములగు పద్యగద్య వివరణ వ్యాఖ్యానములు మొదలగునవి సగముకంటె నెక్కుడుగానున్నవని యెఱుగనగు. ఇచ్చట రామాయణమునందలి యాశ్చర్యమెట్టిదని గ్రంథనామమును వినినవారలకు సంశయముండవచ్చును. అవ్విషయము చెప్పబడుచున్నది. ఈధర్మవిప్లవసమయమున భగవత్కథను జెప్పువాడునువినువాడును చెప్పడము వినడము సర్వము, ఆశ్చర్యముకాన నచ్చటచ్చట ధర్మవిశేషముల నీరామాయణము తెలియఁజేయుటయే రామాయణగతమైన యాశ్చర్యమని యాంతరంగికాశయము. మఱియు, ఆశ్చర్యమగుకథలతోఁగూడియుండుట వలనను

విప్లవసమయే తత్ర తత్త తత్తద్ధర్మవిశేషనివేదకనిబంధన యోరప్యాశ్చర్యత్వా త్తత్త ద్ధర్మవిశేషనివేదకత్వమేవ గ్రంథగతమాశ్చర్యమిత్యాంతరంగికాశయః. యద్వా, ఆశ్చర్యకథోపేతత్వ మేవ గ్రంథగతమాశ్చర్యమితి. గ్రంథేఽస్మి న్గుంభితానాం కథావిశేషాణా మాలోకనేన తత్రభవతాం భవతాం మానసం నిర్వ్యాజరమణీయం భవేదితిమన్యే, అస్య చ సముపయోగ మనేకధాచిరపరిచితాః విపశ్చిద ఏవ విదంతీతి నాస్తిమే కించిదప్యత్రకథనీయావసరః. తత్రభవతాం సమర్ప్యమాణోఽయమాశ్చర్యరామాయణాఖ్యగ్రంథసూక్ష్మరూపబాల కాండ ప్రథమభాగఏవ గ్రంథనిర్మాణపరిశ్రమం రచనావిధానం చ దిఙ్మాత్రతయా ప్రదర్శయిష్యతీతిమామకీనోఽయం విశ్వాసః.

మమ గ్రంథముద్రాపణే పూర్వపరిచయశూన్యత్వాన్ముద్రాలయస్యాఽప్యసంస్కృతగ్రంథముద్రకత్వాత్. అనారోగ్యాదివశేనేతరత్రస్థితే ర్మమాఽసన్నిహితత్వా ద్గ్రంథాలయస్య దోషజ్ఞాసహితత్వాచ్చ దీర్ఘబిందువిసర్గవర్ణవ్యత్యాసాదిశబ్దస్ఖలిత్యా న్యర్థస్ఖలిత్యానివా, ఋకారస్య రేఫః రేఫస్యఋకారః. అనుదరబిందుస్థలేషూదరబిందుః ఉదరబిందుస్థలేష్వనుదరబిందుస్థితిరిత్యేవమాదీనివాముద్రణప్రమాదాన్మత్ప్రమాదా ద్వా యది దృశ్యేరన్, తానిగుణగ్రాహకపాఠకమహాజనాః గుణదోషపత్రికావలోకనేన శుద్ధానికృత్వా సంపఠ్యమామకీనాపరాధం క్షమధ్వమితి సుబహు థార్యతే మయా, యతోఽహం నవిద్వాన్న చ గ్రంథకరణక్షమః. పరంతు శ్రీరామచంద్రచరణకమలభక్తి పారవశ్యాత్త

ఆశ్చర్యరామాయణమని నామముసార్థకము.

ఈగ్రంథమునందుఁ గూర్పబడిన కథావిశేషములనుఁ జూచుటచేతఁ బూజనీయులగు మీదుమానసములు నిర్వ్యాజరమణీయములగుననితలచెదను. ఈగ్రంథముయొక్క సదుపయోగమునుఁ జిరపరిచితులగు పండితులే తెలిసికొనెదరు. కాన నేనీవిషయమునఁజెప్పఁదగిన యవసరములేదు. మీకు సమర్పింపఁబడే యీయాశ్చర్యరామాయణసూక్ష్మరూపమగు బాలకాండ ప్రథమభాగమే గ్రంథనిర్మాణ పరిశ్రమమును రచనావిధానమును దిజ్మాత్రముగాఁ బ్రదర్శింపఁగలదని నావిశ్వాసము. నేనింతకుఁబూర్వము గ్రంథముల ముద్రింపించుటలో బరిచయము లేనివాడనగుటవలనను,ముద్రణాలయమును సంస్కృతగ్రంథ ముద్రణపరిచయము లేనిదగుటవలనను, నేననారోగ్యవశముచే సమీపమున నుండకపోవుటవలనను, ముద్రణాలయములో పండితులు లేనికారణమువలనను, దీర్ఘబిందువర్ణవ్యత్యాసాది స్ఖాలిత్యములు కాని వఱియు సగస్ఖాలిత్యములకాని పాట్టలో సున్నలులేని స్థలముల యందు సున్నలుపడుటయు సున్నలుండఁదగిన స్థలములయందుఁ బడకపోవుటయు, ఋకారమునకు రేఫయు రేఫకు ఋకారము మొదలగు స్ఖాలిత్యములుకాని ముద్రణప్రమాదముచేఁగాని నాప్రమాదముచేఁగాని కన్పడిన వానినిఁ దప్పొప్పుల పట్టినిఁజూచి శుద్ధములనుఁగాఁజేసికొని చదివి నాయపరాధములను క్షమింపవలయునని ప్రార్థింపఁబడుచున్నది. (ఏలనన) నేను గొప్పపండితుడనుకాని గొప్పగ్రంథములను రచింప శక్తుడను కాని కాను (ఇకనేమన) శ్రీరామచంద్ర చరణకమలములయందలి భక్తిపారవశ్యము వలన నీగ్రంథమునుఁ గూర్పనుద్యమించితిని,

చ్చిత్రచరిత్రాత్మకగ్రంథగ్రథనే సముద్యతో உహం తత్రభవతాం సమర్ప్యమాణో உయ మాశ్చర్యరామాయణగ్రంథసూక్ష్మరూపభూతబాలకాండప్రథమభాగఏవ గ్రంథనిర్మాణపరిశ్రమం రచనావిధానం చ దిఙ్మాత్రతయా ప్రదర్శయిష్యతీతి మామకీనో உయం విశ్వాసః- గ్రంథోపరి స్వేషాం గమ్యమానా నాశయా స్సంశేక్ష్య ప్రేషయంత్వితి దోషజ్ఞా న్సప్రశ్రయ మహ మభ్యర్థయే-

## కృ త జ్ఞ తా ని వే ద నం

మజ్జన్మగురూణాం వాచి గురూణా మాదా గ్రామణీనాం పశ్చాత్కార్తాంతికగ్రామణీనాం తత స్తీర్థేషు రక్తానాం సంసృతౌ విరక్తానాం తాతపాదానాం సంసేవితయోగిజనభవాబ్ధిపోతపాదానాం లక్కావఝులవంశముక్తాఫలానాం పితౄణాం సుబ్రహ్మణ్యశిద్ధాంతినాం చరణయుగళస్య,

కావ్యగురూణా మధీతపాణినీయానా మలంకృతనూజవీటిసంస్థాన స్థితశ్రీరాజోన్నతాంగ్లకలాశాలా ప్రధానపండితపదానాం బాలవ్యాఘ్ర (కూనపులి)వంశముక్తాఫలానాం సువృత్తానా మావృత్తానాం చ పూర్ణయ్యశాస్త్రిణాం చరణయుగళస్య,

న్యాయగురూణాం సకలవిద్యావాచస్పతీనాం స్వచరణకమలసంసేవనలబ్ధవైదుష్యబహుళశతాంతేవాసినా మాదిభట్టవంశముక్తాఫలానాం కీర్తిశేషాణాం రామమూర్తిశాస్త్రివర్యాణాం చరణయుగళస్య,

తదనంతరన్యాయగురూణా మనధీతైకశాస్త్రిణామపి స్వప్రతిభావిశేషాధ్యాపితసకలశాస్త్రిణాం శ్రీపీఠికాపురసం

గ్రంథముపై బుధులకుఁ దోచబడే యభిప్రాయములను వ్రాసిపంప వలయునని పండితులను వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను.

## కృతజ్ఞతానివేదనము.

నా జననగురువులును వాఙ్మయమును గురువులును (అనగా వాఙ్మయములో బృహస్పతితో సమానులును,) మొదట గ్రామాధికారిపదవి నలంకరించిన వారును పిమ్మట సిద్ధాంతులలో నగ్రేసరులై పంచాంగములనుఁ జేయ సమర్థతగలవారై తదనంతరము సంసారవిముఖులై పుణ్యతీర్థముల సేవించువారలై సంసారతారకములగు మహాయోగి పాదములను సేవించువారలై పూజనీయులైన మాతండ్రిగారగు లక్కావఝ్ఝల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి చరణకమలములకును,

కావ్యగురువులును వ్యాకరణశాస్త్రాధ్యేతలును, నూజివీడు సంస్థానమందలి శ్రీరాజా హైస్కూల్‌లో ప్రధానపండితులును సద్వర్తికలవారును నాకు బావగారునగు కూనపులి పూర్ణయ్యశాస్త్రిగారి చరణకమలములకును,

మొదట, న్యాయశాస్త్రగురువులును సకలవిద్యావాచస్పతులును, తమచరణకమలముల నాశ్రయించిన యనేకవిద్యార్థులకుఁ బాండిత్యమునుఁ గలుగఁజేసినవారును, ఆదిభట్టవంశముక్తాఫలభూతులును, కీర్తిశేషులునగు రామమూర్తిశాస్త్రులవారి చరణకమలములకును.

తదనంతరము న్యాయగురువులును నొకశాస్త్రమునైనను జదువనివారైనను స్వప్రతిభావిశేషముచేతను సమన్వయించి సకలశాస్త్రములను సంపూర్ణముగా విద్యార్థులకుఁ బాఠములనుఁ జెప్పినవారును శ్రీపిఠాపురసంస్థానమునందు న్యాయశాస్త్రపరీక్షకులునగు బ్రహ్మశ్రీ శ్రీపాద లక్ష్మీనృసింహశాస్త్రిగారి పాదపద్మములకును,

స్థానన్యాయశాస్త్రిపరీక్షాధికారిణాం శ్రీపాదవంశముక్తాఫలానాం లక్ష్మీనృసింహశాస్త్రిణాం చరణయుగళస్యచ,

వేదాంతగురూణా మధీతన్యాయనిగమాంతానా మద్వైతోపన్యాసవిశేషసంతోషితసకలదేశీయానాం దిగంతవిశ్రాంతయశసాం మల్లాదిరామకృష్ణచయనినాం చ కృతజ్ఞతాపూర్వకాభివందనాని సమర్ప్యంతే. యతః, యద్గురుప్రసాదా త్కించిజ్జ్ఞానవా నహ మభూవం. అపిచ, సత్యపి కార్యజాతే మదీయా మభ్యర్థనా మురరీకృత్య పరిశీల్య చ గ్రంథ మేత మామూలచూడం విస్మయనీయభూమికావిలేఖనేన ప్రసన్నేభ్య శ్శతఘటీకవితావిరాజమానేభ్యో విరచితానేకప్రబంధేభ్య స్తాడేపల్లిరాఘవనారాయణశాస్త్రిభ్య శ్చ కృతజ్ఞతాపూర్వకమానసికీని నమాంసీతి విజ్ఞాప్యతే- కించ యద్యన్మహర్షి మహాకవిప్రణీతకోశజాతం మదీయరచనాసహకార్యభూత్, తత్తన్మహర్షి మహాకవిజనతాయై సహస్రవందనార్పణేన వినా నహ్యన్య స్తత్తదృణనివర్తనోపాయ ఇతి చ విజ్ఞాప్యతే- పుత్రికాస్మృతిః

అపిచ, ద్వావింశతివర్షీయాయాః పితృభక్తివిరాజమానాయాః మజ్జ్యేష్ఠపుత్ర్యా స్సుబ్బమాంబాయాః ప్రేమభూమికాయాః వినశ్వర మైహికం సుఖ మితి బోధయితుకామాయా ఇవ గౌరీలోకం గతాయా స్సర్వథా స్సర్వదా కరోత్వాత్మశాంతిం జానకీజాని రితి శ్రీరామచంద్రచరణయుగళప్రార్థనాం వినా నహితదీయోపకృతిపితృభక్త్యోరన్యదృణనివర్తనసాధనం పరిదృశ్యత ఇతి విజ్ఞాప్యతే- యతః, యద్వియోగక్లేశ మసమానో ఽహర్నిశ మనేకరామాయణ

వేదాంతగురువులును న్యాయవేదాంతములయందుఁ బూర్ణపాండిత్యముగల వారును, అద్వైతోపన్యాసములచే సకలదేశీయులను సంతసింపఁజేసిన వారును, సకలదిక్కులయందు వ్యాప్తమైన కీర్తిగలవారునగు బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణచయనులుగారి పాదపద్మములకును కృతజ్ఞతాపూర్వకమగు నాయభివందనములని విన్నవింపఁబడుచున్నది. మఱియు, తమకార్యములున్నను నాప్రార్థన నంగీకరించి యీగ్రంథమును సమగ్రముగఁ బరిశీలించి యాశ్చర్యమగు నుపోద్ఘాతమును వ్రాసి యనుగ్రహమునుఁ జూపినట్టియు గడియకు నూరుశ్లోకములనుఁ జెప్పునట్టి యాశుకవిత్వముచే నొప్పునట్టియు ననేకగ్రంథములను రచించినట్టివారునగు బ్రహ్మశ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారికిని నానమస్కారములని విన్నవింపఁబడుచున్నది. మఱియు. నే యే మహర్షులచే నే యే కవులచేఁ బ్రణీతములగు పురాణరామాయణాదిగ్రంథములు నాగ్రంథరచనకు సహకారములయ్యెనో యాయామహర్షి మహాకవిజనసమూహమునకు సహస్రవందనముల నర్పించుటకంటె వారలఋణమునుఁ దీర్చునుపాయము మఱియొకటి లేదని విన్నపము.

## పుత్రికాస్మృతి.

మఱియు, నిరువదిరెండుసంవత్సరముల వయస్సుకలిగినట్టియుఁ బితృభక్తిగలిగినట్టియు, నా ప్రేమభూమికయగు నాజ్యేష్ఠపుత్రికయైన సుబ్బమాంబ యిహలోకసౌఖ్యము వినశ్వరమేయని లోకమునకు దెలియఁ జేయునదివలె నైహికమునువిడిచి గౌరీలోకమునుఁ బొందియుండెను. శ్రీరామచంద్రమూర్తి నామెయాత్మకు శాంతినిఁగలుగజేయుగాకయని శ్రీరామచంద్ర చరణయుగళమునుఁ బ్రార్థించుటకంటె నామె యుపకృతి పితృభక్తులకు వేఱువిధముగ ఋణమునుఁదీర్చుసాధనము కన్పడదని విన్నపము. (ఏలనన) ఏసుబ్బమాంబవియోగమువలనఁ గలిగిన క్లేశమును సహింపలేక రాత్రింబవళ్ళయందుఁ దత్క్లేశపరిహారముకొఱకు నానారామాయణములనుఁజూచుభాగ్యము నీగ్రంథమునురచించుభాగ్యము నాకుఁగలిగినదో యందువలనఁ బుత్రికాస్మృతి యవసరమని విన్నపము.

దర్శనేతద్గ్రంథ గ్రథనభాగ్యావా నభూవం, తస్మా త్పుత్రికా స్మృతిః కృతేతి విజ్ఞాప్యతే, కించ, మమైతద్గ్రంథముద్రాపణ విషయే ప్రథమతః హస్తావలంబనప్రదానాం విశేషత శ్చౌదార్య ప్రదర్శితవతాం విరమికమండలఖండాధిపత్యపదానాం షోడశోత్తరశతరూపికా వాగ్దానకృతాం వల్లభజ్యోతిష్యులవరబ్రహ్మశాస్త్రిణా మేతద్గ్రంథ మహారాజపోషకపదాశ్రితానాం,

అగ్రహారిణాం శతార్థరూప్యప్రదానాం. మహారాజపోషకపదాశ్రితానా మంటడిపూడిరామకృష్ణశాస్త్రిణా మవశిష్టానాం మహారాజపోషక రాజపోషక పోషకవర్గీయవిరాళప్రదానాం శిష్టానాం చ కృతజ్ఞతా నహి కదాఽపి విస్మృతా భవేదితి విజ్ఞాప్యతే-ఇతఃపర మస్యాస్తికమహాశయాః మదీయోద్యమస్య సహాయం కుర్యు రితి విశ్వసిమి. సమగ్రోఽయం గ్రంథః నవభాగాత్మకతయా సంముద్య్రత బాలకాండ స్తు భాగద్వయాత్మకః. ప్రథమభాగస్తు సుకృతినాం సహాయా న్ముద్రితః ద్వితీయ భాగోఽపి ముద్రాపణాయ దత్తః సోఽపి శీఘ్రమేవ బహిర్గమిష్యతీతివిశ్వసిమి పరంతు వాగ్దత్తలిఖితవిరాళానాం బహుభి రేతావ దదత్తత్వాత్ ప్రథమభాగముద్రాపణస్య కాలవిళంబోఽభవదిత్యహమేవ లజ్జితః. దాతవ్యవిరాళాని శీఘ్రమేవ దత్వా మదీయోద్యమం పోషకవర్గీయా స్సర్వే ప్యాస్తికా స్సఫలం కుర్వంత్వితి ప్రార్థయామి. యద్యద్భాగముద్రాపణే యే యే పోషకవర్గీయా భవేయుస్తేషాం తేషాం నామాని తత్తద్భాగేషు ముద్రాపయిత్వా తత్తద్భాగం తేషాం తేషాం విధినా దాతుం నిశ్చితవా నహం. ఇతరేషాం భాగానాందానే

మఱియు నీగ్రంథమును ముద్రించుటలో మొదట నాకుఁజేయూత నొసగినట్టియు, విశేషముగ నౌదార్యమునుఁ జూపినట్టియు రిటైర్డుడిప్యూటీ కలెక్టరుగారును నూటపదునాఱురూప్యములను వాగ్దత్తముచేసి మహారాజ పోషకులుగనుండిన వల్లభజ్యోత్యుల పరబ్రహ్మశాస్త్రిగారియొక్కయు, అగ్రహారీకులును నర్ధశతమానమునిచ్చి మహారాజపోషకులుగనుండిన యంబడి పూడిరామకృష్ణశాస్త్రిగారియొక్కయు,మిగిలిన మహారాజపోషకులు రాజ పోషకులు పోషకులుగానుండి విరాళములనిచ్చి యీగ్రంథముద్రణమునకు సహాయము చేసినవారియొక్కయు కృతజ్ఞత యెన్నటికిని మఱువఁబడ దని నావిన్నపము-

ఇటుపిమ్మటయును, ఆస్తికమహాశయులు నాయుద్యమమునకు సహా యము చేసెదరని విశ్వసించుచున్నాడను. సంపూర్ణగ్రంథమంతయు తొమ్మిదిభాగములుగా వెలువడును. బాలకాండము రెండుసంపుటములు- అందు ప్రథమసంపుటము. పుణ్యాత్ములసహాయముచే ముద్రింపఁబడెను. రెండవభాగము ముద్రణమునకొసంగఁబడినది. అదియును శీఘ్రములోనే వెలు వడగలదు. కాని యీప్రథమభాగమునకు వాగ్దత్తముచేసిన విరాళముల నింతదనుక యనేకులిచ్చియుండని కారణమున నీభాగమును ముద్రించు ట యాలస్యమైనందునకు నేనే లజ్జించుచుంటిని.

కాన పోషకవర్గములోఁ జేరినవారందఱును, తామీయవలసిన విరా ళములను శీఘ్రముగనిచ్చి నాయుద్యమమును సఫలమునుఁజేయుడనివారలఁ బ్రార్థించుచున్నాను. ఏయేభాగమును ముద్రించుటకు నెవరెవరు పోషక వర్గములోచేరుదురో వారివారి నామములను నాయాభాగములలో ముద్రిం పించి యా యా భాగమును వారివారికి విధిగా నిచ్చునేర్పాటైయున్నది. ఇతరభాగముల నిచ్చుటకువిధికాదు. ఎందువలననగా నార్థికలోపమువలనను

తు నవిధిః కృతఇతి చే దన్యభాగా స్వార్థికలోపా త్పో
షక సంభవాద్వా యదముద్రితానభవేయు స్తదా మదీయ
ప్రతిజ్ఞా భజ్యేతేతిభియా తథోచ్యతే నతుహేత్వంతరే
ణేతి విజ్ఞాప్యతే- ఏకైకభాగపోషకవర్గవివరణం

| | |
|---|---|
| పంచదశాధికరూప్యదః | మహారాజపోషకః |
| పంచదశరూప్యదః | రాజపోషకః |
| దశరూప్యదః | ప్రధానపోషకః |
| పంచరూప్యదః | పోషకః |

ఏతద్వ్యతిరేకేణ యేనకేనాపి వా విధానేన ముద్రణ
సాహాయ్యం కృతవతాం కుర్వతాం కరిష్యతాంచ శ్రీరామ
చంద్రప్రసాదేన సకలశ్రేయాంసి సంభవంత్వి త్యాశిష మా
శాస్య విరమ్యతే

ఇత్థం
పండితవిధేయః గ్రంథరచయితా
లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రీ



గాని పోషకులు సంభవింపని కారణమువలనఁగాని కొన్ని భాగములు ముద్రింపఁబడనిచో నాప్రతిన నెరవేరనట్లు కన్పడనంయున నట్లుచెప్ప బడుచున్నదే కానియితరకారణము కాదని విన్నపము-ఒక్కొక్క భాగము నకుఁ బోషకవర్గవివరణము-

| | |
|---|---|
| అధికముగధనసహాయమునుఁజేయువారు | మహారాజపోషకులు |
| పదునైదురూప్యములనిచ్చువారు | రాజపోషకులు |
| పదిరూప్యములనిచ్చువారు | ప్రధానపోషకులు |
| ఐదురూప్యములనచ్చువారు | పోషకులు |

పైవిధములలో నెవ్విధముగనయినను ముద్రణసహాయము చేసిన వారికినిఁజేయుచున్నవారికిని జేయనున్నవారికిని నందఱకు శ్రీరామచంద్ర ప్రసాదముచే సకలశుభములు చేకూరుగాకయని యాశీస్సునుఁజేయుచు నింతటితో విరమింపబడుచున్నది.

ఇట్లు, పండితవిధేయుడు
గ్రంథరచయిత
లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రి



# కృతజ్ఞత

ఈగ్రంథముద్రణ విషయమున నిర్ధనుడనగు నాకు సర్వవిధములఁ బ్రోత్సాహమునుఁ గలిగించి గ్రంథమును సంపూర్ణముగాఁ దమ ముద్రాలయమున ముద్రింపించిన తాడంకి సంజీవరావుగారి కృతజ్ఞత యెన్నటికి మఱువఁబడదని విన్నపము.

శ్రీ రామ.
శుభమస్తు.
అవిఘ్నమస్తు.
శ్రీరామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ఆశ్చర్య రామాయణే




## మాహాత్మ్య ప్రారంభః.



శ్లో॥ శృతిశాఖి పల్లవాభ్యాం। స్మృతిమాత్రప్రాపితార్థసాఖ్యా
భ్యాం। గతిజితమత్తగజాభ్యాం। నతిరస్త్వేసాగణేశచర
ణాభ్యాం॥ ౧

శ్లో॥ భక్తిర్ముక్తి విధాయినీ భగవతశ్శ్రీరామచంద్రస్య
హే లోకాః కామదుఘాంఘ్రిపద్మయుగళం సేవధ్వ
మత్యుత్సుకాః। నానాజ్ఞాన విశేష మంత్రవితతిం త్యక్త్వా
సుదూరే భృశం। రామం శ్యామతనుం స్మరారి హృదయే
భాంతం భజధ్వం బుధాః। ౨

[1]శ్లో॥ పురా కైలాసశిఖరే। విష్ణుమారాధ్య శంకరః। ఉపవిష్ట
స్తతో భోక్తుం। ద్యావశ్యా మాహ పార్వతీం॥ 3

1. తత్వసంగ్రహ రామాయణం.

శ్రీ రస్తు.

శుభమస్తు.

శ్రీ గణేశాయనమః.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# ఆశ్చర్య రామాయణమునందు



## ప్రథమమున మాహాత్మ్యము చెప్పఁబడుచున్నది.

౧ తా॥ శ్రీమదఖండ విజ్ఞాన రూపమగు వేదమనెడి వృక్షమునకు (ఋగ్వేదాది) శాఖలుఁ జిగుళ్లునంటివియు, స్మరణమాత్రము చేతనే యర్థిజనులకు సర్వాభీష్టములనొసగునట్టివియు, మదపుటేన్గుల నడలతో సమానమగు గమనము గలవియునగు గణేశుని పాదములకు నా నమస్కారము.

౨ తా॥ ఓజనులారా! కలియుగమున సంసారమను సముద్రమును దాటుటకు భగవద్భక్తి యను నావకంటె వేఱు సాధనము లేదంచున సంసారతారకమును, సర్వాభీష్టప్రదమునగు శ్రీరామచంద్ర పాదారవిందయుగళమును సేవింపుడు. ఓ విబుధులారా! మోహకరములగు నితర మంత్ర తంత్రములను దూరముగాఁ బడిలి శంకరుని హృదయకమలమున నెల్లప్పుడు భాసించెడి యా శ్యామల విగ్రహుని భజింపుడు.

3. పూర్వకాలమునఁ గైలాసమునందు శంకరుడు ద్వాదశీదినమునందు విష్ణునారాధించి భుజింపఁబోవుచుఁ బార్వతీదేవితో నిట్లనెను.

శ్లో॥ పార్వత్యేహి మయా సార్థం। భోక్తుం భువన వందితే।
తమాహ పార్వతీ దేవి। జప్త్వా నామసహస్రకం॥ ౪

శ్లో॥ తతో భోక్ష్యామ్యహం దేవ। భుజ్యతాం భవతా ప్రభో॥
తత స్తాం పార్వతీం ప్రాహ ప్రహసన్పరమేశ్వరః॥ ౫

శ్లో॥ ధన్యాసి కృతకృత్యాసి। విష్ణుభక్తాసి పార్వతి।
దుర్లభా వైష్ణవీ భక్తి। ర్భాగధేయంవినేశ్వరి॥ ౬

శ్లో॥ రహస్యమంత్రం తే వచ్మి। శత కోటి ప్రవిస్తరే। రామా
యణే ప్రియే గుప్తం। శ్రేష్ఠం నామసహస్రతః॥ ౭

శ్లో॥ శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే। సహస్రనామ
తత్తుల్యం। రామనామ వరాననే॥ ౮

శ్లో॥ రామేత్యుక్త్వామహాదేవి। భుంక్ష్వసార్థంమయాఽధునాఽ౯
పార్వతీ శ్లో॥ వామదేవేన గురుణా విష్ణోర్నామసహస్రకం
మమోపదిష్టం భగవన్। కరోమి నియతం విభో
రామేతివర్ణద్వితయే తాదృశం మహిమాస్తి కిం॥ ౯-౧౦

౪-౫. లోకవందితురాలవగు నోపార్వతీ! నాతోఁగూడ భుజించుటకు రమ్మనెను. అప్పుడు పార్వతీదేవి తనకు విష్ణు సహస్రనామ పారాయణము కాలేదనియుఁ, ఇమ్మట భుజించెదననియు, మీరు భుజింపుడనియుఁ జెప్పగా మందహాసముఁజేయుచుఁ బరమేశ్వరుడు పార్వతితో నిట్లనెను. (వామదేవునివలన దేవి విష్ణు సహస్రనామముల నుపదేశమునుఁ బొందినట్లును, ప్రతిదినమునందున భోజనమునకుఁ బూర్వము సహస్రనామ పారాయణము చేయుచుండెడిది యనియు, పాద్మపురాణమునందు చెప్పబడియున్నది.)

౬. ఓ పార్వతీ! విష్ణుభక్తిగలదానవగుటచే నీవు ధన్యాత్మురాలవు. పూర్వ సుకృతములేనిచో విష్ణుభక్తి కలుగుట కడుదుర్లభము.

౭. శతకోటివిస్తరమగు రామాయణమున విష్ణుసహస్రనామములకంటె శ్రేష్ఠమగు గోప్యమైన రహస్యమంత్ర మొకటి కలదు. దానినిఁ జెప్పెదను వినుము.

౮. ఓపార్వతీ! శ్రీరామ రామ యని యుచ్చరింపుము. ఆరామ యను నామము విష్ణు సహస్రనామములతో సమానమైనది. (అనగా విష్ణు సహస్రనామ పారాయణమువలన గలుగు ఫలము రామ యను వర్ణద్వయోచ్చారణము చేసినచో కలుగుచున్నదని భావము.)

౯-౧౦. ఓపార్వతీ! రామరామ నామము నుచ్చరించి నాతోఁగూడ నిప్పుడే భుజింపుమని శివుడు పలుకగా దేవా! నాకు వామదేవుడను మహర్షి యొకానొకప్పుడు విష్ణుసహస్రనామపారాయణము మహాఫల ప్రదముగాన నామసహస్ర పారాయణము చేసి భుజించుచుండుమని చెప్పెను. రామ యనెడి వర్ణద్వయము నందేయట్టి మహిమ కలదా? యని పరమేశ్వరుని ప్రశ్నించెను.

శివః॥ అన్యాపదేశతో రామ నామ్ని ముక్తిప్రదాయిని । సతి సాక్షాద్రామనామకీర్తనం ముక్తిదాయకం । కథంనభవతీశాని తస్మాన్నామైవకీర్తయేత్ । ఇతిహాస మిమం వచ్మి శృణు దేవి సమాహితా॥ ౧౧ ౧౨

1 వనే చరామో వసుచాహరామో । నదీ స్తరామో న భయం స్మరామః ఇతీరయంతోఽపి వనే కిరాతాః। ముక్తిం గతా రామ పదానుషంగాత్॥ ౧౩

2 అత్రైవోదాహరామ్యన్య మితిహాసంపరంశృణు
అవంతివిషయే కశ్చిద్బ్రాహ్మణోఽభూత్పురా శివే। ౧౪

శ్లో॥ విహాయ వైదికాన్ధర్మాన్ శ్రుతి స్మృత్యురరీకృతాత్
పాషండైః కృతసంసర్గో పరదారరతోఽభవత్॥ ౧౫

శ్లో॥ నష్టేషు ద్రవ్యజాతేషు స్వదారనిరతోఽభవత్
సాపి తీవ్రక్షుధా దగ్ధా పంచత్వం చ గతా శుభా॥ ౧౬

1 బ్రహ్మాండ పురాణం. 2. తత్వసంగ్రహ రామాయణం.

౧౧-౧౨. ఓ పార్వతీ! అన్యాపదేశముననే రామ యను నామము మోక్ష ప్రదమగుచుండఁగ, సాక్షాద్రామనామ సంకీర్తనము మోక్షప్రద మెట్లుకానేరదు! కాన రామ యను నామమునుఁ గీర్తించినచా లనెను. మఱియు నీకొక యితిహాసమును జెప్పెదను వినుమనెను.

౧౩. (అర్థము) (వనే) అడవియందలి (కిరాతాః) బోయలు (వనేచ రామః) అడవిని సంచరించెదము. (వసుచాహరామః) ధనమును తీసుకొనివచ్చెదము (నదీస్తరామః) నదులనుదాటుదుము (సభయం స్మరామః) భయమును దలఁపకుందము.

1 (ఇతి) ఈ ప్రకారముగ (ఈరయంతోఽపి) చెప్పుకొనుచున్న వారైనప్పటికి (రామపదానుషంగాత్) రామయనుపదము కలియుట వలన(ముక్తిగతాః) మోక్షమును బొందిరి. (పూర్వమున కొంతమంది చోరులుకూడిన వారై (వనేచరామ ఇతి (వసుచాహరామ ఇతి) (నదీస్తరామ ఇతి (సభయంస్మరామ ఇతి) అను మాటలనుక్రమము గా. వనమునసంచరించెదము. ధనమునపహరించెదము. నదులను దాటెదము, భయమును దలఁపము- అను నభిప్రాయములతోఁ జెప్పు కొనినను రామయను పదమా మాటలలో నుపయోగించుటచే మోక్ష మును బొందిరని యభిప్రాయము)

౧౪''2 ఓ పార్వతీ! ఈ విషయమున నీకు మఱియొక యితిహాసమునుఁ జెప్పెదను వినుము, అవంతిదేశమునందుఁ బూర్వకాలము నందొక బ్రాహ్మణుడుండెను. అతనిని విద్యాధరుడను నామముతోఁ బిలి చెదరు.

౧౫. ఆబ్రాహ్మణుడు, వేదశాస్త్రములయందుఁజెప్పఁబడిన వైదికధర్మ ములను విడిచి వేదబాహ్యులతో సంబంధము గలవాడై పర స్త్రీలోలుడై భార్యను విడిచియుండెను.

౧౬. ద్రవ్యమంతయుఁబోయినంతప దుర్వృత్తిని వదలి స్వకళత్రమునందపే క్షగలవాడయ్యెను, కాని యామె యన్నపానాములు లేనికతమున నప్పటికే మృతినొందెను.

శ్లో॥ హతా రామేతి విజ్ఞాయ చింతయానో దివానిశం
విషయేష్వనురక్తోఽసౌ హారామేతి రురోదహా॥ ౧౭

శ్లో॥ హా రామ మమ రామేతి క్వ రామేతి మనోరమే
ఇమం శబ్దం సుబహుశః కుర్వన్సంచరతి క్షితౌ॥ ౧౮

శ్లో॥ ఏవం కాలే బహు గతే గతకల్మషపంజరః
నామస్మరణమాహాత్మ్యా జ్జీవన్ముక్తశ్చచారసః॥ ౧౯

శ్లో॥ ఏవంభూతం ద్విజవరం కింకరాః కాలచోదితాః
సంగృహ్య సర్వతః ప్రాణాన్ కష్టమున్యోగమాస్థితాః। ౨౦

శ్లో॥ పాశం ప్రాణేషు సంయోజ్య। ప్రాణాం స్తేజసి యోజితాః
తేజస్యాకృష్యమాణేతు। తత్రైవ విలయం గతః॥ ౨౧

శ్లో॥ విద్యాధర మదృష్ట్వా తే। క్వ గతో బ్రాహ్మణాధమః
ఇతి శంకిత చిత్తా స్తే। మార్గం తేస్మ పరస్పరం॥ ౨౨

శ్లో॥ మార్గిత్వా బహుకాలం తు దూతా ఖిన్నముఖా భృశం
రాజ్ఞే నివేదయామాసుః బ్రాహ్మణానయనక్రియాం॥ ౨౩

దూతాః॥ శ్లో॥ శృణు ప్రేతపతే యుష్మద్గణకస్య విచేష్టితం
వాక్యమాకర్ణ్యహి వయం। గతాస్మ బ్రాహ్మణాంతికం॥ ౨౪

౧౭. భార్య మృతినొందెనని తెలిసి యహోరాత్రములయందు, నామెనే తలచుచు విషయలోలుడై ఓరామాయని (అనగా, ఓప్రియురాలా యని) యేడ్వసాగెను.

౧౮ తా. ఆబ్రాహ్మణుడు హాప్రియురాలా, నాప్రియురాలా, నాప్రియురాలెక్కడ, నామనోరమ యేమయ్యెనని, యర్థమును, బోధించు (హారామా) మమరామా, క్వరామా, యను శబ్దములను తలచుచుగా నుచ్చరించుచు, భూమియందు, సంచరించుచుండెను.

౧౯ తా. ఈ ప్రకారము బహుకాలము గతింపగా నాబ్రాహ్మణుడు, పాపరహితుడై రామాయను నామోచ్చారణమువలన జీవన్ముక్తుడయ్యెను. (అనగా పైన చెప్పబడిన (హారామా) మమరామా) క్వరామా) అను పదముల నుచ్చరించుటలో రామ యను నక్షరములు మిళితములై, యున్నందున నతడు, వేఱువిధముగ నర్థముతో నుచ్చరించినను రామనామస్మరణమాహాత్మ్య ఫలముగలిగి జీవన్ముక్తుడయ్యెనని భావము.

౨౦ తా. ఇట్టిబ్రాహ్మణునకుఁగాలమాసన్నముకాగా యమకింకరులువచ్చి యతని ప్రాణములమీదఁబాశములను ప్రసరింపజేసిరి.

౨౧ తా. పైవిధముగ యమకింకరులు, యమపాశములను ప్రాణములయందుఁ బ్రసరింపఁజేసి యాప్రాణములను తేజస్సునందు సంయోజనము చేయుచుండ నాజీవుడు బ్రహ్మతేజస్సునందు లయమై యదృశ్యుడయ్యెను.

౨౨ తా. కింకరులను నాజీవుడు కన్పడనందున నబ్రాహ్మణాధముడేమయ్యెనని సంశయ చిత్తులై వెదకిరి.

౨౩ తా. బహుకాల మివ్విధమున వెదకినను కన్పడనందున ఖేదమునొందిన వారలై యమపురమునకు వచ్చి యా బ్రాహ్మణవిషయము నంతయుఁ యమప్రభువునకు నిట్లుచెప్పిరి.

౨౪ తా. యమధర్మరాజా! మీ చిత్రగుప్తుని చేష్టితమునననుసరించి మమ్ములను విద్యాధరుడను బ్రాహ్మణుని బాశబద్ధునిజేసి తీసికొనరమ్మని పంపగా మేము వెళ్ళితిమి.

శ్లో॥ బహుశో యత్నమాస్థాయ బ్రాహ్మణగ్రహణే కృతే
తం తత్ర కంచనాదృష్ట్వా నిరాశా జీవితే వయం॥ ౨౫

శ్లో॥ ఇత్యుక్తో దూతముఖ్యైస్తు । చిత్రగుప్తముపాహ్వయత్
యమః॥ శ్లో॥ ఆలోక్యాచక్ష్వ గణక। కృతంకర్మద్విజేనవై ॥౨౬

గణకః శ్లో॥ అయం విద్యాధరో విప్రః పాపినా మగ్రణీ ర్భృశం
వృషలీగమనాద్విప్రః కుంభీపాకేషు పచ్యతాం॥ ౨౭

శ్లో॥ యతీనాం నిందక శ్చాయం మహతాం దూషక స్తథా
ఏవమాదీని పాపాని కృతవాన్ బుద్ధిపూర్వకం॥ ౨౮
తస్మాద్విదేహ నిర్వాణ పదవీంనార్హతి ద్విజః॥ ౨౮½

శ్లో॥ చిత్రగుప్తేనైవముక్తః కాలో దండధరో రుషా
దండముద్దాంచసంగృహ్య వేధసోంతికమాగమత్ ॥ ౨౯½

యమః॥ శ్లో॥ భగవన్దేవ దేవేశ మహాపాతకినాం వరః
విద్యాధరః కథం విప్రఃసాయుజ్యం మోక్షమన్వగాత్ ॥ ౩౦½

బ్రహ్మ॥ శ్లో॥ ధర్మరాజ। ప్రవక్ష్యామి విప్రస్య చరితంమహత్
యస్య స్మరణమాత్రేణ । జీవన్ముక్తో భవేన్నరః॥ ౩౧½

౨౫ తా. మేము పాశములతో బ్రాహ్మణుని బంధించుటకు బహుప్రయత్న మునుఁజేసితిమి కాని యాతడు తేజస్సునఁదే లయమై యదృశ్యుడగుట వలన నిరాశఁజెంది వచ్చితిమి.

౨౬ తా. ఇట్లు కింకరులు చెప్పగా యముడు చిత్రగుప్తునిఁబిలిపించి, యో చిత్రగుప్తా విద్యాధరుడను నాబ్రాహ్మణునిచేఁజేయబడిన శుభాశుభ కర్మనుఁజెప్పుమని యడిగెను.

౨౭ తా. చిత్రగుప్తుడు లెక్కలనుఁజూచి యమునితో నిటులఁజెప్పెను. ఓ రాజా! ఈవిద్యాధరుడను బ్రాహ్మణుడు పాపాత్ములలో నగ్రేసరుడు, స్వభార్యను విడిచి శూద్రస్త్రీలతో నెప్పుడునుండువాడు కాన కుంభీపాకమునఁ బచనము చేయబడవలెను (అనగా కాగుచున్న నూనెతో కట్టెలో పడవేసి పచనము చేయబడవలెను.)

౨౮ తా. మఱియు నా బ్రాహ్మణుడు యతులను నిందించువాడు మహాత్ములను దూషించువాడు, ఇట్టి పాపముల ననేకముగా బుద్ధిపూర్వకముగా జేసెను.

౨౮-౪ తా. ఆ కారణమువలన విదేహనిర్వాణపదవికి (అనగా బ్రహ్మయందు లయమగునట్టి విదేహకైవల్యమునకు) నాబ్రాహ్మణుడనర్హుడని చిత్రగుప్తుడు చెప్పెను.

౨౯. చిత్రగుప్తుడిట్లిధముగఁ జెప్పగా యముడు కోపమొంది బ్రహ్మదేవుడు తనకుఁ బూర్వ మిచ్చిన దండమును, ముద్రను (శీలును) తీసికొని బ్రహ్మదేవు నొద్దకు వెళ్లెను.

౩౦ యముడు॥ బ్రహ్మదేవునితో నిట్లు జెప్పదొడగెను. దేవదేవా! మహాపాతకులలో శ్రేష్ఠుడగు విద్యాధరుడను బ్రాహ్మణుడు మోక్షము నెట్లు పొందెను? ఇట్టి మహాపాతకులకు మోక్షమిచ్చుచుండినచో నాయధికారమేల? మీరిచ్చిన దండమును శీలునుఁగూడఁదెచ్చితిని. తీసికొను డనెను.

౩౧. బ్రహ్మ యిట్లు చెప్ప నారంభించెను. "ఓ ధర్మరాజా! ఆబ్రాహ్మణుని చరిత్రము మహత్తరమైనది. చెప్పెదను వినుము. ఆ బ్రాహ్మణుని స్మరించిన మనుజుడు జీవన్ముక్తుడగును.

శ్లో॥ అయం బ్రాహ్మణదాయాదో। రామనామ సదాస్మరత్
సహస్రనామసదృశో రామనామాత్మకో మనుః॥ 32

శ్లో॥ కోటియజ్ఞసమో రామభద్రచంద్రేత్యయం మనుః
రామేతి రామభద్రేతి రామచంద్రేతి వా మనుం
యావజ్జీవం జపన్మర్త్యో జీవన్ముక్తో న సంశయః॥ 33-34

శ్లో॥ తస్మాత్కౌశికగోత్రోఽయం జపన్నేవ పరమం మనుం
రామచంద్రస్య సతతం ముక్తి మాపసుదుర్లభాం॥ 35

యమః ॥శ్లో॥ అనేన సర్వపాపంచ కృతం। బుద్ధిపురస్సరం।
బుద్ధిపూర్వకృతేపాపే ప్రాయశ్చిత్తం నవిద్యతే॥ 36

బ్రహ్మ ॥శ్లో॥ శ్రీరామనామాసదృశ। మవశేచాపి సంగృణన్।
ముక్తిం ప్రాప్నోతి మనుజః। కింపున ర్బుద్ధి పూర్వకం॥ 37

శ్లో॥ రాశబ్దోచ్చారణే జాతే । వక్త్రాత్పాపస్య నిర్గమః।
మకార శ్రవణే జాతే । భస్మీభావం గమిష్యతి॥ 38

శ్లో॥ బ్రహ్మహత్యాసహస్రాణి । స్వర్ణ స్తేయశతానిచ ।
సురాపానశతంచాపి । నశ్యంతేరామకీర్తనాత్॥ 39

శ్లో॥ రఘునాథస్య నామాని। యే గృణంతి నరా భువి ।
విముక్త సర్వపాపాస్తే । మోదంతే విష్ణు మందిరే॥ 40

౩౨. ఈ బ్రాహ్మణుడు మొదట దుర్వృత్తికలవాడైనను పిమ్మట రామ నామము నెల్లప్పుడును స్మరించెను. ఆ రామనామ మను మంత్రము విష్ణుసహస్రనామములతో సమానమైనది, పావనమైనది.

౩౩_౩౪. మఱియు, "రామభద్ర" రామచంద్ర" యను మంత్రము కోటి యజ్ఞములతో సమానమైనది. "రామ" యని గాని, "రామభద్ర" యని గాని, "రామచంద్ర" యనిగాని యీమంత్రములను యావజ్జీవము జపించిన మనుజుడు జీవన్ముక్తుడగుటకు సంశయము లేదు.

౩౫. ఆ హేతువువలనఁ గౌశికగోత్రుడైన యా బ్రాహ్మణుడు పరమ మంత్రమగు రామనామమును జపించిన కతమున దుర్లభమగు మోక్షమునుఁ బొందెను. అని బ్రహ్మదేవుడు యమునితోఁ జెప్పెను.

౩౬. అప్పుడు యముడు బ్రహ్మతో నిట్లనెను, ఈ బ్రాహ్మణుడు బుద్ధిపూర్వకముగ సర్వపాపములను జేసెనుగదా? బుద్ధిపూర్వకముగఁ బాపములనుఁ జేసినపుడు ప్రాయశ్చిత్తములేదని శ్రుతులయందు కలదు" గదా యనెను.

౩౭. అపుడు బ్రహ్మ యమునితో నిట్లనెను. "శ్రీ రామనామ మసదృశమైనది. దానిని బుద్ధిపూర్వకముగాఁ నుచ్చరించకపోయినను నన్యాపదేశముచే రామనామోచ్చారణము జేసినను మనుజుడు ముక్తినిఁ బొందును. బుద్ధిపూర్వకముగ రామనామమునుఁ జేసిన మనుజుడు ముక్తినిఁ బొందుననని చెప్పనగదియేమి యని యనెను.

౩౮. మఱియు "రా" యను శబ్దము నుచ్చరించుటతోడనే లోనిపాపములు బయలువెడలును. "మ" కారము నుచ్చరించుటతోఁ బాపములు భస్మమగును.

౩౯. మఱియు (రామ) అను నామము నుచ్చరించుటవలన సహస్ర బ్రహ్మహత్యా పాపములును నూరుసువర్ణస్తేయ పాతకములును, సురాపానశతమువలన సంభవించిన కల్మషములును నశించును,

౪౦. తా॥ శ్రీరఘునాథుని నామములను యేమనుజులు కీర్తించెదరో వారు సర్వపాపవిముక్తులై విష్ణుమందిరమునందు బ్రహ్మానందముతో నుండెదరు,

శ్లో॥ శ్రుత్వా యమో విశ్వసృజశ్చ వాక్యం। నివృత్తకోప
శ్చతురాననస్య। భృత్యై స్తత స్సంయమనీ। మగాత్పురీం
పున స్తథావిశ్వసృజం ప్రణమ్య॥ ४१

శ్లో॥ ఏవం శ్రుత్వా రామనామప్రభావం పరమేశ్వరాత్।
తుష్టా రామేతి నామోక్త్వాభుక్త్వాఽథపతిమాహ సా॥४२

1 శ్లో॥ ధన్యాస్మ్యనుగృహీతాస్మి కృతార్థాస్మి దయానిధే।
యద్రామనామమాహాత్మ్యం శ్రుతం త్వన్ముఖనిసృతం॥४३

శ్లో॥ దేవేశ మహిమా స్త్వేవం రామనామ్న్యేవ కేవలం।
శ్రీరామచరితే కీదృక్ఫలం రామాయణే వద॥ ४४

శివః ॥శ్లో॥ రామాయణ ఫలం। దేవి। రామో వేత్తి నచాపరః
తథాపి తద్యథాబుద్ధి వక్ష్యే। శృణు సమాహితా ४५

శ్లో॥ రామాయణకథా దేవి। శతకోటిప్రవిస్తరా। శ్రుత్వా
యత్రాక్షరం మర్త్య స్సర్వపాపైః ప్రముచ్యతే ४६

శ్లో॥ బ్రహ్మలోకేచ సతతం శతకోటి ప్రవిస్తరం। బ్రహ్మణా
శ్రూయతే నిత్యం మార్కండేయాద్ద్విజోత్తమాత్ ॥४७

1. తత్త్వసంగ్రహణ రామాయణే.

౪౧, తా॥ యముడు బ్రహ్మవాక్యములను వినినవాడై కోపరహితుడై బ్రహ్మదేవునకు నమస్కరించి తదానతినొంది తనపట్టణమునకు వెళ్లెను.

౪౨, తా॥ ఇవ్విధముగఁ రామనామప్రభావమునుఁ బరమేశ్వరుని వలనఁ బార్వతి విని యాశ్చర్యసంతోషముల నొంది రామయను నామోచ్చారణముఁ జేసి భుజించి తిరిగి పరమేశ్వరునితో నిట్లనెను.

౪౩. తా॥ ఓదయానిధీ! నీముఖారవిందమునఁ బయలువెడలిన రామనామ మహాత్మ్యమనెడి మకరందమును గ్రోలుటచే నేను ధన్యాత్మురాలను, కృతార్థురాలనైతిని,

౪౪. తా॥ మహాదేవా? కరుణా సముద్రా? రామయను నామమునందే యిట్టిమహిమయుండెనే యా రామచరితమగు రామాయణమునందెట్టి మహిమ ముండెనోయనుగ్రహించి నాకుఁజెప్పుమని పార్వతి పరమేశ్వరునిఁ బ్రశ్నించెను.

౪౫, పరమేశ్వరుడు పార్వతితో నిటులఁజెప్ప నారంభించెను ఓ దేవి! రామాయణమహిమమును, రాముడొక్కడే పూర్తిగ నెఱుగును గాని యితరుడెవ్వడును బూర్తిగ నెఱుగడు. అట్లయ్యును నాబుద్ధికిఁదగినటులఁ జెప్పగలను సావధానచిత్తము గలిగి వినుమనియెను,

౪౬, తా॥ మఱియు నోదేవి. రామచరితము శతకోటి విస్తృతమైయుండెను ఆరామాయణమునందొక యక్షరమును వినినను సమస్తపాపములు నశించును.

౪౭. తా॥ ఓదేవి!శతకోటివిస్తరమగు నీ రామచరితము నెల్లప్పుడు బ్రహ్మలోకమున బ్రహ్మదేవుడు, మార్కండేయ మహర్షివలన వినుచుండును.

శ్లో॥ బ్రహ్మలోకే విష్ణులోకే। కైలాసే విష్ణుమందిరే।
అష్టదిక్పాల లోకేషు। నాగాదీనాం చసద్మసు। ౪౮

శ్లో॥ జనభవ్యేషు లోకేషువ్యాప్య విశ్వం వ్యవస్థితా।
సకృద్రామాయణం శృత్వాజన్మపావన ముత్తమం॥ ౪౯

శ్లో॥ రామాయణకథా మేవ। యే శృణ్వంతి।నరా భువి।
విధూతపాపా స్తే యాంతి। విష్ణులోకం సనాతనం॥ ౫౦

శ్లో॥ శృణ్వన్ రామాయణం భక్త్యా।యః పాదంపద మేవవా
సయాతి బ్రహ్మణ స్థానం।బ్రహ్మణా పూజ్యతే సదా॥ ౫౧

శ్లో॥ అత్రైవోదాహరంతీమ మితిహాసం పురాతనం।
విప్రః కశ్చిన్మహాబుద్ధిః రామార్చన పరోఽభవత్ ౫౨

శ్లో॥ గచ్ఛన్గ్రామాంతరం। మధ్యేమార్గం వటతరో। గధః
స్నాత్వా సరసి తత్తీరే రామాయణ మథాపఠత్ ॥౫౩

శ్లో॥ తులాద్రవ్యగ్రహాద్భ్రత్వా।బ్రాహ్మణా।బ్రహ్మరాక్షసాః।
సంస్థితా స్తత్ర బహవో వట వృక్షే సువిస్తరే॥ ౫౪

1 తత్త్వసంగ్రహ రామాయణము

౪౮-౪౯ తా॥ బ్రహ్మలోకమునను, వైకుంఠమునందును, కైలాసమునందును అష్టదిక్పాలక లోకములందును, నాగలోకమునందును జనలోకము భూలోకము మొదలగు లోకములయందును. వ్యాపించియుండెను. ఒకపర్యాయమైనను రామాయణమును వినినవాని జన్మముపావనమని చెప్పనొప్పును.

౫౦. తా॥మఱియు రామాయణకథను నేమనుజులు శ్రవణముఁ జేయుదురో వారలు సర్వపాపవిముక్తులై శాశ్వతమగు వైకుంఠమునుఁబొంద గలరు.

౫౧. భక్తిపూర్వకముగ రామాయణమునందలి శ్లోకమునైనను, నొక పాదమునైనను నొకపదమునైనను వినిన వాఁడును. బ్రహ్మలోక మునుఁ బొంది బ్రహ్మచేఁ బూజింపఁ బడుచునుండును నన రామా యణమునుఁ బూర్తిగ వినువారిఫలముఁజెప్పనది యేమియునెను.

౫౨. తా॥ ఓదేవి! నేను చెప్పినదంతయు స్తోత్రపరము తలవకుము, ఇవ్విషయమునఁ బురాణములందు చెప్పిన పురాతనమైన యితిహాసము నుఁజెప్పెదవినుము. పూర్వకాలమునందొక బ్రాహ్మణుఁడు రామా ర్చనపరుఁడైయుండెను.

౫౩. తా॥ ఆబ్రాహ్మణుఁడు గ్రామాంతరము వెళ్లుచు మార్గమధ్యమున నొక సరోవరము కనుపడగా నాసరస్సులో స్నానమునుఁజేసి తత్తీరమునందలి వటవృక్షముక్రింద కూర్చొని రామాయణ పారా యణముఁ జేయుచుండెను.

౫౪. తులాభారము తూగిన ద్రవ్యమును గ్రహించినందునఁగొందఱు బ్రాహ్మణులు బ్రహ్మరాక్షసులై యావటవృక్షముపైనుండిరి.

శ్లో॥ రామాయణ కథా పాఠేమంగళాన్యకరో ద్విజః
రామాయణ ప్రభావేణ సర్వేనాశిత పాతకాః
దివ్యరూపధరా భూత్వా। దేవానీ తవిమానగాః
రామాయణపఠంతం తంనమస్కృత్యా బ్రువంశ్చతే ౧౬

శ్లో॥ వైభవం భవతోఽధీనం పరలోకవిజృంభితం

ప్రాప్తా రామాయణకథా త్వం విశిష్టోఽసి వాచకః ౧౭

శ్లో॥ ముక్తింగతా వయం సర్వే। భవతోఽస్యచదర్శనాత్
రామాయణకథాం శ్రుత్వా।వయం పాపస్య నిర్గమాత్
ఆరుహ్య స్వర్గసౌఖ్యాని।భజామః కృతినోయథా। ౧౮
శ్లో॥ ఇత్యుక్త్వా బ్రహ్మ రక్షాంసి। పరిక్రమ్యప్రణమ్యతం।
దేవత్వం సమనుప్రాప్యయయుర్దేవగతింతదా॥ ౧౯
రామాయణ ఫలందేవి శ్రుత్వైవంప్రాహశంకరం। ౨౦

పార్వతీ॥ శ్లో॥ భగవన్ దేవదేవేశ శ్రీరామాయణ వైభవం
శ్రుత్వాత్వన్ముఖతోఽభూవం కృతార్థాహంనసంశయః ౨౧

ఇత్యాశ్చర్యరామాయణే
రామాయణ మాహాత్మ్యం సంపూర్ణం

---

తత్త్వ సంగ్రహరామాయణే రామోత్సవ రత్నాకరేచ

౫౫-౫౬. అవట వృక్షము క్రిందన రామాయణ పారాయణముఁ జేయు చున్న బ్రాహ్మణుఁడు రామాయణమునందలి మంగళ శ్లోకములనుఁ బఠించుచుండగా వటవృక్షము పైనున్న బ్రహ్మరాక్షసులు మంగళ శ్లోకములను వినిన మాత్రముననే సర్వపాప విముక్తులై దివ్యరూపము లను ధరించి తమకొఱకుఁ దీసికొనిరాఁబడిన విమానముల నెక్కినవారలై రామాయణమునుఁ జదువుచున్న బ్రాహ్మణునకు నమస్కరించి యిటులఁ బల్కిరి.

౫౭తా॥ ఓ ద్విజోత్తముఁడా! పరలోక వైభవము నీయధీనమైయున్నది సర్వ పాప హరమగు రామాయణకథను నీవు పఠింపగా మేము వింటిమి నీవు గొప్ప కథకుడవు అని యాబ్రాహ్మణుని బ్రహ్మరాక్షసులు పొగడిరి.

౫౮-౫. మఱియు నిట్లనిరి, ఓ మహాత్మా! నీదర్శనమునను నీవుపఠించిన రామాయణ శ్రవణము వలనను మాపాపములన్నియు నశించి మేము ముక్తినిఁ బొంది విమానముల నెక్కి పుణ్యాత్ములవలె స్వర్గసౌఖ్యములనొందఁ బోవుచుంటిమి.

౫౯ ఇవ్విధముగ బ్రహ్మరాక్షసులు చెప్పి బ్రాహ్మణునకు నమస్కరించి దివ్యరూపములతో దేవలోకమునకుఁ బోయిరి.

౬౦. తా॥ ఇవ్విధముగ శంకరుఁడు రామాయణ ఫలమునుఁ జెప్పగాఁ బార్వతి విని సంతసమునుఁ బొంది శంకరునితో నిటులఁ బల్కెను.

౬౧. ఓ దేవదేవా! నీ వలన రామాయణ మాహాత్మ్యమునువిని కృతార్థురాలనైతినని పరమేశ్వరునితోఁ బల్కెను.

ఆశ్చర్యరామాయణమున

రామాయణ మహాత్మ్యము సంపూర్ణము.

---

# శ్రీమదాశ్చర్యరామాయణే

## బాలకాండే ప్రథమస్సర్గః.

శ్లో॥ వందామహే మహేశానచండకోదండ ఖండనం।
జానకీ హృదయానంద చందనం రఘునందనం॥ ౧

శ్లో॥ ఏకదా మునయస్సర్వే । నానారణ్యానివాసినః।
సత్రయాగం ప్రకుర్వాణా స్సంస్థితా నైమిశే వనే॥ ౨

శ్లో॥ ఏతస్మిన్ సమయే తత్ర సమాగాద్రోమహర్షణః।
తం పూజయిత్వా పప్రచ్ఛు ర్వ్యాసశిష్యం తపోధనాః॥ ౩

---

౨ వ్యా॥ ఏకదేతి- నైమిశమితి - ఏకదా మహర్షయః వేధసోఽంతికం గత్వా తపస్తప్తుమేకం పావనం స్థలం ప్రదర్శయేతి ప్రార్థయామాసుః తదా బ్రహ్మా కుశైర్నేమిం (చక్రం) కృత్వా హస్తేన తాం గృహీత్వా మునీ నవాదీత్ భోమహర్షయః మయేయముత్ క్షిప్యేత యత్రేయం పతేత్. తత్స్థలం పవిత్రమిత్యుక్త్వా, నేమిం దూరతస్తూత్క్షేపయామాస, యత్ర నేమిః పతితా తత్స్థలం నైమిశమభూత్, తత్స్థలస్యారణ్యమయత్వా న్నైమిశారణ్యమిత్యాఖ్యా సమజనీతి.

నానారణ్యాని ధర్మారణ్య వింధ్యారణ్యాదీని పుణ్యారణ్యానీత్యర్థః.

3 వ్యా॥ రోమహర్షణఇతి. యస్య సుభాషితైః శ్రోతౄణాం శరీరేషు రోమహర్షణం (రోమాంచః) జాయతే. సరోమహర్షణఇతి వాయుపురాణే 1 అధ్యాయే ప్రతిపాదితం.

21

# ఆశ్చర్య రామాయణమునందు



## బాలకాండ ప్రారంభము.

౧ తా॥ మహేశ్వరుని ధనువును ఖండించినవాడను, జానకీహృదయానంద కరుడునగు శ్రీరామచంద్రుని నమస్కరించెదను.

౨ * తా॥ ఒకానొకప్పుడు నానారణ్యములయందుండెడి మహర్షులందఱును నైమిశారణ్యమునందుఁగలసి దీర్ఘ సత్రయాగమునుఁ జేయుచుండిరి

3 * తా॥ ఈ సమయమునందు నచ్చటకు రోమహర్షణుఁడను వ్యాసశిష్యుడు వచ్చెను. అచ్చటి మహర్షులు వ్యాస శిష్యుడగు నా రోమహర్షణుని బూజించి ప్రశ్నించిరి.

---

* వ్యా॥ నైమిశారణ్యమనగాఁ బురాణముల యందివ్విధముగఁ జెప్పబడినది, (ఏమన) ఒకప్పుడు మహర్షులు బ్రహ్మదేవుని యొద్దకు వెళ్ళి, మేము తపస్సు చేసికొనుటకుఁ బవిత్రమయిన స్థలమునుఁ జూపుమని ప్రార్థించిరి. అప్పుడు బ్రహ్మదేవుడు మహర్షులతో నిట్లనెను. ఓమహర్షులారా కుశలతో నేనొక చక్రముసుఁగల్పించి దూరముగా విసరివేయుదును ఈకుశచక్ర మెచ్చటబడునో యది పవిత్ర స్థలముగా భావింపుడని చెప్పియా నేమిని (చక్రమును)ఎగరవేసెను. ఆ నేమి (ఆచక్రము) పడినప్రదేశము నైమిశమయ్యెను. అదియరణ్యప్రదేశ మగుటవలన నైమిశారణ్యమని పిలువబడుచున్నది.

నానారణ్యములనగ ధర్మారణ్యము, వింధ్యారణ్యము, మొదలగు పుణ్యారణ్యములు.

* (రోమహర్షణుడు) ఏమహర్షియుని కథ శ్రవణము చేత భక్తులగు శ్రోతలకు, రోమహర్షణము (ఆనందముచే శరీరమున గగుర్పాటు) కలుగునో యామహాత్మునకు రోమహర్షణుడను పేరుకలిగెనని వాయుపురాణమునందు 1 అధ్యాయమునఁ జెప్పబడినది.

శ్లో॥ పౌరాణిక మహాబుద్ధే రోమహర్షణ సువ్రత
త్వత్తశ్శ్రుతామహాపుణ్యాః పురా పౌరాణికీ కథాః॥ ౪
శ్లో॥ న మనో నిర్మలం జాత మస్మాకం రోమహర్షణ।
తస్మాద్రామకథాం బ్రూహి పాపహాం చిత్తశుద్ధిదాం॥ ౫
శ్లో॥ రామాయణాని బహుశ స్సంతీతి శృణుమో వయం।
తేషాం సారం సముద్ధృత్య కథాంత్వంవక్తుమర్హసి॥ ౬
శ్లో॥ సూర్యవంశభవానాంహి। రాజ్ఞాం చారిత్ర మద్భుతం।
ప్రథమం సంగ్రహేణోక్త్వా త్వాసూర్యాజసుతావధి।
పశ్చాత్త్వం రఘువీరస్య చరితం విస్తృతంవద॥ ౭
సూతః శ్లో॥ ధన్యాయూయం ద్విజశ్రేష్ఠాః యేషాంవోమతిరీ
దృశీరఘువీర పదద్వంద్వ మకరంద స్పృహావతీ॥ ౮
శ్లో॥ సఫలం జీవితం మేఽద్య। యదాహ్రమ స్మారితః పునః
సురాసురకిరీటౌఘ మణి నీరాజితాంఘ్రికః॥ ౯
శ్లో॥ రావణారి కథావార్తా। మశకో మాదృశః కియాన్।
యత్ర బ్రహ్మాదయో దేవా మోహితా నవిదంత్యపి॥ ౧౦
శ్లో॥ తథాపి వో మయా త్వద్య వక్తవ్యం స్వీయశక్తితః
పక్షిణ స్స్వగతిప్రాయం ఖే గచ్ఛన్తి సువిస్తరే॥ ౧౧

౪. సర్వపురాణములనుఁ దెలిసిన మహాబుద్ధిమంతుడవగు నో రోమహర్షణుఁడా ! పూర్వమునందు నీవలన మేము సర్వపురాణ గాథలను విని యుంటిమి.

౫. ఓరోమహర్షణుడా నీవలన బురాణములన్నియు వినినను మాకు జిత్తశుద్ధి కలుగనందునఁ జిత్తశుద్ధినిఁ జేయునదియును, సర్వపాపహరము నగు రామకథను జెప్పుము,

౬.॥తా॥ రామాయణము లనేకములుగా నున్నవని వినుచున్నాము ఆరామాయణము లన్నిటిలోని సారమునెత్తి యొకకథనుగా జెప్పుముఁ

౭॥తా॥ మఱియును సూర్యవంశపురాజుల చరిత్ర మత్యద్భుతముగాన. బ్రథమమున సూర్యుడు మొదలుగ దశరథుని పర్యంతముగల కథా భాగమును సంగ్రహముగ జెప్పి యనంతరము సూర్యవంశ మణిభూతుడగు నారామచంద్రుని కథావృత్తాంతమును విస్తారముగ వర్ణింపుమని మహర్షులు కోరిరి.

౮॥తా॥ రోమహర్షణుఁ డిట్లు చెప్పఁదొడంగెను. ఓమహర్షులారా! మీరు చిత్తము శ్రీరాముని పాదారవిందముల యందలి మకరందమును గోర్కెల నుద్యమించిన కతంబున మీరు ధన్యాత్ముల రైతిరి.

౯. మఱియు నోమహర్షులారా! మీరు ధన్యాత్ముల రగుటయేకాను సురాసురుల కిరీటములయందలి మణులచే నీరాజింపబడు పాదపద్మములుగల యారామచంద్రుని స్మరణము నాకు లభించినందున నేనును కృతార్థుడనైతి. నాజన్మము సఫలమయ్యెను.

౧౦॥తా॥ మహర్షులారా! బ్రహ్మాది దేవతలును మాయామోహితులై యే రామకథను బూర్ణముగ దెలియజాలకుండిరో యారామకథయనెడి మహాసముద్రమున నాబోటియల్పుఁ డొకదోమయని చెప్పఁనొప్పును (అనగా మహాసముద్రమువంటి యారామకథను వర్ణించి చెప్పుటకు నేనెంతవాడనని భావము.)

౧౧॥తా॥ అట్లయ్యును, బహువిశాలమగు నాకాశమునందుఁ బక్షులు తమ గమనానుసారము సంచరించిన విధమున నాశక్తికొలది మీకుఁ జెప్పెదను.

శ్లో॥ రఘునాథస్య సత్కీర్తి ర్మద్బుద్ధిం నిర్మలీపసాం
కరిష్యతేఽగ్నిసంపర్కా త్కనకం త్వమలంయథా॥ ౧౨౹
పురా కైలాసశిఖరే పార్వతీం ప్రతి శంకరః

తత్పృష్టోయాంకథాం ప్రాహతామేవాద్యవదామివః ౧౩

శ్లో॥ ఏవముక్త్వా మునీ న్సర్వాన్ ధ్యానస్తిమితలోచనః।
జ్ఞానేనాలోక్య వైచిత్రాంకథాంవక్తుము పాక్రమత్ ॥ ౧౪౹

కథాప్రారంభః

1 ఆదినారాయణాద్బ్రహ్మాఽభూన్మరీచిర్విధేస్సుతః
మరీచేః కశ్యపః పుత్రః లోకేసృష్టిప్రవర్తకః॥ ౧౫౹
2శ్లో॥ అదితి స్సుషువే పుత్రమాదిత్యం కశ్యపా ద్విజాః
సూర్యస్య పత్నీ సంజ్ఞాఽభూ త్తనయా విశ్వకర్మణః॥ ౧౬౹
శ్లో॥ అసూత తపసా సాతు మనుం జ్యేష్ఠం వివస్వతః

యమౌ పున రసూతాసౌ యమంచ యమునాంతతః ౧౭౹

శ్లో॥ శాతవర్ణంచ తన్మూర్తిం దృష్ట్వా సంజ్ఞా వివస్వతః
అసహంతీ స్వకాం ఛాయాం సవర్ణాం నిర్మమేతదా
ప్రాంజలిః ప్రయతా భూత్వా। ఛాయాసంజ్ఞామభాషత ౧౮-౧౯

1. ఆనందరామాయణే 2. వాయుపురాణే 84 అధ్యాయేచ

౧౨। మహర్షులారా! సువర్ణమునందలి మాలిన్యమగ్నిసంపర్కముచేఁ బోయిన విధమున నాబుద్ధి యందలి మాలిన్యము. రఘువీరుని సత్కీర్తిని వర్ణించుటచే నశింపఁగలదు.

౧౩।తా॥ మహర్షులారా! మీరలు నన్నడిగినవిధముననే పూర్వమునఁ గైలాసపర్వతమునం దొకప్పుడు పార్వతి పరమేశ్వరుని రామకథనుఁ జెప్పవలసినదిగాఁ బ్రశ్నించెను. అప్పుడు పార్వతికిఁ బరమేశ్వరుడు చెప్పినకథనే నేనిప్పుడు మీకుఁ జెప్పెదను వినుడని రోమహర్షణుడు మహర్షులతో ననెను.

౧౪।తా॥ ఈవిధముగ రోమహర్షణుడు మహర్షులతోఁ జెప్పి నేత్రములను మూసి ధ్యానముచేసి సమస్తమును జ్ఞానదృష్టిచేఁ జూచి మహర్షులకుఁ జిత్రమగు కథానకమునుఁ జెప్పఁనారంభించెను.

(కథాప్రారంభము.)

౧౫। ఓ మహర్షులారా! నారాయణమూర్తివలన బ్రహ్మయు బ్రహ్మవలన మరీచియు వానివలన కశ్యపుడును జనించిరి.

౧౬। కశ్యపునకదితి యందుసూర్యుడుద్భవించి తపస్సుచేత గ్రహరాజై యొప్పుచు విశ్వకర్మపుత్రికయగు సంజ్ఞాదేవినిఁ బెండ్లియాడెను.

౧౭। ఆసంజ్ఞాదేవియుఁ దపముఁజేసి యా తపోబలముచే, సూర్యునివలన నొక పుత్రునిఁగనెను ఆపుత్రునకు వైవస్వతమనువను నామమిడిరి, పిమ్మట మఱియొక పుత్రుడును పుత్రికయు జన్మించిరి. ఆపుత్రునకు యముడనియుఁ బుత్రికకు యమునయనియు నామములై యున్నవి. ఈవిధమున మనువు, యముడు, యమున, అనుమువ్వురు సంజ్ఞాదేవికి సూర్యునివలనఁగలిగిరి.

౧౮-౧౯-తా॥ సంజ్ఞాదేవి దుస్సహమగు సూర్యుని తేజస్సును సహింపలేనిదై తనతో సమానాకారముగల ఛాయను (నీడను) తన తపోమహిమచేఁ బ్రాణవంతురాలనుగా నిర్మించెను.

ఆచ్ఛాయాదేవి ప్రాంజలియై సంజ్ఞాదేవితో నిట్లనెను.

1 శ్లో॥ వదస్వకిం । మయా కార్యంసా సంజ్ఞా తా మథాబ్రవీత్
అహం యాస్యామి భద్రం తే । స్వమేవ భవనంపితుః ౨౦
శ్లో॥ త్వయేహ భవనే మహ్యం వస్తవ్యం నిర్విశంకయా
ఇమౌ చ బాలకౌ కన్యా రక్షణీయా స్త్వయామమ॥ ౨౧

శ్లో॥ భర్త్రే వై నైవ మాఖ్యేయ మిదం భగవతే త్వయా
ఏవముక్తాఽబ్రవీ త్సజ్ఞాంఛాయా ప్రాంజలిసంయుతా. ౨౨
1శ్లో॥ ఆకేశ గ్రహణా ద్దేవి ఆశయం నైవ కర్హిచిత్
ఆఖ్యాస్యామి మతం తేత్వం గచ్ఛ దేవిస్వ మాలయం ౨౩
శ్లో॥ సమాధాయ చ తాం సంజ్ఞా తథే త్యుక్తాతయాచ సా
త్వష్టు స్సమీప మగమ ద్వ్రీడితేవ తపస్వినీ॥ ౨౪

శ్లో॥ పితా తా మాగతాం దృష్ట్వాకుద్ధ స్సంజ్ఞా మథాబ్రవీత్

భర్తుస్సమీపం గచ్ఛ త్వం మాజుగుప్సదివాకరం॥ ౨౫

శ్లో॥ అగమ ద్బడబా భూత్వాఽచ్ఛాద్య రూప మనిందితా

ఉత్తరా న్సా కురూ న్గత్వా । తృణాన్యథ చచారసా ౨౬

శ్లో॥ ద్వితీయాయాంతుసంజ్ఞాయాం సంజ్ఞేయమితిచింత్యతాం
ఆదిత్యో జనయామాస పుత్రా వాదిత్యవర్చసౌ।
శనైశ్చరం మనుం చాన్యంఛాయా దేవ్యాంతతఃపరం॥ ౨౭

---

1 పురాణే 84 అధ్యాయే శివరామాయణేచ.

౨౦-౨౧ ఓ సంజ్ఞాదేవి! నన్ను నీవిటులనిర్మించుటకు నావలనఁ గాదగిన కార్యమెద్దియో చెప్పుము, అని ఛాయాదేవిపల్కఁగా, సంజ్ఞాదేవి, యాచ్ఛాయాదేవితో నివ్విధముగఁజెప్పెను. నీకుశుభము గలుగుగాక నేను నాపుట్టినింటికి వెళ్లెదను. నాకుఁ బ్రతినిధిగ నీవునానుగృహంబుననుండి నాముప్వురు పిల్లలను రక్షించుచుండుము.

౨౨ మఱియు నా వృత్తాంతమును నాభర్తయగు సూర్యునకుఁ జెప్పకుము, అని చెప్పగా ఛాయాదేవియుఁ జేతులుజోడించి సంజ్ఞాదేవితో నిటులఁబల్కెను

౨౩ ఓదేవి, నాకుబ్రాణసంకటము కలుగునంతదనుక నేను చెప్పను నీవు పితృగృహమునకు వెళ్లుమనెను.

౨౪ అపుడు సంజ్ఞాదేవి, ఛాయను సమాధానపరచి లజ్జపడుచు, దీనురాలవలె పితృగృహమునకు వెళ్లెను.

౨౫తా॥ సంజ్ఞాదేవి తండ్రియగువిశ్వకర్మ, తనగృహమునకు వచ్చినకూతురి తనుఁజూచి కోపమునొంది, యిటులఁ బుత్రికతోఁబల్కెను, పుత్రి? నీవు, తిరిగి, భర్తృసమీపమునకుఁ బొమ్ము, భర్తయగుసూర్యుని నవమానించి యిటులవచ్చుట, యుక్తముకాదనెను.

౨౬ పూజ్యురాలగు సంజ్ఞాదేవి, పైవిధమున తండ్రిచెప్పగఁ నచ్చటనుండి బయలుదేరి నిజరూపమునుఁ గప్పిపుచ్చి, యాడగుఱ్ఱము రూపమును ధరించి, యుత్తర కురుదేశమునొంది యచ్చట తృణములను భక్షించుచుండెను.

౨౭౮తా॥ సంజ్ఞాదేవికిఁ బ్రతినిధియగుఛాయను సంజ్ఞాదేవియనితలచియామెతో సూర్యుడు సుఖించుచుఁ నామెవలన శనైశ్చరుడు సావర్ణిమనువను నిద్ద్వఱపుత్రులనుఁ బడసెను.

శ్లో॥ ఛాయా తు పార్థివీ సా వై । స్వపుత్ర ద్వితయే యథా
చకారాభ్యధికం స్నేహం న తథా పూర్వజేషు వై॥
మను స్తచ్చాక్షమత్సర్వం యమ స్తన్నైవచాక్షమత్ ॥౨౮-౨౯

శ్లో॥ విమానితశ్చబహుశ స్సాపత్న్యా ద్దతిదుఃఖితః ।
తాంవై రోషాచ్చ బాల్యాచ్చభావినోఽర్థస్య వై బలాత్ ।
పదా సంతర్జయామాస ఛాయాం వైవస్వతో యమః॥30

1 శ్లో॥ సా శశాప తతః క్రోధా త్సవర్ణా జననీ యమం ।
పదా తర్జయసే యస్మా త్పితృభార్యాం యశస్వినీం॥
తస్మా త్తవైవ చరణః పతిష్యతి నసంశయః। 3౧-3౨

శ్లో॥ యమస్తు తేన శాపేన। భృశం పీడితమానసః ।
మనునా సహధర్మాత్మా। పితు స్సర్వం న్యవేదయత్ ॥33

శ్లో॥ ఆదిత్య స్త్వబ్రవీ త్సంజ్ఞాం । కిమర్థం తనయేషు వై।
తుల్యేష్వప్యధిక స్నేహః కేషుచి త్క్రియతే త్వయా॥3౪

శ్లో॥ సా తత్పరిహరంతీ వై । నాచచక్షే వివస్వతః॥ 3౪

తాం శప్తుకామో భగవా న్నాశాయ కుపితః ప్రభుః।

సా తత్సర్వం యథాతత్త్వ మాచచక్షే వివస్వతః॥3౫

శ్లో॥ దదర్శ యోగమాస్థాయ।స్వాం భార్యాం బడబాంతథా।
అదృశ్యాంసర్వభూతానాం। తేజసానియమేనచ। ॥3౬

1, వా॥ పు॥ 84 అ, లింగపురాణే 65 అ-శివరామాయణేచ,

౨౮-౨౯ ఛాయాదేవి తనపుత్రులయందెట్టి ప్రేమతో నుండెనో, సంజ్ఞాదేవిపుత్రులయందట్టి ప్రేమతో నుండకపోయెను ఛాయాదేవిదుష్కృత్యమును మనువు సహించెను కాని యముడు సహింపకపోయెను.

౩౦౺. యముడు ఛాయాదేవివలన ననేకపర్యాయము లవమానింపబడి బహుదుఃఖితుడై రోషముచేతను, బాల్యముచేతను, భావికార్యబలముచేతను, కాలితోం దన్నెదనని ఛాయను భయపెట్టెను.

౩౧-౩౨. పిమ్మట ఛాయాదేవి కోపముతో యముని శపించెను. ఓరి యముడా! యశస్సంపన్నురాలను తల్లినియగు నన్ను పాదముతోం, దన్నెదనని భయపెట్టినకతంబున నీపాదము పడిపోగాక యని శపించెను.

౩. తా॥ యముడా శాపముచేతను మిక్కిలి పీడింపఁబడిన మనస్సుగలవాడై తన సోదరుడగు వైవస్వత మనువుతోఁగూడఁ దండ్రిసమీపమునకు వెళ్ళి వృత్తాంతమునంతనుఁ దెలియఁజేసెను.

౩౪. తా॥ సూర్యుడు ఛాయాదేవితో నిటులఁబల్కెను. ఓ ప్రియురాలా! నీకు కొమరులందఱు సమానులైనను, గొందఱియందే యధికప్రేమతో నుండుటకుఁ గారణంబేమనెను.

౩౪౺. తా॥ పైవిధముగ భర్తయగు సూర్యుడు ఛాయాదేవినిఁ బ్రశ్నించినను సమాధానము జెప్పకుండెను.

౩౫౺. తా॥ ఛాయాదేవి సమాధానముఁ జెప్పని కారణమున సూర్యుడు కోపించి నశింపుమని శపింపఁ నుద్యుక్తుడుకాగా నప్పుడు భయమొంది ఛాయాదేవి సూర్యునకు జరిగిన వృత్తాంతము నంతను యథార్థముగాఁ జెప్పెను.

౩౬౺. తా॥ అప్పుడు సూర్యుడు యోగదృష్టిచేత (దన భార్యయగు సంజ్ఞాదేవి నాడగుఱ్ఱము రూపముతో సర్వభూతములకు నదృశ్యురాలై యుత్తరకురుదేశమునందున్న దానినిగాఁ దెలిసికొనెను.

శ్లో॥ అశ్వరూపేణ మార్తాండ స్తత్రగత్వాతయాన్వితః
జనయామాసనాసత్యం దస్త్రింతస్యామథాశ్వినౌ॥ ౩౭
సంజ్ఞాదేవీం సమాశ్వాస్య రవి స్తాం గృహ మానయత్
విశ్వకర్మ సుతాం ద్రష్టుం సమాగాద్రవిమందిరం॥ ౩౮
రవి మాహతత స్త్వష్టా సాంత్వపూర్వంద్విజోత్తమాః ౩౯
1 తవాసహంతీ భగవన్ మహత్తేజ స్తమోనుదం ।
బడబారూప మాస్థాయ గతా సంజ్ఞా దివాకర॥ ౪౦
అపనేష్యామి తే తేజో యంత్రే కృత్వాదివాకర ।
తథేత్యుక్త స్స రవిణా భ్రమా కృత్వా దివాకరం॥ ౪౧
పృథక్చకార తత్తేజః విష్ణోశ్చక్ర మకల్పయత్ ।
త్రిశూలంచైవ శర్వస్య వజ్ర మింద్రస్య చాధికం॥ ౪౨
ఏవం శృత్వా రవేర్వృత్తం ప్రపచ్ఛు రోమహర్షణం।
ఋషయ స్తుష్టమనసో మహాశ్చర్యకరం తదా॥ ౪౩
ఋషయః శ్లో॥ సూర్యపుత్రకథాంశ్రోతుంపరంకౌతూహలం
హినః।యమస్యశాపముక్తించవదన స్సూతసత్వరం॥ ౪౪

---

1 మాత్స్యే 11 అధ్యాయే

౩౭. తా॥ అనంతరము సూర్యు డశ్వరూపము నొంది బడబారూపముతో (ఆడగుఱ్ఱమురూపముతో) నున్న సంజ్ఞాదేవియొద్దకు వెళ్లి యామెనుఁ గలిసి యామెయందు దేవవైద్యులగు నశ్వినీదేవతల నిద్దఱనుఁ బుట్టించెను. (వారికే నాసత్యుడనియు దస్రుడనియు నామములు.)

౩౮. తా॥ అనంతరము సూర్యుడు సంజ్ఞాదేవి నోదార్చి యామెను స్వగృహమునకుఁ దీసికొనివచ్చెను విశ్వకర్మయును సంజ్ఞాదేవి సూర్యునింటికి వచ్చినదని తెలిసి తనపుత్రికయగు సంజ్ఞాదేవినిఁ జూచుటకు సూర్యునిగృహమునకు వచ్చెను.

౩౯. తా॥ ఓమహర్షులారా? పిమ్మట విశ్వకర్మ. సూర్యునిగూర్చి, సామవాక్యములతో నిటులఁబల్కెను.

౪౦. తా॥ భగవానుడగు నో సూర్యుడా! అంధకారమునుఁ బోఁగొట్టునదియు. మహత్తరమునగు నీము తేజస్సును నాకొమరిత, సహింపలేక బడబారూపము నొంది (ఆడగుఱ్ఱమురూపము నొంది) కురుదేశమునకు వెళ్లిపోయెను.

౪౧-౪౨. తా॥ ఆకారణమువలన నీతేజస్సును యంత్రమునందుంచి కొంత భాగమునుఁదగ్గించెదను. అని విశ్వకర్మ చెప్పగా నందునకు సూర్యుడంగీకరించెను అప్పుడు విశ్వకర్మ సూర్యుని, భ్రమియందుంచి యతని తేజస్సును సానబట్టెను అట్లుసానబట్టగా వచ్చిన తేజస్సుతో విష్ణుమూర్తికిఁ జక్రమును. శంకరునకుఁ త్రిశూలమును దేవేంద్రునకు వజ్రాయుధమును విశ్వకర్మ చేసియిచ్చెను.

౪౩. తా॥ ఇవ్విధముగా మహైశ్వర్యమగు సూర్యుని వృత్తాంతమును. రోమహర్షణుడు చెప్పఁగా మహర్షులువిని సంతసించి తిరిగి యారోమహర్షణునిఁ బ్రశ్నించిరి"

౪౪. తా॥ ఓ రోమహర్షుడా? సూర్యపుత్రులకధనుఁగూడ మాకు విను కుతూహలముండుటవలన జెప్పుము మఱియు. యమునకు ఛాయాదేవి వలన శాపముకలిగెనని చెప్పియుంటివి శాపవిముక్తి యతనికి నెట్లయ్యెనో యావృత్తాంతమును గూడఁ జెప్పుమని మహర్షులు సూతుని బ్రశ్నించిరి. (సూతునకే రోమహర్షణుడని నామాంతరము)

సూతః॥శ్లో॥ఆరాధయ న్మహాదేవం లోకపాలత్వ ముత్తమం ।
పితౄణా మాధిపత్యం చ శాపమోక్షం యమ స్తథా
లబ్ధవా న్దేవదేవస్య ప్రసాదా చ్ఛూలపాణినః॥ ౭౫

ఛాయాదేవీసుతో యోఽసౌ ద్వితీయః కథితో మనుః।
పూర్వజస్య సవర్ణోఽసౌ సావర్ణి స్తేనకథ్యతే॥ ౭౬
శని ర్గ్రహత్వం యమునా నదీరూపం తథాఽభజత్ ।
వైవస్వతమనో ర్వృత్తం వదేయం శృణుత ద్విజాః ౭౭

ఇత్యాశ్చర్యరామాయణే ప్రథమస్సర్గ స్సమాప్తః.

౪౭౫ సూతుడిటులఁ జెప్ప నారంభించెను.? ఓ మహర్షులారా! యముడు ఛాయాదేవివలన శపింపఁబడి యాశాపముచే నొకపాదము కుళ్లిపడిపోగా మఃఖితుడై పరమేశ్వరుని గూర్చి చిరకాలము తపముచేసి యాపరమేశ్వరుని యనుగ్రహమును సంపాదించికొని శాపవిముక్తునిఁ బొంది తిరిగి పడిపోయినపాదమునుఁ బొందుటయేకాక యుత్తమమగు లోకపాలకత్వమునుగూడ నాపరమేశుని యనుగ్రహమువలనఁ బొందగలైను.

౪౮౫ తా॥ ఛాయాదేవియందు సూర్యునకుద్భవించిన రెండవమనువు, సంజ్ఞాదేవి పుత్రుడగు వైవస్వత మనువుతో సమానవర్ణము గలవాడగుటచేతను సావర్ణిమనువని పిలుపఁబడుచుండెను. (ముందువచ్చు మన్వంతరము సావర్ణిమన్వంతరమే.)

౪౯౫ తా॥ ఓమహర్షులారా! ఛాయాపుత్రుడగు శనైశ్చరుడు, తపోబలముచే నవగ్రహములలో నొక గ్రహమగుటనుఁ బొందెను. సూర్యుని వలన సంజ్ఞాదేవియందు జనించిన యమున, నదీరూపము నొందిలోకోపకారిణియయ్యె. సూర్యపుత్రులలో వైవస్వతమను వృత్తాంతమును జెప్పెదను సావధానులై వినుడని సూతుడు శౌనకాదిమహర్షులకుఁ జెప్పెను.

ఆశ్చర్యరామాయణమున

ప్రథమసర్గము సమాప్తమయ్యెను.

## ద్వితీయ సర్గః.

* వైవస్వతమనుం భూమ్యాః పాలనేఽజో నియుక్తవాన్
తస్య శ్రద్ధా మనోః పత్నీ పతిభక్తిరతాఽవసత్॥ ౧
అయోధ్యా నిర్మితా తేన పాతి భూమిం స తత్స్థితః।
ఏకదా స మను ర్వశిష్ఠ ముద్యుక్తో గురు మబ్రవీత్॥ ౨
యజ్ఞం కర్తుమనా శ్చాహం త్వయాఽంగీక్రియతే యది ౨½
అత్ర తీర్థం పరం నాస్తి నాస్తి శ్రేష్ఠా మహానదీ
ఆనయస్వ నదీం రమ్యాం మానసాత్పాతకాపహాం॥ ౩½

తద్గురో ర్వచనా ద్రాజా మను ర్వైవస్వతో మహాన్
రణాత్కృత్య మహచ్చాపం సందధే శర ముత్తమం॥ ౪½
శ్లో॥ స శరో మానసం భిత్వా తస్మా న్నిష్కాస్య తాం నదీం।
అయోధ్యా మానయామాస పంథాసందర్శయన్నివ॥ ౫½
శ్లో॥ ఆనీతా సా శరేణైవ శరయూ శ్చేతి కథ్యతే।
సరోవరాత్సముద్భూతా సరయూ శ్చేతి కేచన॥ ౬½

* వాయుపురాణే 85 అధ్యాయే శివరామాయణేచ.

## రెండవ సర్గము.

౧౹తా॥ బ్రహ్మదేవుడు సూర్యపుత్రుడైన వైవస్వతమనువును, భూపరిపాలనమునకు నియోగించెను. అతడు బ్రహ్మచేనియమింపఁబడి భూమండలమును ధర్మముగాఁ బరిపాలించుచుండెను. ఆ వైవస్వత మనువునకు శ్రద్ధయనెడి భార్యకలదు, ఆమెపతిభక్తి కలదైయుండెను.

౨తా॥ ఆ వైవస్వత మను వయోధ్యయను పత్తనమును నిర్మింపఁజేసి యచ్చటనుండి రాజ్యపరిపాలనము చేయుచుండెను. వైవస్వతమను నొకానొకప్పుడు యజ్ఞమునుఁ జేయఁదలచి గురువగువసిష్ఠునితో నిటుల బల్కెను.

౨౹తా॥ ఓగురువర్య! నీవంగీకరించితివేని నేనొక యజ్ఞమునుఁజేయఁదలచితిననెను.

౩౹తా॥ అపుడు వసిష్ఠుడిట్లనియెను. ఓ రాజా; నీవు యజ్ఞమునుఁజేయఁబూనుట నాకు సంతసమేకాని యిచ్చట మహానదికాని తీర్థముకాని లేదయ్యె (యజ్ఞము మహానదీ ప్రాంతమునఁ జేసినచో మహాఫలప్రదమని యాశయము) కానమహాపాపహరమగు నొకరమ్యమగు నదిని మానస సరోవరమునుండి తీసికొని రమ్మనెను.

౪౹తా॥ వసిష్ఠుని వాక్యమును విని వైవస్వతమనువు ధనుష్టంకారముఁ జేసి యాధనువునందు బాణమును సంధించివిడిచెను.

౫౹తా॥ ఆబాణము మహావేగముగా, మానస సరోవరమును భేదించి యా సరోవరమునుండి యొకనదిని బయలుదేరఁదీసి మార్గమునుఁ జూపుచున్నదివలె నయోధ్యాపురికిఁ దీసికొనివచ్చెను,

౬౹తా॥ ఆనది శరముచేఁ (బాణముచే) దీసికొనిరాబడినది కాన శరయూనదియని చెప్పఁబడుచున్నది. మఱికొందఱు మానస సరోవరమునుండి యుత్పత్తిగలది కాన సరయూ నదియనిచెప్పుదురు.

శ్లో॥ అథాకరో త్పుత్రకామః పరమేష్ఠిం ప్రజాపతిః ।

తత్ర శ్రద్ధా దుహిత్రర్థం హోతారం సమయాచత॥

శ్లో॥ తేన హోత్రపచారేణ కన్యేళానామ సాఽభవత్ ॥ ౭-౮

మిత్రావరుణయో రాసీ త్ప్రసాదా త్పురుష స్త్విళా॥ ౮౹

*శ్లో॥ సుద్యుమ్న ఇతి విఖ్యాత స్త్రిషు లోకేషు పూజితః ।

గత్వా శరవనం తత్రపునః స్త్రీరూప మాప సః॥ ౯౹

వ్యా॥ *సుద్యుమ్న ఇతి సుద్యుమ్నస్య పునః స్త్రీరూపత్వ ప్రాప్తేః కారణం మత్స్య పురాణే॥ అధ్యాయే ప్రతిపాదితం॥ తథాహి। రమతే యత్ర దేవేశః శంభుస్సోమార్ధ శేఖరః ఉమయా సమయ స్తత్రపురాశర వనేకృతః॥ పుం నామస త్త్వం యత్కించిదా గమిష్యతి తేవనే స్త్రీత్వమేష్యతి తత్సర్వం దశయోజన మండలే అజ్ఞాత సమయోరాజా ఇలశ్శరవనే పురా స్త్రీత్వమాపవిశన్నేవ బడబాత్వం హయ స్తథా ॥ఇతి॥

1 వా౹ పురాణే 85 మహారామాయణేచ బ్రహ్మాండేచ.

౬౪తా॥ అనంతరము వైవస్వతమనువు పుత్రకాముడై పుత్రకామేష్టినిం జేసెను. ఆయాగమున వైవస్వతమనుభార్యయగు శ్రద్ధాదేవి, హోతను తనకుం బుత్రిక కలుగునటుల హోమమునుం జేయవలయునని ప్రార్థింపగా నాహోతయును, శ్రద్ధాదేవి కోరిక ననుసరించి మిత్రా వరుణలకు హవిర్భాగముల నిచ్చునపుడు పుత్రిక కలుగంజేయుడని ప్రార్థించగా నాదేవతలు నవ్విధమున నే యనుగ్రహించిరి. ఇవ్విధమున హోతయుపచారముచేతం బుత్రునకుం బదులు పుత్రిక జన్మించెను, (ఆమెకు, ఇళ యని పేరు)

౭౪తా॥ వైవస్వతమనువు, తనకుం బుత్రుడు పుట్టుటకుం జేసిన పుత్రకామేష్టివలనం బుత్రిక యెట్లుకలిగెనని విచారించి తెలిసికొని తిరిగి మిత్రావరుణులనుం బ్రార్థింపంగా వారలనుగ్రహించి యిళయను నాకన్యను దిరిగి పురుషునింగాం జేసిరి.

*౮౪తా॥ ఆపురుషుడు సుద్యుమ్నుడను నామముతోం ద్రిలోకముల యందుం బ్రసిద్ధుడై యొకానొకప్పుడు వేటకరణ్యమునకేగి యశ్వముచే బహుదూరము తీసికొనిపోబడి శరవనమను నొక వనమునుం జేరెను. ఆవనమునుం బ్రవేశించుటతోడనే తనపురుషరూపముపోయి తిరిగి సుద్యుమ్నుడు స్త్రీరూపమునుం బొందెను.

---

* సుద్యుమ్నునకుం దిరిగి స్త్రీరూపము కలుగుటకుం గల కారణము మత్స్య పురాణమున పదునొకండవ యధ్యాయమునం జెప్పంబడినది (ఏమన, చంద్రశేఖరుడగు శంకరుడు పార్వతీదేవితో నొకప్పుడు శరవనమునందుం గ్రీడించుచుండగం గొందఱు మహర్షులు పార్వతీపరమేశ్వరుల సందర్శనమునకు వచ్చుటకు రాగాం బార్వతి లజ్జితురాలై యావనమునకు గ్రిందివిధమున శాపమిచ్చెను, దశయోజన విస్తీర్ణముగల (పదియామడల చతురముగల) శరవనమునకు నేపురుషజంతువైననుం బ్రవేశించినచో, స్త్రీ రూపమునుం బొందగలదని" సుద్యుమ్నుడు, పార్వతీ శాపవృత్తాంతము నెఱుగక యవ్వనమునం బ్రవేశించి స్త్రీరూపము నొందె ననియు సుద్యుమ్నుడెక్కిన మగగుఱ్ఱముకూడ వెంటనే యాడగుఱ్ఱమయినదనియుం జెప్పబడినది.

శ్లో॥ బుధస్యాశ్రమ మాసాద్య మైధునాయోపమంత్రితా ।

సోమపుత్రాద్బుధా చ్చాస్యా ఇలో జజ్ఞేపురూరవాః॥౧౦౫

శ్లో॥ తతః పుంస్త్వాభిలాషాచ్చ మునిభి శ్చప్రసాదితా ।

పునః పుంస్త్వం గతా నారీ స్త్రీపౌర్వ్యాద్రాజ్యభాగ్నహి ॥

వసిష్ఠ వచనా చ్చాసీ త్ప్రతిష్ఠా నపురే తు సః ౧౧-౧౨

శ్లో॥ క్షువతశ్చ మనోః పశ్చా దిక్ష్వాకు రభినిసృతః ।

సతు రాజ్యాభిషిక్తస్సన్పాలయామాస మేదినీం॥ ౧౩

1 శ్లో॥ మంత్రిష్వాధాయ వై రాజ్యంచకార సుమహత్తపః

సాక్షాత్కృత్య హరి స్తస్య। దదౌ శ్రీరంగమందిరం॥౧౪

శ్లో॥ సప్తద్వీపవతీం భూమిం సశైలవనకాననాం ।

పాలయామాస ధర్మాత్మా పూర్వానుష్ఠితమార్గతః॥ ౧౫

1. వాయుపురాణే 85 అ.

౧౦౪ తా॥ సుద్యుమ్నుడు పైవిధముగ స్త్రీరూపము నొంది యచ్చటచ్చట సంచరించుచు బుధుని యాశ్రమమునుఁ జేరి బుధునిచేఁ గామ క్రీడలకుఁ బ్రేరేపింపఁబడి యతనితో గలసి సుఖించుచుండగా గొంతకాలమునకు నామెకు బుధునివలన నొక కొమరుడు కలెను. అతడే పురూరవుడని పిల్వఁబడుచుండెను. (ఇతని వల ననే చంద్రవంశమభివృద్ధిఁజెందెను)

౧౧-౧౨ తా॥ ఇళయను పేరుతో నామె యాబుధుని గృహమునందుండి, పురూరవుడు కలిగిన పిమ్మట బురుషరూపము బొందదలచి, యచ్చటి మహర్షులను బ్రార్థింపగా, నామహర్షులనుగ్రహించిన కారణమునఁ దిరిగి యామె పురుషరూపమునుఁ బొందెను, కాని యతడు మొదట స్త్రీరూపముతో జనించిన, హేతువుచే రాజ్యార్హుడు కాడయ్యె, వసిష్ఠుడు చెప్పిన కారణమున ప్రతిష్ఠాన నగరమును మనువు నిర్మింపఁజేసి, సుద్యుమ్నున కివ్వగా, నచ్చటనే, యతడు నివాసముగా నుండెను.

3॥ తా॥ అనంతర మొకానొకదినమున నైవస్వతమనువు, తుమ్ముచుండగా దైవసంకల్పముచే నొకశిశువుజన్మించెను. (అనగా తుమ్మినపుడు లోపలనుండి బయల్వెడలెను.) ఆహేతువువలననే యిక్ష్వాకువని వానికి నామకరణముచేసిరి.) ఆ యిక్ష్వాకువు రాజ్యాభిషిక్తుఁడై భూమిని ధర్మముగాఁ బరిపాలించుచుండెను.

...త కాలము, రాజ్యమును పరిపాలించి, యిక్ష్వాకువు రా... త్రులకప్పగించి వనమునకేగి గొప్పతపస్సు చేసెను. ...క్షమై, యతనికి శీరంగ మందిరమును పూజానిమిత్త...

... మనుపుత్రుడైన యిక్ష్వాకువు, పర్వతారణ్య... యుతమునగు భూమినిఁ బూర్వుల ...ర్మముతోఁ బాలించుచుండెను.

తస్య పుత్రశతం హ్యాసీ దిక్ష్వాక్షోస్తు మహాత్మనః।
తేషాం విచిత్రచరితా వికుక్షి నిఃమిదండకా॥ ౧౬

శకునిప్రముఖా స్తస్య పుత్రాః పంచాశతస్తు తే
ఉత్తరాపథదేశస్య రక్షితారో మహీక్షితః॥ ౧౭

శ్లో॥ శేషా స్తస్య సుతా రాజ్ఞః దక్షిణాపథరక్షిణః॥ ౧౭½
తేషాం జ్యేష్ఠో వికుక్షి స్తు గుణైః శ్రేష్ఠోఽ-వస త్తథా॥౧౮

శ్లో॥ ఇక్ష్వాకు స్తు వికుక్షిం వై అష్టకాయామథాదిశత్
మాంస మానయ శ్రాద్ధేత్వంమృగాన్హత్వామహాబల॥ ౧౯

2 శ్లో॥ సగత్వా మృగయాం కృత్వా మృగాఽ హత్వా
శ్రమాన్వితః। భుక్త్వా చ శశకం తత్ర వికుక్షిర్గృహ
మాగతః॥ ౨౦

శ్లో॥ ఆగతే తు వికుక్షౌ తు సమాంసే సనరాధిపః।
వసిష్ఠం చోదయామాసమాంసం వైప్రోక్ష్యతామితి॥

శ్లో॥ సదృష్ట్వా పహతం మాంసం క్రుద్ధో రాజానమ
క్షుద్రేణోపహతం మాంసం పుత్రేణ తవ పా

శ్లో॥ శశభక్షణతోఽభోజ్యంతవ మాంసం మ
శశో దురాత్మనా నేన భక్షితో యేన
శశాద ఇతి లోకేస్మి న్నాఖ్యాతశ్చ

శ్లో॥ ఇక్ష్వాకుస్తు తతః క్రుద్ధో వికుక్షి

2. ఇక్ష్వాకోస్తు వికుక్షిహిః శశాదశ్చస

౧౬. అతనికి నూర్గురు పుత్రులు గల్గిరి ఆనూర్గురు పుత్రులలో విచిత్ర చరిత్రముగల వారలు ముప్వురుండిరి. (వికుక్షి, నేమి, దండుడు, అను వారలు)

౧౭- ఆపుత్రులలో శకుని మొదలగు నేబదిమంది పుత్రులు ఉత్తర దేశమును బరిపాలించుచుండిరి. మిగిలిన వారిలో నలుబది యేడుగురు దక్షిణదేశమునుఁ బరిపాలించుచుండిరి.

౧౮- ఇక్ష్వాకు పుత్రులలో జ్యేష్ఠుండగు వికుక్షి, గుణగణముచే శ్రేష్ఠుఁడైయుండెను.

౧౯. ఇక్ష్వాకు మహారాజొకప్పు డష్టకా శ్రాద్ధమును జేయదలచి, వికుక్షిని మాంసమును దెచ్చుటకు నియమించెను,

౨౦- అతఁడు తండ్రిచే నియమింపఁబడి, వేటకు బోయి, శ్రాద్ధార్హము లగు మృగములను గొన్నిటిని జంపి, శ్రమచే నొకచోట విశ్రమించి క్షుద్బాధచే నొకకుందేటి మాంసమును, భుజించి, పిమ్మట గృహమునకు వచ్చెను.

౨౧. ఇట్లు వికుక్షి, మాంస సహితముగా. గృహమునకు రాగా నిక్ష్వాకుడు తనగురువగు వసిష్ఠునితో, మాంసమునుఁ బ్రోక్షించవలసినదిగాఁ జెప్పెను.

౨౨. ఆవ్వసిష్ఠుఁడు వికుక్షిచే దీసుకొని రాబడిన మాంసమునుఁజూచి యాగ్రహించి రాజుతో నిట్లనెను, ఓరాజా! క్షుద్రబుద్ధిగల నీ పుత్రునిచే మాంస మపవిత్రముగాఁజేయబడినది.

౨౩½. ఓరాజా! దురాత్ముఁడగు నీపుత్రునిచే నొక చెవులపిల్లి మాంసము భక్షింపఁబడిన కారణమున, ఈమాంసము భుజింపదగనిదయ్యెను. ఇతఁడులోకమున శశాదుడను నామముతో జెప్పంబడును.

౨౪. ఇక్ష్వాకువు పిదప కోపముతోఁ దనపుత్రుడగు, వికుక్షినిగూర్చి యిటులబలికెను.

పితృకర్మణి నిర్దిష్టో మయా త్వం మృగయాం గతః ।
శశం భక్షయసే ఽరణ్యే నిర్ఘృణఃపూర్వమద్యను॥ ౨౩

శ్లో॥ తస్మాత్పరిత్యజామి త్వాం గచ్ఛ త్వం స్వేన కర్మణా।
ఏవ మిక్ష్వాకునా త్యక్తో వసిష్ఠేననివారితః॥ ౨౬

*1శ్లో॥ ప్రజాసంక్షోభకరణా దిక్ష్వాకు ర్దండ మత్యజత్।

పిత్రా నిష్కాసితో దండః వనం గత్వాఽటవీజనాన్

వశీకృత్యస్వయం తేషాంప్రభుభూత । స్సమావసత్॥ ౨౭

శ్లో॥ సంపాద్య రాజ్యం గహనే స్థిత స్సన్నేకదా తు సః ।
శుక్రకన్యాం తపస్యంతీం దృష్ట్వామోహవశంగతః॥౨౮

---

* ప్రజాసంక్షోభ ఇతి—దండోనామకశ్చి దిక్ష్వాకుసుత, స్తత్పుత్రశతాంతర్గత ఏవాసీత్,తస్యప్రజానాం పీడాకరత్వాత్, సతుపిత్రానిష్కాసితః కస్మింశ్చిద్వనేత్వాటవికైర్మిళిత్వా తేషా ముపరి ప్రభుర్భూత్వా క్రమేణ, రాజ్యమపి, సంపాద్య, స్థిత, స్సన్కదాచన, శుక్రకన్యాం బలాత్కృత్య,తత్పితృశుక్ర శాపా,త్సప్తాహపర్యంతం,తద్రాజ్యే మృద్వృష్టిపతనాత్సర్వం తద్రాజ్యం, వినష్ట, మభవత్, క్రమేణ, వన, మప్యభవత్ తదేవ, దండకారణ్యమితి, లోకే, ప్రథితమితి, దండఏవ, దండక, ఇతివ్యవహృతిః

---

1. విష్ణుపురాణే

౨౫. ఓరసీచుడా? పితృకర్మనిమిత్తమై నాచేనియోగింపఁబడి నీవరణ్యమునకేగి మృగములను వేటాడి యొక శశమాంసమును భక్షించి, లజ్జవిడిచి,యేఁటులసంచరించుచుంటివి.

౨౬. నీవిచట నుండదగవు. కాన నిన్ను బరిత్యజించితిని. నీదుష్కృత్యముచే, నీవెచ్చటకైనను బొమ్మని పుత్రుని, నిక్ష్వాకువు పరిత్యజింపగా,వశిష్ఠమహర్షి నివారించెను,

౨౭ - ఓమహర్షులారా: ఇక్ష్వాకుపుత్రులలో విచిత్రచరిత్రము, గల ముప్వురలో వికుక్షి చరిత్రముఁజెప్పితిని. దండుఁడను వానివృత్తాంతముఁ జెప్పెదను వినుడు. దండుఁడను నిక్ష్వాకుపుత్రుఁడు ప్రజలనుహింసించుచుండుటవలన పుత్రుఁడగు దండుని తనదేశము నుండి యిక్ష్వాకువు వెడలఁగొట్టెను. ఇట్లువెడలఁగొట్టబడిఁ దండుఁడు వనమునకేగి యచ్చటి యడవిజనులతో జెలిమిజేసి వారలను స్వాధీనముఁజేసుకొని తానువారలకుఁ బ్రభువుగానుండెను.

౨౮. అతఁడు గొంతరాజ్యమును సంపాదించి పరిపాలించుచున్నొకానొకప్పుడు వనమునఁదపముజేయుచున్న శుక్రాచార్యుని కొమరితనుఁ జూచి మోహాంధుడయ్యెను.

---

* దండుడనువాడు, ఇక్ష్వాకు పుత్రుడొకడుండెను. అతడు నూర్గురు పుత్రులలో నొకడైయుండెను ఆదండుడు ప్రజలను బాధించుచుండుట వలన నిక్ష్వాకువతనిని దేశమునుండి వెడలగొట్టెను. అతడువనమునకేగి యాటవికులతోఁగలిసివారలకుఁబ్రభువై క్రమముగారాజ్యమును సంపాదించి యుండి యొకానొకప్పుడు శుక్రాచార్యుని కొమరితను బలాత్కరించి యామెతండ్రియగు శుక్రుని శాపమువలన నేడు దినములు మట్టి వానకురి యగావాని రాజ్యమంతయు నష్టమయ్యెను. క్రమముగా నాబదేశమంతయు నరణ్యమయ్యెను. అదియేదండకారణ్యమనిలోకమున బ్రసిద్ధమయ్యెను.దండుని కే దండకదనివ్యవహారము.

శ్లో॥ బలాత్కృత్య చతాందండః శప్తస్తద్గురుణాఽభవత్ ।
శుక్రశాపాత్తుఽతద్రాజ్యం వినష్ట మభవద్ధ్రితం
తదేవ దండకారణ్య మిత్యద్యాపిప్రథాం గతం॥ ౨౯,౩౦

*²శ్లో॥ నిమిర్నామ మనోః పౌత్రః వికుక్షే రనుజస్తు యః।
సశాపేన వసిష్ఠస్య విదేహా స్సముపద్యత॥ ౩౧

* నిమిరితి—ఇక్ష్వాకుసుతానాం మధ్యేత్రయో,విచిత్రచరితా, ఇతి, ప్రథమత, స్తూక్తం, ఏకః, వికుక్షిః, ద్వితీయో, దండః, తృతీయః, నేమిరితి, ద్వయో, ర్వృత్తాంత ముక్త్వా, తార్తీయీకం, బ్రవీతినేమి, స్సర్వదా, యజ్ఞాదీ, న్కుర్వన్నాసీత్, ఏకవారం, నేమి, స్స్వగురుం, వసిష్ఠ, ముపసృత్యయాగం, కారయేత్యువాచ, సగురుస్తు, ఇతఃపూర్వ మేవ, యాగం కృతవానసి, పున, రిదానీమేవ, యాగం, కరోషిచేత్, యాజకస్య, మమాపి, శ్రమ, స్సంభవేత్, తస్మాత్కించిత్కాలముపేక్ష్య, పశ్చాత్కుర్విత్యువాచ, సనేమిస్తు, ధర్మస్య, త్వరితా, గతి రితిన్యాయేనా, ద్యైవ, కర్తుం, సముద్యుక్తోహం,మాన్యథావక్తవ్యమితి, ప్రార్థయామాస, సగురుస్తునాగంతు మద్యాహమ లమితి యదావదత్ తదానేమిరన్యం గురుమానీయయాగం కరవాణీత్యువాచ, తదావసిష్ఠశ్శశాపత్వం విదేహోభవేతి.

2. వాయుపురాణే॥ 89 అద్యాయే

౨౯౪-౩౦. ఆదండుఁడు. శుక్రకన్యకను బలాత్కరింపఁ గానామె తండ్రి తోఁ జెప్ప గా నాశుక్రుఁడు దండుని నిటుల శపించెను. ఓదండుఁ డా. నీరాజ్యము ఏడుదినములు మట్టివానకురిసి నష్టమగుగాక నీవును నశించెదవుగాక" ఇట్లు శుక్రశాపమువలన దండుఁడు నిజరాజ్యము తోఁగూడనశించెను. నష్టమైన దండకరాజ్యప్రదేశ మరణ్యమయ మగుటచే దండకారణ్యమని ప్రసిద్ధినొందెను. దండునకే దండకుఁ డనియు నామాంతరముకలదు.

*౩౧. ఇక్ష్వాకు పుత్రులలో. నిమియనురాజు వసిష్ఠునిశాపముచే విదేహుడ య్యెను (దేహము లేనివాడయ్యెను)

---

* (నిమి, విషయము జెప్పఁ బడుచున్నది)

(మను పుత్రులలో ముప్వురు విచిత్రచరిత్రలు కలవార నిప్రథమ మునఁ జెప్పబడినది (1 వికుక్షి, 2, దండుఁడు, 3. నిమి) ఇరు వురవృత్తాంతములఁ జెప్పి. మూడవవాఁడగు నిమి వృత్తాంతము జెప్పఁబడు చున్నది,

నిమియను రాజు (రాజ్యమునుపాలించుచు) నెల్లప్పుడు యాగముల నుఁజేయుచుండెను. ఒకప్పుడు నిమి తనగురువగు వసిష్ఠుని సమీపించి గురువర్యా! నేను మరల యాగము జేయుటకు సంకల్పించితి చేయిం పుమన నవ్వసిష్ఠుడు. నిమిరాజోత్తమా? ఇంతకుపూర్వము యాగము, నుఁజేసి మరల నిప్పుడేయాగముఁజేసితివేని, యాజకుడనగునాకును గష్టముగానేయుండును. కానకొంతకాలముపేక్షించి యనంతరముఁ జేయుమనియెను. అప్పుడు నిమియనురాజు నిట్లనెను. ధర్మకార్యముఁ జేయవలెనని సంకల్పముపొడమి నపుడే దానిని నెరవేర్చవలెననెడి యార్యోక్తిచే నేనిప్పుడేచేయుటకుద్యమించితిని. మరియొక్కవిధము గాఁ జెప్పకుడని ప్రార్థింపగా నవ్వసిష్ఠుడు నీవిపుడే చేసినచో నేను వచ్చుటకు వీలుకాదనగా నిమిచక్రవర్తి, మరియొకపురోహితు నేర్ప అచుకొని యజ్ఞముఁచేసెదనని వసిష్ఠునితోఁజెప్పెను అప్పుడువసిష్ఠుఁ డు కోపగించి నీవువిదేహుఁడవగుదునిశపించెను.

శ్లో॥ వైవస్వతమనోః పుత్రః ఇక్ష్వాకుర్బ్రహ్మణో వరాత్।
దివ్యం యానం సమాసాద్యనారాయణప రాయణః
3 షత్త్రింశచ్చసహస్రాణిత్వబ్దాన్ రాజ్యంతదాకరోత్॥ 32

1 శశాదోప్యథ ధర్మేణ స్వప్రజాః పరిపాలయన్ ।

శతహీనాం స్తదబ్దాంశ్చ రాజ్యం.కృత్వాదివం,గతః॥334

* శశాదస్య తుదాయాదః కకుత్థ్సోనామ। వీర్యవాన్
1 ఇంద్రస్య వృషభూతస్య కకుత్థ్సస్తేన । సస్మృతః
2కకుత్థ్సేన కృతం రాజ్యం శతహీనం తదబ్దకం॥ 38_39

---

* వికుక్షే రేవశశాదఇతి నామాంతర మితి పూర్వం ప్రతిపాదితం తస్యపుత్రః పురంజయః తస్యైవకకుత్థ్సఇతి నామాంతరం కర్మణాసమ భూదిత్యత్రప్రమాణ మానంద రామాయణాది కంతథాహి వికుక్షేస్తు కకుత్థ్సశ్చ। సఏవాత్ర పురంజయ ఇతి" పరంతు కకుత్థ్స ఇతి నామపురం జయస్య కథమాగత మిత్యత్ర బ్రహ్మండవాయు లింగ పాద్మాదిషు

---

8. భవిష్యపురాణే ప్రతిసర్గపర్వణి। అధ్యాయే.

1 శశాదస్య రాజ్యపాలన కాలః (3౫౯౦౦) ఇతి భవిష్యే
శశాదస్యేక్ష్వాకుపుత్రత్వేఆనందరామామాయణంచ ప్రమాణం

2 కకుత్థ్సరాజ్యపాలన కాలః (3౫౮౦౦) ఇతి భవిష్యే

3౨. వైవస్వతమను పుత్త్రుండగు నిక్ష్వాకువు వైవిధమున నూఱ్వురు పుత్త్రులు గలవాడై యెల్లప్పుడు భగవద్భజన జేయుచు బ్రహ్మదేవుని వరప్రభావముచే నొకదివ్యవాహనముఁ బొందిదానితో సంచరించుచు ముప్పదియారువేల సంవత్సరములు రాజ్యపరిపాలనముఁ జేసి తనపుత్త్రులలో జ్యేష్ఠుండగు శశాదునకే రాజ్యము నిచ్చి వైకుంఠము నొందెను

(334) తా॥ అనంతరము, ఇక్ష్వాకు మహారాజు పుత్త్రుడు వికుక్షియను నామాంతరముచే నొప్పు శశాదుడను రాజు ధర్మముతోఁ దన ప్రజలను బాలించుచు దన తండ్రికంటె నూరు సంవత్సరములు తక్కువగా (అనగా 3౫౯౦౦సం॥ రాజ్యముఁజేసి పిమ్మట స్వర్గమునకేగెను.

(3౮ 3౯) శశాదుని యనంతరము తత్పుత్త్రుడగు పురంజయుడు రాజ్యమునుఁ బాలించెను. అతడు రాజ్యమును బాలించుకాలమున దేవదానవులకు యుద్ధము జరిగి యాయుద్ధమున నింద్రాదులు పరాజయము నొంది విష్ణునొద్దకేగి తమ యపజయవృత్తాంతమునుఁ జెప్పికొనఁగా నమ్మాధవుఁడు" పురంజయుడను రాజునందు నాశక్తినిఁ బ్రవేశపెట్టెదను మీరు వానిని సహాయునిఁగా గోరి తీసికొనివచ్చి తిరిగి యుద్ధము చేసినచో నారాక్షసులు నశించెదరని చెప్పగా నింద్రుడు పురంజయుని సహాయునిగాఁ గోరెను. అతడు మహేంద్రునితో నిట్టుల జెప్పెను. నీవు వృషభరూపమును ధరించినయెడల నీమూపురము మీద నెక్కి యుద్ధమునుఁజేసి రాక్షససంహారము చేసెదననంతన కమ్మహేంద్రుం డంగీకరించి వృషభరూపమొందగా నతని మూపురమునఁ గూర్చుండి యుద్ధముఁజేసి విష్ణ్వంశము తనయందుఁ బ్రవేశించియుండుటచే దానవులనుసంహరించెను అతడు వైవిధముగ వృషభరూపముగల యింద్రుని మూపురమునందుండి యుద్ధముఁజేసి

8 అనేనాస్తు కకుత్థ్సస్యదాయాదః పరికీర్తితః।

శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే॥ 3

---

తత్ప్రతిపాదితం తథాహి॥ ఏకదా। దేవదానవానాం సమరే దేవాః పరాభూతా హరిం శరణమాగతా స్సర్వం" తస్మైన్యవేదయన్ తదా శ్రీహరి స్తానాహ భోదేవాః! భూలోకే,పురంజయోనామ, రాజాఽస్తిమత్తే జస్తస్మిన్నావేశయేయం, తం, సహాయంకృత్వా, పున, స్సమరం, దానవైః కురుత, జయ స్సంభవేద్వ స్త్వితి"తచ్ఛ్రుత్వా మహేంద్రస్స్వయమేత్య, పురంజయం సహాయం, వవ్రే, సపురంజయ, స్త్వేవమవోచత్ మహేంద్ర యదిత్వం వృషరూపం ధృత్వా, వాహన భూత, స్స్యాశ్చేత్తదా, సమాగచ్ఛేయ, మహామితి. మహేంద్రోపితథైవాభవత్, తదాపురంజయః, వృషభూతస్య, మహేంద్రస్య, కకుది, స్థిత, స్సమరే దానవాన్నిహత్యాగతః, తస్మాత్కకుత్థ్స, ఇతి గౌరవనామ సమభూత్ ఏవం పురంజయస్య, కకుత్థ్స, ఇతినామాంతరం"- సతుకకుత్థ్సస్స్వపితుశ్శతహీనాన్ పూర్వోక్తాబ్దాన్ రాజ్యం, కృతవానితి.

---

3 అనేనసః పాలనకాలః (3౫౭౦౦) ఇతి భవిష్యే

౩౬. కకుత్థ్సునియనంతరము వానిదాయాదుడు। అనేనుడు" అనురాజుభూమినిఁ బరిపాలించెను అతడును తనతండ్రికంటె నూరు సంవత్సరములుతక్కువుగా (అనగా (౩౫౮౦౦)సంవత్సరములు) భూమి యందు రాజ్యపాలనము చేసెను.

---

నకారణముచేతఁ గకుత్థ్సుడని బిరుదునామముకలిగెను. అప్పటినుండికకుత్థ్సుడని పురంజయునకు నామాంతరముగలిగెను ఆకత్థ్సుడును తనతండ్రిపరిపాలనకాలముకంటె నూరుసంవత్సరములు తక్కువగాఁ అనగాముప్పదియైద వేలయెనిమిదివందల సంవత్సరములు రాజ్యమును బాలించి పిమ్మట స్వర్గస్థుడయ్యెను.

శ్లో॥ పృథు రానేన స శ్చాపి శతహీనం తదబ్దకం[1]।
రాజ్యం చకార ధర్మేణ స్వప్రజా స్త్వనురంజయన్॥ 3౭

శ్లో॥ తస్మా జ్జాతో విశ్వకశ్చ శతహీనం తదబ్దకం[2]।
రాజ్యంచకార ధర్మేణ త్వాసముద్రామహీ మిమాం॥ 3౮

శ్లో॥ తదాత్మజ స్త్వార్ద్రికోపి శతహీనం తదబ్దకం[3]।
ఆసముద్రక్షితీ శానో పాలయామాస ధర్మతః॥ 3౯

* వ్యా॥ అయం పృథు, రన్యః వైవస్వత మన్వంతరాం తర్గతః, యేన గోరూపధరా, భూమి ర్దుగ్ధా, యేన భువః పృథ్వీతి వ్యవహ్రుతి లోకే సమజని సచాపరః పృథుః చాక్షుష మన్వంతరీయ ఇతివాయుపురాణే 62 అధ్యాయే దృశ్యతే తథాహి॥ శ్లో॥ చాక్షుషస్య నిసర్గేను సంభూతః కశ్యపాన్వయే తస్యాన్వవాయే సంభూతః పృథుర్వైన్యః ప్రతాపవానితి॥

2 పృథోఃపుత్రఃవిశ్వక ఇతి లింగపురాణే॥
విష్వగశ్వ ఇతి భవిష్యే—
పృషదశ్వ ఇతి వాయావిభిన్నథావర్తతే ఏకస్త్యేవతాని నామాంతరాణీత్యను సంధేయం ఆర్ద్రికః విశ్వకపుత్ర ఇతి లింగపురాణే భవిష్యే చవర్తతే.

1 వాయుపురాణే 85 అధ్యాయేనవిష్యపురాణే ప్రతిసర్గేరాజ్యకాలనిర్ణయశ్చ

* 1 పృథోః రాజ్యపాలనకాలః, సం॥ 35600—
2 విశ్వకపాలన కాలః ... సం॥ 35500
3 ఆర్ద్రికపాలన కాలః ... సం॥ 35400

* ౩౬ తా॥ అనేనసునిపుత్రుడగు పృథువును తండ్రికంటె నూఱు సంవత్స రములు తక్కువగా (అనగా ౩౫౬౦౦) సం॥ ప్రజలను సంతోష పెట్టుచు ధర్మముగ రాజ్యమునుఁ బాలించెను.

౩౭ తా॥ పృథుపుత్రుడగు విశ్వకుడును చతుస్సముద్రపర్యంతమగల భూమి నంతనుధర్మముగా బరిపాలించెను. అతనిరాజ్యపాలనకాలము తండ్రి కంటె నూఱు[illegible]ంవత్సరములు తక్కువ (అనగాఁ ౩౫౫౦౦) సంవత్స రములని యెఱుంగనగును.)

౩౮ తా॥ విశ్వకుని పుత్రుడగు నార్ద్రకుడును తనతండ్రికంటె నూఱు సంవ త్సరములు తక్కువగా (౩౫౪౦౦ సం॥) సముద్ర పర్యంతకమైన రాజ్యమును ధర్మముగఁ బాలించెను.

---

* వైవస్వతమన్వంతరాంతర్గతుడగు నీపృథువు వేఱని యెఱుగునది ఏపృథువు వలన భూమికి పృథివి యనువ్యవహారము కల్గెనో గోరూపమును ధరిం చిన భూమియందు సర్వౌషధులను నేపృథువు పిదికెనో యాపృథువు చాక్షుషమన్వంతరాంతర్గతుడని వాయుపురాణమున 62 అధ్యా యమునఁ జెప్పబడినది. (ఏమన) చాక్షుషమన్వంతరమునందు కశ్య పవంశీకుడగు వేనుడు, అను రాజుయొక్క దక్షిణహస్తమును మధిం చగాఁబుట్టిన పృథువు చక్రవర్తియు మహాప్రతాపవంతు డొకడు కలడని”

శ్లో॥ యువనాశ్వ స్తత్సుతశ్చ శతహీనం తదబ్దకం[1] ।
రాజ్యంకృత్వా దివం యాతఃధర్మతఃపాలయన్ప్రజాః॥ ౪౦

శాబస్తిఃపాలయామాస శతహీనం తదబ్దకం[2]
ఆసముద్రక్షితిం ధర్మా చ్ఛాబస్తీ యేన। నిర్మితా॥ ౪౧

ఉదయాద స్తపర్యంతం త్రై ర్న్వృపై ర్భూమిమండలం।
భుక్తం నీతిపరై ర్భూపైః శ్రావ స్తేన చభూతలే॥ ౪౨

శ్లో॥ శ్రావ స్తస్యతుదాయాదః బృహదశ్వో।మహాయశాః
* శతహీనం[2] కృతం రాజ్యం తేనరాజ్ఞాపి భూతలే॥ ౪౩
[1]శ్లో॥ కువలాశ్వం స్వపుత్రంతు శూరముత్తమ ధార్మికం
బృహదశ్వో ఽ భ్యషించత్తం తస్మిన్ప్రాప్తే నరాధిపః
పుత్రసంక్రామితశ్రీకః వనం గంతు మియేష సః॥ ౪౪

---

1 వాయౌ 88 అధ్యాయే ఆనందరామాయణేచ వంశక్రమోఽస్తి లింగపురాణే 65 అధ్యాయేచ॥

| | |
|---|---|
| 2 శాబస్తిరాజ్యకాలః | సం—351000 |
| 1 యువనాశ్వరాజ్యకాలః | సం—35300 |
| 3 బృహదశ్వరాజ్యకాలః | సం—35000 |

సర్వేషాం రాజ్ఞాం రాజ్యపాలన కాలనిర్ణయస్తు భవిష్య పురాణేప్రతిసర్గేలిఖితఃతమనుసృత్యైవ మయాత్రలిఖ్యతే.

౪౦ తా॥ అర్ధ్రుని పుత్రుడగు యువనాశ్వుడు తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (అనగా 39,200౯౦॥) రాజ్యమునుఁ బాలించి స్వర్గస్థుడయ్యెను”

౪౧ యువనాశ్వ పుత్రుడగు శాబస్తియనురాజు తన పేరితో శాబస్తియను పత్తనమును నిర్మింపఁజేసి సముద్రపర్యంతకమైన భూమిని ధర్మముతోఁ బాలించెను. అతని రాజ్యపాలన కాలము 39,100 సంవత్సరములని యెఱుగనగు”

౪౨ తా॥ ఇక్ష్వాకువంశీయులగు రాజులందఱును నీతితో నుదయాద్రిమొదలుకొని యస్తాద్రి పర్యంతము భూమినిఁ బాలించినవిధముననే శాబస్తియును భూమండలమును” ఉదయాద్రిమొదలుకొని యస్త్రాదిదిపర్యంతము పరిపాలించెను. శాబస్తికిశ్రావస్తుడనియు నామాంతరమని యెఱుగనగును.

౪౩ శాబస్తిపుత్రుడగు బృహదశ్వుడు మహాకీర్తిని సంపాదించి తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (అనగా 39,000 సంవత్సరములు) రాజ్యమునుఁ బాలించెను.

౪౪॥ బృహదశ్వమహారాజు తనపుత్రుడును శూరుడును ధార్మికుడునగు కువలయాశ్వునిఁ బట్టాభిషిక్తునిఁగాఁజేసి పుత్రునకురాజ్యలక్ష్మిని సంక్రమింపఁజేసి తపస్సునుఁ జేసికొనుటకు వనమునుగూర్చి పోవ నిశ్చయించెను.

శ్లో॥ బృహదశ్వం మహారాజం శూర ముత్తమధార్మికం ।
1 ఉత్తంకస్తు ప్రయాంతంతం బ్రహ్మర్షిః ప్రత్యవారయత్ ॥ ౪౫॥

ఉత్తంకః॥ శ్లో॥ భవతా రక్షణం కార్యం తత్తావత్కర్తుమర్హతి
నిరుద్విగ్న స్తపః కర్తుంనహిశక్నోమి పార్థివ॥ ౪౬॥

శ్లో॥మమాశ్రమ సమీపేషు సమేషు మరుధన్వసు।
సముద్రోవాలుకా పూర్ణః తత్ర తిష్ఠతి భూపతే॥ ౪౭॥

శ్లో॥ దేవతానా మవధ్యస్తుమహాకాయోమహాబలః।అంత
ర్భూమిగత స్తత్ర వాలుకాంత హితోమహాన్॥ ౪౮॥

శ్లో॥దుంధు ర్లోకవినాశాయ తపఆస్థాయ।దారుణం
సంవత్సరస్య పర్యంతే సనిశ్వాసం విముంచతి
యదాతదా మహీ తత్ర చలతిస్మ సకాననా॥ ౪౯-౫౦

శ్లో॥తస్యనిశ్వాస వాతేన రజఉద్ధూయతే మహత్
ఆదిత్యపద మావృత్య సప్తాహం భూమికంపనం॥ ౫౧
శ్లో॥సవిస్ఫులింగం సజ్వాలం సధూమమతిదారుణం । తేన
రాజ న్నశక్నోమి తస్మి న్థాతుం స్వఆశ్రమే॥ ౫౨

1 వాయు పురాణే 88 అధ్యాయె.

౪౫ తపోవనమునకుఁ బోవుచున్నట్టియు, ధార్మికుడును మహాశూరుడునగు బృహదశ్వమహారాజు నొద్దకు" ఉత్తంకమహర్షి వచ్చి తపోవనము నకుఁ బోవనున్నట్టివాడైన యాబృహదశ్వ మహారాజుని వారించి యిటులఁ బల్కెను.

౪౬ ఓబృహదశ్వుడా! నేను నిర్భయముగా తపము చేసికొనుటకు వీలులే కుండ నున్నందున నీవు నా యాశ్రమమునకు వచ్చి రక్షణముచేయ వలయును. కానఁ దపోవనమునకుఁ బోవఁజనను.

౪౭ ఓబృహదశ్వుడా! నాయాశ్రమ సమీపమునందు సముద్రసంబంధ మగు నిసుక తిప్పయొకటి యున్నది.

౪౮ ఆభూమిలోపల నిసుకచే గప్పఁబడి గొప్పశరీరముగలిగి మహాబల వంతుడై దేవతలకు నవధ్యుడైన ధుంధువను పేరుగలవాడొకడు కలడు"

౪౯-౫౦ తా॥ అధుంధువనువాడు లోకనాశమగునట్లు దారుణమగు తప మునుఁజేయుచు సంవత్సరమునకొక పర్యాయము నిట్టూర్పువాయు వును వదలుచుండును అటుల వదలినపుడుభూమి"పర్వతారణ్యముల తోఁగూడఁ గంపించును.

౫౧-౫౨ తా॥ ఆధుంధువు వదలిన నిశ్వాసవాయువుచే భూమినుండి గొప్ప ధూళి బయలుదేరి సూర్యమండలమును వ్యాపించి యేడు దినముల పర్యంతము భూకంపమునుఁ జేయుచునే యుండును. మఱియు నా ధూళి యగ్నిజ్వాలలతోను, ధూమముతోను నిండి భయంకరమై యున్న కారణముచేతను నేను నాయాశ్రమమునందుఁ దపస్సుజేసి కొనఁ జాలకుంటిని.

1 శ్లో॥తం వారయ మహాబాహో లోకానాం హితకామ్యయా
త్వం పాపస్య వధార్థాయ సమర్థః పృథివీపతే॥ ౫౩

శ్లో॥ఏవ ముక్తస్తు రాజర్షి రుత్తంకేన మహాత్మనా
కువలాశ్వం సుతం ప్రాదా త్తస్మి న్ధుంధుని వారణే॥ ౫౪

శ్లో॥రాజా సన్న్యస్తశస్త్రోహ మయం తు తనయో మమ
భవిష్యతి ద్విజశ్రేష్ఠ దుంధుమారో నసంశయః॥ ౫౫

శ్లో॥సతం త్వాదిశ్య తనయం దుంధుమారణ కర్మణి।
జగామ పర్వతాయైవ తపసే బృహదశ్వకః॥ ౫౬

శ్లో॥కువలాశ్వ స్తు ధర్మాత్మా పితు ర్వచన మా
స్థితః సహస్రై రేకవింశత్యా పుత్రాణాం సహ పార్థివః
ప్రాయా దుత్తంక సహితో దుంధో స్తస్యనివారణే॥ ౫౭

శ్లో॥త మావిశ త్తతో విష్ణు ర్భగవా న్స్వేన తేజసా। ఉత్తం
కస్య నియోగాత్తు లోకానాం హితకామ్యయా॥ ౫౮

శ్లో॥తస్యపుత్రైః ఖనద్భిస్తు వాలుకాంతర్హిత స్తదా
దుంధురాసాదిత స్తత్ర దిశ మాశ్రిత్య పశ్చిమాం॥ ౫౯

శ్లో॥ సర్వే దుంధు ముఖశ్వాసానిలదగ్ధాస్త్రియః స్మృతాః।
అవశిష్టా దృఢాశ్వస్తు చంద్రాశ్వ కపిలాశ్వకౌ॥ ౬౦

1 వాయుపురాణే 88 అధ్యాయే.

౫౩,౫౪,౫౫ మహాశూరుడవగు నో బృహదశ్వమహారాజా! వానిని వధించు
టకు నీవు సమర్థుడవు కాన లోకహితముకొఱకు వానిని వధింపుమని
యుత్తంకమహర్షి బృహదశ్వమహారాజుతోఁ జెప్పగా నాబృహద
శ్వుడును దుంధువను రాక్షసుని సంహరించుటకుఁ దన పుత్రుడగు
కువలాశ్వుని నియోగించి యామహర్షితో నిట్లుపల్కెను. ఓయు
త్తంకమహర్షి! నేను శస్త్రసన్యాసమును జేసియుంటిని. కానఁ దిరిగి
శస్త్రమును ధరించుట న్యాయముకాదు కాన నా కుమారుడు నీ
వెంటవచ్చి దుంధువును సంహరించును. సందియంబొందవలదనెను.

౫౬ బృహదశ్వమహారాజు దుంధుమారణమునకుఁ బైవిధముగఁ దనపుత్రు
ని నియోగించి యుత్తంకమహర్షి యానతిచేఁ దపోవనమునకేగెను.

౫౭ ధర్మాత్ముడగు కువలయాశ్వుడును తనతండ్రి యానతిచే దుంధువును
సంహరించుటకు నిరువదియొక్కవేల సంఖ్యగల తనపుత్రులతో
డను, మహర్షితోడనుగూడి దుంధువు తపముచేయుచున్న పశ్చిమస
ముద్రతీరమునకుఁ బోయెను.

౫౮ అప్పుడామహర్షియును కువలాశ్వునియందు విష్ణుతేజమునుఁ బ్రవేశపె
ట్టుటకు విష్ణుమూర్తిని బ్రార్థింపగాఁ నామాధవుడును మహర్షికోరిక
ననుసరించి తనతేజమును లోకహితముకొఱకుఁ గువలయాశ్వుని
యందుఁ బ్రవేశపెట్టెను.

౫౯ తా॥ కువలాశ్వపుత్రులు పశ్చిమసముద్రతీరమునందలి వాలుకా
ప్రదేశమును (ఇసుకతిప్పను) త్రవ్వగా దుంధువను రాక్షసుడు
కనపడెను.

౬౦ అప్పుడు దుంధువు దీర్ఘముగా వేడినిట్టూర్పును విడువగా వానిశ్వా
సాగ్నిచేఁ గువలాశ్వపుత్రులందఱు దగ్ధమైరి. పైవిధముగఁ గువలా
శ్వపుత్రులు (౨1000) లో (౨0997) దగ్ధముకాగా "దృఢాశ్వుడు,
చంద్రాశ్వుడు, కపిలాశ్వుడు" అను ముగ్గురు మాత్రము మిగిలిరి.

శ్లో॥ తతస్సరాజాఽతి బలో దుంధుం సంహృతవాం స్తదా
ఉత్తంకశ్చవరం ప్రాదాత్ తస్మై రాజ్ఞే మహాత్మనే
అదాత్తస్యాక్షయం విత్తంశత్రుభి శ్చాపరిధృష్యతాం॥౬౨

1శ్లో॥ శతహీనం కృతం రాజ్యం కువలాశ్వేన భూతలే
దుంధుమార సమాఖ్యాంచ లేభే సకువలాశ్వకః॥ ౬౩

2శ్లో॥ శతహీనం కృతం రాజ్యం తత్పుత్రేణ మహాత్మనా
దృఢాశ్వేన యథాన్యాయం। స్వపరిజా స్స్వభిరక్షతా॥౬౪

3శ్లో॥ దృఢాశ్వస్య తు దాయాదః నికుంభ స్స్వ భవన్నపః
సహస్రహీనం రాజ్యంతు కృతంతేన మహాత్మనా॥౬౫

4శ్లో॥ నికుంభస్య చ దాయాదః సంహతాశ్వోఽభవ న్నృపః
సహస్రహీనం రాజ్యం తు కృతం తేన చ భూతలే॥ ౬౬

5శ్లో॥ సంహతాశ్వసుత శ్చాభూత్ రణాశ్వ ఇతి విశ్రుతః
సహస్రహీనం రాజ్యం తత్కృతం తేనాపి భూతలే॥ ౬౭

ద్వితీయస్సర్గ స్సమాప్తః.

---

1 వాయు పురాణే కాల నిర్ణయస్తు భవిష్యే:—

1. కువలాశ్వరాజ్యపాలన కాలః 84900.
2. దృఢాశ్వపాలన కాలః సం. 84800,
3. నికుంభరాజ్యకాలః శం 83800.
4. సంహతాశ్వపాలనకాలః సం. 82800,
5. రణాశ్వపాలనకాలః 81800.

౬౧ ౬౨ తా॥ పిమ్మట విష్ణుశక్తికలిగిన కువలాశ్వుడు దుంధువను రాక్షసుని సంహరించెను. ఉత్తంకమహర్షియును సంతసించి కువలాశ్వమహారాజునకు వరములనిచ్చెను. (అపరమితైశ్వర్యవంతుడై ధనవంతుడై యుండుటయు శత్రువులకజేయుడగుటయు ననియెఱుగనగును.)

౬౩ తా॥ ఆ కువల్యాశుడు దుంధువును సంహరించిన కారణమున దుంధుమారుడని ప్రసిద్ధినొందెను. తనతండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (అనగా 34900) సం॥ రాజ్యమును బరిపాలించెను.

౬౪ తా॥ కువలాశ్వుని పుత్రుడగు దృఢాశ్వుడును యథాన్యాయముగఁ దన ప్రజలను రక్షించుచుఁ దన తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగ (34800 సం॥) రాజ్యమునుఁ బాలించెను.

౬౫ తా॥ దృఢాశ్వుని దాయాదుడగు నికుంభుడను రాజును పైవానికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (33800 సం॥) రాజ్యమునుఁ బాలించెను.

౬౬ నికుంభుని దాయాదుడగు సంహతాశ్వుడను రాజు పైవానికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (32800 సం॥) భూమినిఁ బాలించెను.

౬౭ తా॥ సంహతాశ్వుని పుత్రుడగు రణాశ్వుడును పైవానికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (31800 సం॥)భూమియందు రాజ్యమును బాలించెను.

ద్వితీయ సర్గము సమాప్తము.



## తృతీయసర్గ ప్రారంభః

శ్లో॥ అథతస్యసుతోలోకే। యువనాశ్వఇతిశ్రుతః[1].
ప్రజాహీనంరాజ్యంతు కృతవాన్ఖ్యాతలేనృపః॥ ౧
అత్యంతధార్మికా గౌరీ తస్య పత్నీ పతివ్రతా॥

శ్లో॥ అనపత్యత్వనిర్వేదా దృష్ట్వాత్రిమగతో నృపః
తేనవై కారయామాసు రిష్టిం పుత్రప్రదాం చ తే॥ ౨॥

శ్లో॥ తస్యా మిష్టా మధ్యరాత్రే మంత్రపూతజలా న్వితం
కలశం వేదిమధ్యేచ నివేశ్య సుషుపుశ్చతే॥ ౩॥

శ్లో॥ పిపాసయా నృపో రాత్రౌ తజ్జలం కలశే స్థితం
వ్యథార్యాగర్భనంధాయి పపౌ వజ్ఞానితావశాత్॥ ౪॥
శ్లో॥ యువనాశ్వోదరే గర్భో వవృధే క్షణమాత్రతః
దక్షిణాంగుష్ఠతో భిత్వా నిశ్చక్రామోదరం శిశుః॥ ౫॥

---

1! యువనాశ్వపరిపాలనకాలః (౩౦౩౦౦) సం॥
యువనాశ్వఃరణాశ్వపుత్రఇతి లింగపురాణే
ప్రసేనజిత్పుత్రఇతి వాయౌ భిన్నథావర్తతే
ఏకస్యైవరణాశ్వఇతిప్రసేన జిదితి
నామాంతర మిత్యూహ్యం.

## మూడవ సర్గము.

* ౧ అనంతరము రణాశ్వుని పుత్త్రుడగు యువనాశ్వుడనురాజు తన తండ్రికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ (80800 సం॥) రాజ్యమును బరిపాలించెను.

౨౪ తా॥ ఆయువనాశ్వుని భార్యయగు గౌరీదేవియుఁ బతివ్రతయును ధార్మికురాలునై యున్నది. కాని వారిక్వరకు సంతానము లేనందున గడువిచారముతోనుండిరి. ఒకప్పుడు యువనాశ్వుడు తనభార్యతో గూడ ఋష్యాశ్రమమునకు వెళ్ళి యచ్చటి మహర్షులతోఁ దమయనపత్యత్వమునుగూర్చి చెప్పుకొనగావారలు యువనాశ్వునిచే బుత్రకామేష్టినిఁ జేయించిరి.

౩౪ మహర్షులు యువనాశ్వుని భార్యకు గర్భధారణమగునటుల మంత్రోదకము నభిమంత్రించి యా జలమునుఁ గలశము నందుంచి ప్రాతఃకాలమున యువనాశ్వుని భార్యకా జలము నివ్వదలచి మంత్రోదకముతో నిండినకలశమును వేదిమధ్యయందుంచి యారాత్రి భాగమున నమ్మహర్షులు నిద్రించిరి"

౪౪ తా॥ తనభార్యకు గర్భోత్పత్తినిఁ గలుగఁజేయు కలశమందలి జలమును యువనాశ్వుడు తెలియక దాహముచేఁ బానముచేసెను.

౫౪ తా॥ గర్భోత్పత్తినిఁ గలుగఁజేయు మంత్రోదకమును యువనాశ్వుడు త్రాగుటవలన వెంటనే యా యువనాశ్వునకు గర్భముకలిగి క్షణమాత్రములో వృద్ధినొందెను. ఆగర్భమునందలి శిశువు బయటబడుటకు మార్గాంతరము లేనందునఁ దనబొటనవ్రేలుతో నా యువనాశ్వుని యుదరమునుఁ జీల్చుకొని బయటఁబడెను"

---

* యువనాశ్వుడు రణాశ్వపుత్రుడని లింగపురాణమునందును" ప్రసేనజిత్తుకుమారుడని వాయుపురాణము నందునుగలదు. ఒకనికే నామాంతరమని యూహింపనగును.

శ్లో॥ జాతో నామైష కం ధాస్యతీ తి తే మునయ స్తదా
ప్రోచుః పరస్పరం తత్ర దేవరాజ స్సమాగతః॥ ౬౫

శ్లో॥ మాం ధాతాఽయమితిప్రోక్త్వా ధాపయిత్వాంఽగుళిం
గతః తేన మాంధాతృనామా సౌ బభూవ ధరణీతలే।౭౫

1శ్లో॥ యువనాశ్వసుత శ్రీమాన్మాంధాతా పృధివీపతిః
మాంధాతా భూమిపాలోఽభూచ్ఛ్రుతిహీనం తదద్భుతం॥౮౫
శ్లో॥ మాంధాతా యౌవనాశ్వో వై త్రైలోక్య విజయీ నృపః
అత్రాప్యుదాహరంతీమంశ్లోకం వంశవిదో జనాః॥ ౯౫

2శ్లో॥ యౌవనాశ్వం మహాత్మానం యజ్వాన మమితౌజసం
మాంధాతా తు తను ర్విష్ణోః పురాణజ్ఞాః ప్రచక్ష తే॥౧౦౫

---

1. వాల్మీకిరామాయణే బాలకాండే సప్తతిమసర్గే యువనాశ్వసుతఃమాధాతేత్యత్రప్రమాణం.
2. వాయుపురాణం 68 అధ్యాయే.

౬౪ అప్పుడు మహర్షులును భయసంభ్రమములు కలవారై యీపుట్టిన శిశువు స్తన్యములేక యెట్లు జీవింపఁగలఁడు" దేనినిఁ బానముచేయును" అని పరస్పరము సంభాషించుకొనుచుండఁగ నచ్చటకు దేవేంద్రుఁడు వచ్చి మహర్షులతో నిటులఁజెప్పెను"

౭౪ తా॥ ఈశిశువు నాయంగుళిఁ బానముచేసి జీవించునని మహర్షులతో చెప్పి తన యమృతాంగుళిని (తన వ్రేలును) శిశువునకుఁ గుడిపి స్వర్గమునకు దేవేంద్రుడు వెళ్లెను" దేవేంద్రుడు స్వయముగా వచ్చి యీ శిశువు నా యమృతాంగుళినిఁ బానము చేయునని చెప్పిన కారణముచే నా శిశువునకు మాంధాతయని నామము భూమియందుఁ బ్రసిద్ధమయ్యెను. (మాం) నన్ను అనగా నా వ్రేలును" ధాతా పానము చేయును." అని యింద్రుడు చెప్పినకారణమున మాంధాత యని పేరు కలిగెనని భావము.)

*౮౪ తా॥ యువనాశ్వుని పుత్రుడగు మాంధాత మహారాజు తన తండ్రి కంటె నూఱు సంవత్సరములు తక్కువగ (3700 సం॥) రాజ్యమునుఁ బాలించెను."

౯౪ యువనాశ్వపుత్రుడగు మాంధాత మహారాజు త్రిలోకములను జయించి ప్రసిద్ధినొందెను. ఈ మాంధాత మహారాజువిషయమై పురాణజ్ఞులును వంశవృత్తము నెఱిగినవారునగు పెద్దలు క్రిందివిధముగఁ జెప్పుదురు"

౧౦౪ యువనాశ్వపుత్రుడగు మాంధాత మహారాజు మహాత్ముడనియు బహుయాగములనుఁ జేసినవాడనియు, అమిత తేజస్సు గలవాడనియు, విష్ణ్వంశసంభూతుడనియుఁ బురాణవేత్తలుఁ జెప్పుదురు"

---

* యువనాశ్వుని పుత్రుడు మాంధాతయని వాల్మీకి రామాయణము బాలకాండమున 70 సర్గమునఁగూడఁ కలదు. మఱియు కథాంశము విష్ణుపురాణము చతుర్థాంశము 2 అధ్యాయమునఁ జూడఁదగు.

వాయుపు॥ 85 అధ్యాయమున బ్రహ్మాండపు॥ 68 అధ్యాయమున.

3శ్లో॥ యావత్సూర్య ఉదేతి స్మ యావచ్చ ప్రతితిష్ఠతి
సర్వంతద్యౌవనాశ్వస్య మాంధాతుః క్షేత్రముచ్యతే॥౧౧౪

4శ్లో॥ తస్య బిందుమతీ నామ రూపేణా ప్రతిమా భువి
తస్యాముత్పాదయామాస మాంధాతా త్రీన్సుతాన్భువి
పురుకుత్స మంబరీషం ముచుకుందంచ విశ్రుతం॥౧౨౧౩

శ్లో॥ కన్యాశ్చ యౌవనాశ్వస్య పంచాశజ్జజ్ఞిరే క్రమాత్।
కన్యా వవృధిరే గేహే తస్య రాజ్ఞో సులక్షణాః॥ ౧౪

* శ్లో॥ సౌభరిస్త్వేకదాఽగత్య।మాంధాతార ముపాచహ।

---

* సౌభరిర్నామ మహర్షి రంతర్జలే ద్వాదశాబ్దం కాల మువాస తత్రచాంతర్జలే సంమదోనామ బహుప్రజోఽతిప్రమాణ మీనరాజోఽవసత్ తస్య పుత్రపౌత్రదౌహిత్రాః పృష్ఠతోఽగ్రతః పార్శ్వతశ్చ పరిభ్రమంతః సచాపత్యస్నేహోపచీయమానహర్షప్రకర్షో బహుప్రకారం పుత్రపౌత్రాదిభిః రేమే అథాంతర్జలస్థిత స్సౌభరిః ఏకాగ్రతాసమాధాన మపహాయా నుదినం తన్మత్స్యస్య లలిత మవేక్ష్య చింతయామాస అహో ధన్యోఽయ మతిరమణీయః మమాపి స్పృహాం జనయతి.

అహ మప్యేవం పుత్రాదిభి స్సహ రమిష్యామీతి నిశ్చిత్య జలా న్నిష్క్రమ్య సంతానకామః కన్యార్థం మాంధాతార మగచ్ఛత్ తేనపూజిత స్సౌభరిరువా చేత్యనుసంధేయం.

---

3. విష్ణుపురాణే చతుర్థాంశే 2 అధ్యాయే

4. బ్రహ్మాండే పురాణే ఉత్తరే 64 అధ్యాయే.

౧౧½ ఉదయాద్రి మొదలుకొని యస్తాద్రిపర్యంతముగల భూమండలమంతయు మాంధాతమహారాజు క్షేత్రమేయనికూడఁ జెప్పుదురు.

౧౨½ అట్టి మాంధాత మహారాజునకు బిందుమతియనెడి భార్య కలదు. ఆమె త్రిలోకసుందరియని చెప్పనొప్పును. ఆమెయందు మాంధాతకు ముప్పురు పుత్రులు కలిగిరి. వారలు క్రమముగఁ బురుకుత్సుడు, అంబరీషుడు, ముచుకుందుడను నామములతో నొప్పుచుండిరి.

౧౩ మాంధాతకుఁబైముప్పురు పుత్రులేకాక యేబదిపుత్రికలుకూడఁగలరు. వారలందఱును రూపలక్షణములుకలవారై పితృగృహమునందుఁ బెరుగుచుండిరి.

*౧౩½ ఒకానొకప్పుడు సౌభరియను మహర్షి మాంధాత సమీపమునకువచ్చి యిటులఁ బల్కెను.

---

* సౌభరియను మహర్షి జలములోపలఁదపముఁజేయుచు 12 సంవత్సరములుండెను. ఆజలములోపల సంమదమను పేరుగల మత్స్యరాజముండెను. ఆమత్స్యరాజు జలములో సంచరించుచుండగ దానికి నిరుపార్శ్వముల యందును వెనుకను ముందఱను దాని పుత్రులు పౌత్రులు మునిమనుమలు సంచరించుచుండిరి. ఆమత్స్యరాజు సైన్యముతోఁ గలసి సంచరించుటవలనఁగల్గిన యానందముతో బహువిధములుగఁ దన పుత్రపౌత్రాదులతోఁ గ్రీడించుచుండెను, జలములోఁదపము చేయుచున్న సౌభరిమహర్షి యామత్స్యరాజునుఁజూచి యేకాగ్రతను వదలి ప్రతిదినమున మత్స్యరాజు చేష్టలను వాని గార్హస్థ్య సౌఖ్యమునుఁజూచి మనస్సునందు వ్యథమునఁ జింతించెను. ఈమత్స్యరాజు కృతార్థుడు, కడుధన్యాత్ముడు, ఈ మత్స్యరాజుయొక్క గార్హస్థ్యచేష్టితములు రమణీయములై నాకును గృహస్థాశ్రమ ప్రవేశ సంకల్పమును గలుగఁజేయుచున్నవి. నేనును నవ్విధముగ గృహస్థాశ్రమ సౌఖ్యములనుఁ బొందెదనని నిశ్చయించి జలమునుండి వెడలి సంతానకాముడై కన్యకకొఱకు మాంధాతయొద్దకు వెళ్లెనని తెలియనగును.

శ్లో॥ నిర్వేష్టుకామోఽస్మి నరేంద్ర। కన్యాం ప్రయచ్ఛ మే।
మా ప్రణయం విభాఙ్క్షీః। నహ్యర్థినః కార్యవశాదు
పేతాః। కకుత్స్థవంశే విముఖాః ప్రయాంతి॥ ౧౫॥

శ్లో॥ అన్యేఽపి సంత్యేవ నృపాః పృథివ్యాం। మాంధా
తరేషాం తనయాః ప్రసూతాః। కింత్వర్థినా
మర్థితదానదీక్షాకృతవ్రతం శ్లాఘ్యమిదంకులం తే॥ ౧౬॥

శ్లో॥ శతార్ధసంఖ్యాస్తవ సంతి కన్యాస్తాసాంమమైకాం
[1] నృపతే ప్రయచ్ఛ। యత్ప్రార్థనాభంగభయాద్బిభేమి
తస్మాదహం రాజవరాఽతిదుఃఖాత్॥ ౧౭॥

శ్లో॥ ఇతి ఋషివచనం నిశమ్య రాజా శిథిలతనుం జరయా స
మీక్ష్య మౌనిం మునివరగురుశాపత స్సభీత్య న్నమిత
ముఖ స్సనృప శ్చిరం విదధ్యౌ॥ ౧౮॥

[2]సౌభరిః॥ శ్లో॥ నరేంద్ర। కస్మాత్సముపైషి చింతామసహ్య
ముక్తం న మయాత్ర కించిత్। యావశ్యదేయా
తనయా తయైవ కృతార్థతా నో యది కిం న లబ్ధం॥ ౧౯॥

శ్లో॥ తదా ప్రాహ మునిం రాజా కన్యా త్వాం వృణుతే
యది న దాతుం ప్రతిబంధో మే కులాచార స్స్వయంవరః

---

1 విష్ణుపురాణే చతుర్థాంశే 2అధ్యాయే.

1 వి॥ పురాణే చతుర్థాంశే 2 అధ్యాయే మహారామాయణేచ.

౧౫౪ ఓమాంధ్ధాతమహారాజా? నేను వివాహముజేసికొనఁదలచి నీసమీపమునకువచ్చితిని. నాకు కన్యకనిచ్చి వివాహముచేయుము నాకోరికను విఫలముగాఁజేయకుము కకుత్థ్స వంశకులగు రాజులయొద్దకు యాచకులుకార్యార్థము వచ్చి విముఖులై యింతవఱకు వెళ్లియుండలేదు.

౧౬౪ ఓ మాంధాత మహారాజా! భూమియందనేక రాజులు కలరు. వారలయొద్దఁ గన్యకలును కలరు. కాని యాచకుల యభీష్టముల నెరవేర్చుటయందు దీక్షవహించిన వంశము నీది యొక్కటియే యని వచ్చితినని సౌభరి పల్కెను.

౧౭౪ ఓ రాజా! నీయొద్దను ఏబది పుత్రికలుండిరి. వారిలో నాకొక కొమరిత నిచ్చి వివాహము చేయుము. అతి దుఃఖకరమగు యాచ్నా భంగమునకు నేను భయపడుచుంటిని.

౧౮౪ ఇవ్విధముగ సౌభరి చెప్పిన వాక్యములను విని మాంధాత మహారాజు ముదిమిచే శిథిలాంగుడగు నమ్మునినిఁ జూచి, కన్యక నివ్వనని జెప్పినచో ముని శపించునని భయముచే నేమి చేయుటకుఁ దోచక విచారించుచుండగా సౌభరి తిరిగి మాంధాతతోఁ గ్రిందివిధముగఁ బల్కెను.

౧౯౪ ఓ రాజా? నీవేల చింతించుచుంటివి? ఇవ్విషయమున నీవు చింతించుటకు, నేను, సహింప శక్యముకాని సంగతిని నీకుఁ జెప్పియుండలేదు. ప్రయత్నపూర్వముగా నీవు కన్యకను నెవరికైన నవశ్యముగా నీయవలసినదేకదా? (అట్టి విషయమున నీప్రయత్న మక్కరలేకయే యీకార్యము సమకూరినపుడు సంతోషింపవలసినది కాని విచారింప నవసరములేదని తాత్పర్యము)

౨౦౪ అప్పుడు సౌభరి మహర్షితో మాంధాత యిటులఁ బలికెను. ఓ సౌభరి మహర్షి! స్వయంవరము మా కులాచారము కావున నా పుత్రిక నిన్ను స్వయముగా వరించినచో నా ప్రతిబంధ మేమియులేదు.

శ్లో॥ ఇత్యుక్త్వా తం సమానీయ్య కన్యాంతః పుర మావిశత్
సౌభరి ర్యోగసిద్ధ్యాతు దివ్యరూపధరో ఽభవత్॥ ౨౧౹

శ్లో॥ శతమన్మధరూపం తం సౌభరిం తత్సుతాః పునః
జ్ఞాత్వా వృత్తం పితుస్సద్యః పంచాశ ద్వవిరే ఽసకృత్॥

పరిణీయ శుభాకారాస్సౌభరిర్నృప కన్యకాః
మాంధాత్రనుజ్ఞాం సంప్రాప్యనినాయనిజమాశ్రమం॥ ౨౩౹

తత్రతాసాంస్వపత్నీనాం సౌభరిస్స్వతపోబలాత్
స్వర్ణ సౌధాది సంయుక్తం పురమేకంవినిర్మమే ౨౪౹

సువర్ణ రత్న భూషాశ్చ స్వర్ణమంచాసనానిచ
సువర్ణ డోలికా శ్చాపి నందనోపమవాటికాః॥ ౨౫౹

దాసదాసీజనాంశ్చాపి స్వపత్నీనాం పృథక్పృథక్
కల్పయిత్వాస్వయంతాసాంగృహేష్వాసపృథగ్మునిః ౨౬౹

ఏవం ప్రత్యేకశస్తాభిస్సహక్రీడావినోదవాన్
గార్హస్థ్య సౌఖ్యమగ్నోఽభూత్సర్వదాసౌభరిర్మహాన్॥

పుత్రాన్పౌత్రాంశ్చదౌహిత్రాన్ పుత్రికాస్సౌభరిర్ముదా
పశ్యన్బహూన్వత్సరాంస్తు నినాయక్షణమాత్రతాం॥ ౨౮౹

౨౧। ఇవ్విధముగ చెప్పి మాంధాత సౌభరిని దీసికొని తన పుత్రికలుండెడి యంతఃపురమునుం బ్రవేశించెను. అప్పుడు సౌభరి తన యోగశక్తిచే దివ్యరూపమును ధరించెను.

౨౨। మాంధాత పుత్రికలందరు సౌభరి వచ్చిన సంగతినిం దమ తండ్రి వలనం దెలిసికొని తత్కాలముననే దివ్యరూపధరుడై శతమన్మథులను ధిక్కరించియున్న యా సౌభరిని భర్తనుగా నొక్క పర్యాయముగా వరించిరి.

౨౩। సౌభరి మహర్షి రాజకన్యకలను వివాహము చేసికొని మాంధాత మహారాజు ననుజ్ఞనొంది తన యాశ్రమమునకు వారినిం దీసికొని వెళ్లెను.

౨౪। సౌభరి మహర్షి తన తపోబలముచే రాజకన్యకలగు తన భార్యలకు సువర్ణ ప్రాకారములతోం గూడిన సౌధములచే నొప్పునట్టి యొక పురమును తపోవనమునందు నిర్మించెను.

౨౫।, ౨౬। మఱియు నా సౌభరి మహర్షి తన భార్యలకు ప్రత్యేక సౌధములను తపోమహిమచే నిర్మించి ప్రత్యేకముగ స్వర్ణరత్నాభరణములను, సువర్ణమంచములను, సువర్ణాసనములను ప్రత్యేకముగ వారి వారి సౌధప్రాకారములలోపల నందనవనముతో సమానమగు నుద్యానవనములను, దాసదాసీజనములను వేలు వేలుగ కల్పించి తాను అనేకరూపములను ధరించి వారి వారి గృహములలో నొక్కొక్కడుగ నుండెను"

౨౭। ఈ ప్రకారముగ సౌభరి మహర్షి తపోమహిమచే భార్యలందఱితో క్రీడావినోదములను సల్పుచు గృహస్థాశ్రమ సౌఖ్యములలో నెల్లప్పుడు మునిగియుండెను.

౨౮। సౌభరి మహర్షి పుత్రులను, పౌత్రులను, పుత్రికలను, దౌహిత్రులను జూచుకొనుచు సంతోషము నొందుచు బహుకాలమును క్షణకాలమునుగాం గడపెను.

ఏవం బహుగతే కాలే సౌభరిస్తత్వ దృష్టిమాన్
విచారయామాస హృది బహుధా సంసృతిం ప్రతి॥ ౨౯
అహో మోహస్య విస్తార స్సంసృతౌ సంస్థితస్యమే॥ ౩౦

మనోరథానాం న సమాప్తి రస్తి వర్షాయుతేనాప్యథ
వాపి లక్షైఃపూర్ణేషు పూర్ణేషు పున ర్నవానాం
ముత్పత్తయ స్సంతి మనోరథానాం॥ ౩౧

పద్భ్యాం గతా యావనిన శ్చ జాతా దారైశ్చ
సంయోగమితాః ప్రసూతాః దృష్టాస్సుతా
స్తత్తనయప్రసూతింద్రష్టుంపునర్వాంఛతిమేఽతరాత్మా౩౨

శ్లో॥ అమృత్యుతో నైవ మనోరథానామంతో స్తి
విజ్ఞాత మిదం మయాఽద్య మనోరథాసక్తి
పరస్య చిత్తం నజాయతే వై పరమార్థసంగి॥ ౩౩

శ్లో॥ సమేసమాధిర్జలవాసమిత్రమత్స్యస్యసంగాత్సహసైవనష్టః
పరిగ్రహస్సంగకృతోమయాఽయం
పరిగ్రహోత్థా చ మమాపి లిప్సా॥ ౩౪

౨౯-౪ ఇవ్విధముగ బహుకాలము గడచిన పిదప సౌభరి మహర్షి తత్వదృష్టిగలవాడై సంసారచక్రమునుగూర్చి యనేకవిధములగ హృదయమున విచారింపఁ దొడగెను.

30 సౌభరి మహర్షి యేమని విచారించె ననగా సంసారమునందుండి సర్వమును మఱచి యీ మోహములో పడుట యాశ్చర్య మని (విచారించెను.)

3౧ మఱియు విచారించినదేమనగా కోర్కెలకు సమాప్తి యనునది పదివేల సంవత్సరములకైనను, లక్షల సంవత్సరములకైనను వుండనేరదు. ఒక్కొక కోర్కెక తీరగా మఱియొక కోర్కెక నూతనముగ బుట్టుచుండును.

3౨ పిల్లలు పుట్టువఱకు సంసారములో నుండెదనని యనుకొంటిని. పిల్లలు పుట్టిన పిదప వారలు కొంచెము పెద్దవారలగు నంతవనుక నుండ కోర్కెక యుదయించెను. పిమ్మట వారలకు వివాహముకూడఁ జేసి సంసారమును వదలుకొందునని యనుకొంటిని. వివాహములైన పిదప వారల సంతానమునుఁ జూడవలయునని కోర్కెయు, వారలకు సంతానము కలిగిన పిదప వారల సంతానము చూడవలయు ననియు, నామనస్సు కోర్కెలతో నిండియే యున్నది. కాని శాంతిం పదయ్యెనని సౌభరి విచారించెను.

33 శరీరపాతమగు నంతవనుక కోర్కెలకు సమాప్తియనునది లేదనెడి విషయమును నే నిప్పటికిఁ దెలిసికొంటిని. మనోరథములయందాసక్తికలవాని మనస్సు పరమార్థ సంబంధముకలది కానేరదు.

3౪ నేను కొలనులో జలవాసము చేయుచుఁ దపము చేయుచున్నతఱి కొలనులోని మత్స్యరాజ సంబంధముచేతను నా సమాధియంతయు నష్టమయ్యెను. మత్స్యరాజ సహవాసమువలన నే నాకీ సంసారమంతయు నేర్పడెను. సంసార సంబంధమువలన నే కోర్కెక లుదయించుటయు, వానికి సమాప్తి లేకుండుటయు తటస్థించెను.

1శ్లో॥ నిస్సంగతా ముక్తిపదం యతీనాం సంగాదశేషాః
ప్రభవంతి దోషాః ఆరూఢ యోగోపినిపాత్యతేఽధః
సంగేన యోగీ కిముతాల్పశక్తిః ౩౫

శ్లో॥ ఇత్యేవంచింతయిత్వా సాత్యక్త్వా సర్వపరిచ్ఛదాన్
స్వభార్యాభిస్సాభరిస్తు ప్రవివేశతపోవనం ౩౬

2శ్లో॥ శతహీనంకృతం రాజ్యం మాంధాత్రాపిమహీతలే॥ ౩౬౪

శ్లో॥ శృణు యాద్యోనరో భక్త్యా సౌభరేస్తు కథామిమాం
అసన్మతిర ధర్మశ్చవినశ్యేత్తస్యహేద్విజాః ౩౭౪

శ్లో॥ ఆనంతరీం కథాం వక్ష్యే యాం యాంశృణుతభో ద్విజాః
నద్వాపరఃప్రకర్తవ్యః భవద్భిర్గ్రంథవిస్తరాత్॥ ౩౮౪

ఇతి తృతీయసర్గః సమాప్తః.

1 వి॥ పురాణే

2 మాంధాతుః పాలనకాలః 29800. ఇతిభవిష్యే

3౫ యతులకు సంగరాహిత్యము మోక్షహేతువని చెప్పఁబడినది. సంగమువలననే యనేక దోషములు పుట్టుచున్నవి. సంగమువలన ఆరూఢయోగియు నధఃపతితు డగునని తెలియుచుండ నల్పశక్తి గల యారురుక్షువగు యోగి సంగముచే భ్రష్టు డగునని వేఱు చెప్పనదేమి?

3౬ ఈ ప్రకారముగ సౌభరి మహర్షి మనస్సునందు విచారించి తన తపోమహిమచేఁ గల్పింపఁబడిన సమస్తపరికరములను తిరోహితములనుగాఁ జేసి తన భార్యలతోఁగూడఁ దపోవనమున కేగెను.

3౬౹ మాంధాత మహారాజు ఇరువది తొమ్మిదివేల యెనిమిది వందల సంవత్సరములు రాజ్యమును పరిపాలించెను.

3౭౹ ఓ మహర్షులారా! భూమియందలి యే మనుజులు సౌభరి కథను భక్తిభావముతో వినెదరో వారలకు సమృద్ధియు, ధర్మాసక్తియు కలుగును. (అసమృద్ధియు, నధర్మప్రవృత్తియు నశించును.)

3౮౹ ఓ మహర్షులారా! అనంతర కథనుఁ జెప్పెదను వినుడు. గ్రంథవిస్తరమయ్యెనని సంశయింపకు డనియెను.

తృతీయ సర్గము ముగిసెను.

## చతుర్థస్సర్గః.

*శ్లో॥ పురుకుత్సశ్చ కశ్రీవర్త్రీ మాంధాతుశ్చాత్మజో మహాన్
భువం వై పాలయామాస శతహీనంత దబ్దకం॥ ౧

శ్లో॥ షట్కోటి గంధర్వగణం నాగలోక గతశ్చయః
విష్ణ్వంశ సహితో యస్తు నీతో నర్మదయాఽజయత్॥ ౨

---

* పురుకుత్స విషయే విష్ణుపురాణే చతుర్థాంశే విస్తరతః ప్రతిపాదితం రసాతలేచమౌనే యానామ గంధర్వాభభూవుః షట్కోటిసంఖ్యాస్తైర శేషాణి నాగకులాన్యపహృతప్రధానరత్నాధిపత్యాన్యక్రియంత తైశ్చగంధర్వ వీర్యావధూతైరురగేశ్వరై భగవాన శేషదేవేశః స్తవశ్రవణోన్మీలితోన్నిద్ర పుండరీక నయనో జలశయనో నిద్రావసానవిబుద్ధః ప్రణిపత్యాభిహితః భగవన్నస్మాకమేతేభ్యోగంధర్వేభ్యోభయముత్పన్నం కథ ముపశమ మేష్యతీతి ఆహ భగవానవాది నిధనః పురుషోత్తమోయోసౌ మాంధాతుః పురుకుత్స నామా పుత్రస్తమను ప్రవిశ్యతా న శేష దుష్టగంధర్వానుపశమం నయిష్యామీతి. తదా కర్ణ్య భగవతే జలశాయినే కృతప్రణామా పునర్నాగలోక మాగతాః పన్నగాధిపతయో

---

పురుకుత్స పరిపాలన కాలః 29700

# నాల్గవ సర్గము.

౧ మాంధాత మహారాజ పుత్రుడగు పురుకుత్సుడు గొప్ప చక్రవర్తియై తన తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా భూమినిఁ బాలించెను. (అనగా 29700 సంవత్సరములు పాలించెను.)

౨ ఆ పురుకుత్సుడు తన పరిపాలనా కాలమున నర్మదయను నాగకన్యచే నాగలోకమునకుఁ దీసికొనిపోఁబడి విష్ణ్వంశముతోఁగూడినవాడై యాఱుకోట్ల గంధర్వులను సంహరించి (నర్మదను వివాహమాడెను.)*

---

* పురుకుత్సుడు నాగలోకమునకేగి గంధర్వులను జయించిన విషయము గల కథాభాగము విష్ణుపురాణమున చతుర్థాంశమున విస్తారముగఁ జెప్పఁబడినది. (ఏమన) పాతాళమునందు మౌనేయులను గంధర్వులారుకోట్లు కలరు. వారిచే నాగలోకవాసుల యాధిపత్యము లపహరింపఁబడగా నా నాగలోకవాసులు భగవంతుడగు క్షీరసముద్రశాయియైన విష్ణుమూర్తిని బహువిధముగ స్తోత్రముచేయగ నా దేవాదిదేవుడు వారల స్తోత్రములను విని పద్మపత్రముల వంటి తన నేత్రములనుఁ దెఱచి మేల్కొనగా నప్పుడు నాగలోకవాసు లివ్విధముగ శ్రీహరితోఁ దమ కష్టములనుఁ జెప్పుకొనిరి. (ఏమన) ఓ భగవానుడా! మాకు గంధర్వులవలన భయముగలిగినది. ఆ భయమును నివారింపుమన నాద్యంత రహితుడగు పురుషోత్తముడు వారలతో నిటులఁ బల్కెను. మాంధాత మహారాజ పుత్రుడగు పురుకుత్సునియందు నా శక్తినిఁ బ్రవేశపెట్టి సకల గంధర్వులను సంహరింపజేసెదననెను ఆ వాక్యమును సర్పరాజులు విని భగవానునకు నమస్కారములనుఁ జేసి తదనుజ్ఞనుఁ బడసి పురుకుత్సమహారాజును భూలోకమునుండి నాగలోకమునకుఁ దీసికొనివచ్చుటకు

1శ్లో॥ పురుకుత్సస్యదాయాద స్త్రసదస్యుర్మహాయశాః
నర్మదాయాం సముత్పన్నస్త్రింశదశ్వస్సవివహి॥ 3
2శ్లో॥ శతహీనం కృతం రాజ్యం। త్రింశదశ్వేనధీమతా
రథేయస్య స్మృతా వాహాః। వాజినస్త్రింశతోవరాః॥ ర

శ్లో॥ అనరణ్యస్తతో జాతో, హ్యష్టావింశ సహస్రకం
రాజ్యం ద్వితీయచరణే కృతం సత్యయుగస్యవై॥ ౫

---

నర్మదాంచ పురుకుత్సా నయనాయచోదయా మాసుః సా చైనం రసాతలం గతశ్చా సొభగవ త్తేజసాప్యాయత వీర్య స్సకల గంధర్వాన్నిజఘాన పునశ్చ స్వపురమాజగామ సకల పన్నగపతయశ్చనర్మదాయైవరం దదుః యస్తేను స్మరణం కరిష్యతి నతస్య సర్పవిషభయం భవిష్యతీతి అత్రచశ్లోకః నర్మదాయైనమః ప్రాతః నర్మదాయై నమోనిశి నమోస్తునర్మదేతుభ్యంత్రాహిమాం విషసర్పతః ఇతి “(పూర్వోక్తమానేయానామకా శ్యవపత్న్యా మునేః పుత్రాశ్చిత్రసేనాద్యా ఇతిజ్ఞేయం”

---

1. బ్రహ్మాండే } 1. త్రసదస్యు రాజ్యపాలనకాలః 29600
2. భవిష్య } 2. అనరణ్యపాలనకాలః 28000

3 పురుకుత్సునకు నర్మదయందు త్రసదస్యుడను కుమారుడు కలిగెను. అతడు గొప్ప కీర్తిని సంపాదించెను. త్రసదస్యునకే త్రింశదశ్వుడని నామాంతరమని యెఱుగనగును

౪ త్రింశదశ్వుడను పేరు కలుగుటకు కారణ మేమనగా ఆత్రసదస్యుని రథమునకు ముప్పది గుఱ్ఱములు పూన్పబడును. కాన త్రింశదశ్వుడని ప్రసిద్ధిచెందినవాడై తన తండ్రికంటె నూఱు సంవత్సరములు తక్కువగా రాజ్యమును బాలించెను. (అనగా 29700 సంవత్సరములు పాలించెను.)

౫ ఆ త్రసదస్యునకు అనరణ్యుడు పుట్టెను. అతడు కృతయుగమున ద్వితీయ పాదమునందు ఇరువదియెనిమిదివేల సంవత్సరములు రాజ్యమును బాలించెను.

---

నర్మదయను నాగకన్యను బ్రేరేపింపగా నామె భూలోకమునకేగి పురుకుత్సుని నాగలోకమునకు దీసికొనివచ్చెను. అప్పుడు విష్ణుతేజము పురుకుత్సునియందు బ్రవేశింప నతడు సకల దుష్ట గంధర్వులను సంహరించి, తన పురమున కేగెను. నాగరాజులు నర్మదకు వర మొసంగిరి. (ఏమన) ప్రాతఃకాలమునందును, రాత్రి కాలమునందును విషసర్పములవలన నన్ను రక్షింపుమని యో నర్మదాదేవి! నిన్నెవరు ధ్యానించెదరో వారలకు సర్వవిష భయము లేకపోగాక యని. (పైనఁ జెప్పఁబడిన మౌనేయులను గంధర్వు లెవరనగా కాశ్యపుని భార్యయగు మునియను నామెకు పుత్త్రులైన చిత్రసేనాదులని యెఱుంగనగును.)

*శ్లో॥ మరుత్తరాట్క్రతౌయస్తు। రావణే నహతో౽భవత్
మద్వంశ్యాత్తేమృతిశ్చేతి। యేనశప్తో దశాననః॥ ౬

3శ్లో॥ పృషదశ్వస్తతోజాతో। రాజ్యం షష్ఠసహస్రకం
తదబ్దం భూతలే కృత్వా। స్వర్గలోకమవాపసః ౭
4శ్లో॥ హర్యశ్వస్తుతతోజాతో। విష్ణుభక్తికులేనృపః
సహస్రహీనం రాజ్యంచ కృతం తేనతదబ్దకం॥ ౮
5శ్లో॥ తదాత్మజోవసుమనా। ధర్మేణ పృధివీమిమాం
సహస్రహీనం శరదః। పాలయామాసరంజకః। ౯

* రావణేన మరుత్తయజ్ఞే౽నరణ్యస్సంహృతఇత్యత్రవిష్ణుధర్మోత్తరే ప్రపంచితం (తద్యథా) మరుత్తస్యాధ్వరేవిప్రాః। భక్షయామాసరావణః ఇంద్రోమయూరరూపేణ తస్మాద్యజ్ఞాదపాక్రమత్। మయూరస్యవరం ప్రాదాత్। మేఘేవర్షతి సర్వదా। గమిష్యత్యతులాం ప్రీతిం। మమనేత్రగుణాకృతిం। ధారయిష్యసిలోకేస్మిన్కలాపం సుమనోహరం కృకలా సస్యరూపేణ ధనాధ్యక్షోప్యపాక్రమత్।

| | | | |
|---|---|---|---|
| 3. భవిష్యే | } | 3. పృషదశ్వపాలనకాలః | 6000 |
| 4. భవిష్యే | } | 4. హర్యశ్వపాలనకాలః | 5000 |
| 5. భవిష్యే | } | 5. వసుమనరాజ్యకాలః | 4000 |

* ౬ పిమ్మట మరుత్తుడను రాజు యజ్ఞమునుఁ జేయుచు అనరణ్యునిఁ బిల్వగా అనరణ్యుడు మరుత్తుని యజ్ఞమునకు వెళ్ళెను. ఆ యజ్ఞమునకు రావణాసురుడు వచ్చి హవిర్భాగములను దేవతల కివ్వకుండగ తమ రాక్షసుల కివ్వమనగా నందునకు మరుత్తుడు సమ్మతింపక పోగా యుద్ధమునకు సన్నద్ధుడయ్యె దేవతలు భయపడి పారిపోయిరి. అనరణ్యుడు రావణాసురునితో యుద్ధముచేసి వానిచే హతుడై ప్రాణములను వదలుచు నిటుల రావణుని శపించెను. ఓ రావణుడా! నా వంశీయునివలన నీకు మరణము కలుగుగాక యని.

౭ ||తా|| అనరణ్యుని పుత్రుడగు పృషదశ్వుడు ఆరువేలసంవత్సరములు భూమియందు రాజ్యమునుఁబాలించి స్వర్గస్థుడయ్యెను,,

౮ ||తా|| పృషదశ్వుని పుత్రుడగు హర్యశ్వుడు విష్ణుభక్తికలవంశమునజన్మించి తండ్రికంటె వెయ్యిసంవత్సరములు తక్కువగా రాజ్యమునుఁ బాలించెను= (అనగా ౫,౦౦౦ సంవత్సరములు పాలించెనని భావము)

౯ || హర్యశ్వుని పుత్రుడగు వసుమనుడు ప్రజారంజకుడై తన తండ్రికంటె వెయ్యిసంవత్సరములు తక్కువగ (అనగా నాలుగువేల సంవత్సరములు) రాజ్యమును ధర్మముగఁ బాలించెను

---

* రావణుడు మరుత్తుని యజ్ఞమునకు వెళ్ళెనను విషయము విష్ణు ధర్మోత్తర మహాపురాణమునఁ జెప్పఁబడినది. (ఏమనగా) మరుత్తుని యజ్ఞమునకు రావణుడు వెళ్ళి యచ్చటి బ్రాహ్మణులను హింసించుచుండగా భయపడి యింద్రుడు నెమలిరూపముతోఁ బాఱిపోయి నెమలి జాతి మాత్రమున కంతను నిటుల వరమిచ్చెను. నా వాహనమగు మేఘము గర్జించి వర్షించినపుడు నెమళ్ళకు ప్రీతికలుగుగాక మఱియు మనోహరమగు పింఛమును ధరించుగాకయని,, కోడిరూపముతో కుబేరుడు మరుత్తునియజ్ఞమునుండి పాఱిపోయి కోడిజాతి కంతకును వరమిటులనిచ్చెను కోడినెత్తిమీద సువర్ణచ్ఛాయ యుండునటులను ధనముకూడ పందెములయందు తచ్ఛరము నందుండునట్లును వరమొసంగెను,, జలదేవతయగు వరుణుడు హంసరూపముతో

1శ్లో॥ సతుసూర్యం సమభ్యర్చ్య । రాజా వసుమనాశుభం
లేభేత్వ ప్రతిమంపుత్రం । త్రిధన్వాన మరిందమం। ౧౦
అయజచ్చాశ్వ మేధేన । శత్రూన్ జిత్వాద్విజోత్తమాః
స్వాధ్యాయ వాన్ధర్మ శీలః । తితీర్షురధర్మ తత్పరః
ఋషయస్తు సమాజగ్ముర్యజ్ఞవాటం మహాత్మనః॥ ౧౧౹

శ్లో॥ తాన్ప్రణమ్య మహారాజః । పప్రచ్ఛవినయాన్వితః
సమాప్య విధివద్యజ్ఞం వసిష్ఠాదీన్ద్విజోత్తమాః॥ ౧౨౹

శ్లో॥ కింహి శ్రేయస్కరతరం । లోకేస్మిన్ప్రాహిణార్షభాః
యజ్ఞస్తపోవా సన్న్యాసః । బ్రూతమే సర్వవేదినః॥ ౧౩౹

---

వర్ణంతస్య సువర్ణాభం సద్రవ్యంచత తథాశిరః । వరుణశ్చత
దాప్రాగాత్ । హంసరూపేణ నిర్గతః । హంసస్యచవరంప్రా
దాత్ తోయేరతి మవాప్స్యసి యమోవాయస రూపేణ
తస్మాద్యజ్ఞాద పాక్రమత్ । వాయసస్యవరం ప్రాదాత్ ।
చిరజీవి త్వాలక్షణం। యుష్మద్దత్తేనచాన్నేన పరాంతృప్తింవ్ర
జాస్యహంవక్ష్యథ్వం బలదాతూన్కాం దిగ్గేశగత చేష్టితైః ।
మరుత్తస్యాధ్వరే తాన్ సంకృత్త్వైవంసదివౌకసాం హవిర్భా
గాన్రాక్షసానాం దేహీత్యాహ దశాననః॥ తదానరణ్యస్సం
క్రుద్ధో రావణేనసమంతదా యుద్ధం కృత్వాతేన హతశ్శశాప
చదశాననం॥మద్వంశీయాన్మృతిస్తే స్యాత్ । సహభృత్య
హితాత్మజైః॥ ఇతి.

---

1 కూర్మే శివరామాయణేచ.

౧౦ తా॥ వసుమనుడనురాజు తనపరిపాలనకాలమున సూర్యభగవాను నారాధించితదనుగ్రహముచే నిరుపమానుడగు ప్రతిధన్వుడను పుత్రుని బొందెను

౧౧౪ మఱియు ధర్మశీలుడును శాంతుడును వేదవేత్తయునగు నావసుమనుడు శత్రువులను జయించి యశ్వమేధయాగము నొకప్పుడుచేసెను. ఆమహాత్ముని యజ్ఞవాటమునకు మహర్షులనేకులువచ్చిరి,

౧౨౪ తా॥ వసుమనుడుయథావిధిగాయజ్ఞమునుజేసి యాయజ్ఞమునకు వచ్చిన మహర్షులకు నమస్కారము చేసి వినయపూర్వకముగ వారలనుఁ బ్రశ్నించెనుఁ

౧౩౪ సర్వవేత్తలగునో మహర్షులారా! లోకమునందుఁ గొందరుయజ్ఞములనుఁ జేయుదురు మఱికొందఱు తపమునుఁ జేయుదురు కొందఱు సన్యాసమునును స్వీకరించెదరు ఆయజ్ఞతపస్సన్యాసములలోని పుడు నాకేది శ్రేయస్కరమో విచారించి చెప్పుడని యడిగెను

---

విడలి తనప్రాణరక్షణమును (జేసిన హేతువుచే హంసజాతికంతకును వరమునిచ్చెను (ఏమనగా) నాజలమునందు హంసలకు ప్రీతి యుండుగాకయని॥ యముడు కాకిరూపముతోఁ బాఱిపోయి కాకులకు వరమొసంగెను (ఏమనగా) చిరకాలముబ్రతుకునట్లును కాకులకుఁ బితృకర్మలయందు బలిగావేయబడిన యన్నము చేఁదనకుఁ దృప్తికలుగునట్లును బలినిచ్చువారలకు దిగ్దేశచేష్టితములచేతను శకునములనుఁ జెప్పునట్లునువరములనిచ్చెను, ఇవ్విధముగరావణుడు దేవతలకుసయితము భీతినిఁ గలుగఁజేసి హావిర్భాగములను రాక్షసులకునీయుమని మరుత్తునిగూర్చిపలికెను. అనరణ్యుడుకోపగించి మరుత్తుని యజ్ఞమును నశింపఁజేయ సమకట్టిన రావణునితో యుద్ధముచేసివానిచే హతుడై రావణుని శపించెను (ఏమన) నావంశీకునివలన నీకు మరణము కలుగుగాకయని.

ఋషయః॥శ్లో॥అధీత్య విధివ ద్వేదాన్పుత్రానుత్పాద్యయత్నతః
ఇష్ట్వా యజ్ఞేశ్వరం యజ్ఞైః గచ్ఛేద్వనమథాత్మవిత్॥ ౧౪

శ్లో॥ తచ్ఛ్రుత్వావై వసుమనాః। రాజ్యం పుత్రే సమర్ప్యచ
జగామారణ్య మనఘ స్తప స్తప్తు మను త్తమం॥ ౧౫
శ్లో॥ సంవత్సర శతం తప్త్వా ప్రసాదా త్పరమేష్ఠినః
దివ్యం వైరాజకం స్థానం। జగామతదనంతరం॥ ౧౬
1 శ్లో॥ తస్యపుత్రోఽభవద్రాజా। త్రిధన్వాధర్మ తత్పరః
సహస్రహీనం రాజ్యంత త్తేన రాజ్ఞాపిపాలితం॥ ౧౭
శ్లో॥ ప్రసాదా ద్బ్రహ్మసూనోర్వై। తండినః ప్రాప్యశిష్యతాం
అశ్వమేధ సహస్రస్య ఫలం ప్రాప్యతదాజ్ఞయా
గణైశ్వర్యమనుప్రాప్తః।భవభక్తఃప్రతాపవాన్॥౧౮-౧౯
2 శ్లో॥ త్రైయ్యారుణ స్తస్యసుతః।భూమిపాలోఽభవత్తతః
సహస్రహీనం రాజ్యం తత్తేన రాజ్ఞా వనే కృతం॥ ౨౦
శ్లో॥ తస్య సత్యవ్రతో నామ। కుమారోఽభూన్మహాబలః
తేన భార్యా విదర్భస్య। హృతా సత్యవ్రతేనతు
పిత్రాత్యక్తోవనం యాతి స్తత్రైవన్యవసద్వనే॥ ౨౧
శ్లో॥ నచైనంవారయా మాస వసిష్ఠో భగవానృషిః॥ ౨౨

---

1 బ్రహ్మాండపురాణే ౬౪అధ్యాయే. త్రిధన్వనఃపాలనకాలః (౩000 సం)
2 త్రైయ్యారుణపాలనకాలః (౭000 సం) ఇతిభవిష్యే.

౧౪౪తా॥మహాత్ము త్రివృథనుగ వసుమనునితో జెప్పిరి ఓవసుమనుడా! బ్రహ్మ చర్యమున యథావిధిగ వేదాధ్యయనమునుం జేసి వంశాభివృద్ధికొరకుం గృహస్థాశ్రమములోనికి వచ్చి పుత్రులనుం గనియాగములనుం జేసి యజ్ఞేశ్వరప్రీతినొనరించి వివానప్రస్థాశ్రమమునకేగి తపమునుంజేసి కొనుట శ్రేయస్కరమైనది (అనిచెప్పిరి)

౧౫౪తా॥వసుమనుడు బ్రహ్మర్షులవాక్యమును విని రాజ్యమును పుత్రుడగు (త్రిధన్వునకిచ్చి గొప్పతపమునుం జేయుటకువనమునకేగెను

౧౬౪ నూఱుసంవత్సరములు తపస్సుచేసి బ్రహ్మదేవుని సంతుష్టునిగాం జేసి యాబ్రహ్మనుగ్రహమచేం బిమ్మట విరాట్పురుషుడు నివసించిన దేవలోకమునుంబొందెను.

౧౭౪ వసుమనుని యనంతరము తత్పుత్రుడగు త్రిధన్వుడను రాజు ధర్మముగా తన తండ్రికంటె 1000 సంవత్సరములు తక్కువగా (అనగా 8000) సంవత్సరములు రాజ్యమును పరిపాలించెను.

౧౮-౧౯. ఆత్రిధన్వుడు, బ్రహ్మపుత్రుడగుతండిమహర్షికి శిష్యుడై యతని యనుగ్రహముచే సహస్రాశ్వమేధఫలమునుంబొంది శివభక్తుడై, ప్రమథగణాధిపత్యము నొందెను.

౨౦ అతని కుమారుడగు త్రయ్యారుణుడు రాజై తన తండ్రికంటె వెయ్యి సంవత్సరములు తక్కువగ భూమిని పరిపాలించెను. (7000 సం).

౨౧౪ అతనికుమారుడు సత్యవ్రతుడనువాడు మహాబలవంతుడుండెను. అతడు విదర్భుని భార్యనపహరించగ నాసత్యవ్రతుని, తండ్రియగు త్రయ్యారుణుడు పరిత్యజించ నతడు వనమునకేగి యచ్చటనే, నివసించెను.

౨౨ తండ్రి. సత్యవ్రతుని రాజ్యమునుండి వెడల గొట్టుసమయమున, పూజ్యుడగు వసిష్ఠ మహర్షి,సమీపమున నున్నను నతనిని వారింపడయ్యెను.

1శ్లో॥ దారాంస్తు విషయే తస్య । విశ్వామిత్రో మహాతపాః
సన్యస్య సాగరానూపే చచారవిపులంతపః॥ ౨౩
తస్మింస్తు విషయేతస్య నావర్షత్పాకశాసనః ౨౩½
శ్లో॥ తస్యపత్నీ గళేబధ్వా । మధ్యమం పుత్రమౌరసం
శిష్టానాం భరణార్థాయ । వ్యక్రీతుం నిర్గతాతదా॥ ౨౪½
శ్లో॥ సత్యవ్రతో మహాబుద్ధిర్భరణం తస్య చాకరోత్
విశ్వామిత్రస్య తుష్ట్యర్థ మనుకంపార్థమేవచ॥ ౨౫½
శ్లో॥ సోఽభవద్గాలవోనామ । గళేబద్ధో మహాతపాః
మృగమాంసేన తాన్సర్వాన్పోషయామాస వైనృపః ౨౬½
శ్లో॥ అవిద్యమానే మాంసేతు । వసిష్ఠస్య మహాత్మనః
సర్వకామదుఘాం ధేనుం । జఘాన బలినాంవరః॥ ౨౭½
శ్లో॥ ప్రోవాచ చైవ భగవా న్వసిష్ఠస్తం నృపాత్మజం
పితుశ్చాపరితోషేణ । గురుదోగ్ధ్రీ వధేనచ॥ ౨౮½
అప్రోక్షితోపయోగాచ్చ । త్రివిధస్తే వ్యతిక్రమః
త్రిశంకురితి హోవాచ । త్రిశంకుస్తేన సస్మృతః ౨౯½

1 బ్రహ్మాండే ౬౩ అధ్యాయే.

౨౩ ఆసత్యవ్రతుడరణ్యమునసుండి యాటవికులతో చెలిమిచేసి యచ్చటనే నివసించుచుండ నతఁడుండిన ప్రదేశముననే విశ్వామిత్రుఁడు తన భార్యాపుత్రులను విడిచి గొప్పతపమునుఁజేసి కొనుటకు మఱియొక ప్రదేశమునకేగెను.

౨౩౪ ఆసత్యవ్రతుఁడుండిన దేశమునందు వర్షములేక క్షామము సంభవించెను.

౨౪౪ ఆక్షామకాలమున విశ్వామిత్రునిభార్య తనపుత్రులను పోషించుటకు తెలివుగానక తన మధ్యమ పుత్రుని విక్రయించి యాధనముచే శేషించిన పుత్రులను పోషింపదలచి, యామధ్యమపుత్రుని మెడకు త్రాడును గట్టి, చేతబుచ్చుకొని విక్రయింప బయలు వెడలెను.

౨౫౪ సత్యవ్రతుడు, విశ్వామిత్రుని యనుగ్రహమును సంపాదింపఁదలచి విక్రయించుటకు తీసికొని పోఁబడుచున్నతత్పుత్రుని నివారించి విశ్వామిత్రునిభార్యను శాంతపరచి విశ్వామిత్రుఁడు వచ్చుదనుక తానువారినందఱను పోషించుటకు నొడంబడెను.

౨౬౪ గళమునందు (కంఠమునందు) త్రాడుకట్టబడినవాఁడు కనుకనే విశ్వామిత్రునిమధ్యమపుత్రునకు గాలవుఁడను నామధేయమేర్పడెను సత్యవ్రతుడు మృగమాంసముతో విశ్వామిత్రుని భార్యాపుత్రులనుక్షామకాలమున పోషించుచుండెను.

౨౭౪ ఒకప్పుడు మృగమాంసము దొరకనందున వసిష్ఠుని కామధేనువును సత్యవ్రతుడు మాంసార్థమై సంహరించెను.

౨౮—౨౯౪ పూజ్యుఁడగు వసిష్ఠుఁడు తన కామధేనువుని సత్యవ్రతుఁడు సంహరించిన వృత్తాంతముఁ దెలిసికొని యతఁడు త్రిశంకుఁడను నామముతో లోకమున వ్యవహరింపబడు గాక యని శపించెను. త్రిశంకుఁడనగా మూఁడు కళంకములు గలవాఁడని భావము; అవియెవ్వన (1) తండ్రికి సంతోషకరముగనుండక పోవుట (2) గురుధేనువునుసంహరించుట (3) మంత్రములచే ప్రోక్షింప బడని మాంసమును వినియోగించుట)

శ్లో॥ విశ్వామిత్రో సమాగత్య । శ్రుత్వా జాయాముఖాత్తతః
సత్యవ్రతస్యోపకృతిం । రాజ్యేతంచాభ్యషేచయత్
సహస్రవర్షకంరాజ్యం కృతం తేన మహీతలే॥ 30-31

సశరీరస్వర్గ కామో । ప్రార్థయా మాసవై గురుం
నిరాకృతో వసిష్ఠేన తత్పుత్రాన్ప్రాప భూపతిః॥ 32

గురుధిక్కారకరణాత్త్వం చండాలోభవేతి తైః
వసిష్ఠపుత్రైః శ్శప్తస్సన్కౌశికం శరణం గతః॥ 33

1 మిషతాం సర్వదేవానాం । వసిష్ఠస్యచకౌశికః
తేన యాగంకారయిత్వా । దత్వాచస్వతపః ఫలం
సశరీరం తదాతం వై దివమారోపయత్ప్రభుః॥ 34

శ్లో॥ విశ్వామిత్ర ప్రసాదేన త్రిశంకుర్దివి రాజతే॥ 35

తత్సుతస్తు హరిశ్చంద్రః । త్రిషులోకేషు విశ్రుతః॥ 36

2 సతురాజా హరిశ్చంద్రః । త్రైశంకవ ఇతిశ్రుతః।
ఆహర్తారాజసూయస్య । సమ్రాడితి పరిశ్రుతః
రాజ్యం వింశతిసాహస్రవర్షం రాజ్ఞాకృతం భువి॥ 37

2 త్రిశంకుపుత్రః హరిశ్చంద్ర ఇత్యత్ర వాల్మీకి రామాయణం ప్రమాణం.

1 బ్రహ్మాండ పురాణే లింగపురాణే చ 63 అధ్యాయే

30-31 పిమ్మట విశ్వామిత్రుడు తపమును చాలించి దారాపుత్రాములయొద్దకువచ్చి భార్యవలన సత్యవ్రతుడు క్షామకాలమునఁ జేసిన యుపకారమునువిని సంతసించి దానికి ప్రత్యుపకారముగ సత్యవ్రతునిఁ గోసల రాజ్యాభిషిక్తునిగాఁ జేసెను ఆసత్యవ్రతుడు పిత్ర్యమయిన కోసల రాజ్యమును వెయ్యిసంవత్సరములు పరిపాలించెను.

32తా॥ ఒకప్పుడు త్రిశంకుడు శరీరముతో స్వర్గమునుఁ బొందఁదలచి గురువగు వసిష్ఠునిఁ గలసికొని శరీరముతో స్వర్గమునుఁ బొందుటకు సాధనముఁ జెప్పుమని ప్రార్థించగా నతడునిరాకరించెను అనంతరము సత్యవ్రతుడు వసిష్ఠ పుత్రులయొద్దకు వచ్చి యవ్విధముననే ప్రార్థించెను.

33½ వసిష్ఠ పుత్రులు కోపగించి, గురుధిక్కారమునుఁ జేసినవాడవుగాన నీవు చండాలుడవై కమ్మని త్రిశంకుని శపించిరి. ఇట్లువసిష్ఠపుత్రులచే శపింపఁబడి సత్యవ్రతుడు చండాలరూపుడై విశ్వామిత్రుని శరణము నొందెను.

34 సమర్థుడగు విశ్వామిత్రుడు త్రిశంకునకభయమిచ్చి దేవతలు వసిష్ఠుడు మొదలగువారు చూచుచుండగ వారిచే, నొకయాగమును, జేయించి తనతపఃఫలమునిచ్చి త్రిశంకుని శరీరముతో స్వర్గమునకంపెను.

34½ విశ్వామిత్రుని యనుగ్రహముచే త్రిశంకుడు స్వర్గమునఁ బ్రకాశించుచుండెను.

35 ఆత్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు ముల్లోకములయందుఁ బ్రసిద్ధి నొందెను.

36½తా॥ త్రిశంకుపుత్రుడగు నాహరిశ్చంద్రుడు రాజసూయయాగమునుఁ జేసి సార్వభౌముడని ప్రసిద్ధిఁ జెంది యిరువది వేల సంవత్సరములు రాజ్యమునుఁ బాలించెను,

1శ్లో॥ హారిశ్చంద్రస్యతు సుతో రోహిత్సో నామవీర్యవాన్
పితుస్తుల్యం కృతం రాజ్యం । తేనరాజ్ఞాపి భూతలే॥ 3౭౫
2శ్లో॥ హారితో రోహితస్యాథ । స్వప్రజాస్త్వనురంజయన్
పితుస్తుల్యంచ కృతవాన్రాజ్యం నిష్కంటకం పునః ॥3౮౫
3శ్లో॥ చుంచుభూపస్తత్సుతో౽భూద్రాజా పరమధార్మికః
పితుస్తుల్యం కృతం రాజ్యం । తేన రాజ్ఞాపి భూతలే॥3౯౫
4 పితుస్తుల్యం కృతం రాజ్యం । విజయేనాపి భూతలే
జేతా సర్వస్యశత్రస్య । విజయస్తేన సస్మృతః ౪౦౫

---

1 సర్వేషా మేకాది షడంక సూచితానాం రాజ్యపాలనకాలః ౨0000సం) ఇతిస్నవిష్యే

1 హారిశ్చంద్రసుతఃరోహితఇత్యత్రవాల్మీకరామాయణే బా॥70సర్గే

2 రోహితసుతః హారితఇత్యత్ర వాయౌ లింగేనవిష్యేచ

3 హారితసుతశ్చుంచురిత్యత్రవా 88 అ. నవిష్యేచ.

4 చుంచుసుతః విజయ ఇత్యత్ర వాయౌ నవిష్యేచ.

౩౭౪తా॥హరిశ్చంద్రుని కుమారుడు లోహితుడు" మహాబలవంతుడై భూమి
1 యందుఁదనతండ్రితో సమానముగ(అనగా 20000 సంవత్సరములు) రాజ్యమునుఁబరిపాలించెను.

౩౮౪తా॥లోహితుని కుమారుడగు హరితుడు తన ప్రజలను సంతోషపెట్టు
2 చు రాజ్యమును శత్రురహితముగ జేసి యిరువది వేల సంవత్సరము లుభూమిని పాలించెను"

౩౯౪తా॥హరితుని కుమారుడగు చుంచుభూపుడు పరమధార్మికుడై భూమి
3 యందుఁదన తండ్రి పరిపాలించి నంత కాలము (అనగా ౨౦౦౦౦ సం) రాజ్యమునుఁబరిపాలించెను,,

౪౦౪తా॥చుంచుభూపుని కుమారుడు విజయుడనురాజు తనతండ్రి పరిపా
4 లించి నంతకాలము (అనగా ౨౦౦౦౦ సం) రాజ్యమును పరిపాలించెను సమస్తరాజులను జయించినవాడు గాన విజయుడని చెప్పబడెను

---

పైనసూచింప బడిన 1 మొదలు 6 అంకపర్యంతము గల రాజులందఱు ౨౦౦౦౦ సంవత్సరములు రాజ్యమునుబాలించిరి యనువిషయమున భవిష్యమహా పురాణము ప్రమాణము.

1 హరిశ్చంద్రుని కుమారుడు లోహితుడుఅని చెప్పుటలో వాల్మీకిరామాయణ బాలకాండమున 70 సర్గము ప్రమాణము,

2 లోహితునికుమారుడు హరితుడని వాయులింగభవిష్య మహాపురాణములు ప్రమాణము.

3 హరితుని కుమారుడు చుంచుభూపుడనివాయు 88 అధ్యాయమునను భవిష్యమహాపురాణమునను కలదు.

4 చుంచుభూపుని కుమారుడు విజయుడని వాయుపురాణమునను భవిష్యపురాణమునను కలదు.

5 పితుస్తుల్యం కృతం రాజ్యం రుచకేనాపి భూతలే
నిష్కంటకం ధర్మయుక్త । మాసముద్రక్షితీతలం॥ ౮౧॥

6 తత్పుత్రేణ వృకేనాపి । స్వప్రజా స్స్వభిరక్షితా
పితుస్తుల్యం కృతం రాజ్యం ధర్మేణ పృధివీతలే॥ ౮౨॥

1శ్లో॥ వృకపుత్రో బాహుకోపి పితృతుల్యసమా భువం
పాలయామాసపశ్చాద్వై రాజ్యభ్రష్టోఽభవద్విజాః ౮౩॥

2శ్లో॥ నిరస్తో హైహయై ర్బాహుః । హృతరాజ్యో వనంతతః
ప్రవివేశ సపత్నీకః। చచార చతపో మహత్॥ ౮౪॥

వృద్ధత్వాద్దు బలత్వాచ్చ। హ్యంతరా సమమారహ। ౮౫

భూపాశ్చ బాహుసేనాంతాః వైష్ణవాః పరికీర్తితాః
మణిస్వర్ణ సమృద్ధిశ్చ బహ్వాన్నం బహుదుగ్ధకం॥ ౮౬

---

5 విజయసుతః రుచకఇత్యేతే లింగే 65 అ॥ భవిష్యేప్రతిసర్గేచ॥ రుచకస్యవాయాదరుకఇతివర్తతే తథాపిరుచకస్యైవ రురుకఇతి నామాంతరమిత్యూహ్యం

6 రుచకపుత్రః వృకఇత్యేతల్లింగే 65 అ మత్స్యే 11 అధ్యాయేచ

1 బాహుకరాజ్య పాలనకాలః (౨౦౦౦౦సం॥) ఇతి భవిష్యే,

2 బ్రహ్మాండే,

౪౧|| తా||విజయుని కుమారుడగు రుచకుడు చతుస్సముద్రపర్యంతమైన భూ[5]మిని శత్రుశూన్యముగాను ధర్మయుక్తముగాను ఇరువదివేల సంవత్సరములు పరిపాలించెను”

౪౨|| తా||రుచకునిపుత్రుడగు వృకుడనురాజు తనప్రజలను బాగుగ రక్షిం[6]చుచు తండ్రితో సమానముగా (అనగా ౨౦౦౦౦ సం|) భూమియందు రాజ్యమును బాలించెను”

౪౩|| తా||ఓమహర్షులారా! వృకుని కుమారుడు బాహుకుడనురాజు తనతండ్రి పరిపాలించినంతకాలము(అనగా ౨౦౦౦౦సం||)రాజ్యమును బాలించి పిమ్మటరాజ్యభ్రష్టుడయ్యెను”

౪౪-౪౫ హైహయరాజులు బాహుకునిమీదికి యుద్ధమునకువచ్చి వానితో యుద్ధముచేసి జయించి బాహుకునిరాజ్యము నాక్రమించుకొని యతనిని రాజ్యభ్రష్టునిం జేయగా నాబాహుకుడు భార్యలతోఁ గూడఁ దపోవనమునకేగి గొప్ప తపమునుఁ జేయుచుండగా వృద్ధుడగుటవలనను దుర్బలుడగుటవలనను మధ్యకాలమున మృతిజెందెను” (బాహుకునకే బాహుసేనుడని నామాంతరమని యెఱుంగనగును)

౪౬ తా|| బాహుసేనుడు పర్యంతము గల రాజులందరు వైష్ణవులని (అనగా విష్ణుభక్తులనియే యెఱుంగనగును బాహుసేనునిపర్యంతము భూమియందుఁ బ్రజలకు సువర్ణమణిసమృద్ధియు, అన్నసమృద్ధియు, క్షీరసమృద్ధియు బాగుగానుండెను ధర్మముకూడ పరిపూర్ణముగనుండెను”)

---

5 విజయునికుమారుడు రుచకుడని లింగపురాణమున 65 అధ్యాయమునఁగలను విజయుని కుమారుడు రురుకుడని వాయు పురాణమున నుండినను రుచకునకే రురుకుడని నామాంతరమని యెఱుంగనగును.

6 రుచకుని కుమారుడువృకుడనుటలో లింగపురాణమున 65 అధ్యాయము మత్స్యపురాణము ||అధ్యాయము, ప్రమాణము.

శ్లో॥ పత్నీతు యాదవీతస్య । సగర్భా పృష్ఠతోఽన్వగాత్
సపత్న్యాచగరస్తస్యై । దత్తో గర్భజిఘాంసయా॥ ౪౭

సాతుభర్తుశ్చితిం కృత్వా । వహ్నింతు సమరోహయత్
ఔర్వస్తాం భార్గవోదృష్ట్వా। కారుణ్యాద్విన్యవారయత్ ।౪౮

సగరస్తుసుతో బాహోః । జజ్ఞేసహగరేణ వై
భృగోరాశ్రమమాసాద్య । హవ్యార్క్షేణ పరిరక్షితః ౪౯

ఆగ్నేయ మస్త్రం లబ్ధ్వాతు । భార్గవాత్సగరో నృపః
జఘాన పృధివీంగత్వా । తాళజంఘాన్సహైహయాన్॥ ౫౦

అర్ధంశకానాం శిరసో ముండయిత్వా వ్యసర్జయత్
యవనానాం శిరస్సర్వం । కాంభోజానాం తథైవచ॥ ౫౧

ద్వేభార్యే సగరస్యాస్య భవతస్స్మగుణోత్తరే
తాభ్యామారాధితో వహ్నిర్దదావరమనుత్తమం॥ ౫౨

తద్వరాత్ప్రథమాజాయా । పుత్రం ప్రాసూత కేవలం
ద్వితీయా షష్ఠి సాహస్రిం।పుత్రాణాం సమజీజనత్॥ ౫౩

౪౭.౪౮ బాహుకుడు మృతినొందుసమయమున నతని పెద్దభార్య గర్భవతి గానుండెను ఆమెయొక్క సవతి యసూయచే గర్భములోని శిశు వు మృతినొందునట్లు బాహుకుని జేష్ఠభార్యకు విషము పెట్టినను గర్భ ము చెడిపోక యుండియు స్వభర్తృ మరణమునకు విలపించి సహగ మనముఁ జేయఁ నుద్యమించి చితినిఁ బ్రవేశింపఁ బోగా తత్సమీప ప్రదేశమున తపముఁ జేయుచున్న యౌర్వుడను మహర్షి దయారసము గలవాడై బాహుక నిజ్యేష్ఠభార్య సమీపమునకువచ్చి యోదర్చి గ ర్భవతివిగాన సహగమనము కూడదని వారించి తనయాశ్రమమునకు నామెనుఁ దీసుకొనివెళ్లి కాపాడుచుండెను

౪౯ తా॥ ఔర్వాశ్రమమునందుబాహుకునిభార్య ప్రసవించెను శిశువుసవతితల్లి చే పెట్టబడిన గరముతోగూడ (విషముతో) బుట్టినవాడు గాన స గరుడని నామముచేఁ బ్రసిద్ధుడై యౌర్వమహర్షి యాశ్రమమునందే యామహర్షిచే రక్షింపబడుచుండెను

౫౦ తా॥ ఆగ్నేయాస్త్రమును సగరుడు భార్గవునివలన (ఔర్వునివలన) గ్ర హించి తదస్త్రముచే తాళజంఘులను హైహయులను సంహరించి తన పిత్ర్యమైన రాజ్యమును తిరిగి సంపాదించెను

౫౧ తా॥ శకయవనకాంభోజరాజుల శిరస్సులకు ముండనముఁ జేయించి వారిని నిజదేశములనుండి సగరుడు వెడలఁగొట్టెను

౫౨-౫౩ తా॥ సగరునకు నిర్వురు గుణవతులగు భార్యలుండిరివారుసంతానము కొఱకగ్ని దేవునారాధింపగా నాయగ్ని దేవుడు వారలకుసంతానము కలుగునట్లు వరమొసంగెను ఆవరప్రభావముచేత సగరునిజ్యేష్ఠభార్యకు నొకపుత్రుడుదయించెను రెండవ భార్యకు నరువదివేల పుత్రులు దయించిరి,

ప్రజా సంక్షోభకరణా జ్జ్యేష్ఠం తత్యాజవైపితా
అసమంజస నామానం పుత్రంతు సగరో నృపః ౫౪

సధర్మవిజయీ రాజా । వాజిమేధాయ దీక్షితః
అశ్వం వైచారయామాస । గురుణా౽భిప్రబోధితః॥ ౫౫
1 యజ్ఞీయాశ్వో హృతో౽భూద్వై । వాసవేనతుమాయినా
తస్మిన్న పహృతే ఋత్విగ్యజమానంత ముక్తవాన్॥ ౫౬

* అనీయ్యతాం తురంచాశ్వో । వినిహత్యాపహారకం ।
యజ్ఞచ్ఛిద్రం భవత్యేవ । సర్వేషా మశివాయనః॥ ౫౭

విహతస్యచ యజ్ఞస్య। సద్యఃకర్తా వినశ్యతి॥ ౫౭½
ఇత్యుక్తష్షష్టి సాహస్రీపుత్రా । న్ప్రేషయన్నృపః
విచిత్యసర్వతో భూమి మానేయో౽శ్వ ఇతీరయన్॥ ౫౮½

తేసర్వే హృష్టమనసో । రాజపుత్రా మహాబలాః
జగ్ముర్మహీతలం సద్యః । పితుర్వచనయంత్రితాః॥ ౫౯½

---

1 వాల్మీకి రామాయణే బాలకాండే కథాసంగృహీతా.

* అనీయ్యతామితి అనేనయజ్ఞీయాశ్వహరణ మృత్విగ్యజ మానా శుభకర మిత్యుక్తం భవతి, తథాచ తైత్తిరీయ శ్రుతిః యోబలో౽శ్వమేధేనయజతేయదమిత్రా అశ్వం విందేరన్ హన్యేతా స్యయజ్ఞ ఇతి.

౫౪ తా॥ సగరచక్రవర్తి, తనజేష్ఠపుత్రుడగు నసమంజసుని జనులను బాధించుచున్నందున వలన దేశమునుండి వెడల గొట్టెను

౫౫ తా॥ ఆసగరచక్రవర్తి గురువగువసిష్టునిచేఁ బ్రేరేపింపఁబడి యశ్వమేధ యాగముఁ జేయుటకు దీక్షను వహించి యశ్వమును విడచెను

౫౬ తా॥ సగరచక్రవర్తి విడిచి పెట్టిన యజ్ఞీయాశ్వమును దేవేంద్రుఁడప హరించెను ఆయశ్వమెంతకాలమునకు రానందున యాగమునుఁ జేయించుచున్న ఋత్విక్కు- యజమానియగు సగరచక్రవర్తినిగూర్చి యిటులజెప్పెను"

౫౭* తా॥ ఓసగరచక్రవర్తీ! నీయజ్ఞాశ్వమునపహరించిన వానిని సంహరించి శీఘ్రముగ నీవశ్వమును తీసికొనిరావలయును ఆవిధముగఁదీసికొనిరాకపోయినచో యజ్ఞచ్ఛిద్రమగు, దానివలన మనకందఱకు నమంగళము కాఁగలదనెను"

౫౮ తా॥ మఱియు యజ్ఞము నష్టమయినచో యాగకర్తయును వెంటనే నశించుననెను.

౫౯ తా॥ ఇవ్విధముగ ఋత్విజుడు చెప్పగనే సగరుడు తన యరువదివేల పుత్రులతో భూమినంతను వెదకి యాగాశ్వమును వెదకి తీసికొని రండని చెప్పి వారినిఁబంపెను"

౬౦ తా॥ సగరచక్రవర్తిపుత్రులందఱు సంతసించి పితృవాక్యబద్ధులై వెంటనే భూమియందు వెదకుటకు వెళ్లిరి"

---

* వ్యా" యాగాశ్వమును హరించుట వలన ఋత్విగ్యజమానులకమంగళమను విషయమున తైత్తిరయశ్రుతియు ప్రమాణమని యెఱుంగనగును ఎవడు వాజమేధమునుఁజేయునో వాని యాగాశ్వమును విరోధులపహరించినచో యజ్ఞము వినష్టమై యమంగళమునొనగూర్చునని చెప్పఁబడినది.

యోజనాయామ విస్తార మేకైకో ధరణీతలం
బిభిదుః పురుష వ్యాఘ్రాః వజ్రస్పర్శ సమైర్నఖైః॥ ౬౦॥
1 సాగరాభూమి ఖననం కృత్వా । కపిలసన్నిధౌ
అశ్వందృష్ట్వాత్వయంహర్తే త్యేవం తేఽత్వద్రవన్మునిం॥ ౬౧॥

తత స్తే సాగరా స్సర్వే । దగ్ధాస్తత్కోప వహ్నినా
సగరేణాంశుమన్నామ్నాలాద్యజ్ఞం పూర్ణంకృతంపునః ౬౨॥

తృతీయ చరణే మధ్యే సగరో నామ భూపతిః
త్రింశత్సహస్రవర్షాంవై కృత వాన్రాజ్యముత్తమం॥ ౬౩॥
2 నష్టేషు సాగరేష్వేవమసమంజస ఆత్మజః
శతహీనంకృతంరాజ్యమంశుమాంస్తత్సుతోభవత్ ॥౬౪॥

1 శతహీనం కృతం రాజ్య మసమంజసు తేనచ
స్వపుత్రేరాజ్యభారంతు సమర్ప్యవిధినాంశుమాన్॥౬౫॥

---

1 వాల్మీకి రామాయణే బాలకాండే
2 భవిష్యపురాణే ప్రతిసర్గే పర్వణి అసమంజస రాజ్యపాలన కాలః సం ౨౯౯౦౦ ఇతి ప్రతిపాదితం.
1 అంశుమతః రాజ్యకాలః సం ౨౯౭౦౦ ఇతి భవిష్యే

౬౦౹ తా॥ సగర పుత్రులలో నొక్కకరుడు యోజనము వెడల్పు పొడవు గల భూభాగమును వజ్రముతో సమానమగు గోళ్లచేఁద్రవ్విరి"

౬౧౹ తా॥ సగరపుత్రు లివ్విధముగ భూమినిఁద్రవ్వి పాతాళమునకేగి కపిలమహర్షి సాన్నిధ్యమునఁ దమయాగాశ్వమునుఁజూచి యాకపిలు డే తమయశ్వమును హరించినవాడని యామునిని సంహరించుటకుఁ బరుగిడిరి"

౬౨॥ తా॥ పిదపఁ గపిలమహాముని యాకోలాహలము విని సమాధిని విరమించి వారిని చూడగ నామునికోపాగ్నిచే నాసగర పుత్రులు దగ్ధమైరి పిదప సగరుడు తన పుత్రులు రానికారణమున వారిని వెదకుటకుఁదన మనుమడైన యంశుమంతునిఁబంపగా నతడు తిరిగి తిరిగి కపిలమహర్షి యాశ్రమమునఁదన పితృవ్యులు నశించిన విధమునుఁదెలసికొని యామునిని శాంతింపఁజేసి యశ్వమును దీసికొని వచ్చి సగరుని యజ్ఞమును పూర్తిఁజేయించెను.

౬౩౹ తా॥కృతయుగమునఁ దృతీయపాదమధ్యమున సగరచక్రవర్తి ముప్పదివేల సంవత్సరములు రాజ్యమును బాగుగఁబాలించెను"

౬౪౹ తా॥ సగర పుత్రులందఱు నష్టమొందగా సగరుని యనంతరము తత్పుత్రుడగు నసమంజసుడు పిత్ర్యమయిన రాజ్యమును తనతండ్రి కంటె నూఱుసంవత్సరములు తక్కువగా (౨౯౯౦౦సం) రాజ్యమును ఁబాలించెను అతని కంశుమంతుడను పుత్రుడుండెను"

౬౫-౬౬ తా॥అసమంజసుని కుమారుడగు నంశుమంతుడును తనతండ్రి కంటెనూఱు సంవత్సరములు తక్కువగా (అనగా ౨౯౮౦౦సం) రాజ్యమునుఁబాలించి రాజ్యభారమునుఁదనపుత్రుని యందుంచి భస్మీభూతులగు సగరపుత్రులనుఁదరింపఁజేయనుద్దేశముతో గంగను భూమి మీదికిఁదీసికొని రాదలచి చిరకాలము దపముచేసి విఫలుడయ్యెను"

2 గంగామానేతుకామ స్సన్తప్త్వా చవిఫలోఽభవత్॥ ౬౬
పితర్యుపరతే పశ్చాద్దిలీపోఽ పాలయన్మహీం
శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే॥ ౬౭
రాజ్యం భగీరథే స్థాప్య। గంగానయన యత్నవాన్
విఫలో భూత్తతః పశ్చాన్నృపాలోఽ భూద్భగీరథః॥ ౬౮

3 శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూగతే
మంత్రిష్వాథాయ తద్రాజ్యం। తపస్తేపేసుదారుణం॥ ౬౯

తతస్సురగణై స్సార్థంతప్యమాన మథాబ్రవీత్
భగీరథ మహాభాగ। ప్రీతస్తేఽహంవరం వృణు॥ ౭౦

భగీరథః॥ యదిమే భగవన్ప్రీతః। యద్యస్తి తపసః ఫలం
సగరస్యాత్మజా స్సర్వే మత్తస్సలిల మాప్నుయుః॥ ౭౧

తథేతి గంగాం వ్యసృజత్। ప్రవాహేం సాగతాం నదీం
దామోదర స్స్వపాదేతు।గంగాం ప్రావేశయత్తదా॥ ౭౨

---

2 వాల్మీకి రామాయణే దిలీపపాలనకాలః ౨౫౦౦ ఇతిభవిష్యే
3 భగీరథ పాలనకాలః సం ౨౬౦౦ ఇతి భవిష్యే

౯౭ అంశుమంతుని కొమరుడగు దిలీపుడు తండ్రి యనంతరము భూమి పాలుడైతండ్రి కంటెనూటు సంవత్సరములు తక్కువగా(౨౯౭౦౦ రాజ్యమునుఁజేసెను"

౯౮ దిలీపుడును పైఃథముగఁ గొంతకాలము రాజ్యముచేసి తనపుత్రుడైన భగీరథునియందు రాజ్యమునర్పించి గంగనుఁ దీసికొని వచ్చుటకుఁబ్ర యత్నించెను కాని యతడును విఫలుడయ్యెను. పిదప భగీరథుడు భూమిపాలుడయ్యె"

౯౯ అనంతరము భగీరథమహారాజును భూమినిఁదనతండ్రికంటె నూరు సంవత్సరములు తక్కువగా (౨౯౭౦౦సం) పాలించి రాజ్యమును మంత్రుల కప్పగించి గంగను భూలోకమునకుఁదెచ్చుటకు దారుణ మగు తపమునుఁజేసెను"

౧౦ అనంతరము తీవ్రతపమునఁజేయుచున్న భగీరథుని సమీపమునకు దేవగణములతోఁగూడ బ్రహ్మదేవుడు వచ్చియిటులఁ బల్కెను" భగీరథుడా! నీతపమునకు నేను సంతసించితి, వరమునుఁగోరుమ నెను.

౧౧ తా॥ భగీరథుడు బ్రహ్మదేవునితోఁనిటులఁబల్కెను. ఓభగవానుడా! నాతపమునకు ఫలముండినచో మఱియు నాయందు నీకుఁబ్రీతియుం డిన యెడల నాముత్తాతలగు సగరపుత్రుల భస్మరాసులు నావలన గంగచే నభిషేకింపఁబడుగాక. (అనగా గంగనుభూలోకమునకు విడువుమని భావము.)

౧౨ తా॥ బ్రహ్మదేవుడు సమ్మతించి గంగను వదిలిపెట్టెను ప్రవాహరూ పముగా వచ్చుచుండెడి యాగంగను విష్ణుమూర్తి తన పాదమునఁ బ్ర వేశపెట్టెను (ఏలనన)పతితపావనియగు గంగ భూలోకమునకుఁ బో గూడదని)

దశ వర్షసహస్రాణి తపస్తేపే హరిం నృపః

అనుగృహ్య హరిఃకించిద్వ్యసృజద్భువితాంనదీం॥ ౭౩

1 ఆయాంతీం తాం శివో గంగాం జటాజూటేదధారహ॥ ౭౩

భగీరథోపి ఖిన్నస్సన్దశసాహస్రవత్సరాన్।

శివం ప్రతితపస్తేపే। శివస్తాంకృపయాఽత్యజత్॥ ౭౪

భగీరథరథాత్పశ్చాదాయాంతీంజహ్నునామకః।

యజ్ఞదేశోన్మూలినీం తాం పపౌ భాగీరథీం మునిః॥ ౭౫

భగీరథప్రార్థితస్సన్ శ్రోత్రాభ్యామత్యజచ్చతాం।

తస్మాద్భాగీరథీ గంగాప్రోచ్యతే జాహ్నవీతిచ॥ ౭౬

భగీరథోపి రాజర్షిర్గంగామాదాయ యత్నతః।

సాగరాణాం భస్మరాశిం ప్లావయామాస వై తతః॥ ౭౭

ప్రపితామహవర్గం చ స్వర్నినాయ భగీరథః।

సోపి తప్త్వా చిరం స్వర్గం గతవాంస్తదనంతరం॥ ౭౮

2 శ్రుతసేనస్తతో రాజా శతహీనం తదబ్దకం।

రాజ్యం చకార ధర్మేణ స్వప్రజాస్త్వనురంజకః॥ ౭౯

---

1 వాల్మీకిరామాయణే బాలకాండే కథాభాగః. 2. శ్రుతసేన పాలనకాలః 29500 సం॥ ఇతిభవిష్యే

౨౩ తా॥ అనంతరము భగీరథుడు పదివేలసంవత్సరములు శ్రీహరినిఁగూర్చి తపముచేయఁగాఁబురుషోత్తముడనుగ్రహించి కొంచముగా గంగను భూమియందువిడచెను.

౨౩॥ మహాప్రవాహరూపముగా వచ్చుచున్న యాగంగను శంకరుడు తన జటాజూటమునందు ధరించెను.

౨౪॥ భగీరథుడు ఖేదమునొంది పదివేల సంవత్సరములు శంకరునిగూర్చి తపము చేయగా నమ్మహాదేవుడు సంతసించి కృపతో గంగను భూమియందు విడిచెను.

౨౫॥ భగీరథునిరథము వెనుక వచ్చుచున్నట్టియు తనయాగభూమినిఁబాడు చేయుచున్నట్టియునగు గంగను జహ్నుమహర్షి పానముచేసెను''

౨౬॥ పిదప జహ్నుమహర్షిని భగీరథుడనేకవిధములఁబ్రార్థింప నమ్మహర్షి శ్రోత్రముల ద్వారా గంగను విడిచెను, ఆకారణముననే భాగీరథియైనగంగ,జాహ్నవియని చెప్పబడుచున్నది''

౨౭॥ భగరథుడు గంగనుఁదీసికొని పోయి సగరపుత్రులభస్మరాశినిఁదడిపెను.

౨౮॥ ప్రపితామహులగు సగరపుత్రులను భగీరథుడు స్వర్గస్థులనుఁజేసి తానునుఁజిరకాలము తపముఁజేసి యనంతరము స్వర్గస్థుడయ్యెను.

౨౯॥ అనంతరము భగీరథపుత్రుడగు శృతసేనుడు రాజై తండ్రికంటె నూఱుసంవత్సరములు తక్కువగా, ధర్మముగా, రాజ్యమునుఁబాలించెను. శృతసేనుని పాలన కాలము ౨౯౫౦౦సం॥ అనియెఱుగవలయును.)

1 శైవాష్షట్ఛ్రుతసేనాంతాః । నాభాగో వైష్ణవో నృపః।
శతహీనం కృతం రాజ్యం। తేన రాజ్ఞాపి భూతలే॥ ౧౯౫

2 తస్య పత్నీ శుభాచారా। హరిపూజారతా సదా।
ప్రసుష్వాప కదాచిద్దై వా। స్వప్నే సాక్షాత్కృతో హరిః॥౧౧
కిమిచ్ఛసి వరం భద్రే పుత్ర స్త్వద్భక్తిమాన్భవేత్॥౧౨

తథేత్యుక్త్వా ఫలం తస్యై దదావేకం జనార్దనః।
భక్షయామాస సందశ్య। ఫలం సంహృష్టమానసా॥ ౧౩
తతః కాలేన సా దేవీ। పుత్రం కులవివర్ధనం
అసూయత శుభాచారం వాసుదేవపరాయణం॥ ౧౪

అంబరీష ఇతిఖ్యాతో। నాభాగస్యాత్మజః పునః
పితర్యుపరతే శ్రీమా। అభిషిక్తో మహాత్మభిః।
మంత్రిష్వాధాయ వై రాజ్యం। తపఉగ్రంచకార సః॥౧౫
ఆజగామ సవిశ్వాత్మా। సర్వలోకనమస్కృతః।
ఐరావతమివాత్యర్థం। కృత్వావై గరుడం హరిః।
స్వయంశక్రఇవాసీనః। తమాహనృపసత్తమః॥ ౧౬ ౧౭
ఇంద్రోహమస్మి భద్రం తే। కిం దదామి తవాద్యవై॥౧౮

---

1 భవిష్యేప్రతిసర్గే 2 (నాభాగపాలనకాలః సం॥ (౨౧౪౦౦.)

౮౦౫ సగరుడు మొదలు శృతసేనుని పర్యంతముగల యీరుగురు రాజులు శివభక్తులైయుండిరి. శృతసేనుని పుత్రుడగు నాభాగుడు విష్ణుభక్తుడై యుండెను నాభాగుడు తండ్రియగు శృతసేనునియనంతరము ౨౯౪౦౦ సంవత్సరములు రాజ్యపాలనము చేసెను.

౮౧౨ నాభాగునిభార్య సదాచారము కలదియు శ్రీహరిని నెల్లప్పుడు పూజించునదియైయుండెను. ఒకప్పుడామె నిద్రించుచుండగా శ్రీహరి స్వప్నములో దర్శనమిచ్చి, యో శుభాంగి! నీవు దేనిఁగోరి నన్ను నిరంతరము సేవించుచుంటివో చెప్పుమనగా నాభాగునిభార్య భగవంతుని నిటులఁ బ్రార్థించెను ఓభగవానుడా! నీయందు భక్తిగల పుత్రుడు నాకుఁగలుగునట్లు చేయుమనికోరెను.

౮౩ భగవంతుడాలాగేనని చెప్పియామెకొకఫలము నిచ్చియంతర్ధానమొందగాఁబిదప శ్రీహరియిచ్చినఫలమును నామె సంతసముతో భక్షించెను.

౮౪ అనంతరము నాభాగుని భార్య గర్భవతియై కొలదికాలములో వంశాభివృద్ధికరుడు హరిభక్తుడు సదాచారుడునగు పుత్రునిఁగనెను వానికంబరీషుడని నామమిడిరి.

౮౫ నాభాగపుత్రుడైనయంబరీషుడు తండ్రియనంతరము పెద్దలచేఁ బట్టాభిషిక్తుడై రాజ్యమునుఁబాలించుచుఁనొకప్పుడు మంత్రులకు రాజ్యము నప్పగించి యుగ్రమైన తపమునుఁజేసెను.

౮౬౭ ప్రపంచస్వరూపుడును సర్వలోకవందితుడునగు శ్రీహరి, తన వాహనమగు గరుత్మంతుని నైరావతముగాఁజేసి తాను దేవేంద్రవేషమును ధరించి యైరావతము నెక్కియంబరీషు నొద్దకు వచ్చి, వానితోనిటులఁబల్కెను.

౮౮ ఓయంబరీషుడా! నేను దేవేంద్రుడను నీకు శుభముకలుగుగాక, నీయభీష్టమెద్దియో చెప్పుము, ఇచ్చెదననియె.

అంబరీషః ॥శ్లో॥ నాహంత్వా మభిసంధాయ।
తపఆస్థితవానహం। త్వయాద త్తంచనేచ్ఛామిగచ్ఛ శక్ర
యథాసుఖం॥ ౮౮౪

తతఃప్రహస్య భగవాన్స్వరూప మకరోద్ధరిః।
తమాహ భగవాన్విష్ణుః। కింతేహృదిచికీర్షితం॥ ౮౯౪

1అంబరీషః శ్లో॥త్వయివిష్ణా పరానందే।నిత్యం మేవర్తతాంమతిః
తథేత్యుక్త్వాసగోవిందః। చక్రందత్వారిపుక్షయే॥ ౯౦౪

అంతర్ధానంగతో విష్ణుః। వాజపేయాంశ్చకారసః ౯౧

గృహేగృహేహరిస్తస్థా। వేదఘోషోగృహేగృహే।
నామఘోషాహరేశ్చైవ। యజ్ఞఘోష స్తథైవచ॥ ౯౨
అభవన్నృపశార్దూలే। తస్మిన్రాజ్యం ప్రశాసతి॥ ౯౨౪

2 అంబరీషేణ భూపేన శతహీనం కృతం పదం
ఏకోనత్రింశ త్సాహస్రవర్షాణి త్రిశతానిచ॥ ౯౩౪
నాభాగేరంబరీషస్య భుజాభ్యాం పరిపాలితా।
బభూవ వసుధాత్యర్థం। తాపత్రయ వివర్జితా॥
అంబరీషకథాంయస్తుశృణుయాత్సహరింవ్రజేత్ ॥౯౪-౯౫

ఇత్యాశ్చర్యరామాయణే చతుర్థస్సర్గ స్సమాప్తః.

---

1.బ్రహ్మాండే. 2. భవిష్యే ప్రతిసర్గే 1అ అంబరీషపాలనకాలః29800 సం॥

౮౮ అంబరీషుడిట్లు బలికెను, ఓ దేవేంద్రా! నిన్నుద్దేశించి నేను తపము జేయుచున్న వాడను కాను, నీవిచ్చిన దానిని నేను స్వీకరింపను నేను శ్రీహరినుద్దేశించి తపము చేయుచుంటిని నీవు యథేష్టముగా బోవచ్చునని యె.

౮౯ అనంతరము దేవేంద్రవేషముతో బరీక్షార్థమై వచ్చిన శ్రీహరి, నిజరూపమును జూపి, ఓయంబరీషుడా! నీమనస్సులోని యభీష్టమును జెప్పుమనెను.

౯౦ అంబరీషుడు శ్రీహరితో నిట్లనెను, సచ్చిదానందరూపుడు సర్వవ్యాపకుడునగు నీయందు నామనస్సు నిత్యము లగ్నమై యుండుగాక యని కోరెను.

౯౧ అంబరీషుడు పైవిధముగ గోరగ శ్రీహరియు నవ్విధమువనే యగుగాకయని చెప్పి శత్రుసంహారముకొఱకు దనచక్రాయుధము నంబరీషునకిచ్చి యంతర్ధానము నొందెను, అనంతరమంబరీషుడు వాజపేయ యాగములననేకముగా జేసెను.

౯౨ ఆయంబరీషుడు రాజ్యమును బాలించుచుండగా బ్రతిగృహమునందును వేదఘోషము శ్రీహరిపూజయును హరినామ స్మరణమును యజ్ఞఘోషమును జరుగుచుండెను.

౯౩ అంబరీషమహారాజు తనతండ్రి కంటెనూఱు సంవత్సరములు తక్కువగ (అనగా ౨౯౩౦౦ సంవత్సరములు రాజ్యమును బాలించెను.

౯౪-౯౫ నాభాగపుత్రుడైన యంబరీషుని భుజములచేభూమి, మిక్కిలి తాపత్రయరహితముగ బరిపాలింపబడినది.

ఆశ్చర్యరామాయణమునచతుర్థసర్గము ముగిసెను.

## పంచమసర్గ ప్రారంభః

సింధుద్వీపస్సుత స్తస్య। నిత్యం ధర్మపరాయణః।
1 శతహీనం కృతం రాజ్యం। తేన రాజ్ఞాపి భూతలే॥ ౧

అయుతాయుస్సుత స్తస్య। పాలయామాస మేదినీం।
2 శతహీనం కృతం రాజ్యం। తేనాపి పృథివీతలే॥ ౨

ఋతుపర్ణస్సుత స్తస్య। పుణ్యానామా మహాయశాః।
దివ్యాక్ష హృదయజ్ఞో సౌ। రాజా నలసఖో బలీ॥
3 శతహీనం కృతం రాజ్యం। తేన రాజ్ఞాపి భూతలే॥ ౩౺

తదాత్మజ స్సర్వకామః। భువం పాలితవాం స్తతః।
4 శతహీనం కృతం రాజ్యం। తేన రాజ్ఞా మహీతలే॥ ౪౺

సుదాస స్తస్య తనయో। రాజాత్యింద్రసమోఽభవత్।
5 శతహీనం కృతం రాజ్యం। తేన రాజ్ఞాపి భూతలే॥ ౫౺

---

1. సింధుద్వీప పాలనకాలః 29200సం॥ ఇతిభవిష్యే
2. అయుతాయుపాలన కాలః 29100 సం॥
3. ఋతుపర్ణపాలనకాలః 29000
4. సర్వకామపాలనకాలః 28900 సం॥ 5 సుదాసపాలనకాలః28800.

పంచమసర్గప్రారంభము.

౧ అంబరీషునిపుత్రుడగు సింధుద్వీపుడు నిత్యము ధర్మతత్పరుడైయుం డెను ఆసింధుద్వీపుడును తండ్రికంటెనూఱుసంవత్సరములు తక్కువగా (అనగా ౨౯౨౦౦ సంవత్సరములు) భూమియందు రాజ్యపాలనముఁజేసెను.

౨ సింధుద్వీపునిపుత్రుడగు నయుతాయువు భూమినిఁదండ్రికంటె నూఱుసంవత్సరములు తక్కువగా (౨౯౧౦౦సం) పరిపాలించెను.

౩॥ అయుతాయువుకుమారుడగు ఋతుపర్ణుడు పవిత్రమైననామము గలవాడును మహాకీర్తిసంపన్నుడును పాచకలాడుటయందు నిపుణుడునునలమహారాజునకు స్నేహితుడైయుండి భూమియందు (౨౯౦౦౦)సంవత్సరములు) రాజ్యపాలనమునుఁజేసెను.

౪॥ పిదప ఋతుపర్ణుని పుత్రుడగు సర్వకాముడు భూమిపాలుడయ్యెను ఆసర్వకాముడును భూమియందు (౨౮౯౦౦సం) రాజ్యపాలనము చేసెను.

౫॥ సర్వకాముని పుత్రుడగు సుదాసుడనురాజు దేవేంద్రునితో సమానుడైయుండెను అతడును భూమియందుఁ దనతండ్రి కంటెనూఱు సంవత్సరములు తక్కువగా (౨౮౮౦౦సం) రాజ్యమునుఁబాలించెను.

* సుదాసస్య సుతః ప్రోక్తః। సౌదాసో నామ పార్థివః।
6 ఖ్యాతః కల్మాషపాదో వై। నామ్నా మిత్రసహశ్చ సః।
శతహీనం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే॥ ౬-౭

---

*వ్యా॥ సుదాసపుత్రస్య మిత్రసహ ఇతి కల్మాషపాద ఇతి నామాంతరాగమనకారణం విష్ణుపురాణే చతుర్థాంశే విస్తారేణ ప్రతిపాదితం॥ తథాహి,, సౌదాసో మిత్రసహో నామాట వ్యామటన్ వ్యాఘ్రద్వయముపశ్యత్, తాభ్యాంచ తద్వనమపగత మృగంకృతం మత్వాతయోరేకం బాణేన జఘాన మ్రియమాణశ్చాఽసావతిభీషణాకృతిరతికరాళవదనో రాక్షసోఽభూత్ ద్వితీయోపి ప్రతిక్రియాం తేకరిష్యామీత్యుక్త్వాంతర్ధానంజగామ, కాలేనగచ్ఛతా ససౌదాసో యజ్ఞం చకార పరినిష్ఠితయజ్ఞే చాచార్యే వసిష్ఠే నిష్క్రాంతే తద్రక్షో వసిష్ఠరూపమాస్థాయ యజ్ఞావసానే మమ మనుష్యమాంస

---

6 సౌదాస పాలనకాలః (౩౫౭౦౦ సం)

*౬౨ సుదాసునికుమారుడగు సౌదాసుడు తండ్రియనంతరము (౯౭౨౦౦) సం॥ రాజ్యపాలనము చేసెను ఆసౌదాసునకు మిత్రసహుండనియు కల్మాషపాదుడనియు నామాంతరములుకారణాంతరము చేఁగలిగినవి.

---

* సౌదాసునకు మిత్రసహుండనియుఁగల్మాషపాదుడనియు నామాంతరములు కలుగుటకుఁగారణము విష్ణుపురాణమునఁజతుర్థాంశమున విస్తారముగఁ జెప్పఁబడినది (ఏమన) సౌదాసుడొకానొకప్పుడు వనమునందు సంచరించుచుండగ రెండుపెద్దపులులు కన్పడెను. ఆరెండు పులులచే వనమంతయు నల్లకల్లోలమై చేయఁబడుచుండగ సౌదాసుడుచూచి యాపులలలో నొక పులిని బాణముచేఁగొట్టెను ఆపులియిట్లుకొట్టబడి భయంకరాకారముకల రాక్షసుడయ్యెను రెండవ పులియును, ఓరాజా! నీకుఁదగిన ప్రతిక్రియను నేనుజేసెదనని చెప్పి యంతర్ధానమొందెను సౌదాసుడు గృహమునకు వచ్చి కొంతకాలము గడచిన పిదప నొకయాగమునుఁజేసెను యజ్ఞపూర్తియయిన పిమ్మట కులగురువగువసిష్ఠుడు, స్వగృహమునకు వెళ్లగా నాయవకాశమునుఁజూచివనమునందు వ్యాఘ్రరూపముగానుండి ప్రతిక్రియఁజేయుమనని చెప్పిన రాక్షసుడు వసిష్ఠవేషముతో వచ్చిసౌదాసునితో నిటులఁజెప్పెను, ఓరాజా! యీగాంత్రమున నరమాంసభోజనము పురోహితునకుఁబెట్టవలయును కావున శీఘ్రముగ నరమాంసమునుఁబచనము చేయింపుము క్షణకాలములో వచ్చెదనని యావసిష్ఠవేషముతో వచ్చిన రాక్షసుడు చెప్పివెళ్లిపోయెను, తిరిగి యారక్కసుడు వంటవానివేషమును ధరించి, రాజునానతిచే నరమాంసమునుఁబచనము చేసి రాజునకు విన్నవింపగా, నాసౌదాసుడు పక్వమైన నరమాంసము హిరణ్యపాత్రమునందుంచి వసిష్ఠుని రాకకొరకు చూచుచుండగా నిజమైన వసిష్ఠుడువచ్చెను సౌదాసుడు నరమాంసమును బంగరుపళ్లెమునందుంచి భుజింపుమని వసిష్ఠుని ముందుంచగా, నవ్వసిష్ఠుడు, సౌదాసుని మక్కిలమునకు విచారించి క్రోధముచేగలుషమైన మనస్సుగలవాడై సౌదాసునకు శాపమిచ్చెను (ఏమన) సౌదాసుడా! నరమాంసము మావంటి మహాత్ములకు భుజింపఁదగనిదియుని యెఱిగియుండి

* వసిష్ఠస్తు మహాతేజాః క్షేత్రేశల్మాషపాదకే।
అశ్మకం జనయామాస ఇక్ష్వాకుకులవృద్ధయే॥ ౮
పితుస్తుల్యం కృతంరాజ్యం తేన రాజ్ఞాపిభూతలే॥ ౮౪

* వ్యా॥ భోజనం దేయమితి, తత్సంస్కృ౯ యత్తాంక్షణా దాగమిష్యామీత్యుక్త్వా నిష్కాంతః, భూయస్సూద వేషంకృత్వా రాజాజ్ఞయా మానుషమాంసం సంస్కృత్య రాజ్ఞేన్యవేద యత్, అసావపి హిరణ్యపాత్ర స్థితమాదాయ వసిష్ఠాగమన ప్రతీక్షో భవత్ ఆగతాయ వసిష్ఠాయనివేదితవాః, సచాప్య చింతయత్ అహోఽస్యరాజ్ఞో దాశ్శీల్యం యేనైతన్మాం సమస్మాకం ప్రయచ్ఛతీతి క్రోధకలుషీకృతచేతా రాజనిశ్శా ముత్ససర్జ॥ యస్మాదభోజ్యమేత దస్మద్విధానాంత పస్వి నామ వగచ్ఛన్నపి భవాన్మహ్యందదాతి తస్మాత్త్వైవాత్ర లోఽుపతా భవిష్యతీతి, అనంతరంచ తేనాపి భగవత్తైవాభి హితోఽస్మీత్యుక్తే కింకింమయైవాభిహితమితిపునరపి సమా ధౌతస్థా సమాధౌ విజ్ఞాతార్థశ్చానుగ్రహం తస్మైచకార నాత్యంతికమేతద్ద్వాదశాబ్దం తవభోజనం భవిష్యతీతి, అసావ పిప్రగృహ్యోద కాంజలిం మునిశాప ప్రదానాయోద్యతో, భగవన్నయమస్మద్గురుర్నార్హ స్యైనం కులదేవతా భూత మాచార్యం శప్తుమితి మదయంత్యా స్వపత్న్యా ప్రసాదితః సస్యాంబుదరక్షణార్థం తచ్ఛాపాంబు నోర్వ్యాం నచాకాశే చిక్షేప కింతు తేనైవ స్వపాదౌ సిషేచ తేనచక్రోధాగ్న్యా

*౨-౪ శా॥ వసిష్ఠమహర్షి యిక్ష్వాకు వంశాభివృద్ధికై కల్మాషపాదుని భార్యయందొకపుత్రునిఁ బుట్టించెను, వానికే యశ్మకుడనినామమై యున్నది,, ఆయశ్మకుడు (౨౦౦ సం॥) భూమిని పాలించెను.

---

యు, నాకునీవు నరమాంసమునుఁబెట్టితివికావున, మనుష్యమాంసమును భుజించెడి రాక్షసరూపము నీకుకలుగుగాకయని, (శపించెను) అనంతరము సౌదాసుడు వసిష్ఠునితో నిట్లనియె, గురువర్యా! నీవునరమాంసమునుఁ బచనము చేయింపుమని చెప్పియిట్లుశపించితివేమియన నవ్వసిష్ఠుడు తెల్లఁబోయి నేనేచెప్పితినా! యేమియాశ్చర్యమని ధ్యాననిష్ఠుడై చూడగా సర్వము సమాధియందు గోచరమయ్యె అప్పుడు సౌదాసున కిచ్చిన శాపము పండ్రెండు సంవత్సరములకాలము మాత్రముండుగాక యని చెప్పెను.

వ్యా॥ అప్పుడు సౌదాసుడును దోసిలియందు జలమునుంచుకొని వసిష్ఠమహర్షిని శపించుటకు నుద్యమింపగా నాథా! కులగురువగు వసిష్ఠుని శపించుట తగదని సౌదాసుని భార్యయగు మదయంతీదేవి సామవచనములతోఁదనభర్తనుశాంతింపఁజేయ నాసౌదాసుడు దోసిలియందలి శాపోదకమునుఁబైభాగమునవిడిచిన మేఘములకు నాశము కలిగి వర్షము లేక క్షామముకలుగుననియు భూమియందు విడిచిన సస్యముల

అశ్మకస్యాంశో యస్తు మూలక స్తత్సుతో భవత్
సహి రామభయా ద్రాజా స్త్రీభిఃపరివృతో ఉవసత్ ॥౯

వివస్త్రి స్త్రాణి మన్విచ్ఛ న్నారీకవచ ఈశ్వరః
1 ꞉తు స్త్వల్యం కృతం రాజ్యం। తేన రాజ్ఞాపి భూతలే॥

తత్కాలే రావణే రాజ్యంలంకాయాంపాలయన్నభూత్
సనత్కుమారో భగవా నాగతో రావణాంతికం॥ ౧౦

శ్రీ తేన శాపంబునాదగ్ధచ్ఛాయా తత్పాదా కల్మాషతాము
పగతౌ తతస్సకల్మాషపాదసంజ్ఞా మవాప సౌదాసపుత్రస్య
వసిష్ఠజన్యత్వే అశ్మకనామా గమనేచ హేతు స్తత్రైవోక్తః
తథాహి సౌదాసః వసిష్ఠశాపాచ్చ రాక్షస స్వభావ
ముపేత్యాటవ్యాం పర్యటన్ అనేకశో మానుషా నభ
క్షయత్ ఏకదాతు కంచిన్మునిమృతుకాలే భార్యా
సంగతం దదర్శ, తయోశ్చ తమతిభీషణం రాక్షసరూప
మవేక్ష్యత్రాసాద్ధంపత్యోః ప్రధావితయోర్బ్రాహ్మణంస
జగ్రాహ తతస్సాబ్రాహ్మణీ బహుశ స్తమభియాచితవతీ,
ప్రసీదేక్ష్వాకు కులతిలకభూత స్త్వం మహారాజో మిత్రసహో
నామ రాక్షసః నార్హసి స్త్రీధర్మసుఖాభిజ్ఞో మయ్యకృతార్థా
యామిమం మద్భర్తారం హంతుమిత్యేవం బహుప్రకారం

1 మూలకరాజ్యకాలః 2,700. ఇతిభవిష్యే అశ్మకజః హరివర్మేతి భవిష్యే వర్తతే మూలకస్యైవ నామాంతరం తదపీత్యనుసంధేయం.

౮౪-౯ అశ్మకుని యనంతరము తత్పుత్రుడగు మూలకుడనువాడు రాజ్యము నుఁబాలించుచుండగాఁబరశురాముడు క్షత్రియులనువధించుచు మూలకునిఁగూడవధించుటకు రాగాఁబరశురాముని భయముచే వస్త్రవిహీనుడై స్త్రీలుధరించు రవికను చీరెను ధరించి స్త్రీలచేఁజుట్టుకొనబడి ప్రాణరక్షణము చేసికొనిన కారణముచే మూలకునకు నారీకవచుడని నామాంతరము కలిగెను,. అతనిపరిపాలన కాలము. (౨౭౦౦౦సం)

౧౦ ఆసమయమున రావణుడు లంకా రాజ్యము చేయుచుండెను సనత్కుమారుడొకప్పుడు రావణునియొద్దకు వచ్చెను.

---

కు (పైరులకు) నష్టము కలుగుననియుఁ దలచి యామంత్రించిన శాపోదకమునుఁదనపాదములయందే విడిచికొనెను, కోపాగ్నిచేదగ్ధమైన యాజలము పాదములయందు పడుటచేఁబాదములు కల్మషమయ్యెను (కమలిపోయెను) ఆకారణముచే సౌదాసునకుఁగల్మాషపాదుడని నామము కలిగెను (అనగా కమలినపాదములుకలవాడని భావము) మిత్రభావముతో వసిష్ఠుని శపింపవద్దనిభార్యబోధించగా తన భార్యవాక్యమును విని సహించి యూఱకున్నవాడుగాన మిత్రసహుడనియుఁబ్రసిద్ధిఁజెందెను.

* వసిష్ఠమహర్షి వలన అశ్మకుడు పుట్టుటకుఁగారణము విష్ణుపురాణమునఁజతుర్థాంశమునఁజెప్పబడినది,, వసిష్ఠశాపము వలన సౌదాసుడు రాక్షసుడై యరణ్యమున సంచరించుచు మనుష్యులననేకముగా భక్షించుచుండెను ఒకప్పుడు భార్యతోఁగలసి యున్నయొకమునినిఁజూచెను, ఆమునిదంపతులు రాక్షసునిఁజూచి భయపడిపాఱిపోవుచుండగా నామునిని బట్టుకొనెను అనంతరము మునిభార్య యనేకవిధములుగ రాక్షసుని ప్రార్థించెను ఓ రాక్షసుడా! నీవు పూర్వము సౌదాసుడను మహారాజువు రాక్షసుడవుకావు వసిష్ఠశాపముచే నిటుల

పూజయిత్వా ఽర్ఘ్యపాద్యాద్యై స్తంమునిం రాక్షసేశ్వరః
ప్రపచ్ఛ ముక్తికామ స్సన్నేకాంతే తాపసేశ్వరం॥ ౧౧
మహర్షే మమ కస్మాద్వైమృతిస్స్యాద్వద మేఽనఘ॥౧౧౪

శ్లో॥ ఇక్ష్వాకువంశే భవితా రాజా దశరథాహ్వయః।
తత్పుత్రాన్మృతిరాదిష్టేత్యుక్త్వాఽగాత్తాపసేశ్వరః॥ ౧౨౪

---

తస్యాం విలపంత్యాం వ్యాఘ్రః పశుమివారణ్యేభిమతంతం బ్రాహ్మణమభక్షయత్ తతశ్చాతికోపసమన్వితా బ్రాహ్మణీరాజానం శశాప యస్మాదేవం మయ్యతృప్తాయాంత్వయా యంమత్పతిర్భక్షితః తస్మాత్త్వమపికామోపభోగప్రవృత్తో మృతింప్రాప్స్యసీతి, శప్త్వాచైవంసాఽగ్నింవివేశతతస్తస్య ద్వాదశాబ్దానంతరం విముక్తశాపస్య స్త్రీవిషయాభిలాషిణో మదయంతీ తం స్మారయామాస తతః పరమసౌ స్త్రీభోగం త్యాజ వసిష్ఠశ్చా పుత్రేణరాజ్ఞా పుత్రార్థ మభ్యర్థితః మద

౧౧ అప్పుడు రావణుడర్ఘ్యపాద్యములచే సనత్కుమారునిఁబూజించితనకు మరణమెవరివలననో తెలిసికొనఁగోరిమహర్షిని క్రిందవిధముగఁనడిగెను.

౧౧౹ ఓసనత్కుమారమహామునీ! నాకునెవరివలన మరణముకలుగునో ఓ పాపరహితుడా? విచారించిచెప్పుమని రావణుడడిగెను.

౧౨౹ సనత్కుమారమహామునియిట్లుఁజెప్పెను (ఏమన) ఓరావణుడా ఇక్ష్వాకువంశమున దశరథుడను పేరుగలరాజు పుట్టును అతనికుమారునివలన నీకుమరణము నిశ్చితమై యున్నదనిచెప్పి సనత్కుమారుడు వెళ్లెను.

---

రాక్షస రూపమును ధరించినవాడవు నేను కృతార్థురాలను కాకుండగ నీవునాభర్తనుఁజంపుట న్యాయ్యము కాదని బహువిధములుగ నామునిపత్ని విలపించుచున్నను పెద్దపులి పశువులను భక్షించినవిధముగ మునిని భక్షించెను. అనంతరము మునిపత్ని మిక్కిలి కోపముకలదియై రాక్షసరూపముతో నున్నసౌదాసుని శపించెను (ఏమన) నేను సంసారతృప్తినొందనిదాననైయుండ, నా భర్తను నీవు భక్షించిన కారణమున నీవును నీశాపాంతమునఁగామోపభోగముకొఱకు భార్యనుఁ గలసినచో మృతినొందఁగలవని శపించి యామునిపత్ని యగ్నిలోఁ బ్రవేశించెను, అనంతరము వసిష్ఠుని వాక్యము చొప్పునఁ బండ్రెండు సంవత్సరములు సౌదాసుడు రాక్షస రూపముతో నుండి పిదప శాపవిముక్తుడై రాజై తిరిగి తనపట్టణమునుఁ బ్రవేశించెను కానిమునిపత్ని శాపమునఁ దనభార్యయైన మదయంతినిఁ గలసికొనుటకు వలను

ఇక్ష్వాకువంశే తన్నామా జాతో వేతి విచారయన్
భియాయుతో రాక్షసేశ స్తిష్ఠతాం స్తదనంతరం॥ ౧౩౪

1 మూలకస్యాత్మజో జాతః। నామ్నా దశరథ స్తతః
పితు స్తుల్యం కృతం రాజ్యం తేన రాజ్ఞాపి భూతలే॥౧౪౫

తస్మా ద్దశరథా జ్జజ్ఞే నామ్నా త్విలబిల స్త్వితి॥ ౧౫౬
నామ్నా త్విలబిలం పుత్రం జాతం దశరథస్య తు

జ్ఞాత్వాగత్య పరీక్ష్యా థ రావణో వీతభీ రభూత్॥ ౧౬

2 పితు స్తుల్యం కృతం రాజ్యం తేనరాజ్ఞామహీతలే॥ ౧౬౫
3 పితు స్తుల్యం కృతం రాజ్యం రాజ్ఞా విశ్వసహేన చ॥౧౭

---

యంత్వా సంగతః. యదాచస స్తవషాణ్యాసౌ గర్భః నజజ్ఞే
తత స్తం గర్భమశ్మనా సాదేవీ జఘాన పుత్రశ్చా జాయత
తస్య చాశ్మక ఇత్యేవనామాభవత్॥
(అశ్మకపాలన కాలః ౨౮౭౦౦సం॥) ఇతిభవిష్యే.

---

1 మూలక పుత్రస్య శతరథఇతి నామ వాయ్వాదిపురాణేషు దృశ్యతేతథాపి నామాంతర మిత్యూహ్యం॥
దశరథపాలనకాలః (28700 సం॥)ఇతి భవిష్యే
2 ఇలబిలస్యాపి పాలనకాలః (28700) ఇతిభవిష్యే.
3 విశ్వసహపాలనకాలః (28700 సం॥)

౧౩౪-౧౪౪ అనంతరము రావణుడు, ఇక్ష్వాకువంశమున దశరథుడను పేరుకల రాజుపుట్టెనా, యని విచారించుచు భయముతోనే యుండెను. ఇట్లుండగా నా యిక్ష్వాకువంశీయుడగు మూలకుడను రాజునకు కుమారుడు పుట్టెను వానికిదశరథుడని పేరు పెట్టిరి' ఆ దశరథుడు తండ్రియనంతరము తండ్రియగు మూలకుడు పరిపాలించినంత కాలము (అనగా ౨౮౦౦సం) రాజ్యమునుం బరిపాలించెను.

౧౫ ఆ దశరథునకు, ఇలబిలుడను నొకకొమరుడుకలిగెను.

౧౬ దశరథునకు, ఇలబిలుడను పుత్రుడొకడు పుట్టినట్లు రావణుడువిని సనత్కుమారుడు చెప్పిన దశరథుడితడేయనియు నతనిపుత్రుడే తనకు మారకుడనియు భ్రమపడి,భీతిచేదశరథపుత్రుని బరీక్షించుటకు వచ్చి యాబాలుడుసామాన్యుడుగానున్నందునవానిం జంప సమర్థుడు కాడని తలచి, నిర్భయముగా లంకకేగెను.

౧౬౪ ఆయిలబిలుడు నతనతండ్రి పరిపాలించినంతకాలము (౨౮౦౦సం) రాజ్యమునుంబాలించెను.

౧౮ ఆయిలబిలుని కుమారుడు విశ్వసహుడును తండ్రిపాలించినంతకాలమే (౨౮౦౦సం) రాజ్యమునుం బరిపాలించెను.

---

పడక స్త్రీభోగమును విడిచెను తనకు వంశాంకురమగు నటులదన భార్య యందు సంతానముకలిగించవలసినదిగా వసిష్ఠుని బ్రార్థింపగా వసిష్ఠుడు మదయంతినిం గలసెను. మదయంతిగర్భవతియై యుండి యేడు సంవత్సరములు పర్యంతము శిసువు బయటంబడనందున మదయంతి రాతితోదనగర్భముమగొట్టుకొనగాంబుత్రుడుపుట్టెను(అనగా బయటపడెను)అశ్మముచే (రాతిచే)గొట్టబడగాబుట్టినవాడుగానఅశ్మకుడని వానికినామమయ్యె, అతడును తండ్రి పాలించినంతకాలము పాలించెను (౨౮౦౦సం)

రాజ్యం దశసహస్రం తన్నియజ్ఞో పాలయన్నృపః॥ ౧౭

తదధర్మప్రతాపేన హ్యనావృష్టి స్తదా భవత్
శతవర్ష మనావృష్టి స్సర్వరాజ్యమనాశయత్॥ ౧౮
4 యజ్ఞం వై కారయామాస రాజ్ఞ్యై సంచోదితో గురుః
యజ్ఞాత్ఖట్వాంగ ఉత్పన్నః ఖట్వాంగశ్శత్రుముద్వహః ॥౧౯

ఇంద్రసాహాయ్య మగమత్ రాజ్యం త్రింశత్సహస్రకం
కృత్వాత్రవరంలబ్ధ్వా దేవేభ్యోముక్తతాంగతః॥ ౨౦

ఖట్వాంగా ద్దీర్ఘబాహు శ్చ రాజ్యం వింశత్సహస్రకం
కృత్వా మహీతలే పశ్చా త్స్వర్గలోక మవాప సః॥ ౨౧
ఖట్వాంగో దీర్ఘబాహు శ్చ వైష్ణవౌ పరికీర్తితౌ॥ ౨౨
తస్మా త్సుదర్శనో జాతః దేవీపూజనతత్పరః
మహోదారో మహాప్రాజ్ఞః కాశీరాజసుతాం నృపః॥ ౨౩
పరిణీయ నృపా న్జిత్వా దేవీసేవాప్రసాదతః
రాజ్యం భరతఖండాంత మదధ ద్ధర్మతో నృపః॥ ౨౪
వర్షపంచసహస్రాణి రాజ్యం చక్రే స భూపతిః
స్వప్నమధ్యేవచః ప్రోక్తం మహాకాళ్యా నృపాయవై॥ ౨౫

---

4 భవిష్యే

౧౭॥ విశ్వసహుని కుమారుడగు నియజ్ఞుడు పదివేల సంవత్సరములు రాజ్యమును బాలించెను, ఆనియజ్ఞుడు ప్రకృతి బద్ధుడై జ్ఞానహీనుడైనరాజై యుండెను.

౧౮॥ ఆనిజయజ్ఞునియాధర్మ ప్రభావముచే నాదేశమునందనావృష్టిదోషము సంభవించెను నూఱుసంవత్సరముల పర్యంతము వర్షము సరిగాకురియక పోవుటవలన రాజ్యమంతయు నష్టప్రాయమయ్యెను.

౧౯॥-౨౦॥ నియజ్ఞని భార్య సిద్ధుని ప్రార్థింపగ నవ్వసిద్ధుడు రాణి ప్రార్థన ననుసరించి నియజ్ఞునిచే యాగమునుజేయించెను, ఆ యజ్ఞము వలన ఖట్వాంగుడు పుట్టెను ఆఖట్వాంగుడు నియజ్ఞునియనంతరము పట్టాభిషిక్తుడై యిప్పదివేల సంవత్సరములు రాజ్యమును బాలించెను ఇంద్రునకు సహాయుడుగా నొకపుడు ఖట్వాంగుడు శస్త్రధారియై స్వర్గమునకేగి దేవతలవలన వరములనొంది తనకు మరణమెప్పుడుకలుగునని యింద్రుని నడుగగా ముహూర్తమాత్రమే యాయువని మహేంద్రుడు చెప్పగా భూలోకమునకువచ్చి సన్యసించి బ్రహ్మసత్యము జగత్తు మిథ్యాయని గ్రహించిముక్తుడయ్యెను.

౨౧॥ ఖట్వాంగుని వలన దీర్ఘబాహుడు జన్మించి యతడు తండ్రియనంతరము, ఇరువదివేలసంవత్సరములు భూమియందు రాజ్యమునుజేసి పిదప స్వర్గస్థుడయ్యెను!

౨౨ ఖట్వాంగుడును దీర్ఘబాహుడును విష్ణుభక్తిగలవారని చెప్పబడుదురు.

౨౩-౨౪ దీర్ఘబాహుని పుత్రుడు సూర్యుడు దేవీపూజాపరుడును గొప్పయాచార్యవంతుడును మహాప్రాజ్ఞుడై యుండెను అతడు కాశీరాజపుత్రికను వివాహమాడి యిష్టదేవతానుగ్రహముచే రాజులనుజయించి భరతఖండాంతమగు భూమి నంతను ధర్మముగా బాలించెను.

౨౫ అతడు (౫౦౦౦సం) రాజ్యమును పాలించిన పిదప నొకదినమున రాత్రిభాగమున నిద్రించుచుండ కాళికాదేవి యిట్లుచెప్పెను.

వత్స త్వం ప్రియయా సార్ధం వసిష్ఠాదిభి రన్వితః
హిమాలయగిరిం ప్రాప్య వాసం కురు మహామతే। ౨౬

మహావాయుప్రభావేణ క్షయో భరతఖండకే
భవే ద్భవా న్తత స్తత్ర జీవితో భవతా న్నృప॥ ౨౭
తథేతి మత్వా సనృపః పర్వతం వై హిమాలయం।
ప్రాప్తవా న్ముఖ్యభూపైస్తు ముఖ్యైర్వైశ్యై ర్ద్విజై స్సహ॥ ౨౮
తతః క్రమా జ్జలం జాతా వర్షాధిక్యా ద్వసుంధరా।
బహుజీవా వినష్టా శ్చ దశవర్షాంతరే పునః॥ ౨౯
తతః పశ్చాత్ స్థలీభూతా మహీ సర్వత్ర దృశ్యతే। ౨౯½

1 వైశాఖశుక్లపక్షే తు । తృతీయాయాం గురువాసరే ।
సుదర్శనో జనై స్సార్ధ మయోధ్యా మగమత్పునః॥ 30½
మాయాదేవీప్రభావేణ పురం సర్వం మనోహరం ।
మహావృద్ధియుతం ప్రాప్తం బహ్వాన్నం సర్వరత్నకం॥ 31½
దశవర్షసహస్రాణి రాజ్యం కృత్వా సుదర్శనః।
ప్రాప్తవా న్శాశ్వతం లోకం దిలీప స్తత్సుతోఽభవత్॥ 32½
2 దిలీపే సతి భూపాలే రావణప్రేషితాసురాః
సమాగత్య చ యుద్ధ్వా చ తేన రాజ్ఞా పరాజితాః।
ప్రాప్యలంకాం దశాస్యాయ సర్వం తే ప్రాబ్రువం స్తతః॥ 33-34

1 భవిష్యే ప్రతిసర్గపర్వణి 1 అధ్యాయే.

2 భరద్వాజ రామాయణే.

౨౬ ఓవత్సా! నీవు నీభార్యాపుత్రాములతోడను వసిస్థామలతోడను పుర మునుండి వెడలి హిమవత్పర్వతమునఁగొంతకాలము నివసింపుమని చెప్పెను.

౨౭_౨౮ మహావాయువువీచి భరతఖండమున జనము నశించును కావననీవువెళ్లి హిమవత్పర్వతమునందుండి జీవింపుమని కాళికాదేవి చెప్పిన ప్రకా రము సుదర్శనుడు తనముఖ్యులగు దారాపుత్రాది పరివారముతో డను, ముఖ్యులగుబ్రహ్మక్షత్రియ వైశ్యులతోడను హిమవత్పర్వ తమునకేగెను.

౨౯ పిమ్మట క్రమముగా వాయువుతో కూడినవర్ష మధికముగాకుఱియు టచే భూమియంతయు జలప్రాయమయ్యె జీవకోటికి విశేషముగ నష్టమువాటిల్లెను ఇట్లుపదిసంవత్సరములవరకుండెను.

౨౯4 పిమ్మట జలప్రాయమైన భూమియంతయు మెట్టప్రదేశముగా నయ్యెను.

304 వైశాఖశుద్ధతదియ గురువారమున సుదర్శనుడు తన పరివారములో బయలు వెడలియయోధ్యకేగెను.

3౧4 కాళికాదేవిప్రభావముచే, తనరాజధానియగు నయోధ్యాపట్టణము ప్రలయమున కూడనశింపక మనోహరమై యుండెను మఱియు ధనకనక వస్తువాహనసమృద్ధితో నుండెను.

3౨4 ఇట్టిపట్టణమున సుదర్శనుడుతిరిగి పదివేలసంవత్సరములు రాజ్యము పాలించి సద్గతినొందెను అతనికుమారుడు దిలీపుడై యుండెను.

33_3౪ దిలీపుడు తండ్రియనంతరము రాజ్యమును పరిపాలించుచుండగ రావణుడు తనరాక్షసులను దిలీపుని మీదకి యుద్ధముఁజేసిరండని పంపగా వారువచ్చి దిలీపునితో యుద్ధముచేసి పరాజితులైలంకా పురికేగి, జరిగినవృత్తాంతమును రావణునకెఱిగించిరి.

1 రావణ స్తద్బలం జ్ఞాతుం। ద్విజవేషధర స్తతః
దిలీపాంతఃపురం సర్వై ర్ద్విజై స్సాకం సమావిశత్॥ ౩౫

సమభ్యర్చ్య తదా విప్రా న్దిలీపే సరయూగతే
సుదక్షిణాఽర్ఘ్య హస్తా గాద్ద్విజరూపం దశాననం॥ ౩౬

తస్యై సందర్శయామాస రావణస్తు నిజంవపుః
అంతః పలాయితా సా భూ ద్దృష్ట్వాతంభీతమానసా॥ ౩౭
పున ర్బాడబరూప స్సన్రావణ స్సరయూం గతః
ద్విజపూజాకరం తత్ర। దిలీపం తు దదర్శ సః॥ ౩౮
దిలీపస్తు తదా తత్ర మధ్యేత్యక్త్వా ద్విజార్చనం
పూర్ధ్వ ముత్క్షేపయామాస తండులానభిమంత్ర్య సః॥ ౩౯
ఏవం కృతం త్వయా భూప కిమర్థమితి బాడబైః
పరిపృష్టో దిలీపస్తు కథయామాస తా న్ప్రతి॥ ౪౦
వనే ఽద్య గో హర్తుకామం సింహం తం హంతు
కాముకః। తండులా నభిమంత్ర్యా ఽహ మూర్ధ్వ ము
త్క్షిప్త వాన్ ద్విజాః ॥ ౪౧
సింహో మృతో ఽద్యపశ్యంతుభవంత స్త్విత్యువాచ నః
ద్విజవేషదశాస్య స్తు నృపశక్తిం పరీక్షితుం
వనం గత్వా తత్రమృతం।మృగేంద్రంసందదర్శ సః॥ ౪౨-౪

1 భరద్వాజ రామాయణే తులసీదాసరామాయణేచ కథాభాగః.

౩౫ పిమ్మట రావణాసురుడు దిలీపునిబలమును పరీక్షించుటకు బ్రాహ్మణవేషమును ధరించి యయోధ్యకేతెంచి బ్రాహ్మణులతోఁగూడదిలీపుని యంతఃపురమునుఁ బ్రవేశించెను.

౩౬ దిలీపమహారాజు సరయూనదికి స్నానార్థమైవెళ్లియున్నందున సుదక్షిణాదేవి వచ్చినబ్రాహ్మణులనుఁ బూజించి పూజాద్రవ్యమును హస్తమునందుంచుకొని, బ్రాహ్మణవేషమును ధరించియున్నరావణునిఁబూజించుటకు వానిసమీపమునకు వచ్చెను.

౩౭ రావణుడప్పుడామెకు నిజరూపమునుఁజూపింపఁగ నాసుదక్షిణాదేవి యారాక్షసునిఁజూచిభయపడి యంతఃపురమునుఁజొచ్చెను.

౩౮ ఆరావణుడు తిరిగి బ్రాహ్మణరూపమును ధరించి సరయూనదికివచ్చి యచ్చట బ్రాహ్మణపూజఁజేయుచున్నదిలీపునిఁజూచెను.

౩౯ అప్పుడతడు మధ్యలో బ్రాహ్మణపూజను జాలించియతడు తండులములను (బియ్యమును) మంత్రించి పైభాగమునఁజల్లెను.

౪౦ అక్కడనున్నబ్రాహ్మణులు, తండులములను దిలీపుడుపైకిజల్లుటకుఁ గారణమునడుగఁగా నాదిలీపుడు వారలతోఁగ్రిందివిధముగఁజెప్పెను.

౪౧ ఓబ్రాహ్మణులారా! ఇప్పుడు సమీపారణ్యములో నొకసింహము గోవునుఁజంపుటకుయత్నించుచున్నది గోహంతకమగునా సింహమునుఁజంపదలచి నేను తండులములనభిమంత్రించి పైకిచల్లితినని నెను.

౪౨-౪ బ్రాహ్మణులారా! సింహము చచ్చియుండును మీరిపుడు వెళ్లిపరీక్షింపుడని దిలీపుడుపలుకఁగానచ్చట బ్రాహ్మణవేషముతోనున్నరావణుడు దిలీపునిశక్తినిఁబరీక్షించుటకు వనమునకేగి యచ్చట మృతినొందియున్నసింహమునుఁజూచెను.

దిలీపమంత్రిశక్తి స్తద్భుజశక్తి శ్చ భీతిమా
తురం జగామ స్వపురీం। రావణో లోకరావణః॥ ౪౩

దిలీపోపి గృహం గత్వా। శ్రుత్వా జాయాముఖాత్పునః
రావణస్యతు ద్వారాత్మ్యం కుపితోఽభూ ల్లయాగ్నివత్ ॥౪౪

స్వాంజలా వుదకం న్యస్య । జపిత్వాఽరిహారం మనుం ।
ఉదబిందూ న్నృత్యువాచ దిలీప స్స్వాంజలిస్థితా ॥౪౫

యూయంశరా స్స్వయంభూత్వా లంకామేత్య చతత్పురీం
రావణేన సమం వార్ధౌ నిమగ్నాం కురుత ద్రుతం॥౪౬

ఇత్యుక్త్వా స్వాంజలిగతం జలందక్షిణతోఽత్యజత్ ॥ ౪౭

తదుత్తిష్ఠా శ్శరా భూత్వా క్షణేనో దకబిందవః
గత్వాలంకాపురీం సర్వాంకంపయామాసు రద్భుతం॥౪౮

ఆకస్మికం భూమికంపం దృష్ట్వా సర్వేఽసురా స్తదా।
నిరాశా జీవితే స్వస్మిన్ స్థితా స్తేఽజ్ఞాతహేతుకాః॥ ౪౯

తదా మండోదరీ జ్ఞాత్వా ప్రాతివ్రత్యప్రభావతః।
ఉత్పాతహేతుం స్వపతేర్దోషం ప్రాంజలి రబ్రవీత్ ॥ ౫౦

దిలీపభూపతే! భృత్యా స్తవ సర్వే వయం ప్రభో ।
అజ్ఞానాద్యత్కృతంభర్త్రా మమ సర్వంక్షమస్వతత్ ॥౫౧

౪౩ దిలీపుని మంత్రశక్తికిని తమ్ముజశక్తికిని రావణుడు భీతిజెందిశీఘ్రము గదనపురమును(గూర్చివెళ్లెను.

౪౪ దిలీపుడును సరయూనదినుండి తనగృహామునకువచ్చి భార్యవలన రావణుని దుర్మార్గమును విని ప్రళయాగ్నివలె కోపాతిశయముకల వాడయ్యెను.

౪౫ దిలీపుడు జలమునుమంత్రించి శత్రుమారకమగు మంత్రమును జపించుచు(దనచేతిలోని జలబిందువులతో నిర్విఘ్నము(జెప్పెను.

౪౬-౪౭ ఓయుదకబిందువులారా! మీరుబాణరూపముకలవారై లంకకేగి రావణసహితముగలంకాపురిని సముద్రములో ముంచిరండనియభి మంత్రించినజలమును దక్షిణముగా విడిచిపెట్టెను.

౪౮ దిలీపునిచే నిర్విఘ్నముగ వదలిపెట్ట(బడిన యుదకబిందువులు .బాణ రూపకములై ( వాయువ్యాస్త్రరూపకములై) లంకాపట్టణమును గంపించివేసెను

౪౯ ఆకస్మికముగా( గలిగిన భూకంపము(జూచి రాక్షసులందఱు కారణము తెలియనివారై తమ జీవితములందు నిరాశ( జెందిరి

౫౦ అప్పుడు మండోదరి తనపాతివ్రత్యప్రభావముచే తనభర్తృదోషముచే నిట్టిమహోత్పాతము సంభవించినదియని తెలిసికొని చేతులు(జోడించి దిలీపుని (ప్రార్థించెను)

౫౧ దిలీప మహారాజా! మేమందరము నీభృత్యులము, తెలియక నాభర్త చేసినయపరాధమును క్షమించుము"

త్వదన్యో రక్షకో నాస్తి రక్ష మాం శరణార్థినీం
యథా పురీయం నశ్యేన్న తథా కురు దయాం విభో॥ ౧౨

ఇతి మండోదరీదేవ్యా దీనయా ప్రార్థితో విభుః
దిలీపోపి కృపావిష్టశ్చోపసంహృతవాన్ స్వరాన్॥ ౧౩

దిలీపాద్యసురాధీశో రామావధి విరోధకృత్ ।
క్రమాత్పూర్వైః పరాభూతో బభూవ ధరణీతలే॥ ౧౪

మగధాధిపతేః పుత్ర్యా లోకోత్తరసురూపయా ।
సుదక్షిణాఖ్యయా రాజ్ఞ్యా సహసౌఖ్యాన్వితోఽభవత్॥ ౧౫
తథాప్యసంతతీ రాజా సభార్యస్త్వేకదా గురోః
సమీపం ప్రాప్య తం నత్వా వసిష్ఠమిదమబ్రవీత్॥ ౧౬

మత్యంగతేమయి బ్రహ్మన్ రాజ్యం కస్య భవేద్వద ।
కేన దోషేణ మే పుత్రో జాయతే న తపోనిధే॥ ౧౭

వసిష్ఠః॥ త్వంపురా రాజశార్దూల సంసేవ్య సురనాయకం।
స్నాతామిమాంవధూంస్మృత్వా చలితో నిజమందిరం॥ ౧౮
ఆసీత్సురతరోర్మూలే కామధేనుః స్థితా పథి
ప్రదక్షిణనమస్కారమకుర్వాం స్త్వం సమాగతః॥ ౧౯

సా శపత్త్వామతిక్రోధాపుత్రో నోత్పత్స్యతే తవ ।
మమసంతానశుశ్రూషాం యావత్త్వం న కరిష్యసి॥ ౨౦

౫౨ నీకంటె వేఱురక్షకుడు మాకు లేడు. శరణని ప్రార్థించుచున్న నన్ను రక్షింపుము ఈపట్టణము నశింపకుండులాగున దయారసమును జూపుము

౫౩ ఇవ్విధముగాఁ బ్రార్థించుచున్న మందోదరి దీనవాక్యములచే దిలీపుడు కృపగలిగినవాడై బాణములను సంహరించెను.

౫౪ దిలీపుని మొదలుకొని రామునివఱకు తమ పూర్వరాజులతో నివ్విధముగ రావణుడు కలహించి పరాభూతుడగునని పరమేశ్వరుడు పార్వతితోఁ జెప్పెను.

౫౫ దిలీపమహారాజు, లోకోత్తరసౌందర్యవతియును. మగధరాజపుత్త్రికయగు సుదక్షిణాదేవితో సకలసౌఖ్యములు కలవాడైయుండెను.

౫౬ కాని సంతానములేని హేతువుచే నొకప్పుడు సుదక్షిణాదేవితోఁ గూడ దిలీపుడు గురువగు, వసిష్ఠునొద్దకు వచ్చి యిట్లనుగఁ బలికెను.

౫౭ ఓగురువర్యా! నేమృతినొందిన పిమ్మట నా రాజ్యమెవరికి సంక్రమించునో, నే నేదోషము చేయుటచే సంతానము నాకు కలుగకపోయెనో యనుగ్రహించి చెప్పవలె నని ప్రార్థించెను.

౫౮ వసిష్ఠుడిట్లు చెప్పఁబోడగెను, ఓదిలీపమహారాజా! నీవు స్వర్గమునకు వెళ్లిదేవేంద్రుని సేవించి స్వగృహమున సభార్య ఋతుస్నాతయైన సంగతిని స్మరించి నిజపురమునకు బయలువెడలితివి.

౫౯ స్వర్గమునుండి బయలుదేరి వచ్చుచుండ తత్సమీపమున మార్గములో కల్పవృక్షము యొక్క మొదటియందు, కామధేనువు కన్పడినను దానికి నమస్కారమును జేయకుండగ వచ్చితివి.

౬౦ కామధేనువు, నీవు తనను నమస్కరింపకుండగ వచ్చుటకు కోపమొంది నా సంతతిలో చేరిన ధేనువునకుఁ దెంగి శుశ్రూష చేయుపర్యంతము నీకు సంతానము కలుగకుండుఁగాక యని శపించెను.

తస్యా స్సుతాసుతాం ధేనుం నందినీం ససుతాం మమ।
ఆరాధయా నయా వధ్వా సాచ తేదాస్య తేసుతం॥ ౬౧

ఏవ ముక్తో నృప స్తేన పత్న్యా సహ వినిర్గతః
సవత్సాం నందినీం భక్త్యా పూజయం స్తామనుస్మృతః॥ ౬౨

సా త్వరణ్యం గతా సోపి సభార్యోనుజగామ చ।
ఏకాధికా వ్యతీయాయ దినానాం చైకవింశతిః॥ ౬౩

అలక్షితాగమ స్సింహో బలా జ్జగ్రాహ నందినీం।బాణ
ముధృత్యతూణీరాత్సింహంహంతుంనృపోఽయతత్ ॥౬౪
స్తంభీకృతభుజో రాజా త్వభూత్సింహ ప్రభావతః॥ ౬౫

సింహః॥శ్లో॥దిలీపం త్వాంమహారాజం జానామిరవివంశజం.
దైవేన కల్పితా మేఽద్య జఘ్ధ్యర్థం నందినీత్వియం॥ ౬౬
రాజా॥శ్లో॥వసిష్ఠో బ్రహ్మణఃపుత్రో గురుర్మే నందినీత్వియం
తేనదత్తాఽరాధ యితుం తస్మాద్ధేనుం విముంచ హా॥౬౭

మయా కురు నిజాహారం గవార్థే సుగతి ర్మమ
ప్రాణాంస్తు త్యజతో మే స్యా దిత్యుక్త్వా సపపాత శా॥౬౮

పుత్రో త్తిష్ఠేతివచనం శ్రుత్వా రాజా సముత్థితః
జననీ మివ తాం ధేనుం దదర్శ న మృగాధిపం॥ ౬౯

౬౧ ఆకామధేనువు కూతురుకూతురైన యీనందినీ ధేనువును నీవు భార్యాసమేతముగా సేవింపుము నందినీ ధేనువువలన నీవు సంతానముఁ బొందగలవు (అనివసిష్ఠుడు చెప్పెను.

౬౨ పైవిధముగ వసిష్ఠుడు చెప్పగ దిలీపుడు భార్యతోఁగూడ వత్ససహితమగు నందిని ధేనువును భక్తితోఁబూజించుచు దాని ననుసరించుచు వెళ్లెను.

౬౩ ఆనందినీ ధేనువు వత్ససహితముగ నరణ్యమునకేగగా నాదిలీపుడును భార్యతోఁగూడ దానివెంటననుసరించి సేవచేయుచు వెళ్లుచుండెను ఇట్లువెళ్లుచుండగ నిరువదియొక్క దినములు గడచెను.

౬౪ ఆసమయమున నొకసింహ మాకస్మికముగా వచ్చి బలాత్కారముగ నందినీ ధేనువునుఁబట్టుకొనెను దిలీపమహారాజు పొదిలోనుండి బాణమునుఁదీసి సింహమునుఁజంపుటకుఁ బ్రయత్నించెను.

౬౫ ఆదిలీపుడు సింహప్రభావముచే స్తంభింపబడిన భుజములు కలవాడై యుండెను,

౬౬ అప్పుడు సింహము దిలీపునితో నిట్లుఁబల్కెను. నీవు సూర్యవంశీయుడవగు దిలీపమహారాజువనియెఱుగుదును, దైవము నాకీనందినీ ధేనువును ఆహారమునుగాఁగల్పించెను (అని సింహము దిలీపునితోఁ బల్కెను.

౬౭ దిలీపుడు సింహముతోఁ గ్రిందివిధముగఁజెప్పెను, ఓసింహమా! బ్రహ్మపుత్రుడగు వసిష్ఠుడు నాకు గురువై యుండెను నేను నందినీ ధేనువునుఁబరిచర్య చేయుటకు వసిష్ఠునడుగగా నతడు పరిచర్యార్థమై నాకిచ్చెను, కావున నందినీ ధేనువును వదిలిపెట్టుము.

౬౮ మఱియు నోమృగరాజమా! ఆహారము కావలయుననినచో నన్ను భక్షింపుము గోవునిమిత్తము ప్రాణములను విడచిన నాకు నుత్తమగతి కలుగునని చెప్పి దుఃఖముతో భూమియందుఁబడెను.

౬౯ అప్పుడు పుత్రుడా! లెమ్మనుమాట విన్పడగా రాజులేచి చూచెను తల్లివలె నందినీ ధేనువుమాత్రము కన్పడెను సింహమచ్చటఁగన్పడక పోయెను.

1నందినీశ్లో॥మాయయాసింహరూపిణ్యాత్వంమయాసిపరీక్షితః
మనసాపి కుతోఽ న్యేషాం గ్రహణే శక్తి రంగినాం॥౬౯

భవితా వంశకర్తా తే సుత శ్శస్త్రాస్త్రతత్త్వవిత్ ।
ఇత్యుక్త స్తు తయా రాజా ధేన్వా సహ గురుం గతః॥౭౦

సకలం వృత్త ముక్త్వా చ గురవే సహ భార్యయా
తదనుజ్ఞా మవాప్త స్స జ్జగామ స్వపురీం నృపః॥ ౭౧

నందిన్యా స్తు ప్రసాదేన దిలీపమహిషీ పునః
సుదక్షిణా గర్భవతీ ప్రాసూత సుత ముత్తమం॥ ౭౨

*1 దశవర్షసహస్రాణి దిలీపోఽ పాలయ ద్భువం

*2 రఘునామా నృప స్సోఽయం పితర్యుపరతే సతి॥
రాజ్యేఽభిషిక్తః పృథివీం పాలయామాస వై చిరం॥౭౩

ఏకదా విశ్వజిద్యాగం కృత్వా రఘు రయం మహాన్
కోశజాతం దదౌ తస్మిన్ బ్రాహ్మణేభ్యోఽ ధ్వరేఽఖిలం॥౭౪

---

1 పాద్మే

*దశవర్ష సహస్రాణి దిలీపో రాజ్యసత్కృతఇతి భవిష్యపురాణ వచనేన దిలీప పాలనకాలః (10,000 సం॥)

*2 రాజ్యం కృతం చ రఘుణా దిలీపాంతే పితుస్సమ మితి భవిష్య వచనేన రఘుపాలనకాలోఽపి (10,000 సం॥)

౧౯ అప్పుడు నందినీ ధేనువు దిలీపునితోఁ నిటులఁబల్కెను, ఓ దిలీపుడా! నేనే మాయచే సింహమునుఁ గల్పించి నిన్నుఁబరీక్షించితిని. ఇతరు నకు మనసుచేఁగూడ నన్నుఁబట్టుటకు శక్తిచాలదని యెఱుగుము.

౨౦ నీకువంశాభివృద్ధికరుడును శస్త్రాస్త్రవేత్తయునగు పుత్రుడు కలుగ గలడు. అని నందినీ ధేనువు చెప్పగా దిలీపుడు నందినీ ధేనువుతోడను తన భార్యతోడను వసిష్ఠుని సమీపమునకు వచ్చెను.

౨౧ జరిగిన వృత్తాంతమునంతను గురవగు వసిష్ఠునకుఁ జెప్పి తదనుజ్ఞను బడసి భార్యతోఁగూడ తనపురమును గూర్చివెళ్లెను.

౨౨ నందినీ ధేనువుయొక్క యనుగ్రహముచేత దిలీపునిభార్యయగు సుదక్షిణాదేవి, గర్భవతియై యుత్తముడగు పుత్రునిఁగనెను. అత నికి రఘువని పేరిడిరి.

1* దిలీపుడు పదివేల సంవత్సరములు రాజ్యమునుఁబాలించెను.

*౨౨౩౪ తండ్రియనంతరము దిలీపపుత్రుడగు రఘువు భూమినిఁజిరకాలము పరిపాలించెను (అనగా ౧౦౦౦౦ సం॥) పరిపాలించెను, (రఘు వనగా సర్వవిద్యాపారంగతుడని యర్థము.)

౨౮౪ రఘువు తనరాజ్యపాలన కాలమున నొకప్పుడు విశ్వజిద్యాగమునుఁ జేసి ధనమునంతను యజ్ఞములో బ్రాహ్మణులకిచ్చెను,

---

*1 పదివేల సంవత్సరములు దిలీపుడు రాజ్యమునుఁ బాలించెనని భవిష్య పురాణమునఁబ్రతిసర్గపర్వములో నుండెను.

*2 తండ్రితో సమముగా రఘువు రాజ్యమునుఁబాలించెనని భవిష్యపురా ణముననే యున్నది.

మృత్వాప్రత్యేకంనృపతిం రఘుం కౌత్ససుతోఽగమత్
వరతంతు గురోరర్థే దక్షిణా కాముకస్తదా ౭౫

కౌత్సాగమన వృత్తాంతం విదిత్వా రఘురప్యథ।
కుబేరేణ సమంయోద్ధుం సన్నద్ధోఽభూద్బలైస్సహ॥ ౭౬

రఘోర్ధైర్యం బలం జ్ఞాత్వా కుబేరోపి భయాన్వితః
కోశాగారే రఘోస్తస్య స్వర్ణవృష్టిం వవర్ష సః॥ ౭౭

మహత్సువర్ణరాశిం తం కౌత్సాయ ప్రదదౌరఘుః
నాంగీచకార సర్వం తం గుర్వోర్దేయాత్సచాధికం॥ ౭౮

రఘుః శ్లో॥ త్వన్నిమిత్తాగతం హ్యేతన్మయాగృహ్యేతనోమునే౭౯

మునిః॥ శ్లో॥ కోటీశ్చతస్రోదశచాహరేతి గురుణారఘో
కథితోఽహం తదేవాహం స్వీకరోమి నచాధికం॥ ౮౦

ఏవం తయోర్వివాదే తు ప్రశశంసుర్జనాస్తు తౌ
అర్థితాధికదం భూపం ప్రదత్తాగ్రహణం మునిం ౮౧

సదస్యానాం ప్రార్థనయా స్వర్ణరాశిం ప్రగృహ్య సః
గురోర్నికట మాగత్య దదౌ సర్వం చ దక్షిణాం॥ ౮౨

౨౫ మట్టిపాత్రలు మిగులఁగా గలిగియున్న రఘుమహారాజునుఁగూర్చి వరతంతు మహర్షి శిష్యుడగు కౌత్సమహర్షి గురుదక్షిణకొఱకు వచ్చెను.

౨౬ కౌత్సమహర్షి వచ్చిన వృత్తాంతమును రఘువు తెలిసికొని తనయొద్ద ద్రవ్యము లేని హేతువుచేఁ గుబేరుని మీదికి యుద్ధమునకు వెళ్ళుటకు సైన్యములతో సన్నద్ధుఁడైయుండెను,

౨౭ రఘుమహారాజుయొక్క ప్రయత్నమును వాని స్థైర్యమును బలమునుఁ గుబేరుఁడు, తెలిసికొని భయపడి, రఘుమహారాజుయొక్క ధనపు కొట్లయందు సువర్ణవర్షము కురిపించెను,

౨౮ రఘుమహారాజు. గొప్ప సువర్ణరాశినంతయు కౌత్సమహర్షికిచ్చెను ఆకౌత్సమహర్షియును. తనగురుచే కోరఁబడిన గురుదక్షిణకంటెయధిక ధనము గ్రహించుటకంగీకరింపక పోయెను,

౨౯ రఘుమహారాజు కౌత్సునితోఁ నిటులఁబలికెను ఓకౌత్సమహర్షీ! ఈ ధనమంతయు నీనిమిత్తముగా వచ్చినదికాన దీనినంతయు నీవు గ్రహింపవలసినదేకాని నేను గ్రహింపను (అని రఘువు చెప్పెను.)

౩౦ కౌత్సమహర్షి రఘువుతోఁ దీనిని ఇవ్విధముగఁ జెప్పెను ఓరఘుమహారాజా! పదునాలుగు కోట్ల సువర్ణనాణెములను గురుదక్షిణగా నా గురువగు వరతంతుమహర్షి చెప్పెను కావున నేనంతమాత్రముననే గ్రహించెదనుగాని యధికధనమునుఁ గ్రహింపననియె.

౩౧ ఇవ్విధముగా కౌత్సునిచే యాచింపబడిన ధనముకంటె యధికముగా నిచ్చెదనని రఘుమహారాజును. గురుదక్షిణకంటె యధికముగానీయబడిన ధనమును గ్రహింపనని కౌత్సమహర్షియును, వారలు వివాదపడుచుండగా నచ్చటిజనులు వారలనిద్దఱను కొనియాడిరి.

౩౨ సభ్యులందఱి ప్రార్థనచే కౌత్సమహర్షి యాసువర్ణరాశినంతయుఁదీసికొని గురువునొద్దకేగి యాధనమంతయు గురుదక్షిణగానిచ్చెను.

1 ఏకదా రావణో యోద్ధుం ప్రేషయామాస రాక్షసాన్
రఘు స్తా న్నిశితై ర్బాణై స్తాడయామాస రాక్షసాన్॥ ౮౩

రఘుణా తాడితా స్సర్వే రాక్షసా స్స్వపురీం గతాః
రావణాయా వద న్సద్య స్త్వజేయో రఘు రిత్యథ॥ ౮౪

రఘుణా రావణే కోపా ల్లంకాద్వారో శరాళిభిః
నిర్బంధితోఽ యోధ్యాస్థేన తజ్జాయా ప్రార్థనావశాత్
ఉపసంహృతవా న్భూయ శ్శరాళిం రఘుభూపతిః॥ ౮౫

తత్పుత్రోఽ భూ దజోనామ యస్మా దజముహూర్తజః
పితుర్వ్యుపరతేఽ జోపి పట్టబద్ధోఽభవ త్తతః॥ ౮౬

కదాచి ద్రావణోఽ భ్యేత్య రఘుణా సంగరం తతః
కృత్వాచవాయవ్యాస్త్రేణలంకాయాంపాతితోభవత్॥ ౮౭

దశవర్ష సహస్రాణి రాజ్యం కృత్వా రఘో స్సుతః
ఇష్ట్వాచ దేవతాః పశ్చాత్ స్వర్గలోక మవాపసః॥ ౮౮

ఆశ్చర్యరామాయణే పంచమసర్గ స్సమాప్తః.



1 భరద్వాజరామాయణే,

౮౩ ఒకప్పుడు రావణుఁడు రఘుమహారాజుతో యుద్ధముఁజేసి జయించి రండని యోధులను బంపఁగా రఘుమహారాజు వారినందఱను, తీక్ష్ణమైన బాణములచే హతముఁజేసెను.

౮౪ రఘుమహారాజుచే రాక్షసులందఱు పరాజితులై తమలంకాపురికేఁగి రావణునితో రఘుమహారాజు దుర్జయుడని చెప్పిరి.

౮౫ రఘుమహారాజు రావణునియందాగ్రహము గలవాఁడై. యయోధ్య నుండియే లంకాపురద్వారములను తనబాణపరంపరలచే బంధింపఁగా మండోదరి, బాణముల నుపసంహరింపుమని లంకాపురినుండి ప్రార్థింపఁగా, రఘుమహారాజుపసంహరించెను.

౮౬ అనంతరము రఘుమహారాజ పుత్రుడగు అజమహారాజు తండ్రియనంతరము పట్టాభిషిక్తుఁడై రాజ్యమునుఁబాలించెను (అజుడను నామమెట్లు కలిగెననఁగా బ్రహ్మదేవతాకమగు అజముహూర్తమునందుఁబుట్టిన వాఁడు గనుక అజుడనిపిల్వఁబడుచుండెను).

౮౭ ఒకానొకప్పుడు రావణుడు స్వయముగా నయోధ్యాపురికి వచ్చి యజమహారాజుతో యుద్ధముచేసెను. అజమహారాజు వాయవ్యాస్త్రముచే రావణుని సాకేతపురమునుండి లంకాపట్టణములోఁబడవేసెను.

౮౮ అజమహారాజు పదివేలసంవత్సరములు రాజ్యమునుఁబాలించి యనేక యజ్ఞములనుఁజేసి పిమ్మట స్వర్గస్థుఁడయ్యెను.

ఆశ్చర్యరామాయణమున పంచమసర్గముముగిసెను.



## షష్ఠసర్గప్రారంభః.

అథాజపుత్రో ఽయోధ్యాయా మభూద్దశరథో నృపః
ఇక్ష్వాకూణా మతిరథో నిత్యం ధర్మరతో మహాన్॥ ౧

* తత్పాల్యమానే సాకేతే నకశ్చి దబహుశ్రుతః
నాసూయకో నచావిద్వా న్సర్వే ధర్మరతా జనాః॥ ౨

1 అష్టౌ బభూవు ర్వీరస్య మహామాత్యా యశస్వినః
ఋత్విజౌ ద్వా వభిమతౌ వసిష్ఠో వామదేవకః। 3

* ఈదృశై స్తైరమాత్త్యైస్తు రాజా దశరథో నఘః
ఉపపన్నో గుణోపేతై రన్వశాస ద్వసుంధరాం॥ ౪

2 అయోధ్యాయా స్తు సాన్నిధ్యే దేశే కోసలనామని
కోసలాయాంమహాపుణ్యాఃకోసలాఖ్యో నృపోఽభవత్॥ ౫

---

* అనేన రాజ్ఞో ధర్మతః పరిపాలనేన జనానాం ధర్మనిరతత్వం భవతీతి సూచితం తథాచ ప్రాచీనాః రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః యథా రాజా తథా ప్రజాః॥ ఇతి॥

* వ్యా॥ అనేన రాజ్ఞా సద్గుణవిశిష్టా మంత్రిణః సంగృహ్యా ఇతి సూచితం తథాచ మనుః॥ సచివా న్సప్త చాష్టౌ వా ప్రకుర్వీత పరీక్షితాన్॥ ఇతి॥

1. వాల్మీకిరామాయణే బాలకాండే.

## ఆరవ సర్గ ప్రారంభము,

౧ అజమహారాజు ననంతరము తత్పుత్రుడగు దశరథమహారాజు అయోధ్యయందు పట్టాభిషిక్తుడయ్యెను. ఆదశరథుడు ఇక్ష్వాకువంశీయులగు రాజులలో నతిరథుడును ధర్మాసక్తుడును మహాత్ముడునై యుండెను.

*1 ౨ ఆదశరథునిచేతం బరిపాలింపబడుచున్న యయోధ్యాపట్టణమున శాస్త్రజ్ఞుడుకానివాడును, అసహనముగలవాడును, విద్వాంసుడు కానివాడును నొకండైన గానిపింపడు. జనులందరు ధర్మనిరతులైయుండిరి

3 ఆదశరథునకు కీర్తిసంపన్నులగు నెనమండ్రుగురు మంత్రులుండిరి.

*2 వసిష్ఠుడు వామదేవుడను నిద్దఱు ఋత్విజులుండిరి.

౪ ఇట్టి సద్గుణసంపన్నులగు మంత్రులతోఁగూడి దశరథమహారాజు భూమిని పరిపాలించుచుండెను.

౫ అయోధ్యాపట్టణ సమీపమున దక్షిణకోశలదేశమున కోసలయను రాజధానియందు పుణ్యాత్ముఁడగు కోసలుడను రాజుండెను,

---

*1 రాజు ధర్మ్యముగా పరిపాలనము చేత జనులందరు ధర్మనిరతులై యుండుటను విషయము ఇందులవ సూచింపబడినది. ప్రాచీనులు నవ్విధముగనే చెప్పిరి. (యథా) రాజు ధర్మవంతుడైయుండిన ప్రజలు ధర్మిష్ఠులై యుందురనియు రాజెట్లుండిన ప్రజలవ్విధముననుందురని యుచెప్పబడినవి.

*2 రాజు సద్గుణసంపన్నులగు నెనమండ్రు మంత్రులను సంగ్రహింపవలెనని దీనిచే సూచింపబడెను. ఇట్లే మనువు చెప్పెను. (ఏమన) ఏడుగురుమంత్రులనుగాని యెనమండ్రుగురు మంత్రులనుగాని రాజు పరీక్షించి తనసన్నిధియందుంచుకొనవలెనని.

తస్యాఽసీ ద్దుహితా రమ్యా కౌసల్యా పతికాముకా
తస్యా దశరథేనైవ వివాహోనిశ్చితో ముదా॥ ౬
లగ్నార్థం తం సమానేతుం దూతా దశరథంనృపం
యయు ర్వినిశ్చయం కృత్వా । వివాహదివసస్యచ॥ ౭
తదా దశరథశ్చాపి। సాకేతే సరయూజలే
విహారం నావి రాజా వై కురుతే మంత్రిబంధుభిః॥ ౮
తస్మిన్ కాలేతు లంకాయాం విధిం పప్రచ్ఛ రావణః
కస్మా న్మే మరణం బ్రహ్మన్ త త్త్వంమేవక్తు మర్హసి
తద్రావణవచ శ్శ్రుత్వా కథయామాస తం విధిః॥ ౯
కౌసల్యాయాం దశరథా ద్రామ స్సాక్షా జ్జనార్దనః
చతుర్ధా పుత్రరూపేణ భూత్వా త్వాం సహనిష్యతి॥౧౦
పంచమేఽహని లగ్నస్య రాజ్ఞో దశరథస్య హి
దివసో నిశ్చితో విప్రైః కోసలాఖ్యేన రావణ॥ ౧౧
1 తద్విధే ర్వచనం శ్రుత్వా పుష్పకస్థో దశాననః
అయోధ్యాం సత్వరం గత్వా రాక్షసైః పరివేష్టితః॥౧౨
నౌకావిహారిణంభూపం జ్ఞాత్వా తత్రగత స్తదా ౧౩
బభంజ నిజపాదేన తాం నౌకాం సరయూజలే
తదా సర్వే మృతా స్తత్ర। సరయ్వా నిర్మలే జలే॥ ౧౪
సుమంత్రాజసుతౌ ద్వౌతు నౌకాఖండోపరిస్థితౌ
శనై శ్శనైః ప్రవాహేణ గత్వా భాగీరథీం నదీం॥
తత స్సముద్ర మధ్యేత్య జీవితౌ ద్వీప మేత్యతౌ॥ ౧౫

---

1. ఆనందరామాయణే.

౬. అకోసలునకు కౌసల్యయను నొకకొమరిత యుండెను. ఆమె వివాహ యోగ్యురాలైయుండగా, దశరథునకిచ్చి వివాహముచేయుటకుఁ గోసలుడు నిశ్చయించెను.

౭. ఆ వివాహదినమునకు దశరథుని దీసుకొనివచ్చుటకు, కోసలరాజదూతలు అయోధ్యాపట్టణమునకేగిరి, ఆసమయమున దశరథుడు సాకేతపుర సమీపమునందలి సరయూనదిలో మంత్రిబంధుసమేతముగ నావికా విహారము సలుపుచుండెను.

౯ ఆసమయమున లంకాపట్టణమున రావణుడు బ్రహ్మను ప్రశ్నించెను. ఓ బ్రహ్మదేవుడా ! నాకెవనివలన మరణము గలుగునో విచారించి చెప్పుము. అని యడిగిన రావణుని వాక్యము విని బ్రహ్మదేవుడిట్లు సమాధానమిచ్చెను.

౧౦ దశరథునకు విష్ణ్వంశములతో నల్వురు పుత్రులుద్భవించెదరు వారిలో కౌసల్యాపుత్రుడగు రాముడు నిన్ను సంహరింప గలడు.

౧౧ ఓరావణుడా నేటికి నైదవదినమున కౌసల్యాదశరథులకు వివాహ లగ్ననిశ్చయమును బ్రాహ్మణులు చేసిరని బ్రహ్మరావణునతోఁజెప్పెను.

౧౨-౧౩ రావణుడు బ్రహ్మవాక్యమును విని దశరథుని సంహరింపదలచి రాక్షసులతోఁగూడి విమానారూఢుడై యయోధ్యకేగి దశరథుని గూర్చి విచారింపగా దశరథుడు సరయూనదిలో విలాసార్థమై నావికావిహారమునుఁజేయుచుండెనని తెలిసి తానును దశరథుని వెదకికొనుచు సరయూనదీతీరమున వెళ్ళుచుండెను.

౧౪ రావణుడు సరయూనదివెంట వెళ్లుచుండగా దశరథసుమంత్రాదుల తోఁగూడిన నావ (పడవ) కన్పడెను రావణుడానావను కాలితోఁ దన్నగా నాపడవ మునిగిపోయి యందలి జనులందరు మృతినొందిరి

౧౫ కాని దైవవశమున సుమంత్రుడును దశరథుడును పడవచెక్కలనుఁ బట్టుకొని మెల్లమెల్లగా సరయూనదీప్రవాహమునుండి కొట్టుకొని వచ్చి గంగలోఁబడి యాగంగనుండి సముద్రములోనికి వారిద్దరు కొట్టుకొనివచ్చి యొకద్వీపమునుఁజేరిరి,

1 రావణః కోసలాం గత్వా కృత్వా పరమసంగరం
కోసలాఖ్యం నృపం జిత్వా కౌసల్యాం తు జహార సః॥ ౧౬½

కౌసల్యాం మత్స్యరాజాయ న్యాసభూతాం కరోమ్యహం
ఇతి నిశ్చిత్య మనసి పేటికాయాం నిధాయ తాం। తస్మై
సమర్ప్య హృష్టాత్మా యయాలంకాం దశాననః॥ ౧౭-౧౮

తిమింగలోఽపి తాంమాంస్యే ధృత్వాబ్ధౌ విచరన్సుఖం
ఆహూతోఽన్యేన రిపుణా మత్స్యరాజేన స్తై తదా॥ ౧౯

ద్వీపే తాం పేటికాం స్థాప్య యోద్ధుం చ రిపుణాగతః॥ ౧౯½

తత్ర తౌ మంత్రినృపతీ ద్వీపం తం చాగతౌ తదా॥ ౨౦

నృపస్తాం పేటికాం దృష్ట్వా సముద్ఘాట్యాఽతివిస్మితః
తస్యాం దృష్ట్వాఽథ కౌసల్యాం జ్ఞాత్వా నృపసుతాం పరస్పరం
తావన్యోన్యం వివాహం తు నిర్వర్తయితుకాముకౌ॥ ౨౧½

నృపేణ మనసా ధ్యాతో గురుర్యోగబలాన్వితః
సదారస్తు సమాగత్య మంగళం నిరవర్తయత్॥ ౨౨½
లంకాయాం రావణశ్చాపి సమాహూయ విధింపునః
ఉవాచ ప్రహసన్వాక్యం సభాయాం సంస్థితస్సుఖం॥ ౨౩½

1 ఆనందరామాయణే

౧౬॥ రావణుడు పిమ్మట కోసలపురికేగి కోసలరాజుతో గొప్పయుద్ధమును జేసి యారాజునుజయించి కౌసల్యనపహరించెను.

౧౭-౧౮ ఈకౌసల్యను చంపకుండగ సముద్రములోని తిమింగలమునొద్ద దాచెదనని రావణుండు నిశ్చయించి యాకౌసల్యను నొకపెట్టియం దుంచి సముద్రమునందలి తిమింగలమునకు దాపనిచ్చి తాను లంకాపురికేగెను.

౧౯॥ తిమింగలమును రావణుండిచ్చిన పెట్టెను నోటగరచుకొని సముద్రమున సంచరించుచుండగా శత్రువగుమరియొకమత్స్యరాజు తనను యుద్ధమునకుం బిలిచెను. అప్పుడా తిమింగిలము తననోటియందలి పెట్టెను ద్వీపమునందుంచి శత్రువులో యుద్ధముచేయంబోయెను.

౨౦ అప్పుడు దశరథసుమంత్రులు పెట్టియున్న ద్వీపమునకే చేరిరి.

౨౧॥ దశరథుడు కౌసల్యయున్న యాపెట్టెనుంజూచి యాపేటికను దెరచి చూడగా కౌసల్య పెట్టెయందుండెను ఆమెనుంజూచి యాశ్చర్యపడెను పరస్పరము దమవృత్తాంతములను దెలిసికొని వారిద్దఱు వివాహమును జేసికొనంగోరిరి.

౨౨॥ అప్పుడు దశరథుడు తనగురువగు వసిష్ఠుని ధ్యానింపగా నవ్వసిష్ఠుడు యోగదృష్టిచేఁ దెలిసికొని భార్యతోఁగూడ దశరథుఁడుండిన ద్వీపమునకు యోగసిద్ధిచే క్షణములోవచ్చి వివాహమును జేయించుచుండెను.

౨౩॥ రావణుండు లంకాపురికేగి సభాస్థలమునంగూర్చుండి బ్రహ్మదేవుని బిలిపించి యిటులబల్కెను.

విధే తవ మృషా వాక్యం రావణేన మయా కృతం
హతో దశరథ స్తోయే కౌసల్యా గోపితా మయా॥ ౨౪

తద్రావణవచ శ్శ్రుత్వా సభాయాం పద్మసంభవః
దీర్ఘస్వరేణ ప్రోవాచ ఓంపుణ్యాహమితిస్ఫుటం॥ ౨౫

1 రావణ స్సంభ్రమా త్ప్రాహ కిమిదం వ్యాహృతంత్వయా ౨౬

విధిః ప్రోవాచ లగ్నం హి జాతం దశరథస్య తు॥ ౨౬

తస్మి న్కాలే నారదోపి సభా మేత్య తు రక్షసా
పరిపృష్టోఽబ్రవీ త్తస్మై వివాహవిషయం తయోః॥ ౨౭

తదైవ రావణో మానీ స్వయంభూసహిత స్తురం
విమానేనా గతో ద్వీపం కౌసల్యాజసుతాన్వితం॥ ౨౮

వధూవరౌ వసిష్ఠం చ। సుమంత్రం చ దశాననః
దృష్ట్వా దశాననః క్రుద్ధః హంతుం దశరథం యతః॥ ౨౯
దశాననో దశరథః। పరస్పరజయైషిణౌ।
యుద్ధం చ చక్రతుర్వీరౌ తదా బ్రహ్మా న్యవారయత్॥ 30

1. ఆనంద రామాయణే.

౨౪½ ఓ బ్రహ్మదేవుడా? నీవాక్యమును నేనబద్ధమునుఁగాజేసితిని నేను దశరధునిఁజంపితిని కౌసల్యనుదాచితిని (నీవు కౌసల్యాదశరధులకుఁబుట్టిన వానివలన నాకు మరణముకలుగునని చెప్పితివి అదియబద్ధమయ్యెనని భావము.)

౨౫½ రావణుని వాక్యమును బ్రహ్మదేవుడు విని సభాస్థలమునందు దీర్ఘస్వరముతో (ఓం పుణ్యాహమని) యాశీర్వచనమును స్ఫుటముగా పలికెను. (వసిష్ఠుడు కౌసల్యాదశరథులకు వివాహమునుఁజేయించుచు బ్రహ్మను ధ్యానింపగా బ్రహ్మదేవుడు ఓం పుణ్యాహమని యాశీస్సును బలికెనని భావము).

౨౬ ఓ బ్రహ్మదేవుడా? నీవు సభలో నాశీర్వాదమునుఁజేయుచుంటివి ఇప్పుడేమిశుభము జరుగుచున్నదని రావణుడు బ్రహ్మదేవునిఁ బ్రశ్నించెను.

౨౬½ కౌసల్యాదశరథులకు సముద్రద్వీపములో వివాహమిపుడు జరుగుచున్నదియని బ్రహ్మ రావణునితోఁ జెప్పెను.

౨౭ తా॥ ఆసమయమున నారదుడు లంకాపట్టణమున రావణసభకు రాగా, రావణుడు, కౌసల్యాదశరథుల వివాహముజరుగుట నిజమా యబద్ధమాయని నారదుని నడుగగా నాదేవర్షి వారల వివాహముజరుగుట నిజమేయని చెప్పెను.

౨౮ అప్పుడే రావణుడు బ్రహ్మనారదులను వెంట నిడుకొని విమానారూఢుడై కౌసల్యాదశరథులుండిన ద్వీపమునకువచ్చెను.

౨౯ ఆద్వీపమునందు నూతన వధూవరులగు కౌసల్యాదశరథులను వసిష్ఠసుమంత్రాదులనుఁ జూచి యాశ్చర్యపడి రావణుడు కోపముతో దశరథుని సంహరింప నుద్యమించెను.

30 దశరథుడును వెనుదీయక రావణునితో యుద్ధముజేయ సమకట్టెను అపుడు బ్రహ్మదేవుడు వారలనిద్దఱను నివారించెను.

నారదోపి దశాస్యం తం న్యవారయ దనేకథా
యద్భావి త ద్భవత్యేవ న్మృతే రస్య శ్వ రుత్తమం॥ ౩౧
నారసింహాశ్రవా ద్యైన భగవా న్నరరూపధృత్
కిమర్థం త్వాం న హింస్యా ద్యై విచారయ మదీరితం
సాహసం కురు మాఽద్యైన సత్యాయుషి దశానన॥ ౩౨

1విధిః॥శ్లో॥ నభవిష్యతి మద్వాణీ మృషా జానీహి నిశ్చయం
యద్భావ్యం తద్భవత్యేవ గహనా కర్మణో గతిః॥ ౩౩
ఇతి తాభ్యాం వారిత స్స్రావణ స్స్వపురీం గతః॥ ౩౪
గచ్ఛంతం గగనే బ్రహ్మ జటాయుం విహగోత్తమం
సమాహూయా జపుత్రేః కారయత్వాచ సౌహృదం
జగామ సత్యలోకం తు నారదేన సమన్వితః॥ ౩౫
పక్షిరాజాధిరూఢ స్స తదా దశరథో నృపః
సదార స్ససుసంత్ర్యా చ్చ సాకేతం ప్రవివేశ సః॥ ౩౬
ఏవం మృత్యుముఖాన్ముక్తః నగరీం తు ప్రవిశ్య సః
బంధుమిత్రాదికా న్సర్వా న్సమాహూయ యథావిధి
వైవాహికోత్సవం కృత్వా పూజయామాస చాఖిలాన్
కోసలోపిస్వజామాత్రే స్వరాజ్యం చద దౌత వా॥ ౩౭౩౮
తయా కౌసల్యయా సాకం రాజ్యభోగాన్స్వభోజనః॥ ౩౯

1, ఆనందరామాయణే,

౩౧ ఓ రావణుడా ! ఏదిజరుగనున్నదో యదిజరుకమానను. ఇపుడు చచ్చుటకంటె రేపటిదినమునఁ జచ్చుట యుత్తమ మను లోకోక్తి యున్నదికాన నీవునిష్కారణముగఁగలహించియిప్పుడేముప్పు తెచ్చి కొనుట మంచిదికాదని నారదుడు రావణునితోఁజెప్పి నివారించెను.

౩౨½ తా॥ మఱియు నారదుడు రావణునితో నిటులఁజెప్పెను.ఓరావణుడా! నీవు దశరథునితో నిష్కారణముగఁ గలహించినచోఁ బూర్వము నృసింహస్వామి స్తంభమునుండి పుట్టుకునివచ్చిన విధముగ భగవంతుడు రామరూపమున నెవ్విధముననో యిప్పుడే యావిర్భవించి నిన్ను నేల హింసింపకూడదో నామాటను బాగుగ నాలోచింపుము ఆయుపుండగ నిపుడే సాహసమునుఁ జేయకుమనెను.

౩౩½ అప్పుడుబ్రహ్మయు నిటులఁబలికెను. ఓ రావణుడా! నావాక్యము మిథ్యకానేరదు. నిశ్చయముగ నమ్ము. ఏదిజరుగనున్నదో యదిజరుగక మానను, కర్మగతి, మజ్ఞేయమని చెప్పెను.

౩౪ ఈప్రకారముగా బ్రహ్మనారదులచే రావణుడు నివారింపబడి తన పురమునకేగెను.

౩౫½ అనంతరమాకాశమార్గమున బోవుచున్న జటాయువును బ్రహ్మ పిలిచి దశరథునితో స్నేహము జేయించి తాను నారదునితోఁగూడ సత్యలోకమునకేగెను.

౩౬ అప్పుడు దశరథుడు కౌసల్యా సుమంత్రులతోగూడ జటాయువు నధిష్ఠించి సాకేతపురమునకేగెను.

౩౭½-౩౮½ ఇవ్విధముగా దశరథుడు మృత్యుముఖము నుండి బయటబడి తన పట్టణమును జేరి బంధుమిత్రాదులనందఱ నాహ్వానించి యథావిధిగా వివాహమహోత్సవమును జేసి యందఱను తగునటుల పూజించెను. కోసలరాజును దశరథునకుఁ దనరాజ్యము నిచ్చెను,

౩౯ ఆకౌసల్యతోగూడ దశరథుఁడు రాజ్యభోగముల ననుభవించుచుండెను

ఏకదాఽజసుత స్స్వర్గం దేవేంద్రం ద్రష్టు మిచ్ఛయా
గత్వా పున స్త్వాగమనే కామధేనుం దదర్శ సః॥ ౪౦

అకుర్వం స్తన్నమస్కారం గత్వా చ కించి త్పదా
విచార్య చ పునః పశ్చా ద్గత్వా తాం ప్రణనామ సః॥౪౧

క్రుద్ధా సాఽశపద త్యేన మనపత్యో భవాన్భవేత్
ఇతి శప్తేన రాజ్ఞా సా ప్రార్థితా పున రబ్రవీత్॥ ౪౨

మత్ప్రసాదా త్తవ సుతా త్వేకా శీఘ్రం జనిష్యతి
విలంబేన సుతా శ్చాపి భవేయు ర్గచ్ఛతా ద్భవా॥౪౩

ఇత్యుక్తో నృపతి ర్గేహం గత్వా స్నాతాం ప్రియాం పునః
మిళితోఽభూ త్తత స్సాపి సత్వరం గర్భవత్యభూత్॥౪౪

దశమే మాసి వై తస్యాః కన్యారత్న మజాయత
శాంతేతి నామ భగవా న్వసిష్ఠ స్తు చకార సః॥ ౪౫

క్రమాద్వృద్ధి మవాప్తాయాశ్శాంతాయా స్తు స్వయంవరః
ఘోషితోఽభూన్నృపతినా చాయయు ర్నృపసూనవః॥ ౪౬

రామో పరశుధారీ స న్నాయయా తత్స్వయంవరే
సర్వే పలాయితా స్సద్యః తదా నృప మువాచ సః॥ ౪౭

౪౦ ఒకప్పుడు దశరథుఁడు దేవేంద్రునిఁ జూచుటకు, స్వర్గమునకేగి తిరిగి వచ్చుటలో స్వర్గసమీపమునందే, కామధేనువును జూచెను.

౪౧ కాని, దశరథుడు కామధేనువునకు నమస్కరింపకుండగఁ గొంతదూరమేగి, శపించునను భయముతో వెనుకకుఁ దిరిగి వచ్చి కామధేనువును నమస్కరించెను.

౪౨ నీవు,సంతానహీనుడవు కాగలవని కామధేనువు కోపముతో దశరథుని శపించెను, ఇట్లు దశరథుడు శపింపఁబడి కామధేనువును బహువిధముల ప్రార్థించెను.

౪౩ అప్పుడు కామధేనువనుగ్రహించి రాజుతోనిటుల జెప్పెను. నాయనుగ్రహముచే నీకొకస్త్రీసంతానము శీఘ్రములోఁ గలుగఁగలదు. విళంబముచేఁ బుత్రులు కలుగుదురు నీవు వెళ్ళుము. )అని చెప్పెను)

౪౪ ఇటులఁగామధేనువు చెప్పిన పిమ్మట దశరథుడు తనగృహమునకేగెను ఋతుస్నాతయైన కౌసల్యను దశరథుడు కలియుగా వెంటనే యాకౌసల్య గర్భవతి యయ్యెను.

౪౫ ఆకౌసల్యకు వదియవమాసమున నొకకన్యారత్నము కలిగెను పూజ్యుడగు వసిష్ఠుఁడు కౌసల్యాపుత్రికకు శాంతయను నామకరణముఁ జేసెను.

౪౬ క్రమముగా శాంతయను కన్యక వృద్ధినొందెను. ఆకన్యకకు వివాహసమయము వచ్చినంమన దశరథుఁడు స్వయంవరమును సాటింపగా రాజపుత్రులందఱు స్వయంవరమునకు వచ్చిరి.

౪౭ పరశురాముఁడు గండ్రగొడ్డలిని ధరించి యాస్వయంవరమునకు రాగా నాజమదగ్ని పుత్రునిఁజూచి రాజులందఱు భయముచే పారిపోయిరి. అప్పుడు పరశురాముఁడు దశరథునిఁజూచి యివ్విధమున బలికెను.

మహార్షయే ప్రదాతవ్యా కన్యేయం వరవర్ణినీ । నోచే
త్త్వాంనాశయిష్యామీత్యుక్త్వా।రామోయయౌపునః॥ ౪౮
అనపత్యోఽఙ్గరాజోపి సఖా దశరథస్య తు
తదా నృపంప్రార్థితవాన్యాంతాంకృతిమపుత్రికాం॥ ౪౯

కన్యాం దశరథో రాజ్ఞా రోమపాదేన యాచితః
అపత్యకృతికాం రాజ్ఞే రోమపాదాయ తాం దదౌ॥ ౫౦
తదాది తస్యా మేకోపి నాభవత్పుత్రక శ్చిరం॥ ౫౧
ఏతస్మి న్నంతరే రాజ్ఞా మాగధేన తు పత్రికా
సంప్రేషితాఽజపుత్రాయ స్వకన్యాశుభసూచికా॥ ౫౧
కౌసల్యా తాం నిశామ్యాఽసు తదా దశరథం పతిం
ప్రోత్సాహయిత్వాసుభగాప్రేషయామాసతత్పురీం॥
తత్ర గత్వా దశరథ స్స్వయంవరసభాం గతః ౫౨-౫౩
స్వయవరసభాంసర్వే రాజపుత్రాస్సమాగతాః॥
మాగధేశసుతా సాపి సుమిత్రా స్వసఖీయుతా
సభాస్థలం గతా పాణౌ పుష్పమాలాం ధరంత్యథ॥ ౫౪
వృద్ధదాసీ రాజవంశపరిజ్ఞానవతీ తదా।
ఏకైకనృపసాన్నిధ్యం నీత్వా కన్యామబోధయత్॥ ౫౫
కన్యే మహా నయం రాజా కాళింగోబహుకోశవాన్
నైకజాయాసమప్రీతిః యదీచ్ఛసినృపం వృణు॥ ౫౬

౪౮ ఓదశరథుఁడా ! యీకన్యను మహర్షి క్రీయుము. అటులకీయనిచో నిన్ను నశింపజేసెదనని పరశురాముడు చెప్పితిరిగి వెళ్లిపోయెను.

౪౯ దశరథునకు మిత్రుఁడైన యంగదేశరాజగు రోమపాదుడు సంతానహీనుడైనందున శాంతను తనకు దత్తతగాకీయుమని దశరథమహారాజునుఁ బ్రార్థించెను,

౫౦ రోమపాదుడిట్లు పరిపరి విధముగఁ దననుఁ బ్రార్థింపగా దశరథుడు తనకొమరితను రోమపాదునకు దత్తుగా నిచ్చెను.

౫౦౪ అదిమొదలు కౌసల్యయందును సంతానము చిరకాలపర్యంతము లేక కలుగకపోయెను.

౫౧౪ ఈసమయమున మగధరాజు తనపుత్రికకు స్వయంవర మహోత్సవమునుఁ జేయఁదలచి రాజులందఱకు నాహ్వానపత్రికలను బంపుచు దశరథునకుగూడ నాహ్వానపత్రికఁ బంపెను.

౫౨-౫౩ కౌసల్య,మగధరాజ పంపిన శుభపత్రికనుఁజూచి,యప్పుడు వెంటనే దశరథునిఁ బ్రోత్సహించి మగధరాజ పట్టణమునుగూర్చి పంపెను. అక్కడకువెళ్లి దశరథుడు స్వయంవరసభకేగెను.

౫౪౪ రాజపుత్రులందఱును స్వయంవరసభను గూర్చివచ్చిరి. మగధరాజ పుత్రికయగు సుమిత్రయు పుష్పమాలికను హస్తమునం దుంచుకొని చెలికత్తెలతోఁగూడ సభాస్థలమునకు వచ్చెను.

౫౫౪ రాజవంశములను గుర్తెరింగిన యొక వృద్ధదాసి, సుమిత్రాదేవిని ప్రత్యేకముగ రాజపుత్రులసన్నిధానమునకుఁ దీసికొనివెళ్లి యామెకు నిటులఁ దెల్పెను.

౫౬౪ ఓరాజపుత్రి ! ఈకళింగదేశపు మహారాజు బహుధనవంతుడును భార్యలందఱి యందును సమమైన ప్రేమభావము గలవాడునై యుండెను. నీకిష్టమైన వరింపుమనెను.

ఇత్యుక్త్వా మాగధీ జ్ఞాత్రీ పురత స్తా మచోదయత్॥ ౫౭

వంగరాజాంతికం నీత్వా రాజపుత్రీం తు చేటికా
బోధయామాస తస్యాథ బహుపుత్ర ధనాఢ్యతాం॥ ౫౮

తదాశయజ్ఞా కన్యా సా పురత స్తా మచోదయత్॥ ౫౯

కశ్చిమాచ్చేటీ దర్శయంతీ రాజపుత్రీ బహూన్నృపాన్
బోధయంతీ చ తద్వృత్తంనినాయాజసుతాంతికం॥ ౫౯

చేటీ ప్రాహ సుమిత్రాం చ రాజాఽయం రఘుపౌత్రకః
అజపుత్ర స్సార్వభౌమ స్సశైలవనభూపతిః।
నామ్నా దశరథో లోకే ఖ్యాతకీర్తి ర్గుణాధికః॥౬౦-౬౧

ఇతి సంబోధితా కన్యా। మాగధీ పుష్పమాలికాం
నిక్షిప్య కంఠే రాజ్ఞ స్తు వవ్రే దశరథంతదా॥ ౬౨

తయా సుమిత్రయా సాకం సమాగత్య నిజం పురం
బుభోజ సర్వసౌఖ్యాని చిరం దశరథ స్తతః॥ ౬౩

౫౮ ఇవ్విధముగ, వృద్ధదాసి, చెప్పగ నామెభావమును గ్రహించి ముందర అను నడువుమని ప్రోత్సహించెను. (అనగా కళింగరాజునకు బహు భార్యలుండినట్లు గ్రహించి ముందుకు నడువుమని ప్రోత్సహించెనని భావము.)

౫౯ పిమ్మట వృద్ధదాసి రాజపుత్రికను వంగరాజసమీపమునకుఁదీసికొని వెళ్లి యతడు బహుధనాఢ్యుడును బహుపుత్రుడునై యుండెనని యామెకుబోధించెను.

౫౯-౧ ఆదాసియొక్క యభిప్రాయమును సుమిత్రగుర్తెఱిగి ముందుకు నడువుమని దాసినిఁ బ్రేరేపించెను.

౫౯-౪ ఇట్లుక్రమముగ నారాజపుత్రికకు రాజులనందఱనుఁ జూపించుచు వారలవృత్తాంతములనుఁదెల్పుచు దశరథుని సమీపమునకుఁదీసికొని వెళ్లెను.

౬౦-౧ ఆదాసి సుమిత్రనుగూర్చి యివ్విధముగఁ బలికెను. ఓరాజపుత్రి ఈ దశరథుడు సార్వభౌముడును పర్వతారణ్యసహితమగు భూమికంతకు ప్రభువును లోకప్రసిద్ధమైన కీర్తిగలవాడును గుణాధికుడునై యుండెను. ఇతడు రఘుమహారాజపౌత్రుడు అజమహారాజ పుత్రుడు నీకిష్టమైన వరింపుమనెను.

౬౨ ఇవ్విధముగ నాదాసి చెప్పగా సుమిత్రాదేవి చేతిలోనిపుష్పమాలికను దశరథ మహారాజుయొక్క కంఠమునందుంచి యతనిని వరించెను.

౬౩ పిమ్మట దశరథుడు సుమిత్రాదేవితోఁగూడ నిజపురమగు సాకేత పురికి వచ్చి యామెతోఁగూడి సకల సౌఖ్యముల ననుభవించెను.

* పరంతు సంతతిం తస్యాం న లేభేఽ జసుత శ్చిరం
తాత్రీయాకర్ణ ముక్త్వర్ధ మథ చింతాం గతో నృపః॥ ౬౪

తత్కాలే బ్రహ్మపుత్రస్తు నారదో ముని సత్తమః
వాదయన్ మహతీంవీణా మయోధ్యాం ప్రవివేశ సః॥ ౬౫

రాజా దశరథ స్తం హి పూజయామాస భక్తితః
సింహాసనే మహాదివ్యే సన్నివేశ్య యథావిధి॥ ౬౬

రాజాశ్లో॥ పాతాళే బ్రహ్మలోకే వా కించిత్రం వర్తతేఽవనౌ ౬౭

---

* పుత్రోత్పత్తేశ్చ ఋణ నివర్తకత్వం నరకోద్ధారకత్వం ఉత్తమలోక ప్రాపకత్వం వంశాభివృద్ధికరత్వం చ శ్రుతావుక్తం। ఋణ నివర్తకత్వే తావత్ జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిః ఋణవాన్ జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయాపితృభ్యః ఏషవా అనృణోయః పుత్రీ ఇతి, నరకోద్ధారకత్వేచ పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్రఇతి, ఉత్తమలోక ప్రాపకత్వే చ నా పుత్రస్య లోకోఽస్తీతి। వంశాభివృద్ధి కరత్వే చ ప్రజాం తంతుం మావ్యవ చ్ఛేత్సీః ఇతి। ఏతాదృశః పుత్రో నాభూదితి దశరథః విచారయామాస॥

೬೪ కాని దశరథునకు సుమిత్రాదేవియందును సంతానము కలుగనందున మూడవ ఋణముయొక్క విముక్తినిగూర్చి (అనగా పితృఋణమును దీర్చునుపాయము లేకపోయెనని) యొకదినమున విచారింపఁ జొచ్చెను.

೬೫ అట్టిసమయమున బ్రహ్మపుత్రుడగు నారదమహర్షి మహతియను పేరుగల వీణను వాయించుకొనుచు నయోధ్యాపురికి వచ్చెను.

೬೬ దశరథమహారాజు నారదమహర్షిని సింహాసనమునందుఁ గూర్చుండఁ బెట్టి యథావిధిగ భక్తితోఁ బూజించి యీ క్రిందివిధముగఁ బ్రశ్నించెను.

೬೬౹ ఓ నారదా, భూలోకమునందుఁగాని పాతాళలోకమునందుఁగాని బ్రహ్మలోకమునందుఁగాని క్రొత్తవిశేషములున్నచోఁ జెప్పుమనియె.

---

* పుత్రోత్పత్తివలన ఋణనివృత్తియు నరకోత్తీర్ణతయు నుత్తమలోకప్రాప్తియు వంశాభివృద్ధియు కలుగునని శ్రుతియందుఁ జెప్పబడెను. ఋణనివృత్తి విషయమై యిటులఁ జెప్పబడెను. (ఏమన) బ్రాహ్మణుడు మూడుఋణములతోఁ బుట్టుననియు నా మూడుఋణములలో ఋషిఋణము బ్రహ్మచర్యముచేతను దేవతాఋణము యజ్ఞములచేతను పితృఋణము పుత్రోత్పత్తిచేతను తీర్చవలయుననియు నెవడు పుత్రవంతుడో వాడే పితృఋణవిముక్తుడగుననియు (చెప్పబడినది) నరకోత్తీర్ణత విషయమున (పున్నామ నరకమునుండి రక్షించువాడు గాన పుత్రుడను శృత్యర్థము ప్రమాణము. పుత్రునివలన నుత్తమలోకప్రాప్తి కలుగు ననువిషయమున (పుత్రులులేనివానికి నుత్తమగతులులేవు) అనుశృత్యర్థము ప్రమాణము. వంశాభివృద్ధి పుత్రునివలనఁగలుగు ననువిషయమున (సంతాన తంతువును తెంపకుము) అను నుపనిషద్వాక్యము ప్రమాణము. ఇట్టిశ్రేయస్కారణభూతుడగు పుత్రుడు కలుగకపోయెనని దశరథుడు విచారించుచుండెను.

1నారదః॥శ్లో॥ బ్రహ్మలోకాదహంప్రాప్తః పృథివీం శృణుభూపతే।
సర్వేవిలోకితా దేశాః నరనారీ ప్రపూజతాః ౬౭

యథా దృష్టా మయా రాజ న్కన్యా కేకయభూపతే
నైవ దేవీ న గంధర్వీ యథా సా కిం వర్తతే॥ ౬౮

అహ మశ్వపతే రాజ న్గృహం గత్వా వ్యలోకయం
తస్యా హస్తే మయా దృష్టో రేఖాహ స్తగతా స్తథా॥౬౯

తాం దృష్ట్వా శీఘ్రముత్థాయ ప్రాప్తోస్మి చ తవాంతికం
తస్యాః పాణించ గృహ్ణీష్వ యత్నేన ఖలు భూమిప॥ ౭౦

తస్యాం పుత్రో యశస్వీ చ మహాజ్ఞానీ మహాతపాః।
భవిష్యతి మహారాజ తవ పుత్రో న సంశయః॥ ౭౧

శ్రావయిత్వా తు రాజానం దేవర్షిః పరమద్యుతిః
బ్రహ్మలోకంయయా ధీమా న్నృపమామంత్ర్యవైతదా॥ ౭౨

రాజా దశరథ స్తాం హి రూపేణా ప్రతిమాం భువి।
శ్రుత్వాశుశోచలాభార్థంకథంప్రాప్స్యామితాంప్రియాం॥ ౭౩

ఇత్యాశ్చర్యరామాయణే
షష్ఠస్సర్గస్సమాప్తః

---

1. మార్కండేయ రామాయణే.

౬౭ నారదుఁ డపుడిట్లు పలికెను. ఓ దశరథా! నేను బ్రహ్మలోక మునుండి భూలోకమునుఁ బొంది స్త్రీ పురుషులచేఁ బూజితములైన యీభూమండలములోని దేశములన్నియుఁ జూచితిని.

౬౮ ఓ రాజా! కేకయరాజపుత్రికయగు కైకేయివంటి సౌందర్యవతిని దేవతాస్త్రీలలోఁగాని గంధర్వస్త్రీలలోఁగాని నేను చూచియుం డలేదు.

౬౯ ఓరాజా! నేను అశ్వపతి మహారాజ గృహమునకు వెళ్ళినపుడు వానిపుత్రికయగు కైకేయియొక్క హస్తమును హస్తగత రేఖలను జూచితిని.

౭౦ ఆ కైకేయినిఁ జూచి నీసమీపమునకు శీఘ్రముగా వచ్చితిని. ఆమెను నీవు ప్రయత్నముచేసి వివాహమాడుము.

౭౧ ఆ కైకేయియందు మహాజ్ఞానియును మహాయశస్సంపన్నుఁడునగు కుమారుఁడు నీకు కలుగఁగలఁడు సందియములేదు.

౭౨ గొప్ప తేజస్సు జ్ఞానము గలిగిన నారదమహర్షి దశరథమహారాజునకుఁ బైవిధముగ కైకేయీ వృత్తాంతమును వినిపించి తదనుజ్ఞచే బ్రహ్మలోకమును గూర్చి వెళ్ళిపోయెను.

౭౩ దశరథుఁడు నారదమహర్షివలన కైకేయి, సౌందర్యమున నసమానురాలని విని యాకైకేయిని నేనెటుల భార్యనుఁగాఁ బొందగలను. నాకెట్లులభ్యమగునని విచారింపఁదొడఁగెను.

ఆశ్చర్యరామాయణమున నాఱవ సర్గము ముగిసెను,



## సప్తమ సర్గ ప్రారంభః

అథతత్రాగతా రాజ్ఞ స్సమీపం దేవయోగినీ।
తయాపృష్టోమహారాజః కిం త్వం ధ్యాయసిభూమిప॥ ౧

రాజోవాచ॥శ్లో॥ఇదానీంనారదోదేవివిహ్యాగతోమమసన్నిధేః
తేన రూపం హి కైకేయ్యాః మమ సర్వం నివేదితం॥౨

కథం ప్రాప్స్యామ్యహం తావదితి శోచామి పండితే।౨౺

యోగినీ॥శ్లో॥మోహినీ నరనారీణాం రూపిణీ జనహారిణీ।
ప్రాపయామి మహాభాగ కైకేయీం తవ సన్నిధిం॥ 3౺

ధైర్యం కురుమహారాజ దూతిభావే మయిస్థితే।
పరంతు శ్రుణు కాకుత్స్థ సతాం ధర్మో నచేదృశః॥ ౪౺

తస్మాత్తస్యాస్త్వయాసార్థంవివాహార్థంయతామ్యహం।
రాజ్ఞా సభాజితా సాపియయౌ శీఘ్రం చ యోగినీ॥ ౫౺

సాహి స్వల్పేన కాలేన ప్రాప్తా కేకయపత్తనం।
నాగరైః పూజ్యమానా సా నరస్త్రీరేఽవసత్తదా॥ ౬౺

## స ప్త మ స ర్గ ప్రా ర ం భ ము

౧ అనంతరము యోగినియొక్కతె దశరథునిసమీపమునకు వచ్చినదై జేనినిగూర్చి నీవు విచారించుచుంటివో చెప్పుమని దశరథునిఁ బశ్నించెను.

౨ దశరథుఁడిటులఁ జెప్పనారంభించెను. ఓయోగిని ! ఇంతకుముందు నారదుడు నాయొద్దకువచ్చి కైకేయీ సౌందర్యమునుగూర్చి వర్ణించి చెప్పెను.

౨½ ఓ పండితురాలా! ఆకైకేయి నాకెట్లు లభ్యమగునని విచారించు చుంటినని దశరథుడు యోగినితోఁజెప్పెను.

౩½ యోగిని దశరథునితోనిటుల జెప్పనారంభించెను. ఓ దశరథుడా స్త్రీపురుషులను మోహింపజేయు సమర్థత నాకుంగలదు మఱియు నేను జనులనాకర్షింపఁగల శక్తిగలదానను కైకేయిని క్షణకాల ములో నీయొద్దకు దీసికొని రాగలను.

౪½ ఓ దశరథ మహారాజా! నేను దూతికగానుండగా, నీకు విచారమేల ధైర్యముగా నుండుము, కాని యీపని సత్పురుషులకు సమ్మతము కానేరదని తలచెదను నేను చెప్పునది వినుము.

౫½ రహస్యముగా నామెనుఁ దెచ్చి వివాహముచేసికొనుట సజ్జననింద్య ముకౌన నామెకును నీకును వివాహమగునటుల నేనుయత్నించెదను. ఇవ్విధముగ జెప్పి దశరథునిచేఁబూజింపఁబడి తదనుమతిచే కేకయ పట్టణమునకుఁ బ్రయాణమయ్యెను.

౬½ ఆ యోగిని స్వల్పకాలములోనే కేకయపత్తనమునకు వెళ్ళి యొక సరోవరతీరమునఁ జపము చేయుచున్న దానివలె నటించుచు నగర వాసులచేఁ బూజింపఁబడుచుండెను.

కైకేయీ స్నాతు మాయాతా కదాచిచ్చేటికావృతా।
సుతా మశ్వపతే ర్దృష్ట్వా లేభే సా పరమాంముదం॥ ౭౫
కన్యా సాఽశ్వపతేః పుత్రీస్నాత్వాప్రాప్తా చ యోగినీం।
నత్వా పురఃస్థితా భక్త్యా యోగినీ సా వదచ్చ తాం॥౮౫
రాజలక్షణసంయుక్తా రాజపత్నీ భవిష్యసి॥ ౯
తస్యా వాక్యం నిశమ్యాథ మందహాస స్తయా కృతః।
తయా నీతా మానితా చ భవనే తు నృపస్యచ॥ ౧౦
ప్రాసాదోపరి దత్త శ్చ వాస స్తస్యా స్సుభావహః
కదాచి త్తైకయీం ప్రాహ యోగినీలోకమోహినీ।౧౧
పృథివ్యా స్సాగరాంతాయాః రాజా భర్తా భవేద్యది।
తర్హి రూపస్య సాఫల్య మన్యథా వ్యర్థ మేవ హి॥౧౨
అయోధ్యానామ విఖ్యాతా విష్ణో రాద్యా పురీశుభా।
తస్యాం పుర్యాంతుభూపాలో నామ్నా దశరథో మహాన్ ౧౩
ఈదృశో యది తే భర్తా సఫలం తవ జీవితం।
ఇత్థం నివేదితా కన్యా తస్మిం శ్చేతో దధార సా॥ ౧౪
ఉదాసీనా నిరాహారా స్థితా సా వికలంక్రియా।
సుతా కేకయరాజస్య యోగిన్యా ఉపదేశతః॥ ౧౫

౭౪ కైకేయి యొకపర్వదినమున సఖురాండ్రతో గూడి సరస్సులో స్నానము చేయుటకు రాగా యోగిని యాకైకేయినిఁ జూచి తన కార్యము సఫలమగునని సంతసించుచుండెను.

౮-౯ కైకేయియును స్నానముఁజేసి పురజనులచే సేవింపబడుచున్న యోగినిని దర్శించుటకువచ్చి భక్తితో నమస్కరించి విధేయతతో నిల్వబడియుండగా యోగిని కైకేయికిట్లాశీర్వదించెను. ఓరాజపుత్రి! నీవు రాజలక్షణములుకలదానవుగా గన్పడు చున్నందున తప్పక సార్వభౌమునకు భార్యవుకాగలవని (యోగిని కైకేయితో జెప్పెను.)

౧౦ ఆయోగినివాక్యమును కైకేయి విని మందహాసము చేయుచు యోగినిని రాజగృహమునకు తీసికొనివెళ్లి గౌరవించెను.

౧౧ ఆయోగినికి తన మేడపైభాగమున కైకేయి నివాసమునుఁగల్పించెను ఆమెకు నివాసమనుకూలముగా నుండెను. ఇట్లుండ నొకప్పుడు లోకమోహినియగుయోగిని కైకేయినిఁగూర్చియిటులబల్కెను.

౧౨ ఓ రాజపుత్రి! చతుస్సముద్ర పర్యంతమగు భూమండలమునుఁ బాలించుసార్వభౌముడు నీకుభర్తయైనచో నీసౌందర్యము సఫలమగును, లేనిచో వ్యర్థమగుననియె.

౧౩ ఓ రాజపుత్రి! అట్టిసార్వభౌముడెవడుండెనని నీకు సందియమన వసరము. అయోధ్యయనుపట్టణము విఖ్యాతమైయుండెను. ఆ పట్టణమునఁదు దశరథుడను సార్వభౌముడుండెను,

౧౪ ఇట్టి సార్వభౌముడైన దశరథుడు నీకు భర్తయైనచో నీజీవితము సఫలమగునని యోగిని చెప్పగా నారాజపుత్రిక యగు కైకేయి యొక్క మనస్సు దశరథునియందు ప్రవేశించెను.

౧౫ యోగిని, కైకేయీ మనమును గ్రహించి ఓరాజ పుత్రి! నీవునిష్కారణముగ అన్నపానాదులను ముట్టకుండగ నుండుము నీకోరిక సఫలముకాగలదని యుపదేశింపగా నాయోగిన్యుపదేశముచే కైకేయి, మౌనముఁదాల్చి యాహారమును భుజింపక యలంకారములను ధరింపక యుండెను.

తస్యా ఆశ్యస్తు తాం దృష్ట్వా భయభీతాఽవావసత్।
విలోక్య కైకయీం మాతా వచనంచేదమబ్రవీత్॥౧౬

కిం వికృతిం గతాసి త్వం పుత్రి మే వద సత్వరం।
శరీరే తవ కా వ్యాధిస్తాంయత్నాన్నాశయామ్యహం॥౧౭

యదా సా నోత్తరం ప్రాదాత్తదా సా యోగినీంగతా।
సుతా మే త్వీదృశీం ప్రాప్తా దశాం వై కేన హేతునా॥ ౧౮
యోగినీ॥అయోధ్యా వర్ణితా తస్యాః పతిర్దశరథస్తథా।
వర్ణితో భూన్మయా సర్వవర్ణనే రాజ్ఞిసత్తమే॥ ౧౯

తచ్ఛ్రుత్వా కైకయీమాతా గత్వా భర్తారమబ్రవీత్।
రాజ్ఞా దశరథేనైవ కుమార్యాః పాణిసంగ్రహం॥
కర్తుం యతస్వ భో నాథ తచ్చిత్తాభూత్సుతాయుతః॥ ౨౦

తచ్ఛ్రుత్వా కేకయో రాజా తథేత్యుక్త్వా సభాంగతః॥
మంత్రిభిస్సహ వై చక్రే తద్వార్తాం సదసి త్వరం॥ ౨౧
మంత్రిణః॥శ్లో॥తస్మై కన్యా ప్రదాతవ్యాఽనంగరూపాయసత్వరం।ఇతి తేషాం ప్రబ్రువతాంమంత్రిష్వేకోఽవదత్తదా॥ ౨౨

౧౭ కైకేయి యొక్క సఖురాండ్రు కైకేయిస్థితినిఁజూచి భయభీతులై యుండిరి. కేకయపత్నియు తనపుత్రికస్థితినిఁజూచి యివ్విధముగఁ బల్కెను.

౧౭ ఓ పుత్రి! నీశరీరములో వ్యాధి యేదియో చెప్పుము నీవు మానముతో నుండి యాహారాదులను విసర్జించుటకుఁ గారణము వ్యాధియా, లేక మతియొక్కటియా దాపక వెంటనే చెప్పుము. నీకు నేను చికిత్సచే యించెదననియె.

౧౮ కైకేయి యెప్పుడు ప్రత్యుత్తరమును జెప్పకపోయెనో యప్పుడు కైకేయితల్లి యోగినియొద్దకు వెళ్లి ఓ యోగిని! నా పుత్రికయగు కైకేయి యేకారణముచే నిట్టిదశను బొందెనో జెప్పుమని యడిగెను.

౧౯ యోగిని, కైకేయి తల్లితో నిటులఁజెప్పెను ఓరాజపత్నీ! నీకొమరిత నన్నే యేదేశములను జూచితివని యడుగగా నేజూచిన దేశముల నన్నిటిని వర్ణించుచు నయోధ్యాపట్టణమును దాని ప్రభువగు దశరథుని వర్ణించితిని అది మొదలుకొని యెందుచేతనో నీకొమరిత వికారమును బొందియున్నది,

౨౦॥ కేకయపత్ని యావాక్యమును విని భర్తను సమీపించి యోనాథా! నీకొమరితను దశరథునకిచ్చి వివాహముచేయఁ బ్రయత్నింపుము. (ఏలనన) నామెచిత్తము యోగినివలన దశరథునిగుణములను విన్నది మొదలుకొని యతనియందే లగ్నమైయున్నది యని యూహించెదననియె.

౨౧॥ భార్యయొక్క వాక్యమును కేకయరాజు విని యవ్విధముగనే ప్రయత్నించెదనని చెప్పి సభాస్థలమునకేగి, సభలోని మంత్రులతోఁ దన కొమరితను దశరథునికిచ్చి వివాహముఁ జేసెదనను విషయమును జెప్పెను.

౨౨॥ అప్పుడు మంత్రులు కేకయరాజుతో నిట్లుచెప్పిరి. ఓకేకయమహారాజా! మన్మథునితో సమానుడగు దశరథసార్వభౌమునకు కైకేయి నిచ్చి వివాహముఁజేయుట మాకుసమ్మతమని మంత్రులుకొందఱు చెప్పుచుండగా నప్పుడొక మంత్రి, రాజుతో నిట్లనియె.

శ్రూయతే ఖలు వృద్ధోహి రాజా దశరథః కృతీ ।
పురంధ్ర్య స్సంతి బహ్వ్యశ్చ తస్యరాజ్ఞోమహీపతేః॥ ౨౩
కథం దేయా హ్యపుత్రాయ బహుపత్నీయుతాయచ।
తదా ప్రోవాచ గర్గస్తు విప్రో రాజపురోహితః॥ ౨౪

సత్రం కృతం కుబేరేణ శ్రీహరేః ప్రీతికామ్యయా ।
తస్మిన్యజ్ఞేఋషిగణా శ్శంకరం ప్రాబ్రువం స్తదా॥ ౨౫
గంగాధర నమస్తుభ్యం సర్వంజానాసి తత్త్వతః ।
రావణో రాక్షసైస్సార్ధం కదా నాశం వ్రజిష్యతి॥ ౨౬
శివః॥ అయోధ్యాయాంమహాపుర్యాం రాజాదశరథోవసేత్
తస్య పత్నీ సుమిత్రా చ కౌసల్యా భానుమంతజా॥
అపరా కైకయీనామ తాసు పుత్రా మహాబలాః
భవిష్యంతిహి చత్వారః తేషాం జ్యేష్ఠోహనిష్యతి॥ ౨౭-౨౮
ఇతి వృత్త మహం యజ్ఞేహ్య శ్రౌషం త్ర్యంబకాత్పురా
తస్మా దైక్ష్వాకవే దేయా కన్యేయం భో నరేశ్వర॥ ౨౯
రాజా॥ గత్వాయోధ్యాంప్రకర్తవ్యోవివాహస్తుత్వయాద్రుతం
కైకేయ్యా స్తస్య భూపస్య సమయేన త్వయానఘ॥ ౩౦
కైకేయ్యాం మమపుత్ర్యాం యఃరాజ్ఞఃపుత్రో భవిష్యతి
రాజ్యంతస్మైప్రదేహిత్వంసత్యేనానేనగృహ్యతాం॥ ౩౧

౨౩ ఓకేకయమహారాజా! దశరథమహారాజు, కడువృద్ధుడని వినుచుంటిమి ఆరాజునకు బహుభార్యలుండిరని కూడ వినుచుంటిము.

౨౪ మఱియు సంతానము లేకపోవుట, బహుభార్యలుండుట, యనుదోషద్వయముకల దశరథునకుఁ గైకేయినెటుల నిచ్చెదవు; అని యొకమంత్రి చెప్పగా నప్పుడు కేకయరాజపురోహితుడగు గర్గమహర్షి రాజుతో నిట్లు పలికెను,

౨౫ ఓ రాజా! పూర్వమునందు కుబేరుడు శ్రీహరికి ప్రీతినిఁగొల్పుటకు సత్రయాగమును జేసెను ఆయాగమునందు మహర్షులు శంకరుని గూర్చి యిటుల బలికిరి.

౨౬ ఓ మహేశ్వరుడా! నీకు నమస్కారము నీవు సర్వమును నెఱుగుదువు రాక్షస సహితముగా రావణుడెప్పుడు నశింపఁగలడు (అని ఋషులు శంకరునడిగిరి)

౨౭-౨౮ పరమేశ్వరుడు మహర్షులతో నప్పుడిటుల జెప్పెను అయోధ్యాపట్టణమున దశరథుడను మహారాజుండును. వానికి కౌసల్య సుమిత్ర కైకేయి, యను ముగ్వురు భార్యలుందురు, దశరథునకా ముగ్వురియందును నలుగురు కుమారులు గలుగుదురు వారిలో జ్యేష్ఠుడగు రాముఁడు రావణుని సంహరింపగలఁడు. (అని శంకరుడు చెప్పెను.)

౨౯ ఈ విధముగ నేను పూర్వమునందు శివునివలన వినియుంటిని ఆకారణమువలన, ఓ కేకయరాజా! నీ కొమరితను నిక్ష్వాకువంశీయుడగు దశరథునకీయుము (అని గర్గమహర్షి, రాజుతోఁ జెప్పెను.

౩౦ కేకయరాజు, గర్గమహర్షితో నిటులఁ జెప్పెను ఓ గర్గమహర్షీ! నీవయోధ్యకేగి కైకేయీ దశరథులకుఁ బ్రతినపూర్వమగు వివాహ రాయబారమును జరుపుము,

౩౧ ఓగర్గమహర్షి! ఆదశరథుడు, నాపుత్రికయగు కైకేయియందు కలిగిన కొమరునకు రాజ్యమిచ్చునటుల వానిచే శపథముఁజేయించి కైకేయిని వివాహము జేసుకొనునట్లు నేర్పరుపుము (అని కేకయరాజు పురోహితునితో జెప్పెను.

1 గర్గః॥ గమిష్యామి మహారాజ నగరం ప్రతి భూపతే
వివాహం కారయిష్యామి పుత్రాస్తే సమయేన తు॥ ౩౨
రాజాజ్ఞయా తు గర్గోఽపి సాకేతం నగరం గతః
దదర్శాజసుతం రాజా సంపూజ్య మునిమబ్రవీత్ ॥ ౩౩
సాంప్రతం జన్మసాఫల్యం జాతం మే భవదాగమాత్
భవ్యటంతి మహాత్మానో పునంతో నిఖిలం జగత్ ॥ ౩౪
గర్గః॥ శ్లో॥ యశసా తవ హే రాజన్ కర్ణాపూర్ణా మమానఘ
నేత్రయో స్సఫలార్థాయ సన్నిధిం గతవానహం॥ ౩౫
ఆశయా చాగతో రాజ న్నహం దూరా త్తవాంతికం
పూర్ణాం కురు మమాశాం చ వదాన్యానాం శిరోమణే॥ ౩౬
రాజా॥ శ్లో॥ తద్వివాహం కరిష్యామి ప్రాణైరర్థైశ్చ
సాధయే॥ ౩౭
గర్గః॥ శ్లో॥ ప్రేషితోఽహం నరేంద్రేణ కాశ్మీరస్యాధిపేన తు
తుభ్యం దాస్యతి కన్యాం స్వాం సమయేన నరాధిపః॥ ౩౮
సమయం శృణు భో రాజన్ రాజ్ఞ స్తస్య మహాత్మనః
కైకేయ్యాం మమ కన్యాయాం యస్తు పుత్రో భవిష్యతి
తస్మై రాజ్యం దదా త్వేవం గృహాణ తు మమ కన్యకాం॥ ౩౯
అనేన సమయేనాపి వివాహం కురు భూమిప॥ ౪౦

1. మార్కండేయ రామాయణే.

౩౨ గర్గమహర్షి రాజుతో నిట్లనెను, ఓ రాజా! నేనయోధ్యాపురికేగి నీవుచెప్పిన విధముగనే కైకేయీదశరథులకు వివాహము నేర్పర చెదను.

౩౩ ఈవిధముగ గర్గమహర్షి,రాజుతోఁజెప్పి రాజునను జ్ఞనుఁబడసి సాకేత పురికేగి దశరథుని సందర్శింపగా దశరథుడు గర్గమహర్షినిఁ బూజించి యిట్లుఁ బల్కెను.

౩౪ ఓ గర్గమహర్షి! నీరాకచే నాజన్మము సఫలమయ్యెను మీవంటి మహాత్ములరు పనిలేకపోయినను లోకమును పవిత్రముఁజేయుటకై భూమియందు సంచరించుచుందురు అని దశరథుడు పలికెను.

౩౫ అప్పుడు గర్గమహర్షి యిట్లనెను. ఓ దశరథమహారాజా! నీకీర్తిచే నాశ్రోత్రములు పూరితములైయున్నవి నేత్రములకుఁగూడ సాఫ ల్యము కలుగజేయుట కొఱకు నీసమీపమునకు వచ్చితిని.

౩౬ మఱియు, ఓ.రాజా! నేనొక కోరికతో దూరదేశమునుండి నీదగ్గరకు వచ్చితిని దాతలలో శ్రేష్ఠుడగు దశరథా! నాకోరికను సఫలము జేయుము (అని గర్గమహర్షి జెప్పెను).

౩౭ గర్గమహర్షితో దశరథుడిట్లుచెప్పెను నాయొక్క యర్థములచేతను ప్రాణములచేనైనను నీవుకోరిన కార్యమును నెరవేర్చెదనని చెప్పెను.

౩౮ గర్గమహర్షి రాజుతో నిట్లనెను. ఓ రాజా! కాశ్మీరదేశ ప్రభువగు కేకయరాజు తనపుత్రికయగు కైకేయిని ప్రతినపూర్వకముగ నీకు నీయగలడు

౩౯ ఓ రాజా! ఆప్రతిజ్ఞను జెప్పెదను వినుము కైకేయియందు నీకు గలిగిన కొమరునకు రాజ్యము నిచ్చెదనని ప్రతినజేసి యాకన్యను గ్రహింపుమని యతనిప్రతినయైయున్నది.

౪౦ ఓ రాజా! ఈ ప్రతిన నంగీకరించితివేనను నామెను వివాహము జేసు కొనుమని గర్గమహర్షి జెప్పెను.

రాజా స్వగతం॥ శ్లో॥ వినా హ్యస్తు మమాభీష్టం న పుత్రే రాజ్యమర్ప
ణం యది చేన్మమ పుత్రాశ్చ భవిష్యంతి హ్యపుత్రిణః॥ ౮౧
1 తేచాపి స్వస్య వంశస్య మర్యాదాం చ కుమారకాః।
న త్యజంతి మహాత్మాన స్స్వాదావిక్ష్వాకునా కృతాం॥ ౮౨
ఇతి నిశ్చిత్య రాజా చ వసిష్ఠాదిభి రాత్మవాన్
పురంధ్రీభిస్సమాలోచ్య తాభిశ్చ ప్రేరితోఽవదత్॥ ౮౩
యథా వదసి భో విప్ర తథైవ కరవాణ్యహం
ఇత్యుక్త్వా రాజసుతస్సద్యః। కాశ్మీరం ప్రతి నిర్యయౌ॥ ౮౪
కాశ్మీర దేశపాలేన పూజితః పరమార్హణైః
చకార గ్రహణం పాణేః కైకేయ్యా రాజపుంగవః॥ ౮౫
కాశ్మీరస్య పతిః ప్రీతః పారిబర్హం దదౌ ముదా
మంథరామపి దాసీం చ కైకేయ్యాః ప్రీతికారిణీం ౮౬
రేమే రాజా తయా సార్ధం సంవత్సరగణాన్ బహూన్
పాలయంశ్చ యథా దేవ స్త్వయోధ్యాయాం
తథా నృపః॥ ౮౭
తస్మిన్కాలే దేవతానాం దానవానాం చ సంగరః
అభవత్సంగరే తస్మిన్సంబరేణ జితాస్సురాః॥ ౮౮
తదాభవ ద్దైవవాణీ యత్రాయోధ్యాపతిర్మహాన్
జయస్తత్ర న సందేహః సమానయత తం త్వితి॥ ౮౯

---

1 సత్యోపాఖ్యాన రామాయణే.

౪౧-౪౨. దశరథుఁడు తనలో నిట్లూహించెను కైకేయిని వివాహమాడుట నాకు సమ్మతమే కాని యామెకు గలిగిన పుత్రునకు రాజ్యమునిచ్చుటకు శపథము చేయుటయనునది సమ్మతము గాదు కాని సంతానమే లేని నాకు పుత్రులు కలిగినచో నాకుమారులును తమ వంశమర్యాదను నతిక్రమింపరు.

౪౩. ఇవ్విధముగ దశరథుఁడు నిశ్చయించి వశిష్ఠాదులతోడను తనభార్యలతోడను నాలోచించి వారిచే ప్రోత్సహింపబడి గర్గమహర్షిని గూర్చి యిటులపల్కెను.

౪౪. ఓ మహర్షి! నీవుచెప్పిన ప్రకారముగా కైకేయిని వివాహమాడెద ననిచెప్పి దశరథుడు వెంటనే తనపరివారముతో కేకయరాజ పట్టణమునకేగెను.

౪౫. కేకయరాజుచేఁ బూజింపబడి దశరథుడు కైకేయిని యథావిధిగా వివాహముఁజేసుకొనెను.

౪౬. ఆసమయమున కేకయరాజు దశరథునకు పారితోషికముల ననేకములుగనిచ్చెను మఱియు కేకయరాజు తనపుత్రికకుఁ బ్రేమాస్పదమైన మంథరయను దాసినిగూడ నిచ్చెను.

౪౭. దశరథుఁడు కైకేయితోఁగూడ శచీదేవితో దేవేంద్రుఁడువలె నయోధ్యాపట్టణమున బహుసంవత్సరములు సుఖించెను.

౪౮. ఆకాలమున దేవదానవులకు యుద్ధము జరిగెను. ఆయుద్ధమునందు శంబరుడను రాక్షసునిచే దేవతలు జయింపబడిరి.

౪౯. అప్పుడు దైవవాణి యిట్లు వినఁబడెను. ఓ దేవతలారా ? అయోధ్యాపట్టణమునకుఁ బ్రభువగు దశరథుడే పక్షమునందుండునో యాపక్షమున జయముగలుగుటకు సందియములేదు కావున నతనిని తీసుకొని రండు అని యాకాశవాణి వినబడెను.

1 శృత్వాగిరం సుమనస స్సాకేతాధిపతిం నృపం
ఆనేతుంచ జగత్ప్రాంగ్రేష యామాసురద్భుతాం॥ ౧౦॥

సమీరణ ప్రార్థనయా తదా దశరథో నృపః
కైకేయీసహిత స్తూర్ణం రథామాఢో వినిర్యయౌ॥ ౧౧॥

తత్ర గత్వా దశరథ శ్చకార కదనం మహత్
శంబరోపి మహామాయా స్సంగరేతు ప్రయుక్తవాన్॥ ౧౨॥

వ్యాఘ్రరూపీ సింహరూపీ వ్యాళరూపృథ శంబరః
నానాభీకర రూప స్సన్నృపోపరి సమాయయౌ। ౧౩॥

వారయామాస మాయాస్తాః ధవళాంగ మహర్షిణా
ఉపదిష్టాన్మంత్ర బలాత్కైకేయీ సంగరే తదా॥ ౧౪॥

ఏతస్మిన్నంతరే రాజా భిన్నాక్షం స్వరథం పునః
సంగ్రామ సంభ్రమాత్తత్ర నావిదద్రణకౌతుకీ॥ ౧౫॥

1. ఆనంద రామాయణే.

౫౦౪ ఆకాశవాణిని దేవతలువిని, యయోధ్యాపురీశుడగు దశరథునిఁ దీసికొనివచ్చుటకు వాయుదేవునిఁ బంపిరి.

౫౧౪ వాయుదేవుడు సాకేతపురికేగి దశరథుని రాక్షసులతో యుద్ధము చేయుటకు రమ్మని కోరగా, నా వాయుదేవుని ప్రార్థనచే దశరథుడు కైకేయీ సహితముగ రథారూఢుడై బయలుదేఱెను. (కైకేయి తనభర్తయైన దశరథుడు రాక్షసులతో యుద్ధమునకు వెళ్ళుచుండుటచే రాక్షసులవలన నేమిప్రమాదము వచ్చునోయని రాక్షసమాయలనుఁ దెలిసిన తానుకూడ బయలుదేఱెనని యూహింపఁదగు)

౫౨౪ దశరథుడు శంబరాసురుని పట్టణమునకేగి రాక్షసులతో గొప్ప యుద్ధమునుఁ జేసెను. ఆయుద్ధమునందు శంబరాసురుడును తన రాక్షస మాయలనుఁ దశరథునిమీదఁ బ్రయోగించెను

౫౩౪ మఱియు శంబరాసురుడు వ్యాఘ్రరూపముతోడను, సింహరూపముతోను, సర్పాకారముతోను, మఱియు నితరములగు భయంకర రూపములతోను దశరథునిమీదికి వచ్చుచుండెను.

౫౪౪ దశరథుని సమీపమునందున్న కైకేయి, బాల్యమునఁ దండ్రి గృహమునందున్నప్పుడు ధవళాంగమహర్షి పరిచర్య చేసినందున నమ్మహర్షి సంతసించి కైకేయికి రాక్షసమాయలకుఁ బ్రతిక్రియల నుపదేశించెను. అధవళాంగమహర్షిచే నుపదేశింపఁబడిన మంత్రబలముచేతను యుద్ధములో శంబరాసుడు దశరథునిమీదఁ బ్రయోగించిన మాయలనన్నిటిని నివారించెను.

౫౫౪ ఈ సమయమునందు దశరథునిరథ చక్రముయొక్క శీల విఱిగి పోయెను. ఆసంగతి గుర్తెఱుంగక దశరథుడు యుద్ధమునందలి వేడుకతో తొందరలో నుండెను.

* రాజ్ఞోఽంతికే స్థితా సుభ్రూః కైకేయీ స్వరథం పునః
భిన్నాక్షం తు దదర్శాఽథ వామహస్తం నిజం పునః।
అక్షస్థానే చకారాఽశు స్వపతేర్జయహేతవే॥ ౫౬-౫౭

* నన్వక్షస్థానే కైకేయ్యాః హస్తనిక్షేపణే కథం తన్నభగ్నమితిచేదత్రోచ్యతే, కదాచిత్కేకయగృహం ధవళాంగముని రాగతః కేకయశ్చ నియుక్తవాన్ కైకేయీం తత్సేవార్థం. కైకేయీ చాపి బహుధా తస్య పరిచర్యాం చకార ॥శ్లో॥ గంతుకామం మునిం దృష్ట్వా వరం వవ్రేఽథ కైకయీ। తా మువాచ మునిస్త్వాం తు చక్రవర్తీ వరిష్యతి। తవ వామకరం వజ్రి త్కఠినం భవతి ధ్రువం। యతస్త్వం వామహస్తేనా కరోర్మము నమస్కృతిం॥ ఇత్యుక్త్వా రక్షసాం మాయానాశినీశ్చ పతి క్రియాః। ఉపదిశ్య చ కైకేయ్యై గతవాన్ధవళాంగక ఇతి ఆనందరామాయణాది వచన ప్రామాణ్యాత్ కైకేయ్యాః శాంబరీమాయానివారణ శక్తిః వజ్రాధిక కాఠిన్య వామకర ప్రక్షేపణశక్తిశ్చ సంజాతేతి సుస్థం.

1 అథ జిత్వా రణే దైత్యాన్ దృష్ట్వా తత్కర్మ పార్థివః
దదౌ వరౌ ద్వౌ కైకేయ్యై తయా న్యాసీకృతౌ నృపే
యదాహి యాచయిష్యామి తదా త్వం దేహి తావితి॥ ౫౮

1 అ॥ ఝ॥

*౨౬_౨౮ దశరథుని సమీపమునందున్న కైకేయి, తన రథచక్రముయొక్క శీల విఱిగినట్లు తెలిసికొని దశరథునకు ప్రమాదము లేకుండునట్లు తన వామహస్తమును చక్రముయొక్క శీలమేకుకు బదులుగా నుంచి రథము పడకుండునట్లుచేసి దశరథునిఁ గాపాడెను,

* ౨౮. రథచక్రముయొక్క శీలమేకుకు బదులుగ కైకేయి తన వామహస్తమునుంచెనుగదా యెట్లు కైకేయియొక్క వామహస్తము విఱుగలేదని సందేహముండవచ్చును. ఈవిషయమున ఆనందరామాయణాది గ్రంథములయందిట్లు చెప్పబడినది. కైకేయి బాలికగా నున్నసమయమున నొకప్పుడు కేకయరాజగృహమునకు ధవళాంగుడను మహర్షి రాగా నమ్మహర్షికి పరిచర్యచేయుటకు కేకయరాజు, తన పుత్రికయగు కైకేయిని నియమింపగా నామె పరిచర్య బాగుగఁ జేసెను పిదప ధవళాంగమహర్షి వెళ్ళుచుండగా కైకేయి, మహర్షిని వరముఁగోరెను. అప్పుడు ధవళాంగుడు సంతసించి నీకు చక్రవర్తియగు భర్త రాగలడని వరమిచ్చి మఱియునిటులఁ జెప్పెను. నీవు నాకు ఎడమచేతితో నమస్కారము చేసినందున నీ వామహస్తము వజ్రముకంటెను కఠినమగుగాకయని చెప్పి రాక్షసమాయల ప్రతిక్రియలను తత్సంబంధమైన మంత్రముల నుపదేశించి ధవళాంగుడు వెళ్ళిపోయెను. ఇట్టి యానందరామాయణాది వచనములను బట్టి కైకేయికి శంబర మాయానివారణశక్తియు వజ్రముకంటె కఠినమైన వామహస్తమును శీలమేకుకు బదులుగా నుపయోగించు శక్తియు, కలిగెనని యెఱుగవలయును,

౨౯-౪ అనంతరము యుద్ధములో దశరథుడు రాక్షసులను జయించి, కైకేయి తనరథము పడకుండగ తన వామహస్తమును శీలమేకుకు బదులుగా పెట్టియు, శంబరమాయలను నివారించియు, రెండువిధములఁ దన కుపకారము చేసినందున రెండువరములను కైకేయిని గోరుకొనుమన, నామె నేను కోరినప్పుడు రెండువరములను నీయుమని చెప్పి దశరథునియొద్దనే దాచియుంచెను.

తతః పరం దశరథ శ్శంబరం హంతు ముద్యతః
నివారయామాస నృపం నారద స్తత్ర చాగతః॥ ౫౯

ద్వాపరే శంబరం భూప ప్రద్యుమ్నో నిహనిష్యతి
ఇత్యుక్త్వా థ గతస్స్వర్గం నారదో రామనామకృత్॥ ౬౦

అథాజపుత్ర స్స్వపురీం ప్రతి సంప్రేష్య కైకయీం
దేవేంద్రేణ సమాహూత స్స్వర్గలోక ముపాగతః॥ ౬౧

తత్రోపవేశ్య దేవేంద్ర స్స్వార్థే సింహాసనే నృపం
సన్మానయామాస తదా సుధర్మాయాం విశేషతః॥ ౬౨

అథాగత్య పురీం స్వీయాం। రాజా దశరథో నఘః
వసిత్వా స్వగృహే సర్వసౌఖ్యా న్యనుభవ న్స్థితః॥ ౬౩

అథ దశరథో దశరథసమానరథీ మహీయసా బలేన సుమనసం నామ నగరం జిగమిషయా పంకేరుహసుతసుత వసిష్ఠ మాహూయ నమస్కృత్య మునిదత్తానుజ్ఞః శతాక్షోహిణీసేనయా సహారుహ్య తురగముఖ్యం చంద్రసమానశరీర మతిరోషసమావిష్టో విష్టరశ్రవస మారాధ్య దండయాత్రాంచకార. సాధ్యోనామ స్వీయయా సేనయా వృతో దశరథాభిముఖ మాయయౌ యోద్ధుం. యుద్ధం చాన్యోన్య మభూత్.

మాస మేకం యుద్ధం కృత్వా దశరథ స్తం సాధ్యం జగ్రాహ, అథ సాధ్యసూనుం భువోభూషణ మవ

౫౯౪ దశరథుడు పిమ్మట శంబరుని సంహరింపుటకుఁ బ్రయత్నించు చుండగా, నాసమయమున నారదు డచటకు వచ్చి దశరథుని నివారించి యిటులఁ బలికెను.

౬౦౪ ఓదశరథా! ద్వాపరయుగమునందు శంబరాసురునిఁ బ్రద్యుమ్నుడు సంహరించును. కాన నీవిప్పుడుపేక్షింపుమని చెప్పి నారదుడు రామనామమునుఁ జేసికొనుచు స్వర్గలోకమున కేగెను,

౬౧౪ అనంతరము, దశరథుడు కైకేయిని తనపట్టణమునకుఁబంపి తనను దేవేంద్రు డాహ్వానించినందున స్వర్గలోకమునకేగెను.

౬౨౪ దేవేంద్రుడు దేవసభలో దశరథుని తనయర్థసింహాసనమునందుఁ గూర్చుండఁబెట్టి విశేషముగ గౌరవించెను.

౬౩౪ అనంతరము దశరథుడు తనపురమునకువచ్చి స్వగృహమునందుండి సర్వసౌఖ్యముల ననుభవించుచుండెను.

౬౪౪ అనంతరము దశరథకులతో సమానరథికుడైన దశరథమహారాజు గొప్పసైన్యముతో సుమనసమనుపట్టణముమీదికి యుద్ధమునకుఁబో దలచి బ్రహ్మపుత్రుడగు వసిష్ఠునకు నమస్కరించి తదనుమతిఁబడసి కులదైవమగు రంగనాయకుని నారాధించి చంద్రవర్ణముగల యొక యశ్వమునెక్కి శతాక్షౌహిణీసైన్యముతో సుమనసనగరముమీదికి దండయాత్రవెడలెను. సుమనసనగరాధీశుడగు సాధ్యుడనురాజు తన సైన్యముతో దశరథునకభిముఖముగా యుద్ధముఁజేయుటకు వచ్చెను వారలిద్దరకుఁ బరస్పరము యుద్ధము జరిగెను. దశరథుడు సాధ్యునితో నొకమాసము యుద్ధముచేసి వానినిబట్టుకొనెను. అనంతరము సాధ్యరాజపుత్రుడగు భూషణుడనువాడు కొలదిపరివారముతో దశరథునితో యుద్ధముచేసెను. దశరథుడు భూమికంతకు నలంకారభూతుడుగానుండిన, సాధ్యపుత్రుడగు భూషణునిఁ జూచి

1 లోకస్య యోద్ధు మేవ నైచ్ఛత్ కథ మేతాదృశం హన్మి చాస్మిన్హ తేఽస్య కథంపితా భవిష్యతి, కథం తన్మాతా, కథ మహో ప్రథయూవనా ప్రియా భార్యా, అముష్యహి పదాని నవీనతరదరదరవిందకుసుమానీవ దృశ్యంతే ప్రీతి వర్ధనోనామపుత్రో మమ హృదయ మన్యథాకరోతీతి మనసా వితర్క్య బాలకం గ్రహీతు మారభత, సచాపి పరాధీనోబభూవ, సచకుమారేణసహ పరాజయఖేద మమత్వా సుఖమధ్యువాస సదశరథోపి మాసం తత్ర స్థిత్వా తత్పుత్రసందర్శనసుఖ మవలోక్యా చింతయత్. అహో సర్వదుఃఖాపనోదనక్షమ మేతన్ముఖావలోకనం సర్వరాష్ట్రికోపిజయః పుత్రవియోగ మనుస్మరణతో దుఃఖాయ కేవలంభవతి॥ ౨౮౫

శ్లో॥వ్యర్థా జనిరపుత్రస్య రాజ్యశ్రీ శ్చనిరర్థకా
పుత్రవాన్మృతి మాపన్న శ్శోభతే నాసుత స్తథా॥౨౯౫

1. బ్రహ్మ రామాయణే.

యుద్ధము చేయుట కిచ్ఛయింపక యిట్లు విచారించెను. అయ్యో, నేనెటులనిట్టి సుకుమారుని యుద్ధమునఁ జంపుదును. వీనినిఁ జంపినచో వీని తల్లిదండ్రు లెటుల జీవింపగలరు! మఱియు నవయౌవనవతిగానుండిన యితని భార్య యెట్లు భర్తృవియోగమును సహింపఁగలదు! ఇతని పాదములు నూతనముగా వికసించిన తామరపువ్వుముల వలె నెంతయో మృదువుగా నున్నవి, ఈ సాధ్యపుత్రుడు నాకునుఁ బ్రీతినిఁ గలుగజేయుచు నాహృదయమును వేఱువిధముగా మార్చుచుండెనని వితర్కించుకొనుచు తనపైకి యుద్ధమునకు సన్నద్ధుడై వచ్చిన యా బాలకునిఁ జంపకుండగఁ బట్టుకొనెను. అతడును పరాధీను డయ్యెను. బంధితుడైన సాధ్యునియొద్దనే తత్పుత్రుడగు భూషణునిఁగూడ నిర్బంధములో నుంచెను. కాని, సాధ్యుడు తన పుత్రుడు తనదగ్గర నుండుటచే తనకుఁ గలిగిన పరాజయఖేదమును మఱచి సంతోషముతో నుండెను. ఆదశరథుడును, మాసమువరకు నచ్చటనేయుండి, సాధ్యుడు తనపుత్రుని జూచుకొనుచుఁ బొందుచున్న యానందమును జూచి తన మనమున నిట్లు విచారించెను. ఓహో! యీపిల్లవాని ముఖదర్శనము, సమస్త దుఃఖమునుఁ బోగొట్టుటకుఁ దగియున్నది. నేను రాజుల నందఱను జయించినను నాజయము పుత్రులు లేనికారణముచేతను నాకు దుఃఖకరమేకాని నాకు సుఖకరముగాదని యిట్లు విచారించెను.

౬౨౪ పుత్రులు లేనివాని జన్మము వ్యర్థము. సంపదయు నిరర్థకము. పుత్రవంతుడు మృతినొందినను శోభించును. పుత్రహీనుడటుల శోభింపడు.

స్వపుత్రిస్తు పురో గచ్ఛేద్యస్య వైశ్వానరం వహన్
స్వజనైర్నీయమానస్య మృతి రప్యుత్సవో భవేత్ ॥౧౬॥

ఇతి సంచింత్య సాధ్యాం తం పృష్ట్వా పుత్రజనిం నృపః
హయమేధాత్పుత్రజన్మ శ్రుత్వా సాధ్యముఖా త్తతః
సాధ్యాం చ తత్సుతం చాపి బంధముక్తౌ విధాయ సః
అయోధ్యా మగమత్తిష్ఠ న్పుత్రాభావవిచారవాన్ ॥౧౮॥
అథ మంత్రిణ మాహూయ రాజా దశరథో వదత్ ॥౧౯

* జరా కృతాంతదూతీవ కర్ణమూల ముపాగతా
వంశాంకురో నాభవ న్మే కిం కరోమి సుమంత్ర భోః ॥౨౦

---

* జరాం పరిత్యభియుక్తైరప్యుక్తం తథాహి॥శ్లో॥ యమమివ కరధృతదండం హరమివ సగదం శశాంకమివ వక్రం।
శివమివ చ విరూపాక్షం జరా కరోత్యకృతపుణ్యమపి॥
గాత్రం సంకుచితం గతిర్విగళితా భ్రష్టా చదంతావళిః
దృష్టి ర్నశ్యతి।వర్ధతేబధిరతా। వక్త్రంచ లాలాయతే।
వాక్యం నాద్రియతేచ బాంధవజనైః। భార్యా నశుశ్రూషతే।హాకష్టం పురుషస్య జీర్ణవయసః పుత్రో ప్యమిత్రాయతే।
ఏతాదృశదోషభూయిష్టా జరామమసమాగతా పుత్రో నాభూదితి దశరథః విచారమాపన్నః॥

౬౬-౪ పుత్రవంతుడు మృతినొందినపుడు వానిపుత్రుడు అగ్నిహోత్రమును పుచ్చుకొని తండ్రిశవముముందు నడుచుచుండగా బంధువులచే నావరింపబడి శ్మశానమునకు తీసికొనిపోబడు పుత్రవంతుడగు వాని మరణము ను మహోత్సవముగానే యుండును.

౬౭-౬౮ ఇట్లు దశరథుడు తన మనమున విచారించి తన నిర్బంధములోనుండిన సాధ్యుడనువానిని పుత్రోత్పత్తిసాధనము నడిగి యాతనివలన అశ్వమేధము వలన పుత్రోత్పత్తికలుగుననివిని యప్పుడు సాధ్యుని, తత్పుత్రుడగు భూషణుని, బంధవిముక్తులనుగాఁజేసి పుత్రులులేని విచారముతో సాకేతపురమున కేగెను.

౬౯ అనంతరము దశరథుడు తన మంత్రియగు సుమంత్రునిఁ బిలచి
* యిటులఁ బలికెను. "ఓ సుమంత్రుడా! మృత్యుదేవతయొక్క దూతికవలె వార్ధక్యము కర్ణమూలము నాశ్రయించెను. (అనగా వెంట్రుకలు నెఱసెను.) పంశాంకురము నాకింతవరకు లేకపోయెను. ఏమిచేయుదును. అని దశరథుడు సుమంత్రునితోఁ జెప్పి మఱియు నిట్లనియె.

* వ్యా॥ వార్ధక్యమునుగూర్చి ప్రాచీనులగు పండితులచే నిట్లు చెప్పబడెను. (ఏమన) పుణ్యము చేయకపోయినను వార్ధక్యముచే మనుజుడు యముడంతవాడగును. (అనగా దండధరుడగును, కఱ్ఱ చేతికి వచ్చునని భావము.) విష్ణుమూర్తివలె గదగలవాడగును. (అనగా రోగముగలవాడగునని భావము. గదయనగా రోగమనికూడ అర్థముండెను) చంద్రుడువలె వంకరగలవాడగును. (అనగా ముసలితనమున వంకరలు తిరిగిపోవునని భావము) శివుడువలె విరూపాక్షుడగును. (అనగా కంటిచూపు ముసలితనములోఁ బాగుగ నుండదని భావము.) మఱియు వార్ధక్యదోషము లివ్విధముగ చెప్పబడినవి, వార్ధక్యము వచ్చుటతోడనే శరీరము ముడతలుపడిపోవును. నడక తొట్రుపడును దంతము లూడిపోవును. చూపు తగ్గును. చెముడు హెచ్చును. నోటివెంట చొంగకారును. బంధువు లాదరింపరు. భార్య చెప్పినమాట వినదు. అయ్యో? యెంతకష్టము! ముసలివానికి పుత్రుడుకూడ శత్రువుడై వర్తిల్లును కాన నిట్టి దోషములకాలవాలమగు వార్ధక్యము వచ్చినదనియు, సంతతి లేకపోయెననియు దశరథుడు విచారించెను.

శీఘ్ర మానయ మే సర్వా న్గురూం స్తా న్సపురోహితా౯
తత స్సుమం త్ర స్త్వరితం గత్వా త్వరితవిక్రమః
సమానయ త్సతా న్సర్వా న్సమస్తా న్వేదపారగా౯ ॥ ౭౧
తా౯ పూజయిత్వా । ధర్మాత్మా శ్లక్ష్ణం వచన మబ్రవీత్ ॥ ౭౨

మమ రాజ్యసుఖం వ్యర్థం । నాభూ త్పుత్రసుఖం యతః
తదర్థ మశ్వమేధేనయక్ష్యామీతిమతిర్మమ ॥ ౭౩

నిశమ్య వచనం రాజ్ఞో వసిష్ఠాద్యా మహర్షయః
సాధు సాధ్వితి తే ప్రాహుః పున స్తా న్బ్రవీ న్నృపః ॥ ౭౪
కీదృశో శ్వ స్తత్ర భావ్యః కో విధి స్తత్ర పూజనే
కథంహి శక్యతే కర్తుం । కేజేయా స్తత్ర వైరిణః ॥ ౭౫

వసిష్ఠః ॥ గంగాజలసమానేన వర్ణేన వపుషా శుభః
కర్ణేశ్యామో ముఖే ర క్తః । పీతః పుచ్ఛే సులక్షితః ॥ ౭౬

మనోవేగ స్సర్వగతి రుచ్చైశ్శ్రవసమప్రభః
వాజిమేధే హయః ప్రోక్తో శుభలక్షణలక్షితః ॥ ౭౭

పత్రం లిఖిత్వా ఫాలే తు । స్వనామబలచిహ్నితం
ప్రమోచనీయః ప్రయత్నేన । రక్షకైః పరిరక్షితః ॥ ౭౮

౧౧-౧౫ "ఓసుమంత్రుడా! శీఘ్రముగా వసిష్ఠ వామదేవాది పురోహితులఁ దీసికొనిరమ్ము" అని దశరథుడు సుమంత్రునితోఁ జెప్పగా సుమంత్రుడు మహావేగముతోఁ జని వేదవిదులగు వసిష్ఠాది పురోహితులనుఁ దిసికొనివచ్చెను.

౨౨ దశరథుడు తన గృహమునకు వచ్చిన వసిష్ఠాదిమహర్షుల నందఱనుఁ బూజించి మృదుమధురములగు వచనములతో వారితో నిట్లనియెను.

౨౩ ఓమహర్షులారా! నాకు పుత్రసుఖములేని హేతువుచే రాజ్యసౌఖ్యమును వ్యర్థమనిభావించెదను పుత్రసంతానముకొరకు అశ్వమేధము చేయవలెనని తలంపు నాకు కలిగినది. మీయభిప్రాయమేమియని దశరథుడు వసిష్ఠాముల నడిగెను.

౨౪ వసిష్ఠాదిమహర్షులు దశరథునివాక్యమును విని (బాగుబాగు) అని మహర్షులందఱు సమ్మతినిఁజూపిరి అపుడు వసిష్ఠాదులను దశరథుడు తిరిగిప్రశ్నించెను.(అనగా పుత్రులుకలుగుదురని చెప్పిరి.)

౨౫ వసిష్ఠాదిమహర్షులారా! అశ్వమేధమునకెట్టి లక్షణముగల యశ్వముండవలెను! విధానమేమి! ఎట్లుచేయుశక్యమగును! ఏవైరులనుజయింపవలయును. వీనిని సవిస్తరముగాఁ జెప్పుమని యడిగెను.

౨౬-౨౭ వసిష్ఠుడిట్లులజెప్పెను. ఓ దశరథా! గుఱ్ఱము గంగాజలమువలె తెల్లని రంగుగలిగి యుండవలెను చెవులయందు నలుపు, ముఖము నందెరుపు, తోకయందు పచ్చదనము నుండవలయును అడ్డు లేకుండగ సర్వత్ర వెళ్లునదిగా నుండవలెను మనోవేగముతో సమానగమనముగలిగి యుండవలెను. ఐరావతము, దేవేంద్రుని యశ్వమగు నుచ్చైశ్రవముతో సమానముగానుండవలెను. పైన చెప్పబడిన శుభలక్షణములుగలయశ్వము, అశ్వమేధమునకు నుపయోగించును.

౨౮ ఆయశ్వముయొక్క లలాటమునందు తన నామాక్షరములతో గూడిన పత్రమునుఁ గట్టి రక్షకభటుల సహాయముతో నాయశ్వమును విడిచిపెట్టవలయును

యత్ర గచ్ఛతి యజ్ఞాశ్వ స్తత్ర గచ్ఛంతు రక్షకాః
య స్తం బలా న్నిబధ్నాతి స్వవీర్యబలదర్పితః
తస్మాత్ప్రసభ మానేయః పరిరక్షాకరై ర్హయః॥ ౭౯

కర్త్రా తావ త్సువిధినా స్థాతవ్యం నియమా దిహ
మృగశృంగధరో భూత్వా బ్రహ్మచర్యాసమన్వితః।
వ్రతం పాలయమానశ్చ యావద్వర్షం వ్యతిక్రమేత్।
తావద్దీనాంధకృపణాః పరితోష్యా ధనాదిభిః॥ ౮౦-౮౧

అన్నం తు బహుశో దేయం ధనం వా భూరి దీయతాం
యద్య త్ప్రార్థయతే ధీమాం స్తత్త ద్దద్యా న్నృపాలకః॥ ౮౨

ఏవం యః కురుతే కర్మ యజ్ఞ స్సపూర్ణతాం గతః
కరోతి సర్వపాపానాంనాశనం రిపునాశన॥ ౮౩

తస్మా ద్భవా న్సుయధోఽస్తి కరణే పాలనేఽర్చనే
కృత్వాకీర్తిం సువిపులాంపావయా న్యజ్జనా న్నృప॥౮౪

దశరథః॥విలోకయద్విజశ్రేష్ఠ వాజిశాలాంమమాఽధునా
తాదృశా స్సంతి నోవా శ్వాఃశుభలక్షణలక్షితాః॥ ౮౫

ఇతి శ్రుత్వాఽపి తద్వాక్యం వసిష్ఠః కరుణాకరః
ఉత్తస్థావీక్షితుంసద్యః యాగార్హాన్వాజినశ్శుభాన్॥౮౬

౭౯ ఆయజ్ఞాశ్వము, ఎక్కడికి వెళ్లిన నక్కడకు రక్షకభటులు దానిననుసరించి వెళ్లవలయును. ఎవఁడాయశ్వమును బలాత్కారముగఁ బట్టుకొనునో వానిని జయించి యశ్వమును రక్షకభటులు తీసికొని రావలయును.

౮౦-౮౧ యాగము చేయువాఁడు సంవత్సరకాలము లేడికొమ్ములను ధరించి బ్రహ్మచర్యమును జరుపుచు నియమముతో నుండవలయు. సంవత్సరకాలమంతయు దీక్షలోనుండి దీనులకు గ్రుడ్డివాండ్రకు మఱియు నితరులకందఱకు ధనము మొదలగు వానిచే సంతోషమును జేయువలయును.

౮౨ అన్నదానము విశేషముగా జేయవలయును ధనముకూడ విశేషముగా దానము చేయవలెను, ఎవఁడు దేని నడిగితే దానినంతయు నిచ్చుచుండవలయును.

౮౩ ఓదశరథా! పైవిధముగా నెవఁడు యజ్ఞమును సంపూర్తిగఁ జేయునో వాని సర్వపాపములు నశించును.

౮౪ ఓదశరథా! నీవు యజ్ఞమును చేయుటకును అశ్వమునుఁ బాలించుటకును పెద్దలనుఁ బూజించుటకును సమర్థుఁడవు. యాగమునుజేసి కీర్తిని సంపాదించి యితరులనుగూడ పవిత్రులు చేయుము (అని వసిష్ఠుఁడు దశరథునితో జెప్పెను.

౮౫ దశరథుఁడు తిరిగి వసిష్ఠునితో నిటులఁ బ్రశ్నించెను. ఓవసిష్ఠమహర్షి! నీవు అశ్వశాలనుఁ బరీక్షింపుము. అశ్వమేధమునకు దగిన శుభలక్షణములుగల యశ్వములు అశ్వశాలలోనుండినవో లేవో చూడుమని (దశరథుఁడు వసిష్ఠునితో జెప్పెను.

౮౬ దయాసముద్రుఁడగు వసిష్ఠుఁడు దశరథుని వాక్యమును విని వెంటనే యాగాశ్వములను జూచుటకు లేచి యశ్వశాలకేగెను.

1 దృష్ట్వా వసిష్ఠ స్తు హయా న్రాజాన మిద మబ్రవీత్
హయ మేధకరి త్రో ర్యోగ్యా న్వాహాం స్తేబహుళ శ్శుభాః
పశ్యతో నేత్రయో ర్మేద్య తృప్తి ర్నాస్తి రఘూత్తమ
సరయ్వా శ్చోత్తరేతీరే యజ్ఞభూమిర్విధీయతాం ౮౮౪

సంభారా స్సంభ్రియంతాం చ తురగ శ్చ విముచ్యతాం
ఫాలే బధ్వా పట్ట మేకం స్వనామాంకోపశోభితం
ఇత్యుక్త్వాథవసిష్ఠ స్తుస్వాశ్రమం గతవానభూత్
సర్వేమహర్షయ స్తస్య సంకల్పంచాశ్వమేధికం
శ్లాఘయిత్వా స్వస్వ పదం గతా దశరథాజ్ఞయా
రాజాపిసర్వసంభారాః సంపిద్ధాంస్తుచకారసః॥౮౯-౯౦-౯౧

ఇత్యాశ్చర్యరామాయణేసప్తమస్సర్గసమాప్తః

---

1. పా॥ రా॥

౨౭-౨౮ వసిష్ఠుడశ్వశాలలోని గుఱ్ఱములను జూచి దశరథునితో నిటుల బల్కెను. ఓదశరథా! నీయశ్వశాలలో యాగార్హములగు గుఱ్ఱములనేకములుండెను. ఆగుఱ్ఱములను జూచిన నానేత్రములకు తనివి తీరలేదు (ఇంకను చూడవలెననియే కోరిక యుదయించుచున్నదని భావము.)

౨౯ ఓదశరథా! ఆలస్యమేల, వెంటనే సరయూనది కుత్తరభాగమున యాగభూమి నేర్పరుచుము. సమస్తసంభారములను సిద్ధము చేయుము. అశ్వలలాటమునందు స్వనామాక్షరములతో గూడిన పట్టమును గట్టి యాయశ్వమును విడువుము. అని వసిష్ఠుడు దశరథునితో జెప్పి తన యాశ్రమమునకు వెళ్లెను.

౩౦-౩౧ మహర్షులందఱు దశరథుని యశ్వమేధసంకల్పమునుగొనియాడి దశరథునియనుమతి నొంది తమతమ తావులకేగిరి. పిమ్మట దశరథుడును కావలసిన సంభారములను సిద్ధము చేసెను.

ఆశ్చర్య రామాయణమున సప్తమసర్గము ముగిసెను.

---

## అష్టమసర్గ ప్రారంభః.

ఏత చ్ఛ్రుత్వా రహస్సూతో రాజాన మిద మబ్రవీత్
ఋత్విగ్భి రుపదిష్టోఽయం పురావృత్తో మయా ॥ ౧శ్లో

ఆహ మిక్ష్వాకసారథ్యం కుర్వ న్బ్రహ్మసభాం గతః
తత్ర భావిమహీపాలప్రసంగే తవ భూపతే
అపుత్రత్వం యదా ప్రోక్త మృషిభి ర్విధిసంసది
సనత్కుమారో భగవా న్మహర్షి నవద త్తదా॥ ౨-౩
ఋష్యశృంగం పురస్కృత్య స తు యజ్ఞం కరిష్యతి
పుత్రా స్తస్య భవిష్యంతి చత్వారోఽమితవిక్రమాః॥ ౪

ఏవం స దేవప్రవరః పూర్వాం కథితవాన్కథాం
తదుక్తం బ్రహ్మసదసి వాక్య మశ్రౌష మప్యహం
త దృష్యశృంగ మానీయ సమాచర నృప క్రతుం॥ ౫
ఋష్యశృంగస్య చరితం శ్రుతం తత్ర వదామి తే
శృణుష్వ రాజశార్దూలజన్మకర్మాదికం మునేః॥ ౬
ఏకదా కాశ్యప స్స్నాతుం విభాండకమహామునిః
మహాహ్రదం గత స్తత్ర మజ్జతిస్మ మహీపతే॥
తస్య రేతః ప్రచస్కంద దృష్ట్వాఽప్సరస మూర్వశీం॥ ౭-౮

అష్టమ సర్గప్రారంభము.

౧ సుమంత్రుఁడు, వసిష్ఠాదులుచెప్పిన వాక్యములను విని దశరథమహా
రాజుతో నివ్విధముగ బలికెను. ఓరాజా! వసిష్ఠాదులుచెప్పినట్లే
పూర్వమునందొకరు చెప్పగా నొకకథనువినియుంటిని (చెప్పెదను
వినుము.)

౨-౩ నేను పూర్వకాలమునం దిక్ష్వాకుమహారాజునకు రథసారథినైయుండి
యిక్ష్వాకువు బ్రహ్మసభకు వెళ్లుచుండగా నేనుకూడ నతనితో
బ్రహ్మసభకు వెళ్లియుంటిని. అచ్చట భావికాలపురాజులవిషయమైన
ప్రసంగము రాగా నీప్రసంగముకూడ వచ్చెను అప్పు డచ్చటి
మహర్షులు కొందఱు నీకు పుత్రసంతానముండదని చెప్పగా సనత్కు
మారమహర్షి విని యామహర్షులతో నిట్లుచెప్పెను.

౪ ఓమహర్షులారా! దశరథునకు పుత్రసంతానముండదని మీరుచెప్పుట
యథార్థముకాదు ఆదశరథుడు ఋష్యశృంగమహర్షినిఁ దీసికొని
వచ్చి యజ్ఞమునుఁజేసినను పిమ్మట దశరథునకు మహాపరాక్రమ
వంతులగు నల్వురుపుత్రులు కలుగుదురు.

౫ ఇవ్విధముగ దేవర్షియగు సనత్కుమారుడు చెప్పుచుండగ నేను
కూడ బ్రహ్మసభలో నమ్మహర్షి చెప్పినవాక్యములను వినియుంటిని
ఆకారణమువలన ఋష్యశృంగమహర్షినిఁ దీసికొనివచ్చి యాగమును
జేయుమని సుమంత్రుడు దశరథునితోఁ జెప్పెను.

౬-౪ ఓరాజా! ఋష్యశృంగచరితమునుఁ గూడ నచ్చట వినియుంటిని
ఆమహర్షియొక్క జననము ప్రభావము మొదలగు వానిని జెప్పె
దను వినుమని చెప్పనారంభించెను.

౭-౮ ఓరాజా! ఒకానొకప్పుడు, కశ్యపవంశీకుడగు విభాండకమహర్షి
స్నానార్థమై యొకకొలనుకు వెళ్లి స్నానముచేయుచుండెను. ఆసమ
యమున, ఊర్వశియను నప్సరస కన్పడగా నమ్మునికి రేతస్సు
స్ఖలనమై జలములోఁబడెను.

అపూస్వపస్పృశతే రాజ స్మృగీ తచ్చాఽపిబ త్తదా॥
సహ శోయేన తృషితా గర్భిణీ సమభూ త్తతః
పుత్రం ప్రసూయ సా శాపవిముక్తా స్వర్గతా భవత్॥ ౯

* సాపురోక్తా భగవతా బ్రహ్మణా లోకకర్తృణా
దేవకన్యే మృగీ భూత్వాముని౦సూయవి మోక్ష్యసే॥ ౧౦

అమోఘత్వా దృషేశ్చైవ భావిత్వా ద్దైవసర్మితేః
తస్యాం మృగ్యాం సమభవ త్తస్య పుత్రో మహీపతే
పిత్రా నీతో ఋష్యశృంగః।వనవేవాఽభ్యవర్ధత॥ ౧౧-౧౨

---

* దేవకన్యేతి చిత్రరేఖానామ కాచన దేవకన్యా బ్రహ్మణ స్సదసి ప్రత్యహం నృత్యతిస్మ ఏకదా నర్తనసమయే విధి మపశ్యంతీ పరాభిముఖీ సా యదా ననర్త తదా పితామహః కుపితస్తాంశశాప త్వం మృగీ భవేతి. తయా శాపవిముక్తింప్రతి ప్రార్థిత శ్చాత్మభూ రనుగృహ్ణ న్నేవమవాదీత్, యదా త్వం మునిబాలకం ప్రసూతవతీభవే స్తదా విమోక్ష్యసే ఇతికథానుసంధేయా.

౯౪ ఓదశరథా! ఎక్కడనుండియో యొక యాడలేడి దాహమై యాశ్ర మమువచ్చి నీరుత్రాగుచుండగా విభాండకమహర్షి యొక్క రేతస్సు, జలముతోఁగూడ లేడి గర్భములోనికి బోయెను ఆలేడియు గర్భ వతియై వెంటనే యొకపుత్రునిఁగని శాపవిముక్తురాలై దివ్యరూప ముతో స్వర్గమునకేగెను.

*౧౦౪ ఆలేడి, పూర్వకాలమునందొక దేవకన్యకయైయుండెను సృష్టికర్త యగు బ్రహ్మదేవుఁడొకప్పుడా దేవకన్యకను లేడిరూపము నొందు మని శపింపఁగా నాదేవకన్యక శాపవిమోచనమునుఁగోరగా ముని పుత్రునిఁ గనినవెంటనే శాపవిముక్తియగునని బ్రహ్మచెప్పిన కారణమున పుత్రునిగని శాపవిముక్తురాలై స్వర్గమునకేగెను.

౧౧ ౧౨ విభాండకమహర్షి, యమోఘవీర్యము గలవాడగుటవలనను దైవ లిఖితము జరుగవలసియున్న హేతువుచేతను ఆయాడలేడియందు విభాండకమహర్షివీర్యమువలన ఋష్యశృంగుడుద్భవించిన పిదప విభాండకమహర్షియు సర్వము నెఱిగి,తనపుత్రుని,స్వాశ్రమమునకుఁ దీసికొనివెళ్ళగా నచ్చట ఋష్యశృంగుడు పెరుగుచుండెను.

---

* చిత్రరేఖయనునొక దేవకన్యక బ్రహ్మసభలో ప్రతిదినము నృత్యముచేయుచుండెడిదైయుండెను ఒకప్పుడు నృత్యముచేయు చున్న సమయమున బ్రహ్మవంక చూడకుండగ నితరులకభిముఖు రాలై నృత్యముచేయుచుండెను బ్రహ్మయుఁగోపమంది యామెను ఆడలేడియగునటుల శపించెను. అప్పుడామె, శాపవిముక్తినిఁ బ్రార్థింపగా బ్రహ్మయనుగ్రహించి, యిటులఁజెప్పెను. నీవుఋషి పుత్రునిఁ గనినవెంటనే శాపవిముక్తురాలవగుదువనెడి కథయను సంక్షేపము.

శృంగం శిరసి తస్యర్షేః రాజ న్నాసీ న్మహాత్మనః
తేనర్ష్యశృంగ ఇత్యేవ సదా స ప్రథితో భవత్॥ ౧౩

న తేన దృష్టః పూర్వోఽన్యః పితు రన్యత్ర మానుషః
తస్మా త్తస్య మనో నిత్యం బ్రహ్మచర్యేఽభవ న్నృప॥౧౪

* ఏతస్మి న్నేవకాలేతు సఖ్యా తవ మహీపతే
తేన కామా త్కృతం మిథ్యా బ్రాహ్మణస్యేతి నిశ్రుతం
న బ్రాహ్మణైః పరిత్యక్త స్తదా వై జగతీపతిః॥ ౧౫
1 పురోహితాపచారాచ్చ తస్య రాజ్ఞో యదృచ్ఛయా
న వవర్ష సహస్రాక్ష స్తతోఽపీడ్యంత తత్ప్రజాః॥౧౬

---

* వ్యా॥ మిథ్యా బ్రాహ్మణస్యేతి,, రోమపాదః ప్రత్యహం బాడబానాం దానధర్మాదికం కరోతిస్మ ఏకస్మి న్దినే కశ్చన బాడబః రోమపాదా దేకవారం దానం గృహీత్వా పునరాదాతుం సమాగతో ఽభూత్। తదా రోమపాదః మిథ్యావాదిత్వం బ్రాహ్మణజాతా వారోపితవాన్ తదా సర్వేపి బాడబాః రోమపాదం తత్యజుః. కించ తద్దేశేత్వనావృష్టి స్సంభవేదితి శశపుశ్చతే. ఇతికథాత్రాను సంధేయా.

---

1. అధ్యాత్మరామాయణే. నా॥

౧౩ ఓదశరథమహారాజా! వత్సుడగు ఋష్యశృంగుని శిరస్సునందు, మృగచిహ్నమును సూచించెడి లేడికొమ్మ కూడ నొకటి యుండెను. ఆకారణముచేతనే ఋష్యశృంగుడని ప్రసిద్ధికల వాడయ్యెను. (నెత్తిమీదను లేడికొమ్ముగల ఋషియని ఋష్య శృంగుడను పదమునకర్థమని యెఱుగనగు)

౧౪ ఆఋష్యశృంగుడు విభాండకమహర్షి యాశ్రమమునందుఁ దపోనిష్ఠుడై యుండి, తనతండ్రికంటె, యన్యుని నెప్పుడు చూడకపోయిన కారణముచే నమ్మహర్షియొక్క మనస్సు, నిత్యము పరబ్రహ్మమునందే, లగ్నమైయుండెను.

*౧౫ ఓరాజా! ఈసమయముననే నీస్నేహితుడగు రోమపాదుడు, బ్రాహ్మణులనృతవాదులని బ్రాహ్మణులయందు మిథ్యావాదిత్వదోషము నారోపించుటచే బ్రాహ్మణులచే నతడు పరిత్యజింపఁబడెను.

౧౬ పురోహితబ్రాహ్మణాపచారములను రోమపాదుడు చేయుటవలన దేవేంద్రుడు, ఆదేశమున వర్షింపకపోయెను. అనావృష్టిదోషముచే ప్రజలు పీడింపఁబడుచుండిరి.

---

* వ్యా॥ రోమపాదుడు ప్రతిదినమున బ్రాహ్మణులకు దానముచేయుచుండెను. ఒకదినమున నొకబ్రాహ్మణుడు రోమపాదునివలన నొకభార్యయను దానమునఁగ్రహించి తిరిగి గ్రహించుటకు రాజు నొద్దకురాగా రోమపాదుడప్పుడు, బ్రాహ్మణులందఱు, అబద్ధమాడువారనియు, అశపాతకులనియు దూషింపగా బ్రాహ్మణులందఱు రోమపాదుని త్యజించిరి. మఱియు నతనిదేశమున వర్షము లేకుండ నుండునట్లుశపించిరి. యను కథగ్రాహ్యము.

స బ్రాహ్మణా న్పప్రచ్ఛ త్తపోయుక్తా న్మనీషిణః
ప్రవర్షణే సురేంద్రస్య సమర్థా న్పృథివీపతే
కథం ప్రవర్షేత్పర్జన్య ఉపాయః పరిదృశ్యతాం॥ ౧౭-౧౮
త మూచు శ్చోదితా స్తేన సుకృతాని మనీషిణః
తత్ర త్వేకో మునివర స్తం రాజాన మువాచ హ॥ ౧౯

1 * పితా స్తవ రాజేంద్ర బ్రాహ్మణా నిష్కృతిం చర
ఋష్యశృంగం మునిసుత మానయస్వ చ పార్థివ॥ ౨౦
2 * నచేదవతరే ద్రాజ న్విషయాం తే మహాతపాః
నద్యః ప్రవర్షేత్పర్జన్య ఇతి తే నాత్ర సంశయః॥ ౨౧
ఏత చ్ఛ్రుత్వా వచో రాజన్ కృత్వా నిష్కృతిమాత్మనః
స గత్వా పున రాగచ్ఛ త్ప్రసన్నేషు ద్విజాతిషు
రాజాన మాగతం దృష్ట్వా ప్రతిసంజహృషుః ప్రజాః॥ ౨౨
తతోఽంగపతి రాహూయ సచివా న్మంత్రకోవిదాన్
ఋష్యశృంగాగమే యత్నమకరోన్మంత్రనిశ్చయాత్॥ ౨౩
సోఽధ్యగచ్ఛ దుపాయం తు ష్టై రమాత్యై ర్మహీపతే
శాస్త్రజ్ఞై రఖిలార్థజ్ఞై ర్నిశ్చయం చ పరినిష్ఠితైః॥ ౨౪
తత్ర త్వాజ్ఞాపయామాస వారముఖ్యా మహీపతిః
వేశ్యాః సర్వత్ర నిష్ణాతా స్తా ఉవాచ మహీపతిః॥ ౨౫

1. * బ్రాహ్మణాపచారేణ కర్తవ్య ఇతిసూచ్యతే.
2. * అస్ఖలితబ్రహ్మచారిణ్యే తాదృశ మహిమా స్తీతి సూచితం.

౧౭-౧౮ ఓ దశరథమహారాజా! వర్షింపజేయుటకు సమర్థులు తపస్సంపన్నులునగు బ్రాహ్మణులయొద్దకు రోమపాదుఁడేగి వారినిటుల బ్రశ్నించెను. ఓ బ్రాహ్మణులారా! దేవేంద్రుఁడేవిధముగా వర్షించును! ఉపాయమును విచారింపుడని రోమపాదుడు బ్రాహ్మణులనడిగెను.

౧౯ అప్పుడు బ్రాహ్మణులు రోమపాదునితో నిట్లు చెప్పిరి ఓరాజా! పుణ్యవశముచే దేవేంద్రుడు వర్షము కురిపించవలసినదేకాని వేఱు మార్గములేదనిరి. వారిలో నొకమునీశ్వరుడు రాజుతో నిర్వాధముగ జెప్పెను.

1* ౨౦ ఓ రాజా! ఏవిషయమై బ్రాహ్మణులందఱు, కోపగించిరి. వారిని బ్రసన్నులనుగా జేసికొనుము విభాండకమహర్షి పుత్రుఁడగు ఋష్యశృంగుని నీపట్టణమునకు దీసికొనిరమ్ము.

2* ౨౧ ఓ రోమపాదుడా! ఋష్యశృంగుడు నీదేశమున ప్రవేశించినచో మేఘుడు వెంటనే వర్షించును సందియము లేదని యొక బ్రాహ్మణుడు చెప్పెను.

౨౨ ఈవాక్యమును రోమపాదుడు విని బ్రాహ్మణుల సన్నిధి కేగి వారి ననేక విధములుగ సంతుష్టులనుగా జేసి తిరిగి తనచంపాపట్టణమునకు రాగా పురజనులందరు సంతోషించిరి.

౨౩౪ అనంతరము రోమపాదుడాలోచన కుశలురగు మంత్రులను బిలిచి ఋష్యశృంగుని దీసుకొనివచ్చే విషయమై వారితో నాలోచించెను.

౨౪౪ శాస్త్రజ్ఞులును, కార్యసాధకులునగు మంత్రులతో రోమపాదుడాలోచించి వేశ్యలద్వారా ఋష్యశృంగుని తనరాజ్యమునకు రప్పించుటకు నిశ్చయించెను.

౨౫౪ రోమపాదుడు వేశ్యలనందఱను బిలిపింపగా వారలందఱు రాజునొద్దకువచ్చిరి అప్పుడు రోమపాదుడా వేశ్యలతో నిట్లు పలికెను.

---

1 * ఈ కథవలన బ్రాహ్మణాపచారము చేయగూడదనిసూచితము.

2 * దీనివలన అస్ఖలితబ్రహ్మచారియందలి మహిమ సూచింపబడినది.

ఋష్యశృంగ మృషేః పుత్ర । మానయధ్వ ముపాయతః
లోభయిత్వా సమాశ్వాస్యవిషయంమమశోభనాః॥ ౨౬

తా రాజభయభీతా శ్చ। శాపభీతా శ్చ యోషితః
అశక్య మూచు స్తత్కర్మ వివర్ణా గతచేతసః॥ ౨౭

తత్ర త్వేకా వారయోషా రాజాన మిద మబ్రవీత్
ప్రయతిష్యే మహారాజ త మానేతుం తపోధనం॥ ౨౮

అభిప్రేతాం స్తు మే కామాం స్త్వ మనుజ్ఞాతు మర్హసి
తత శ్శక్ష్యామ్యానయితుమృష్యశృంగమృషేస్సుతం॥ ౨౯

తస్యా స్సర్వ మభిప్రేత మవజానీత పార్థివః
నావి వృక్షా నథారోప్య ఫలాంకారాం శ్చ మోదకాన్
సురసాం శ్చ సుగంధీని మధూని రసవంతి చ
తతో రూపేణ సంపన్నా వయసా చ మహీపతే
స్త్రియ ఆదాయ కాశ్చి త్సా జగామ వన మంజసా॥
౩౦-౩౧-౩౨

సా తు స్థిత్వా కియద్దూరం సంస్థాప్యాశ్రమ ముత్తమం
దృష్ట్వాంతరం కాశ్యపస్యప్రాహిణో త్తత్ర పుత్రికాం॥ ౩౩

సా తత్ర గత్వా కుశలీ తపోనిష్ఠస్య సన్నిధౌ
ఆశ్రమంతు నమాసాద్య దదర్శ త మృషే స్సుతం॥ ౩౪

౨౩ ఓ వేశ్యలారా! విభాండకమహర్షిపుత్రుడగు ఋష్యశృంగుని నెవ్విధముచేతనైనను నిచ్చటకుదీసికొనిరండని రోమపాదుడు వేశ్యలతోఁ జెప్పెను.

౨౪ అప్పుడు వేశ్యలందఱు రాజభయముచేతను, శాపభయముచేతను కాంతివిహీనులైమన స్స్వాస్థ్యములేనివారలై ఋష్యశృంగునిఁ దీసికొని వచ్చుట యశక్యమనిచెప్పిరి. (అనగా వెళ్ళమనిన రాజు దండించుననియు వెళ్ళినచో ముని శపించుననియు భయపడిరని భావము.)

౨౫-౨౯ వారిలో నొకవేశ్య రాజుతో నివ్విధముగఁబలికెను ఓమహా రాజా! ఋష్యశృంగుని దీసికొనివచ్చుటకు ప్రయత్నించెదను నాకు కావలసిన వస్తుసంభారములను సిద్ధముఁజేయించినచో ఋష్యశృం గుని దీసికొనివచ్చుటకు నాకు సమర్థతకలదనియెను.

30-31-32 అనంతరము రోమపాదుడు వేశ్యకుకావలసిన వస్తుసంభార ములనడిగి తెలిసికొని యొకనావయందు కృత్రిమవృక్షముల నేర్పఱచి ఫలములయొక్క యాకారముగలభక్ష్యములను సిద్ధముజేయించివాని నా నావయందుంచియు సువాసనగల రసవంతములైన రసాయన ములనాయత్తపరచియు నామెకోరినవిధముగ సమస్తము రాజునొన గూర్పపిమ్మట నావేశ్య, సౌందర్యవతులు యౌవనవతులునగు మఱికొందఱువేశ్యాస్త్రీలను వెంటదీసుకొనిఋష్యశృంగుని యాశ్రమ సమీపమునకు వెళ్లెను.

33 ఆవేశ్య,ఋష్యశృంగుని యాశ్రమమునకు కొంతదూరమున తనపడవను నిలిపి యొక యాశ్రమమును గల్పించుకొని విభాండక మహర్షి లేని సమయమునుఁజూచి తనపుత్రికను ఋష్యశృంగుని సమీపమునకుఁ బంపెను.

34 ఆవేశ్యాపుత్రిక, తపోనిష్ఠుడగు ఋష్యశృంగుని యాశ్రమమునకేగి యమ్మహర్షినిజూచి యివ్విధమున కుశలప్రశ్నములనుఁ జేసెను.

1 కచ్చి త్తపో వర్ధతే తాపసానాం కచ్చి త్తరో మూల
ఫలం ప్రభూతం
కచ్చి త్త్వయా ప్రీయతే చైవ విప్ర కచ్చి త్స్వాధ్యాయః
క్రియతే చ శశ్వత్॥ ౩౫

ఇతి శ్రుత్వావచ స్తస్య మునివేషధరస్య హి
ఉవాచ వాక్యంవాక్యజ్ఞో మునివేషవిధారిణీం ౩౬

బుద్ధ్యాభవాన్జ్యోతి రివ ప్రకాశతే మన్యే చాహం త్వా
మభివాదనీయం, పాద్యంచాహంసంప్రదాస్యామి తేఽద్య
యథాసిద్ధ్యే త్కర్మఫలానిచైవ॥ ౩౭

కౌశ్యాం బ్రుస్యా మాస్స్వ యథోపవేశం కృష్ణాజినే వా
స్తృతాయాం సుఖాయాం
క్వ చాశ్రమ స్తవ కిం నామచేదం బ్రాహ్మ్యం భాతి
తదేవ వ్యక్తం॥ ౩౮

తతో వేశ్యా ప్రత్యువాచ ద్విజేంద్రం శంకాయుక్తా
కాశ్యపస్యాగమేతు
మమా శ్రమః కాశ్యపపుత్రరమ్య స్త్రియోజనం శైల
మిమం పరేణ॥ ౩౯

తత్ర స్వధర్మోఽనభివాదనం మే నచోదకం పాద్య
మిమం స్పృశామి॥ ౩౯౪

1. అధ్యాత్మ రామాయణే.

౩౫ ఓఋష్యశృంగమహర్షి! ఆశ్రమవాసులగు మహర్షులందఱకు తపస్సు బాగుగజరుగుచున్నదా! కందమూలఫలాదులు విస్తారముగ లభించుచున్నవా! స్వాధ్యాయము హోమము మొదలగునవి బాగుగ జరుగుచున్నవా (అని ప్రశ్నించెను.)

౩౬ ఋష్యశృంగుడు మునివేషధారిణియగు వేశ్యయొక్క మనోహరవాక్యములను విని యావేశ్యనుగూర్చి యిటులఁబలికెను.

౩౭ నీవు సాక్షాత్పరబ్రహ్మవలె ప్రకాశించుచున్నావు నీవు నమస్కరింపఁదగినవాడవు. నేను చేసిన తపస్సంతయు నేడు సిద్ధించునటుల నర్ఘ్యపాద్యాదుల నిచ్చెదను. స్వీకరింపుము.

౩౮ నీవు కుశాసనమునందుఁగాని కృష్ణాజినమునందుఁగాని సంతోషముతోఁగూర్చుండుము. నీయాశ్రమ మెక్కడనున్నది! నీపేరేమి! నీవు సాక్షాద్బ్రహ్మదేవుడవై యిచ్చట బ్రకాశించుచున్నావు (అని ఋష్యశృంగుడు వేశ్యతోఁబలికెను.

౩౯ అనంతరము వేశ్య, విభాండకమహర్షి వచ్చునేమోయను సందేహము కలిగిఋష్యశృంగునిగూర్చి యివ్విధముగ బలికెను. ఓఋష్యశృంగమహర్షి! మాయాశ్రమము మిక్కిలి రమణీయముగానుండును ఇచ్చటికి పండ్రెండుక్రోసుల దూరములోనున్నది.

భవతా నాభివాద్యోహ మభివాద్యో భవా న్మయా
వ్రత మేతాదృశం బ్రహ్మ న్పరిష్వజ్యో భవా న్మయా
ఇతి శ్రుత్వా వచ స్తస్య పున రాహ తపోధనః॥ ౪౦-౪౧

ఫలానిపక్వానిదదానితేఽహంభల్లాతకాన్యమలకానిచైవ
కరూషకానీంగుదకాని తావద్యథోఽజోషం ఫలమత్ర
భుంక్ష్వ॥ ౪౨

సా తాని సర్వాణి చ వర్జయిత్వాభక్ష్యంమహార్హం
ప్రదదాతతోఽస్య
తాన్యృష్యశృంగస్య మహారసాని భృశం సురూపాణి
రుచింబ్రుహీణ॥ ౪౩

తదా చుచుంబా మలగండమూలే సమాశ్లిష చ్చాసకృ
దృష్యశృంగం
అవేక్ష్యమాణా శన కై జగామ కృత్వాగ్నిహోత్రస్య
తదాపదేశం॥ ౪౪

తస్యాం గతాయాం మదనేన చిత్తవిచేతనః ప్రీతివ దృష్య
శృంగః
తా మేవ చిత్తేన గతేన శూన్యో వినిశ్వస న్నార్తవపు
ర్బభూవ॥ ౪౫

౪౦-౪౧ ఋరుష్యశృంగమహర్షి! మానిజధర్మములను జెప్పెదను వినుము. మేము ఇతరులనమస్కారములనుస్వీకరించము మఱియునితరుల యార్ఘ్యపాద్యాదులనుఁ గూడ గ్రహింపము కాననీవు నాకు నమస్కరింపకుము నేను నీకునమస్కరించెదను ఈసమయమున నిది మావ్రతము నిన్ను నేనుకౌగలించుకొనెదనని యర్థముగఁజేసెను. ఇవ్విధముగా వేశ్యావచనములనువిని ఋష్యశృంగుడు తిరిగి వేశ్యతోనిట్లు పలికెను.

౪-౨౪ నీకుజీడిమామిడిపండ్లను వుశిరికఫలములను ఇంగుదీఫలములను మఱియు నితరములగు ననేక కందమూలఫలాదుల నిచ్చెదను. భుజింపుమని యాఫలములను, మునివేషధారిణియగు వేశ్యకు ఋష్యశృంగుడిచ్చెను.

౪౩ అప్పుడు మునివేషధారిణియగు వేశ్య, ఋష్యశృంగునిచే, నీయబడిన ఫలములనన్నిటీనివిడచి, తనచేఁ తీసికొనిరాబడిన మధురములగు భక్ష్యములను ఋష్యశృంగునకునీయాగా ఋష్యశృంగుడు వానినన్నిటిని భక్షించెను ఆభక్ష్యములన్నియు మహర్షికిరుచికరములుగానుండెను.

౪౪ అప్పుడు మునివేషధారిణియగువేశ్య, ఋష్యశృంగుని గండస్థలమునందు ముద్దుపెట్టుకొనెను. మఱియు ఋష్యశృంగుని నాలింగనము జేసికొనెను. ఇట్లుచేసి వేశ్య, తా నగ్నిహోత్రమునుఁ జేసికొనవలయుననెడిమిషతో మెల్లగాతన నివాసమునకు వెళ్ళెను ఋష్యశృంగుడామెనుఁ జూచుచునేయుండెను.

౪౫ ఆవేశ్య, వెళ్ళినపిమ్మట, ఋష్యశృంగుడు మన్మథవికారములతో గూడి మునివేషధారిణియగు నావేశ్యనే మనమునందుఁ దలచుచు నిట్టూర్పువిడుచుచు, శరీరములో బాధగలవాడువలెనుండెను.

తతో ముహూర్తం హరిపింగళాక్షః ప్రవేష్టితో రోమభి రానఖాగ్రాత్
స్వాధ్యాయవార్ణ దృష్టసమాధియుక్తో విభాండకః కాశ్యప ఆవిరాసీత్॥ ౪౬

సోపశ్య దాసీన ముపేత్య పుత్రం ధ్యాయం స్త మేవం విపరీతచిత్తం
వినిశ్వస న్తం ముహు రూర్ధ్వదృష్టిం విభాండకః పుత్రి ముచాచ దీనం॥ ౪౭

నత్వం యథా పూర్వమివాసి పుత్ర చింతావర శ్చాపి విచేతనశ్చ
దీనో తిమాత్రం త్వ మిహాద్య కింను పృచ్ఛామి త్వాం క ఇహా ద్యాగతో భూత్॥ ౪౮

నకల్ప్యంతే సమిధః కింను తాత కచ్చి ద్ధుతం చాగ్ని హోత్రం త్వయాద్య
సునిర్ణిక్తం స్రుక్స్రువం హోమధేనుః కచ్చి త్సవత్సా చ కృతా త్వయాఽద్య॥ ౪౯

ఋష్యశృంగః ॥శ్లో॥ ఇహా గతో జటిలో బ్రహ్మచారీ
నవై హ్రస్వో నాతిదీర్ఘో మనస్వీ
సువర్ణవర్ణః కమలాయతాక్షః సుతం సురాణామివ శోభమానః॥ ౫౦

౪౬ అనంతరము కశ్యపపుత్రుడును, స్వాధ్యాయవేత్తయు, సమాధి వంతుడును నఖశిఖాపర్యంతము రోమములతోనిండిన వాడునగు విభాండకమహర్షి క్షణకాలములో స్వాశ్రమమునకువచ్చెను.

౪౭ విభాండకమహర్షి తనయాశ్రమమునకు వచ్చి పుత్రునిఁజూడగా నతడు దేనినో ధ్యానించుచున్నవాడుగాను, విపరీతచిత్తుడుగాను, మాటిమాటికి నిట్టూర్పువిడుచువాడుగాను, కన్పడినందున దీనభావముతోనున్న పుత్రుడగుఋష్యశృంగునిగూర్చి. విభాండకమహర్షి యివ్విధముగఁ బలికెను.

౪౮ పుత్రుడా! నీవుపూర్వమువలె కన్పడవు, ఎందువలన విచారముతో నున్నవాడవుగాను మనస్థిమితము లేనివాడవుగాను దుఃఖితవుగాను కన్పడుచుంటివి. కారణమేమి, ఇచ్చటికెవ్వరైననువచ్చిరా!

౪౯ సమిధలనుఁ దెచ్చితివా! అగ్నిహోత్రమునుఁజేసితివా! యజ్ఞపాత్రలగు స్రుక్స్రువలను శుభ్రము చేసితివా! హోమధేనువును పాలుపితికితివా! (అనివిభాండకమహర్షి, పుత్రుడగుఋష్యశృంగునిఁబ్రశ్నించెను.)

౫౦ ఋష్యశృంగుడు తండ్రితో నివ్విధముగ జెప్పనారంభించెను. ఓతండ్రీ! ఇచ్చటకు జటాధారియగు, బ్రహ్మచారియొకడువచ్చెను. అతడు విశేషముగా పొట్టివాడుగాగాని పొడగరిగాగాని లేడు. సమాంగుడైయుండెను. మేలిమిబంగారముతో సమానమగు వర్ణము గలవాడై యుండెను. పద్మపత్రములవలె విశాలనేత్రములు గలవాడై యుండెను. మఱియు దేవతలనుఁగూడ మోహింపఁ జేయువాడుగా నుండెను

ఆలంబమానా పునరస్య కంఠే విరాజతే విద్యుదివాంతరిక్షే
ద్వౌ మాంసపిండా వధరేణ కంఠా దలోమశౌ చాపి మనోహరౌ చ॥ ౧౧

నచాపి పాద్యం బహుమన్యతే ఽసౌ ఫలాని చైలాని మయాహృతాని
మయోపభుక్తాని ఫలాని తస్య నేమాని తుల్యాని రసేన తేషాం॥ ౧౨

ఇచ్ఛామి తస్యాంతికమేవ తాత కానామ సా వ్రత
చర్యాను తస్య। ఇచ్ఛామ్యహం చరితుం తేన సార్థం
యథా తప స్సచరత్యుగ్రకర్మా॥ ౧౩

ఇత్యేవ వాక్యం మునిరాత్మజస్య శ్రుత్వా మహావాక్య
విశారదోఽసౌ। ఉవాచ వాక్యం పరిశాంతయంశ్చ
విభాండక స్తపసా జ్ఞాతతత్వః॥ ౧౪
రక్షాంసి చైతాని చరంతి పుత్ర।రూపేణ తేనా ద్భుత
దర్శనేన। అతుల్యవీర్యాణ్య తిరూపవంతి విఘ్నం సదా
తపస శ్చింతయంతి॥ ౧౫
రక్షాంసి తానీతి నివార్య పుత్రం। విభాండక స్తపసే
నిర్జగామ । యదా పునః కాశ్యపో నిర్జగామ ఫలాని
హర్తుం విధినా వనాద్ధి॥ ౧౬

౫౧ ఓతండ్రీ! ఆకాశమునందు మెఱుపుతీగవలె నతనికంఠమునందు జడ వ్రేలాడుచు ప్రకాశించుచుండెను. అతనికంఠమునకు క్రిందిభాగమున, రోమరహితములగు రెండుమాంసపుముద్దలు మనోహరముగా నున్నవి.

౫౨ ఓతండ్రీ! నేనిచ్చిన కందమూలఫలాదులనుగాని యర్ఘ్యపాద్యాములనుగాని భుజింపలేదు నాకు ఫలాదులనిచ్చెను మనయొద్దనున్న ఫలములు,మాధుర్యములో ఆతపస్వియిచ్చిన ఫలములతోసమానము కానేరవు ఆతపస్వియిచ్చిన ఫలములను నేను భక్షించితిని, మధురములగు జలములనుఁద్రాగితిని, ఫలములుగాని రసములుగాని బహు మధురములుగానుండెను.

౫౩ ఓతండ్రీ! నేనాతపస్వియొక్క సమీపముననుండఁ గోరికగానున్నది ఆతపస్వియొక్క వ్రతచర్య యేదైయుండును (అనగా వ్రతచర్య పేరేమి) ఆబ్రహ్మచారితోఁ గూడ, నేనుగూడ నిట్టివ్రతచర్య చేయవలయునని కోరుచుంటిని. ఎందువల్లననగా నాతడిట్టివ్రత చర్య చేయుటచేత నే గొప్పతపస్వియయ్యెను, కావున నేనుకూడ చేసెదననియె.

౫౪ ఈప్రకారముగాఁ జెప్పబడిన తన కుమారుని వాక్యమును విభాండకమహర్షి, విని, తపోబలము చేత యథార్థమును దెలిసికొని తన పుత్రునిగూర్చి యివ్విధముగాఁబలికెను.

౫౫ ఓపుత్రుడా! నీవుచూచిన యాశ్చర్యరూపమును గురించి నేనాలోచింపఁగా రాక్షసులిట్టి యద్భుతరూపముతో సంచరించుచున్నట్లు తోచుచున్నది. మిక్కిలి వీర్యము సౌందర్యముగల రాక్షసులు మహర్షుల తపస్సులకు విఘ్నములనుఁజేయుటకాలోచించుచుందురు. అని విభాండకుడు ఋష్యశృంగునితో జెప్పెను.

౫౬ ఓ పుత్రకా! నీవారాక్షసుల తెరవునకుఁ బోవద్దని పుత్రుని నివారించి తన యాశ్రమమునుండి కందమూలఫలాదులనుఁ దీసికొని వచ్చుటకు మఱియొక వనమునకు విభాండకమహర్షి వెళ్ళెను.

(26)

తదా పున ర్లోఃభయితుం జగామ సా వారయోషా
ముని మృష్యశృంగం । దృష్ట్వైవ తా మృష్యశృంగః
పరిహృష్టః సంభ్రాంతరూపో న్యపత త్తదానీం॥ ౫౭
1 ప్రోవాచ చైనాం భవదాశ్రమాయ గచ్ఛామి యావ
న్నపితా మమైతి। తతో వేశ్యా కాశ్యపస్యైకపుత్రం
ప్రవేశ్య యోగేన విముచ్య నావం॥ ౫౮

* ప్రమోదయంత్యో వివిధై రుపాయై రాజగ్ము రంగాధిప
రాజధానీం । సద్య స్సువృష్టిశ్చ బభూవ దేశే తత్పాద
విన్యాసవశా త్సుభిక్షం॥ ౫౯

స లోమపాదః పరిపూర్ణకామ స్సుతాం దదౌ
ఋష్యశృంగాయ శాంతాం॥ ౫౯-4

---

* వ్యా॥ నను వేశ్యాలింగనాదినా తదత్త భక్ష్యభో
జ్యాదిభోజనాదిభిశ్చ ఋష్యశృంగస్య మహార్షే స్తపోహానా
సత్యాం తస్యపాదప్రక్షేపణేనైవ రోమపాదరాష్ట్రే సువృష్టి
రభూదితి కథన మనుపపన్నం స్యాదతి చేదత్రోచ్యతే తస్య
స్త్రీవిషయకజ్ఞానస్యైవా భావాత్ వారస్త్రీవిషయకజ్ఞానం
కథంవా భవేత్ అపిచ మనశ్చాంచల్యస్య హేతు రేవ నాస్తి

---

1. అ॥ రా॥

౫౪ విభాండకమహర్షి, వనమునకువెళ్ళిన యవకాశమునుఁజూచి వేశ్య తిరిగి ఋష్యశృంగుని లోభపెట్టుటకు ఋష్యశృంగాశ్రమమునకు వెళ్ళగా తన సమీపమునకువచ్చిన వేశ్యను ఋష్యశృంగుడుచూచి సంతుష్టుడును భ్రాంతచిత్తుడునయ్యెను.

౫౫-౫౯॥ఋష్యశృంగుడు మునివేషధారిణియగు తపస్వినిఁగూర్చి యివ్విధముగఁబలికెను. నాతండ్రియగు విభాండకమహర్షి రాకమునుపే నీయాశ్రమమునకు వెళ్ళుదమని బయలువెడలి వేశ్యలందఱు నివసించిన కల్పితాశ్రమముపద్దకు ఋష్యశృంగుడువచ్చి వారున్న నావమీదనెక్కెను ఆవేశ్య యిట్లుఋష్యశృంగుని తనపడవయొద్దకుఁదీసికొనివచ్చి యతని సమాధితోఁగూడ నావనువిడిపించెను (అనగా జీవబ్రహ్మైక్యానుసంధానరూపమగు ఋష్యశృంగుని సమాధిని భంగపరచెననియు, ఆశ్రమమువలె కల్పింపబడిన పడవను రోమపాదుని నగరమునకు విడిచిపెట్టించినదనియు భావము.)ఇట్లు నావనువదలి వేశ్యలందఱు వివిధోపాయములచే ఋష్యశృంగుని సంతోషపెట్టుచు రోమపాదుని రాజధానియగు చంపాపట్టణమునకు దీసికొనివచ్చిరి ఋష్యశృంగునిపాదవిన్యాసము రోమపాదనగరమున కలుగుటతోడనే సువృష్టి,సుభిక్షము,కలిగెను.అప్పుడు రోమపాదుడు తన యభీష్టము నెరవేరినందున ఋష్యశృంగునకు తన కొమరితయగు శాంతనిచ్చి వివాహముచేసి తనపట్టణముననే యుంచుకొనెను.

---

*వ్యా॥ వేశ్యాలింగనాదులవలనను వేశ్యలిచ్చినభక్ష్యాదులను భుజించుట చేతను,ఋష్యశృంగమహర్షికి తపోహానికల్గి మహిమయే పోగా నతని పాదవిన్యాసమాత్రముననే రోమపాదునిరాష్ట్రమున సుభిక్షము సువృష్టియు కలిగెననిచెప్పుట యుక్తమ్ముకాదని పూర్వపక్షము రాగా సమాధానము చెప్పబడుచున్నది. ఋష్యశృంగునకు స్త్రీవిషయకజ్ఞానమేలేనపుడు వేశ్యాస్త్రీవిషయకజ్ఞానమెట్లుండును. మఱియు, మనశ్చాంచల్యమునకుఁ గారణమేలేను (ఏలనన) రాగయుక్తమగు మనస్సుతోఁగూడిన బహిరింద్రియవ్యాపారమే ఫలకారియగును ఇవ్విషయమున, వస్త్రములు తొలగిపోయిన రాక్షస

క్రోధప్రతీకారకరంచ చక్రే గ్రామేష్వేవ మార్గేషు చ కర్షకాంశ్చ। విభాండకస్యా వ్రజత స్స రాజా పశూ స్సమృద్ధాన్ స్వశుపాంశ్చ వీరాన్॥ ౬౦౪

సమాదిశ త్పుత్రమార్గేణ మహర్షి ర్విభాండకః పరిపృచ్ఛే ద్యదావః। సవక్తవ్యః ప్రాంజలిభి ర్భవద్భిః పుత్రస్య తే పశవః కర్షకాశ్చ॥ ౬౦౫

---

రాగయుక్తమనస్సంయుక్తేంద్రియ వ్యాపారఏవ ఫలకారీ భవేత్ అత్రాపసారితచేల రాక్షసీపరిశీలకః హనుమానేవ సాక్షీ, తస్మాత్తపోహాని ర్నాస్తి. కించవేశ్యాదత్త భక్ష్యభోజ నాదినాకించిద్దోషసంప్రాప్తావపి తపోమాహాత్మ్యా త్తద్దోషోపి దగ్ధఏవేతి జ్ఞేయం.

నను ఋష్యశృంగేణ శాస్త్రాణి పఠితానివా నవా యదిపఠితాని తదాశాస్త్రేషు స్త్రియ ఈదృశ్యఇతి, తత్సహ చర్యం బ్రహ్మచారిణః దోషావహ మితి కథంనజ్ఞాతం.అపిచా రణ్యకస్త్రీ దర్శన మపి, నకదాపితస్యాఽభవద్వా, యదిన పఠితానితేనశాస్త్రాణి, అజ్ఞస్తదాభవేత్, అజ్ఞశ్చేత్కథమ స్యానుగ్రహ సామర్థ్యం భవేత్॥ తస్మాత్సర్వజ్ఞ ఏవాయ మితివక్తవ్యం తథాసత్య కృత్యకరణేన తస్యతపోహాని రభూ దితి చేదత్రోచ్యతే॥

బ్రహ్మవేత్తాతు యద్యత్పశ్యతి తత్తత్సర్వం బ్రహ్మే వేతిమనుతే తదనుగుణతయా ప్రవర్తతేసర్వాణ్యపి కార్యాణి ఋజుబుద్ధ్యా కరోతి నతువిషయా భిలాషతః॥

౬౦. ఈ రోమపాదుడు విభాండకమహర్షికిఁ గోపోపశాంతి జేయుటకుఁ దనపట్టణమునకు విభాండకాశ్రమమునకును మధ్యలో గోవులను ఇతరపశువులను వ్యవసాయకులను గోపాలకులను నుండనేర్పరచి పశుపాలకులు మొదలగువారితో నిట్లుచెప్పెను. ఓవ్యవసాయకులారా! ఓపశుపాలకులారా! విభాండకమహర్షి తనపుత్త్రుని వెదకికొనుచువచ్చుసమయమున నతఁడు మీరెవరనికాని యీ పశువులు భూములు ఎవరివనికాని విమ్ములనడిగినచో వినయముతో మీరలు విభాండకునితో మీకుమారునివే యీపశువులు భూములు మేము అనిచెప్పవలయునని వారలను చెప్పించెను,

---

స్త్రీలనుఁ బరిశీలించిచూచిన హనుమంతుడే సాక్షి. ఆకారణమున తపోహాని, ఋష్యశృంగునకు నయ్యెనని చెప్పుట సమంజసము కానేరదు. ఇదియునుంగాక, వేశ్యలచేసీయబడిన భక్ష్యములనుభుజించుటచేఁ గొంచెముదోషము సంప్రాప్తమైనను తపోమహిమచే తద్దోషము దగ్ధమైనదని తెలియనగు. ఇట్లుచెప్పినను కొందఱు క్రిందివిధముగా శంకించెదరు. (ఏమన) ఋష్యశృంగుడు శాస్త్రములనుఁ బఠించెనా.లేదా, పఠించెనని యంగీకరించిన స్త్రీలు,ఇట్టివారని కాని, స్త్రీసహచర్యము బ్రహ్మచారికి దోషావహమనికానియెట్లు తెలియదు. ఇదియునుంగాక, యారణ్యకస్త్రీలనైనను ఋష్యశృంగు డెప్పుడైనను, చూచియుండలేదా, మఱియు, శాస్త్రములను బఠింపలేదని యంగీకరించినచో. ఋష్యశృంగుడు మూఢుడైయుండవలసివచ్చును. అట్లైనచో జ్ఞానవిహీనునకు, అనుగ్రహసామర్థ్యమెట్లుకలుగును కాన ఋష్యశృంగుడు సర్వజ్ఞుడనియే చెప్పవలయును. అభక్ష్యభక్షణాములవలనఁ దపోహానియేకలిగెనని పూర్వపక్షవాదమునిల్చియున్నది. (ఇందుకు సమాధానమేమనగా) ఋష్యశృంగుడు బ్రహ్మవేత్తయని యందఱును, అంగీకరించినవిషయమేకదా, బ్రహ్మవేత్త, యేయేవస్తువులను చూచునో, యాయావస్తువునంతయు బ్రహ్మ

అథోపజాతం సమునిశ్చ్రోప స్వమాశ్రమం ఫలమూలం గృహీత్వా । అన్వేషమాణశ్చ స తత్ర పుత్రం దదర్శ చుక్రోధ తతో భృశం సః॥ ౬౨౪

తతస్సకోపేన విదీర్యమాణ మాశంకమానో నృపతే ర్విధానం। జగామ చంపాం ప్రతి వీక్షమాణ స్తమంగ రాజం సపురంసరాష్ట్రం॥ ౬౩౪

సవై శ్రాంతః క్షుధితః కాశ్యప స్తాన్ ఘోషా న్దదర్శ సాదిచరా న్సమృద్ధాన్ । గోపైశ్చ తై ర్విధివ త్పూజ్య మానో రాజేవ తాం రాత్రి మువాస తత్ర॥ ౬౮౪

అవాప సత్కార మతీవ తస్య పోవాచ కస్య పరిహితా స్థ గోపాః । ఊచు స్తత స్తేఽభ్యగమ్య సర్వే ధనం తవేదం విహితం సుతస్య॥ ౬౫౪

---

ఋజుబుద్ధేః పాపప్రసక్తి రేవ న తథాసతి తపోహానిః కథంభవేత్ అపిచబ్రహ్మవిదోపి ప్రారబ్ధమపరిత్యాజ్యంఖలు॥

తస్మాదేవ తత్పితా యోగదృష్ట్యా సర్వంజ్ఞాత్వా కౌమారిపవాయం దోషః. రాజావా, వేశ్యావా నిమిత్త మాత్రమితి మత్త్వైవరాజ్ఞః వేశ్యానాంచ శాపంనదత్తవాన్ అపిచ నారస్త్రీస్పర్శః బలీయాన్వా తత్తపోబలవద్వేతి విచార్యతాం శక్తిమానశక్తం స్పృశతిచేత్ శక్తస్య శక్తి రశక్తస్యైవ కించిద్గచ్ఛేత్ తస్మాదేవ సదాచారవతాం చండా

౬౨-౬౩॥ అనంతరము విభాండకమహర్షియు కందమూలఫలాదులను దీసికొని తనయాశ్రమమునకు రాగా దనపుత్రుడు కన్పడనందున మిక్కిలి కోపగించి రోమపాదునివలననే యీపనిజరిగినదని తెలుసుకొని రోమపాదుని దేశమును జూచుకొనుచు చంపాపట్టణమును గూర్చి వెళ్ళుచుండెను.

౬౪-౬౫॥ విభాండకమహర్షి క్షుద్బాధతోఁ గూడినవాడై దేశములను గొల్లపల్లెలను సర్వసమృద్ధితో నొప్పుచుండెడి గ్రామములనుజూచుచు నాయాగ్రామములయందలి ప్రజలచే మిక్కిలిపూజింపబడుచు రాత్రియందు నొక్కగొల్లపల్లెలోనుండి యాగోపాలకులచేతను పూజింపబడి విభాండకమహర్షి వారలనిట్లడిగెను ఓగోపాలకులారా! మీరలెవ్వరు! ఎవ్వరిచేఁబంపబడిరి యని యమ్మునీశ్వరు డడుగగా వారలిట్లు చెప్పిరి. ఓమునీంద్రా! మేము నీకుమారుని సేవకులము ఈభూములు గ్రామములు ఈగోవులు నీపుత్రునివేయని బనులుచెప్పుచుండిరి.

---

రూపమును గానే, తలచును, తదనుగుణము గానే ప్రవర్తించును. సమస్తకార్యములను ఋజుబుద్ధితో నే చేయును గాని విషయాభిలాషతోఁ జేయడు. ఋజుబుద్ధితోఁ జేసినవానికిఁ పాపప్రసక్తియే లేదు. అట్లైన తపోహాని, యెట్లుసంభవించును,

ఇదియునుం గాక, యెట్టిబ్రహ్మవేత్తకైనను ప్రారబ్ధము అనుభవింపఁ దగినదై యున్నదిక దా. అందువలననే ఋష్యశృంగునితండ్రి, యోగదృష్టిచే సర్వమునుఁ దెలిసికొని యీదోషము తన పుత్రునిదేయని నిశ్చయించెను, రోమపాదుడు కొని వేశ్యకానినిమిత్తమాత్రమునిశలచియే, రాజునకుగాని వేశ్యలకుఁగాని శాపమిచ్చియుండలేదు.

ఇదియునుం గాక, వేశ్యాస్త్రీస్పర్శదోషము బలవత్తరమైనదా! ఋష్యశృంగునితపస్సు బలవత్తరమైనదా! అనివిచారించెదము.

ఏవం స దేశేష్వభిపూజ్యమానస్తాంశ్చైవ శృణ్వన్మధుర
ప్రలాపాన్ । ప్రశాంతభూయిష్ఠరజాః ప్రహృష్టః
సమాససాదాంగపతిం పురస్తాత్॥ ౬౬౫

సపూజితస్తేననరర్షభేణ దదర్శ పుత్రం దివి దేవ
మింద్రం। శాంతాం స్నుషాం చైవ దదర్శ తత్ర
సౌదామినీ ముచ్చరంతీం యథైవ॥ ౬౭౪
గ్రామాంశ్చ ఘోషాంశ్చ సుతస్య దృష్ట్వా శాంతాం
చ శాంతశ్చ పరం సకోపః । చకార తస్మై చ పరం
ప్రసాదం విభాండకో భూపతయే నరేంద్ర॥ ౬౮౪

---

లాస్పర్శనేత్యేదమేవ కారణమితిజ్ఞేయం. కించవారస్త్రీ
స్పర్శాదినా మునిపుత్రస్య యదితపోహానిస్స్యాత్తర్హి
వాతాపిభక్షకాగస్త్యస్య ఆధోరణహస్తగతపక్వచణకభ
క్షిణశ్చోపస్తిబ్రాహ్మణస్యచ శ్వమాంసభక్షిణోకౌశికస్యచ
కావాగతిరితి సమాధేయం॥ వస్తుతస్తు. ఋష్యశృంగస్య తప
స్సిస్థితస్యవికటంపునః। పితామహస్సమాగత్య దదౌ తస్మై
వరాన్బహూన్॥ యత్రత్వం సంస్థితస్తత్ర సుభిక్షం క్షామ
నాశనం పశుప్రజాభివృద్ధి స్సాస్యత్త్వత్సంకల్పఃఫలీభవే
దితి బ్రహ్మవరానుసారేణ తత్పాదవిన్యాసవశాత్సుభిక్ష
మితి సర్వం రమణీయం॥

౨౨. విభాండకమహర్షి యీప్రకారము రోమపాదునిదేశములో గ్రామాదులయందలి ప్రజలచేఁ బూజింపఁబడుచు నచ్చటివారల నడుగుచు మీ పుత్రునివేయని మధురమైన సమాధానములను వినుచు కోపము కొంతశాంతించినవాడై సంతోషముతో రోమపాదుని పట్టణమును జేరెను.

౨౩-౨౮। రోమపాదు డర్ఘ్యపాద్యాదులచే విభాండకమహర్షినిఁ దనయంతః పురమునకు దీసికొనిపోఁగా నమ్ముని స్వర్గములో దేవేంద్రుడువలె మహావైభవముతోనున్న తనపుత్రుని, మెఱుపుతీగవలె ప్రకాశించుచున్న తనకోడలినిఁ జూచెను. తన కుమారుని వైభవమునుఁ జూచి కోపము పూర్తిగా శాంతించినవాడై రోమపాదునియం దనుగ్రహము కలవాడయ్యెను.

---

శక్తిమంతుడు, శక్తిహీనుని స్పృశించినయెడల శక్తిమంతుని శక్తియే యశక్తునకుఁ గొంచెము చేకూరునుగాని యశక్తునిదోషము శక్తిమంతునకు సంక్రమింపదు. కావుననే సదాచారవంతులు చండాలాదులను స్పృశింపకపోవుటకుఁ గారణముకూడ నిదియే యని యూహింపనగును. ఇదియునుంగాక వేశ్యాస్త్రీస్పర్శము నొందలగువానిచే ఋష్యశృంగునకుఁ దపోహాని కలిగెనననిచో, వాతాపిని భక్షించిన యగస్త్యునకును, మావటివాని చేతిలోనిశనగగుగ్గిళ్ళను లాగుకొనితినిన యుషస్తి బ్రాహ్మణునకును శ్వమాంసభక్షకుడగు విశ్వామిత్రునకును గతి యేమిచెప్పనగునని సమాధానపరచుకొనదగినది వాస్తవికము విచారించినచో. దపోనిష్ఠుడగు ఋష్యశృంగుని యొద్దకు నొకప్పుడు బ్రహ్మవచ్చి యమ్మహర్షికి వరములనేకము గనిచ్చెను. (ఏమన) ఓ ఋష్యశృంగుడా! నీవెచ్చటనుండెదవో యచ్చట సుభిక్షము, క్షామము లేక పోవుట, పశువృద్ధి, ప్రజావృద్ధి, కలుగును మఱియు నీసంకల్పమువిఫలముగుననిఁ యిట్లు బ్రహ్మ వరమిచ్చిన హేతువుచే మునిపాదన్యాసముచే సుభిక్షము కలిగెనని యెఱుగనగు.

1 సతత్రనిక్షిప్య సుతం మహర్షి రువాచ సూర్యాగ్నిసమ
ప్రభావః। జాతేతు పుత్రే వన మావ్రజేథా. రాజ్ఞః
ప్రియాణ్యస్య సర్వాణి కృత్వా॥ ౧౯౫

ఇత్యుక్త్వా ఋష్యశృంగం తం దంపత్యో శ్చాభిషంచరన్
అనుగృహ్యాంగరాజంచజగామస్వాశ్రమంమునిః॥ ౨౦౫

ఇత్యే తదృష్యశృంగస్య చరిత్రం పాపనాశనం
కథితం తే మహారాజ తమాసీయా చర క్రతుం॥ ౨౧౫

తచ్ఛ్రుత్వా రాజశార్దూలః ప్రహృష్ట హృదయ స్తదా
సమానేతుం ఋష్యశృంగం గంతు కామో
భవత్స్వయం॥ ౨౨౫

ఆ శ్చ ర్య రా మా య ణే

అష్టమసర్గ స్సమాప్తః

---

1. అ॥ రా॥

౧౯౹ అనంతరము మహాప్రభావముగల విభాండకమహర్షి, కుమారుడక్కడనే యుండునట్లునియోగించి తాను తనయాశ్రమమునకు వచ్చుచుఁ దన పుత్రునితో నిట్లుఁ జెప్పెను. కుమారా! నీవు రోమపాదుని యభీష్టమును నెరవేర్చి పుత్రసంతానము కలిగిన పిమ్మట వనమునుగూర్చి రావలసినదియని చెప్పెను.

౨౦౹ ఈప్రకారము విభాండకమహర్షి ఋష్యశృంగునిగూర్చి చెప్పి నాతనదంపతుల నాశీర్వచించి రోమపాదునియం దనుగ్రహము గలవాడై తనయాశ్రమమునకు వెళ్లెను.

౨౧౹ ఓదశరథమహారాజా! పాపహరమైన ఋష్యశృంగుని చరిత్రమును నీకుఁజెప్పితి. ఋష్యశృంగుని దీసుకొనివచ్చి క్రతువునుఁజేయుము. అని సుమంత్రుడు దశరథునితోఁ జెప్పెను.

౨౨౹ దశరథుడు మహాప్రభావముగల ఋష్యశృంగుని చరిత్రమునువిని సంతోషించి యమ్మునిని దీసికొనివచ్చుటకు రోమపాదుని పట్టణమునకు బోవ నుద్యుక్తుడయ్యెను.

ఆశ్చర్యరామాయణమున

నెనిమిదవ సర్గము సమాప్తము.

---

## నవమసర్గప్రారంభః.

* అథ రాజా దశరథ స్సభార్య స్ససుహృజ్జనః
వసిష్ఠేనాఽభ్యనుజ్ఞాతః రోమపాదపురీం గతః॥
తతో రాజా యథాన్యాయం పూజాం చక్రే విశేషతః
సఖిత్వా త్తస్య వై రాజ్ఞః ప్రహృష్టేనాంతరాత్మనా ౨॥

---

* వసిష్ఠేనాభ్యనుజ్ఞాతఇతి. అనేన ప్రాచీనఋత్విగభ్యనుజ్ఞానేనైవ అన్య ఆనేయ్యః నతు తదతిక్రమణేనేతి. సూచితం తథాచబోధాయనః. యో స్యసంస్తుతమః స్యాత్తం ప్రథమం వృణీత తేన సచివేనాన్యం లిప్సేతేతి. అపిచాయమర్థో ఽన్వయవ్యతిరేకాభ్యాం ఫలముఖేన స్పష్టీక్రియతే. అన్వయస్తావత్ అంగదేశానీతఋష్యశృంగకారితక్రతునా చత్వారః పుత్రా భవిష్యంతీతి సనత్కుమారవాక్యం సుమంత్రేణ కథితం శ్రుత్వా వసిష్ఠాభ్యనుజ్ఞాంవినా ఋష్యశృంగానయన మయుక్త మితి నిశ్చిత్య అవాప్య తదనుజ్ఞాం దశరథ స్సమానీయ ఋష్యశృంగం వసిష్ఠఋష్యశృగాభ్యాం కారితయాగేన సకలదురితనిరసనపూర్వక మభిలషితసిద్ధిమవాపేతి. వ్యతిరేక స్తావత్ ఏతద్వంశ్య స్త్రిశంకుః సశరీర స్వర్గప్రాప్తయే యజ్ఞః కారయితవ్య ఇతి ప్రార్థితేన వసిష్ఠేన గురుణా ప్రత్యాఖ్యాతో గురుపుత్రా నాసాద్య తై శ్శప్తః ప్రాప్తనీచజాతిః విశ్వామిత్రం శరణం ప్రాప్తః తేన ప్రతిజ్ఞాపూర్వకం సశరీరం స్వర్గం ప్రాపితోపి దేవైః పాతితః అ

## నవసర్గప్రారంభము,

* ౧ అనంతరము దశరథమహారాజు వసిష్ఠునియనుజ్ఞనుబొంది తన భార్యలతోడను, బంధువులతోడను రోమపాదునిపత్తనమునకేగెను.

౨ ఆరోమపాదుడును, తనకు దశరథుడు పరమ మిత్రుడును. బంధువుడును గాన సంతుష్టాంతరంగముతో నారాజునకు దగిన గౌరవమును జేసెను.

---

* దశరథుఁడు ఋష్యశృంగుని తీసికొనివచ్చుటకు వసిష్ఠునియనుజ్ఞను బొంది వెళ్ళెనని చెప్పుటచేఁ బూర్వమునందుండిన పురోహితుల యనుజ్ఞబడసియే మఱియొక పురోహితుని తీసికొనిరావలయు ననియు, ప్రాచీన పురోహితుని నతిక్రమించి తీసికొనిరాకూడదని యెడి ధర్మము దీనిచే సూచింపబడినది. "బోధాయనుఁడును నవ్విధముననే చెప్పెను." (ఏమన,) ఏపురోహితుఁడు పూర్వము నుండి యజమానునిచేఁబూజితుఁడయ్యెనో వానినే కర్మలందువరింప వలయును. వారి యనుమతిచే నితరుని కోరవలయునని,— ఇది యునుంగాక యీవిషయ మన్వయవ్యతిరేకములచే ముఖముగా స్పష్టపరుపబడుచున్నది. అన్వయమనగా, ఏదియుండిన నేదియుండు నో,యది యన్వయమనియు, ఏదిలేనిచో నేదియుండదో యది వ్యతి రేకమనియును శాస్త్రమర్యాదయై యున్నది.)

అంగదేశమునుండి తీసికొనిరాబడిన ఋష్యశృంగునిచేఁజేయింపఁ బడిన యాగముచే నల్వురు పుత్రులు కలుగుదురని సనత్కుమారుఁడు జెప్పిన వాక్యమును సుమంత్రుఁడు చెప్పగా దశరథుఁడు విని వసిష్ఠానుమతిలేనిదే ఋష్యశృంగునిఁ దీసుకొనివచ్చుట న్యాయముకాదని తదనుమతినొంది దశరథుఁడు ఋష్యశృంగుని దీసుకొని వచ్చి వసిష్ఠ ఋష్యశృంగులచేఁ జేయింపఁబడిన యాగముచే సకల పాపక్షయపూర్వకమైన యాభీష్టసిద్ధి నొందెననునది యన్వయము- స్వర్గప్రాప్తికొఱకు యజ్ఞమును జేయింపుడని త్రిశంకుడు తన

రోమపాదేన చాఖ్యాత మృషిపుత్రాయ ధీమతే
సఖ్యం సంబంధకంచైవ తదా తం ప్రత్యపూజయత్ 3॥

ఏవం సుసత్కృత స్తేన సహోషిత్వా నరర్షభః
సప్తాష్టదివసా న్రాజా రాజాన మిద మబ్రవీత్ ౮॥

---

ద్యావా పృథివ్యోర్మధ్యే అంతరిక్షేలంబమాన స్తిష్ఠతి ఏవంచ గురుశాపో ఽప్రతీకార్య ఇతిసూచితం తస్మాత్పూర్వపరిగృహీతఋత్విక్సాచిద్వైనైవ అన్యఆనేయ ఇతిసిద్ధం ఋత్విజాపి యజమానః సత్యాజ్య ఇత్యర్థే మహాభారతే అశ్వమేధికే పర్వణి సంవర్తమరుత్తీయేఽభిహితః గ్రంథవిస్తరభయాన్నలిఖ్యతే-సభార్యఇతి-భార్యాయుతః రోమపాదనగరీం దశరథో ఽగా దితికథనేన జామాతృలాలనయాఽకీత్యా శాంతయా సహానయనార్థమితి మంతవ్యం అన్యథా భార్యాభిస్సహ గమనే ప్రయోజనం నభవేత్

3 రోమ పాదుడును. బుద్ధిమంతుడగు ఋష్యశృంగునితో (దనకు దశరథునకును౦డెడి మిత్రత్వమును, బంధుత్వమును తెలియ జేసెను. అప్పుడు ఋష్యశృంగుడు దశరథుని నెక్కుడుగఁ బూజించెను. (ఇచ్చట: రోమపాదునకు దశరథునకుగల బంధుత్వ మేమనగా దశరథుని కుమార్తెయగు శాంతనుఁదాను బెంచుకొని ఋష్యశృంగునికిచ్చుట యని తెలియనగు)

౪ ఇవ్విధముగ దశరథుడు రోమపాదునిచే సన్మానింపబడుచు వాని గృహము నందేడెనిమిది దినములుండి, పిదప రోమపాదుని గూర్చి యివ్విధముగ బలికెను.

---

గురువగు వసిష్ఠునిఁ బ్రార్థింపగా, నమ్మునిచే తిరస్కరింపఁబడి గురుపుత్రులఁజేరి వారలచే శపింపబడి నీచజాతినొంది విశ్వామిత్రుని శరణుఁబొంది యమ్మునిచే ప్రతిజ్ఞాపూర్వకముగ సశరీర స్వర్గమును బొందింపఁబడినవాడైనను దేవతలచే తలక్రిందుగఁ ద్రోయఁబడి యిప్పటికిని తలక్రిందుగా నాకాశమునందు వ్రేలాడుచు నుండెనను నది వ్యతిరేకము—పైవిషయము విచారింపగా గురు శాపమునకుఁ బ్రతిక్రియ లేదని సూచింపంబడినది. ఆకారణమువలన పూర్వము నుంచియున్న ఋత్విజుని యనుమతిచేతనే మఱియొక ఋత్విజునిఁ దీసుకొనిరావలయునను ధర్మము సిద్ధము)—యజమానుఁడు ఋత్విజుని విడువకూడదనునట్లు ఋత్విజుడును యజమానుని విడువ గూడదను విషయము మహాభారతమున అశ్వమేధపర్వమున, సంవర్త మరుత్తరాట్చరిత్రమున జెప్పబడినది. గ్రంథవిస్తరభీతిచే విరమింపబడుచున్నది. ఇచ్చట దశరథుడు భార్యలతోఁగూడ రోమపాదుని పట్టణమునకు వెళ్ళెననుటచే జామాతయగు (అల్లుడైన) ఋష్యశృంగునకు సంతసమును గలిగించి శాంతనుఁ గూడఁదీసికొని వచ్చుటకని తెలియనగు, లేనిచో భార్యలతో వెళ్ళిన ప్రయోజనము లేదని యెఱుగనగు.

* శాంతా తవ సుతా రాజన్ సహ భర్త్రా విశాంపతే
మదీయం నగరం యాతు కార్యం హి మహదుద్యతం ౫,

---

* శాంతాతవసుతేతి:నను శాంతా రోమపాదపుత్త్రి కేత్యుపరితనవచనేన స్పష్టీక్రియతే. దశరథపుత్త్రీశాంతేతి పూర్వం కథన మసయించీన మితిచే దత్రోచ్యతే శాంతా దశరథపుత్త్రికేత్యత్ర నకశ్చిదపి వివాదః కుత ఇతిచే దుచ్యతే, వాల్మీకిరామాయణే బాలకాండే తీర్థీయవ్యాఖ్యానే (అనేన మేనపత్యాయేతి) ఋష్యశృంగంప్రతి రోమపాదవచనేన" భాగవతే శ్లో॥ రోమపాద ఇతి ఖ్యాత స్తస్మి న్దశరథ స్సఖా శాంతాం స్వకన్యాం ప్రాయచ్ఛ దృష్యశృగ ఉవాహతాం।

ఇతి వ్యాసవచేనచ, వాల్మీకిరామాయణే ఋష్యశృంగస్తు జామాతేతి దశరథంప్రతి సుమంత్రోక్త్యాచ॥ కన్యాం దశరథో రాజా శాంతాంనామ వ్యజీజనత్ అపత్యకృతికాం రాజ్ఞే రోమపాదాయ తాం దదావితి ప్రాచీన భవభూతిమహాకవివచనేనచ" వాల్మీకిరామాయణే, సఖ్యంసంబంధకం చైవేతి దశరథజామాతృత్వరూపసంబంధ నివేదక రోమపాదవచనేనచ" అపిచ" రోమపాదో నపత్యస్సన్ సుతాం దశరథస్యతు। స్వీకృత్య వైభాండకాయ దత్తవాం స్తుష్టమానసఇతి ప్రాచీనమహర్షివచనేనచ దశరథస్యౌరసీ శాంతా

*౫ ఓ రోమపాదుఁడా! నీకొమరితయగు శాంత, భర్తయగు ఋష్యశృంగునితో నాపట్టణమునకు వచ్చుగాక. నేనొక మహాకార్యము నారంభించితిని.

---

* వ్యా శాంత, రోమపాదుని పుత్రిక యని పైవచనముచే స్పష్టీకరింపఁబడినందున శాంత దశరథపుత్రిక యని పూర్వము చెప్పుట సమంజసము కానేరదని పూర్వపక్షము రాగా సమాధానము చెప్పబడుచున్నది. శాంత, దశరథపుత్రిక యని చెప్పుటలో వివాదమేమియు లేదు (ఎట్లన) వాల్మీకిరామాయణమున బాలకాండమున 11 సర్గమున (తీర్థీయవ్యాఖ్యానమున) ఋష్యశృంగుని గూర్చి రోమపాదుఁడు చెప్పినపుడు (సంతానములేని నాకు దశరథుఁడు తన పుత్రికయగు శాంతను దత్తత నిచ్చెనని యర్థమిచ్చు (అనేన మేనపత్యాయ) అను శ్లోకమును బట్టియు" భాగవతమున నవమస్కంధమునందు" రోమపాదుఁడను రాజునకు దశరథుఁడు తన పుత్రిక నిచ్చినట్లును ఋష్యశృంగుఁడామెను వివాహమాడెనట్లు నర్థమిచ్చు (రోమపాద ఇతిఖ్యాతః) అను శ్లోకమును బట్టియు" వాల్మీకిరామాయణమున బాలకాండమున, సుమంత్రుఁడు దశరథునితోఁ బూర్వవృత్తాంతమును జెప్పినపుడు నీయల్లుఁడగు ఋష్యశృంగుఁడు నీచే యాగమునుఁ జేయించుటవలన పుత్రులుకలుగుదురని యర్థమిచ్చు (ఋష్యశృంగస్తు జామాతా) అను శ్లోకమును బట్టియు, దశరథమహారాజునకు శాంతయను కొమరిత కలదనియు నామెను రోమపాదునకు దత్తతగా నిచ్చెనని యర్థమిచ్చు (కన్యాం దశరథో రాజా) అను" ప్రాచీనమహాకవియగు భవభూతిచే రచింపబడిన యుత్తరరామచరితమునందలి శ్లోకమును బట్టియు" రోమపాదుఁడు ఋష్యశృంగునితో దశరథునకుఁగల సంబంధ బాంధవ్యములను జెప్పినపుడు ఋష్యశృంగుఁడు దశరథునియల్లుఁడను నర్థమిచ్చు (సఖ్యం సంబంధకం చైవ) అను వాల్మీకివచనమును బట్టియు, రోమపాదుఁడు సంతానహీనుఁడై దశరథపుత్రికను దత్తతగాఁ గైకొని ఋష్యశృంగునకు సంతోషముతో నిచ్చెనని యర్థమిచ్చు (రోమపాదోనపత్యస్సన్) అను ప్రాచీనమహర్షివాక్యమును బట్టియు, శాంత,

తథేత్యుక్త్వా రోమపాదః వచనం ప్రాహ వైద్విజం॥ ౫౪

---

రోమపాదస్యదత్తసుతేతినిర్ణీతా. కించపురాతనేనతంజావూరు ప్రభుణా విద్వత్కవినాశహాజీసమాఖ్యేనవిరచితే శాంతా కల్యాణేపి దశరథపుత్రీ శాంతేతి నిశ్చితేతిజ్ఞేయం. నన్వేతావతా శాంతాయాః దశరథపుత్రికాత్వేసిద్ధేఽపి దశరథాత్ కౌసల్యాయాముత్పన్నేతి వక్తుమవకాశః కథమితిచేత్ పురాతనకవినా గోపీనాథేన, స్వవిరచితవచనరూపవిచిత్ర రామాయణే శాంతా కౌసల్యాయాం దశరథాజ్జాతే త్యాది కథావిశేషస్య వర్ణితత్వాత్ తత్కథా మనుసృత్య” ఇతర రామాయణేపి తథాదృష్టత్వాచ్చ తత్కథా మనుసృత్యచ, ప్రమోదూతసంవత్సరాశ్వియుజ భారతిపత్రికావిమర్శితశాంతావృత్తాంతమనుసృత్యచ, భవభూతినోత్తరరామచరితే కౌసల్యాయాంజాతాశాంతేతిసూచితత్వేన,తత్కథామనుసృత్యచ,పూర్వోక్తశాంతాస్వయంవరపర్యంతకకథాభాగోమయా గ్రథితః అపిచ వాల్మీకి రామాయణే” పుత్రార్థం నాస్తి వై సుఖ మితి దశరథవచనేనైవ పుత్రికాసుఖ మస్త్యస్తీతిద్యోత్యతేకేచిత్తు కౌశల్యా శాంతాయాః జననీ నతుకౌసల్యా కౌశల్యానామ కుశలత్వవతీ యాకాచన భోగపత్నీ, దశరథస్య వర్తమానసార్థసప్తశతభోగపత్న్యంతర్గతా ” ఇతి వదంతి ఏతస్మిన్ విషయే యథారుచి విపశ్చితోఽనుమోదంత్వితి మయావిరమ్యతే॥

౫౪ అవ్విధమననే యగుగాకయని రోమపాదుడు దశరథునితోఁ జెప్పి
యనంతరము ఋష్యశృంగునిగూర్చి యివ్విధముగాబలికెను.

---

వ్యా॥ దశరథునకౌరసపుత్రికయనియు రోమపాదునకు దత్తతపుత్రిక యనియు నిశ్చయింపబడుచున్నది. మఱియు శాంతాకళ్యాణమను ప్రాచీనగ్రంథమునం దివ్విధమననే యున్నది.

ఇందుపై నొకపూర్వపక్షము వచ్చుచున్నది(ఏమన) పైవాక్యములచే శాంత, దశరథపుత్రికయని నిశ్చయింపబడినను దశరథునివలన కౌసల్యయందుఁ బుట్టినదని చెప్పుటకుఁ బ్రమాణమేమియనగా" పురాతనకవియగుగోపీనాథుడు తనచేరచింపఁబడినవిచిత్రరామాయణమునందిట్లువర్ణించెను శాంత కౌసల్యయందుఁబుట్టినట్లును శాంతాస్వయంవరకాలములో పరశురాముడువచ్చి ఋషిపుత్రునకు నీయుమని చెప్పినట్లును, అప్పుడే రోమపాదుడు దత్తతగానీయుమని తీసుకొనివెళ్ళినట్లును మొదలగునాశ్చర్యభూతమగుకథానకము వర్ణింపబడినదియగుటచేతను, ఇతరరామాయణమునందట్లు కన్పడుటచేతను, ప్రమోదూతసంవత్సరాశ్వయుజమాసభారతిపత్రికలో శాంతావృత్తాంతము విమర్శింపఁబడి యుండుటచే దానినాధారముగ చేసికొనియు, భవభూతిమహాకవి, వుత్తరరామచరితమున కౌసల్యాపుత్రిక శాంతయనిసూచించుటనుబట్టియు, పైకారణములవలన శాంతాస్వయంవరపర్యంతకమగు కథావృత్తాంతము నాచేగూర్పబడినది. మఱియు వాల్మీకిరామాయణమున దశరథుడు వసిష్ఠాదులతోఁ జెప్పునపుడు తనకు బుత్రసుఖములేనట్లు చెప్పుటవలనఁ బుత్రికాసుఖము ధ్వనితమగుచుండెను. కొందఱు కౌశల్య శాంతయొక్క తల్లికావచ్చును. కౌశల్యయనగా కోసలరాజపుత్రికయగు కౌసల్యకాదు కౌశల్యయనగా కుశలతగల యొకానొక భోగపత్నియైయుండును దశరథునకు మూడువందలయేబదిభార్యలుండిరి గనుక వారిలో చేరినకుశలతగలయొకభోగపత్నియందు శాంత జన్మించియుండవచ్చునని వాదించెదరు. కాని యవ్విషయమున తగుప్రమాణముల్లు గానరావు కాన పండితులు తమ యభిమతానుసారమామోదింతురుగాక యనివిరమింపఁబడుచున్నది.

1 అనేన మేఽనపత్యాయ దత్తేయం వరవర్ణినీ
యాచతే పుత్రతుల్యైషా శాంతా ప్రియతరాత్మజా
సోయం తేశ్వశురో బ్రహ్మన్ యథైవాహం తథా నృప॥ ౬-౭
తస్మాత్త్వం భార్యయా సార్థం గచ్ఛాయోధ్యాం పురీం ప్రతి
ఋషిపుత్రః ప్రతిశ్రుత్య తథేత్యాహ నృపం తదా॥ ౮
స నృపేణాభ్యనుజ్ఞాతః ప్రయయౌ సహభార్యయా
అంతఃపురం ప్రవిశ్యైనం పూజాం కృత్వాథ శాస్త్రితః
కృతకృత్యం తదాత్మానం మేనే తస్యోపవాహనాత్॥ ౯

2* అంతఃపురస్త్రియస్సర్వాశ్శాంతాం దృష్ట్వా తథాగతాం
సహభర్త్రా విశాలాక్షీం ప్రీత్యానంద ముపాగమన్॥ ౧౦
తతః కాలే బహుతిథే కస్మింశ్చిత్సుమనోహరే
వసంతే సమనుప్రాప్తే రాజ్ఞో యష్టుం మనోఽభవత్॥ ౧౧
అథ రాజా వసిష్ఠం తు నత్వా ప్రాంజలి రబ్రవీత్॥ ౧౨

* తథాగతాం శాంతాం దృష్ట్వా అంతపురస్త్రియస్తుష్టా ఇతి కథనేన కన్యాత్వకాలేపి శాంతా తదా తదా సమాగతేతి ధ్వన్యతే. అపిచ శాంతాయాః దశరథపుత్రికాత్వాభావే కథం దశరథపత్నీనాం సర్వాసామపి తాదృక్సంతోష స్సంభవేత్ తస్మాదపి దశరథపుత్రీ శాంతేతి స్పష్టీభవతి॥

1 * వా॥ రా॥ 12 సర్గే॥ తీర్థీయవ్యాఖ్యానే. 2* వా॥ రా॥

౬-౭ ఓఋష్యశృంగుఁడా! యీదశరథుఁడు సంతానరహితుడనగు నాకు శాంతను దత్తతగా నిచ్చెను. కావున నీవునేనెటుల మామనో యట్లేదశరథుడును మామయగునని యెఱుఁగనగు.

౮ ఓఋష్యశృంగుఁడా! ఆకారణమువలన నీవు భార్యతోఁగూడ నయోధ్యాపురికివెళ్ళుము అని రోమపాదుడు ఋష్యశృంగునితోఁ జెప్పగా ఋష్యశృంగుడు నటులనేఁజేయుదుననెను.

౯౪ పిమ్మట ఋష్యశృంగుడు రోమపాదుని యనుజ్ఞనొంది భార్యాసమేతుడై దశరథునితో నయోధ్యకేగెను. దశరథుఁడును ఋష్యశృంగుని తనయంతఃపురమునఁ బ్రవేశపెట్టి యథావిధిగాఁబూజించి యామహర్షి తన గృహమునకువచ్చుటచే కృతార్థుడనయితినని సంతసించెను,

*౧౦౪ అంతఃపురస్త్రీలందరు నవ్విధముగావచ్చిన (అనగాభర్తతోవచ్చిన) శాంతనుఁజూచి బ్రహ్మానందమునొందిరి.

౧౧౪ ఇట్లు కొంతకాలము గడచినపిదప మనోహరమైన వసంతఋతువు రాగా దశరథుడు యాగముజేయనుద్యుక్తుడయ్యెను.

౧౨ అనంతరము దశరథుడు వసిష్ఠునిఁబిలిచి చేతులుజోడించి యివ్విధముగఁబలికెను.

---

* అవ్విధముగావచ్చిన శాంతనుజూచి యంతఃపురస్త్రీలు సంతసించిరని చెప్పుటచేత కన్యకగానుండిన కాలమునందప్పుడప్పుడు శాంత వచ్చుచుండెడిదియని తోచబడుచున్నది. మఱియు శాంత దశరథపుత్రికకానియెడల దశరథుని యంతఃపురస్త్రీలందరకు నట్టిసంతోషముగలుగుటకే కారణముండదు. కానశాంత దశరథపుత్రికయని పైవాక్యమువలనను స్పష్టమగుచున్నది.

1 యజ్ఞో మే క్రియతాం బ్రహ్మ న్యథోక్తం మునిపుంగవ
యథా న విఘ్నః క్రియతే యజ్ఞాంగేషువిధీయతాం॥౧౩
* 1 భవా న్స్నిగ్ధ స్సుహృ న్మహ్యం గురు శ్చ పరమో భవాఞ్
వృద్ధశ్చ భవతా చేహ భారో యజ్ఞస్యచోద్యతః॥౧౪
తథేతి చ స రాజాన మబ్రవీ ద్ద్విజసత్తమః
కరిష్యే సర్వమేవైత ద్భవతా యత్సమర్థితం॥ ౧౫
* 2 తతో ఽబ్రవీ ద్ద్విజా న్వృద్ధా న్యజ్ఞకర్మసు నిష్ఠితాఞ్
అవజ్ఞయా న దాతవ్యం కస్యచి ల్లీలయాపి వా
అవజ్ఞయాకృతంహన్యా ద్దాతారంనాత్ర సంశయః॥౧౬

---

1 * అనేన యజ్ఞాదిమహాకర్మారంభే నూతనేషు ఋత్విక్షు సత్స్వపి ప్రాచీనఏవ సర్వజ్ఞే ఆస్తికే మహాబ్రాహ్మణే భారం వినిక్షిప్య తద్వచనానుసారేణ కర్మ కర్తవ్యమితిసూచితం.

2 * అత్రశ్రద్ధా పురస్సరమేవదానం కర్తవ్యం అశ్రద్ధయా దానం నిష్ఫలమిత్యుక్తం తథాచ శ్రుతిః" శ్రద్ధయా దేయం. ఇతి-భగవద్గీతాయామపి"అశ్రద్ధయా హుతం దత్తం తప స్తప్తం కృతం చ యత్। అసదిత్యుచ్యతే పార్థ నచ తత్ప్రేత్య నో ఇహ॥ ఇతి.

---

1 వా. రా.

౧౩ ఓవసిష్ఠమహర్షీ! నేను చేయబోవు యజ్ఞమునందు తదంగములందును విఘ్నము లేకుండునట్లు యాగసంపూర్తిని చేయుదువు గాక!

1*౧౪½ ఓమునివర్యా! నీవు నాకుమిత్రుడవు. మఱియు గురువర్యుడవు. కావున యజ్ఞభారమునంతయు నీవే వహింపవలయును. (అని దశరథుడు వసిష్ఠుని ప్రార్థించెను.

౧౫ ఓరాజా! నీవుకోరినటుల సర్వమును నేను చేయగలనని వసిష్ఠుడు దశరథునిగూర్చి పలికెను.

2*౧౬½ అనంతరము వసిష్ఠుడు యజ్ఞకర్మయందు నియమితులగు వృద్ధబ్రాహ్మణులతో నిట్లు పలికెను. "ఓ ద్విజోత్తములారా! యజ్ఞమునందెవ్వనికైన నేదియైన నీయవలసివచ్చినపుడు విలాసముగాగాని యవమానపూర్వకముగా గాని నీయకూడదు. అవమాన పూర్వకముగ దానముఁజేసినచో దాతకు నష్టముకల్గుననుటకు సందియ మెంతమాత్రము లేదు.

---

1 * పైవాక్యముచే యజ్ఞము మొదలగు మహాకర్మల నారంభించునపుడు క్రొత్తగావచ్చిన ఋత్విక్కులుండినను ప్రాచీనుడగు సర్వజ్ఞుడైన యాస్తికుడైన బ్రాహ్మణునియందు కార్యభారమునుంచి యతడు చెప్పినవిధముగ కర్మ నాచరింపవలయునని సూచింపబడుచున్నది.

* 2 ఈశ్లోకమునందు శ్రద్ధాపూర్వకముగ దానముఁజేయవలయుననియు నశ్రద్ధచే దానముఁజేయుట నిష్ఫలమనియుఁ జెప్పబడినది. శ్రద్ధచే నీయవలయునని శ్రుతియును చెప్పెను. భగవద్గీతయందును, అశ్రద్ధచే, హోమముచేసినను, దానము చేసినను, తపస్సు చేసినను, అది యంతయు వ్యర్థమగుననియు, ఇహమునకుగాని పరమునకుగాని యుపయోగించదనియు కృష్ణుడర్జునునితోఁ జెప్పెను.

1* శుభే దివసనక్షత్రే నిర్యాతో జగతీపతిః
తతో వసిష్ఠప్రముఖా స్సర్వ ఏవ ద్విజోత్తమాః
ఋష్యశృంగం పురస్కృత్య యజ్ఞకర్మారభం స్తదా॥ ౧౮
అథ సంవత్సరే పూర్ణే తస్మి న్ప్రాప్తే తురంగమే
సరయ్వా శ్చోత్తరే తీరేరాజ్ఞో యజ్ఞో భ్యవర్తత॥ ౧౯
ఋష్యశృంగం పురస్కృత్య కర్మ చక్రు ర్ద్విజర్షభాః
2* నచాహుత మభూ త్తత్ర స్ఖలితం వాపి కించన
దృశ్యతే బ్రహ్మవత్సర్వం క్షేమయుక్తం చ చక్రిరే॥ ౨౦

---

1* అత్ర యజ్ఞాదికం కర్మ బ్రాహ్మణ పురస్సరం కర్తవ్యం. అయం ధర్మః సర్వేషాం సాధారణః. రాజ్ఞాం తు విశిష్య బ్రహ్మముఖత్వం సర్వత్రా తిశయధాయకం. తథాచ శ్రుతిః "తస్మా ద్రాజన్యో బ్రాహ్మణవానిత్యాది=గౌతుమశ్చ, బ్రాహ్మణం పురోదధీత.ఇతి=మహాభారతే ఆదిపర్వణి" పురోహితమతే తిష్ఠే ద్యఇచ్ఛే ద్భూతి మాత్మనః॥ ఇతి. ఆరణ్యకే యుధిష్ఠిరదాల్భ్య సంవాదేపి" కుంజరస్యేవ సంగ్రామే పరిగృహ్యాంకుశగ్రహం। బ్రాహ్మణై ర్విప్రహీనస్య క్షత్రస్య క్షీయతే బలం॥ ఇతి.

2* అనేన యజ్ఞకర్మణి విహితే కాలే యథావిధ్యనుష్ఠానకుశలై రభిజ్ఞై రాస్తికైః ఋత్విగ్భి రన్యూనాతిరేకేణ అనుష్ఠాతవ్యమితి సూచితం

1*౧౪-౧౭ అనంతరము శుభనక్షత్రయుక్తదివసమునందు దశరథుడు, యజ్ఞవాటికకు బయలుదేఱెను. అతనివెంట వసిష్ఠుడు మొదలగు బ్రాహ్మణులందఱు, యజ్ఞవాటికకుఁజేరిరి, అప్పుడు ఋష్యశృంగుని ముందిడుకొని యజ్ఞము నారంభించిరి,

౧౯ సంవత్సరము పూర్తియగుచుండ యాగాశ్వము తిరిగి వచ్చెను సరయూనదియొక్క యుత్తరతీరమునందు దశరథుని యజ్ఞము ప్రారంభమయ్యెను.

2*౨౦౪ బ్రాహ్మణోత్తములు ఋష్యశృంగునిఁ బురస్కరించుకొని యాగమునుఁ జేయించుచుండిరి. ఆయజ్ఞమునందు విధినతిక్రమించి హోమముకాని తొట్రుబాటుగాని కొంచెమైనను లేకుండెను, బ్రాహ్మణులు హోమాదికమును విధ్యుక్తముగాను యజమానికి క్షేమము కలుగునట్లుగానుఁ జేసిరి.

---

1* యజ్ఞాదికర్మలు బ్రాహ్మణ పురస్సరముగఁ జేయవలెననెడి విషయము పైవాక్యములచే స్పష్టమగుచున్నది. ఈధర్మ మందఱకు సాధారణమైనను, రాజులకు విశేషించి బ్రహ్మముఖత్వము, అతిశయ విధాయకమని చెప్పనొప్పు. అటులనే శ్రుతియు చెప్పుచున్నది. రాజు బ్రాహ్మణపురస్సరముగ చేయవలయునని- గౌతముడును, "బ్రాహ్మణుని ముందిడుకొని కర్మ నారంభింపవలయును" అని చెప్పియుండెను. మహాభారతమున ఆదిపర్వమున" ఐశ్వర్యమును గోరు రాజు, పురోహితుని మతము ననుసరించి యుండవలయునని చెప్పెను. భారతమున అరణ్యపర్వమునను యుధిష్ఠిర దాల్భ్యసంవాదమున నిటులనే చెప్పబడినది, (ఏమన) యుద్ధభూమియందు మదపుటేనుగున కంకుశ మవసరమయినట్లు, రాజునకు బ్రాహ్మణులట్లవసరమనియును, బ్రాహ్మణరహితుడగు క్షత్రియునకు బలము క్షీణించుననియు చెప్పబడినది.

2* పైవాక్యముచేతను యజ్ఞకర్మయందు విహితకాలమున యథావిధిగా ననుష్ఠించుటయందు నిపుణులును, ఆస్తికులును, విధానమును బాగుగ తెలిసినవారునగు ఋత్విజులు తక్కువ యెక్కువ లేకుండగ కర్మను జేయింపవలయునని ధర్మము సూచితము.

1* న తేష్వహస్సు శ్రాంతో వా క్షుధితో వాపి దృశ్యతే
అన్నపానై స్సువిహితాః తస్మి న్యజ్ఞే మహాత్మనః॥ ౨౧౪

అన్నం హి విధివ త్స్వాదు ప్రశంసంతి మహాత్మనః
అహోతృప్తా స్మ భద్రం త ఇతిశుశ్రావ రాఘవః॥ ౨౨౪

2* కర్మాంతరే తదా విప్రా హేతువాదా న్బహూనపి
ప్రాహు స్సువాగ్మినో ధీరాః పరస్పరజిగీషయా॥ ౨౩౪

---

1* అనేన అవిశేషేణాగతాః సర్వేబ్రాహ్మణాః మృష్టాన్నదానేన తోషణీయ్యా ఇతి సూచితం

2* అనేన ద్విద్వుక్షుభిః సదసో బహిరాసీనైః ప్రయోగావిరోధేన అంతరాలకాలేస్వస్వవిద్యాతిశయప్రఖ్యాపనాయ వాదకుశలైర్భవితవ్యం నతుకర్మకాలే ఇతి సూచితం తథాచ భారతే సభాపర్వణి" కర్మాంతర సమాయత్తా జజల్పురమితౌజసః।ఇదమేవ నచాప్యేవ షేవ మేవనచాన్యథా॥ఇతి

1* ౨౧౪ ఆయాగదినములయందు చూచుటకు వచ్చినవారలలో శ్రమనుఁ జెందినవాడుకాని క్షుద్బాధ నొందినవాడుకాని యొకడైనను లేడు. దశరథుని యజ్ఞమున జనులందఱు, అన్నపానాదులచే సంతుష్టినిఁ బొందిరి.

౨౪ ఆయజ్ఞమునందు మహాత్ములగువారలందఱును భక్ష్యభోజ్యాదులతోఁగూడిన యన్నదానముఁ గొనియాడుచుండిరి. తృప్తినొందితిమి దశరథునకు శుభముకలుగుఁగాత యనెడి కేకలను దశరథుడు వినుచుండెను.

2 * ౨౩౪ మంచివక్తలును, ధీరులునగు బ్రాహ్మణులు నొకరినొకరు జయింపవలయుననెడి కోరికచే, నవకాశము కలిగినపుడు సహేతుకముగ శాస్త్రార్థములనుఁ జేసిరి.

---

1* పైవాక్యముచే కర్మకాలమునందు సామాన్యముగా వచ్చినబ్రాహ్మణులందఱకు మృష్టాన్నాదులచే సంతోషమును చేయవలయుననెడి ధర్మము సూచింపఁబడినది

2 * పైనఁజెప్పిన వాక్యముచే, యాగమునుఁ జూచుటకై వచ్చి సభకు వెలుపలకూర్చుండిన పండితులు, యాగప్రయోగమునకు విరోధము కలుగకుండునట్లు, అవకాశముగలిగినప్పుడు తమవిద్యాకౌశలమునుఁ జూపవలయునేకాని కర్మకాలమునందు వాదములనుఁ జేయఁగూడదను ధర్మము సూచింపఁబడినది. ఇవ్విధముననే భారతమున సభాపర్వమునఁ జెప్పబడినది. (ఏమన) గొప్పతేజస్సుగల బ్రాహ్మణులు ధర్మరాజుయాగము చేయుకాలమున మధ్యమధ్యయందవకాశము కలిగినపుడు, ఇది యివ్విధముగానే యుండవలయుననియు, నిది యివ్విధముగ నుండఁగూడదనియు, నిది యింతేయనియు, నిది మఱియొకవిధము కాదనియు నివ్విధముగ శాస్త్రార్థములనుఁజేసిరి. (అని.)

2* అథబుత్విక్తస్య వపాం శ్రపయామాస శాస్త్రతః
ధూమగంధం వపాయాస్తు జిఘ్రతిస్మ నరాధిపః
యథాకాలంయథాన్యాయంనిర్ణుదన్పాపమాత్మనః॥ ౨౪-౨౫
కరితుం సమాప్యతు తదా న్యాయతః పురుషర్షభః
బుత్విగ్భ్యోపి దదౌ రాజా ధరాంతాం క్రతువర్ధనః॥ ౨౬
బుత్విజః॥ నభూమ్యాకార్య మస్మాకం నహిశక్తాస్మపాలనే
నిష్క్రియం కించిదేవేహ ప్రయచ్ఛతుభవాన్నృప॥ ౨౭
* గవాం శతసహస్రాణి దశ తేభ్యో దదౌ నృపః
దశకోటీస్సువర్ణస్య రజతస్య చతుర్గుణం॥ ౨౮

---

2 * అనేన అశ్వవపాధూమగంధాఘ్రాణస్య సమస్త పాపనివర్తకత్వ ప్రతిపాదనేనాంగినోఽశ్వమేధస్య ఫలాతిశయస్సూచితః తథాచ మహాభారతేపి" ధూమగంధాఘ్రాణం పావనముక్తం- తం వపాధూమగంధం తు ధర్మరాజస్సహానుజైః। ఉపజిఘ్రద్యథాశాస్త్రం సర్వపాపాపహం తదా, ఇతి॥

---

* అనేన యజమానేన దక్షిణాకాలే విహితం పృథ్వ్యాదికం దేయమేవ।బుత్విగ్భిరపి భోగ్యమపి తద్దక్షిణా శక్త్యా వినిమాయ నిష్క్రియో గ్రాహ్య ఇతిసూచితః తథా అవిక్రేయ మపి గవాశ్వాదికం దక్షిణాద్రవ్యం వినిమయేన గ్రాహ్యమితిసూచితం॥

8*౨౮-౨౯ అనంతరము దశరథుడు యాగపశువుయొక్క వపనుఁదీసి శాస్త్రోక్తముగ నగ్నిసంస్కారమునుఁజేసి దానిధూమగంధమును పాపక్షయమునకై యథావిధిగ నాఘ్రాణించెను.

౩౦ దశరథమహారాజు యథావిధిగ క్రతువును సమాప్తిఁజేసి యాగసమృద్ధికై ఋత్విజులకు తన భూమినంతయు నిచ్చెను.

౩౧ ఋత్విక్కులిట్లుచెప్పిరి. ఓదశరథమహారాజా! భూమితో మాకు ప్రయోజనములేదు. భూమిని పరిపాలించుటకు మేమశక్తులము. కావున నీవు భూమికి బదులుగా కొంచెము ద్రవ్యము నిచ్చెదవుగాక.

*౩౨ దశరథుడప్పుడు భూమికిబదులుగా లక్షగోవులను, పదికోట్ల సువర్ణ నాణెములను, నలుబదికోట్ల రూప్యములను ఋత్విజులకిచ్చెను.

---

8 * పైవాక్యమువలన యాగీయాశ్వముయొక్క వపాధూమగంధము నాఘ్రాణించుట, సమస్తపాపములనుఁ బోగొట్టునని చెప్పుటచే నంగియగు నశ్వమేధమునకు ఫలాధిక్యము చూపబడినది. అవ్విధము నసే భారతమునందును, వపాధూమగంధము నాఘ్రాణించుట, పాపహరమని చెప్పబడినది. (ఏమన) ధర్మరాజు తమ్ములతోఁగూడ సర్వపాపహరమగు వపాధూమగంధము నాఘ్రాణించెనని”

---

* పైవాక్యముచే యజమానుడు దక్షిణలిచ్చుకాలమున శాస్త్రవిహితముగ భూమిని ఋత్విజులకు దానము చెయ్యవలయుననియు, ఋత్విజులద్దాని ననుభవింపవలయుననియు, భూమిని రక్షించుటకసమర్థులైనచో దానిని మార్చి కొంతధనమును గ్రహింపవలయు ననెడి ధర్మము సూచింపబడినది అవ్విధముననే గోవులు మొదలగువానిని దక్షిణగా నిచ్చినపుడును వాని నమ్మకూడనప్పటికి వినిమయముచే కొంతద్రవ్యము గ్రహింపవలయుననెడి ధర్మముసూచింపబడినది,

* తస్యా శిషోథవివిధా బ్రాహ్మణై స్సముదీరితాః
ఉదారస్య నృవీరస్య ధరణ్యాం ప్రణతస్యచ॥ ౨౯

1 తతోఽబ్రవీదృష్యశృగం రాజాదశరథ స్తదా
కులస్యవర్ధనం తంతుం కర్తుమర్హసి సువ్రత॥ ౩౦

తథేతి చ సరాజాన మువాచ ద్విజసత్తమః
భవిష్యంతి సుతారాజం శ్చత్వార స్తే కులోద్వహాః॥ ౩౧

ఇష్టింతేహం కరిష్యామి పుత్రీయాం పుత్రకారణాత్
అధర్వశిరసిప్రోక్తైర్మంత్రైస్సిద్ధాం విధానతః॥ ౩౨

తతః ప్రాక్రమదిష్టింతాం । రాజాదశరథోనఘః॥ ౩౨½

తదా మహీ రావణముఖ్యరక్షోభారం తువోఢుం
బహుధాప్య శక్తా। ధృత్వాచ గోరూప
మలంరుదంతీ సమాససాదాబ్జభువంసురేశం॥ ౩౩½

బ్రహ్మాపి తాం సమాశ్వాస్య జగాదవచనంతదా
ఉదంత స్తవవిజ్ఞాతః। మయా ధ్యానేన చా చలే॥ ౩౪½

కింకుర్యాం రావణో దేవి। మయాహంతుం నశక్యతే
వక్ష్యామివృత్తం ప్రాచీనం రావణస్యాచలే శృణు॥ ౩౫½

---

* అనేన యజ్ఞాన్తే బ్రాహ్మణా న్నమస్కృత్య తేభ్యో యజ్ఞసమృద్ధ్యై ఆశిషోగ్రాహ్యా ఇతిసూచితం.

---

1. వా॥ రా॥

*౨౯ ఉదారుడగు దశరథమహారాజు యాగాంతమునందు బ్రాహ్మణులకు నమస్కారమునుఁ జేసి వారియాశీర్వాదములను బొందెను.

౩౦ అనంతరము దశరథుడు ఋష్యశృంగునితో నివ్విధముగఁ బలికెను. ఓ ఋష్యశృంగమహర్షీ! వంశాభివృద్ధికరమగు సంతానతంతువును నాకుఁ గలుగజేయుదువుగాకయని, (పలికెను.)

౩౧ ఋష్యశృంగుడు నట్లేయని దశరథునితోఁ గ్రిందివిధముగా జెప్పెను ఓరాజా! నీకు వంశోద్ధారకులగు నల్వురు కుమారులుకలుగగలరు,

౩౨ ఓరాజా నీకుఁ బుత్రులుకలుగుటకు యథావిధిగ పుత్రకామేష్టిని నథర్వణ వేదోక్తములగు మంత్రములచే జేయించెదనని

౩౨½ అనంతరము పుత్రార్థమై దశరథుడు పుత్రేష్టినిజేయ నారంభించెను.

౩౩½ ఆసమయమున భూదేవియు రావణుడు మొదలగుదుష్టరాక్షసుల భారమును వహించుట కశక్తురాలై గోరూపమును, ధరించి రోదనము చేయుచు బ్రహ్మయొద్దకేగెను.

౩౪½ బ్రహ్మయు నాభూదేవినోదార్చి యివ్విధముగఁబలికెను. ఓభూదేవి! నేను యోగశక్తిచే నీవృత్తాంతమునుఁ దెలిసికొంటిని.

౩౫½ ఓదేవి! నేనేమిచేయుదును రావణుని జయించుటకు నాకుశక్తిచాలను, వానిపూర్వవృత్తాంతమునుఁ జెప్పెదనువినుము.

---

* పై వాక్యముచే యజమానుడు యాగాంతమునందు బ్రాహ్మణులకు నమస్కరించి యజ్ఞసమృద్ధికొఱకు బ్రాహ్మణాశీర్వాదములనుఁ బొందవలయుననెడి ధర్మము సూచింపబడినది.

మహతా తపసారాధ్య రావణశ్శంకరం పురా
తస్మాద్వరాన్సుదుర్లభాంస్తు లబ్ధ్వా తిష్ఠతిదుర్జయః॥ ౩౬
మత్తోఽపిమానుషాదేకా దన్యేభ్యోఽవధ్యతావరం
ప్రాప్తవాన్రావణస్తేన జితాశ్చశక్రాదయస్తత.॥ ౩౭
మాలాకారో మహేంద్రశ్చ వరుణః పురసేచకః
సంమార్జకో జగత్ప్రాణః రావణేనకృతోభువి॥ ౩౮
తస్మాన్మేరావణం జేతుం శక్తిర్నాస్తివసుంధరే
తద్వ్రజేమ శివస్యాద్యసమీపం సత్వరం వయం॥ ౩౯
ఇత్యుక్త్వా తాం సమానీయ త్రిదశైస్సమమాత్మభూః
కైలాసమచిరేణా గాత్ప్రమథాది గణైర్వృతం॥ ౪౦
వేదవాగ్భిశ్శివం దధ్యుర్బ్రహ్మాద్యా స్త్రిదివౌకసః
నమోభవా యశర్వాయ నీలగ్రీవాయతే నమః
నమఃస్థూలాయసూక్ష్మాయబహురూపాయతేనమః॥ ౪౧-౪౨
ఇతిసర్వముఖేనోక్తాం వాణీమాకర్ణ్య శంకరః
ప్రోవాచ నందినందేవా నానయేతి మమాంతికం॥ ౪౩
ఏతస్మిన్నంతరే దేవాః ఆహూతానందినా ధ్రువం
ప్రవిశ్యాంతఃపురే దేవం దదృశు ర్విస్మితేక్షణాః॥ ౪౪
బ్రహ్మాగత్య దదర్శాథ శంకరం లోకశంకరం
ప్రణిపత్యాగ్రతః స్థిత్వా సహదేవైః పితామహః।
ఉవాచ దేవదేవేశం పశ్యావస్థాం దివౌకసాం
దుష్టదైత్యవధోద్యోగంత్వం విధేహిమహాప్రభో॥ ౪౫-౪౬

౩౬౪ పూర్వమునందు రావణుడు శంకరుని గొప్పతపస్సుచే సంతోషప
రచి, వానివలన నితరులకుఁ బొందశక్యముకాని వరములనుఁబొంది
యితరులకు జయింపనలవిగాకుండెను.

౩౭౪ నావలనఁగూడ మనుష్యేతరములగు సమస్తభూతములవలన మృతి
లేకుండగ వరములనుఁ బొందియుండెను. ఆకారణముచే నతడు
దేవేంద్రాదుల నందఱను జయింపగల్గెను.

౩౮౪ రావణుడు, దేవేంద్రుని, పుష్పమాలికలనుగుచ్చియిచ్చువానినిగను
వరుణదేవుని తనపురమును జలముచేత దడుపువానినిగాను, వాయు
దేవుని, తనపట్టణమూడ్చువానినిగాను, జేసెను.

౩౯౪ ఆకారణమువలన రావణుని జయించుటకు శక్తిచాలదు, ఇదియును
గాక, సృష్టిచేయు పనియే నాదియైయున్నది. ప్రలయమును చేయుపని
శివునిదైయున్నది. కాన వానిసమీపమునకుమనము వెళ్ళుదమనియె.

౪౦౪ ఇవ్విధముగ బ్రహ్మదేవుడు చెప్పి భూదేవినిఁ దీసికొని దేవతలతో
గూడ, ప్రమథగణసేవితమగు కైలాసమునకు శీఘ్రముగ వెళ్ళెను.

౪౧-౪౨ బ్రహ్మాదిదేవతలు వేదవాక్యములుచే శివునిస్తుతించిరి. నీలగ్రీవా!
భవా! స్థూలరూపుడవు సూక్ష్మరూపుడవు బహురూపుడవగు నీకు
నమస్కారమని(స్తుతించిరి.)

౪౩ ఇవ్విధముగ దేవతలందఱిచేఁ జేయబడిన స్తోత్రమును శంకరుడువిని
యాదేవతలను తనయొద్దకు దీసికొనిరమ్మని,నందీశ్వరునిఁబంపెను.

౪౪ ఈసమయమున దేవతలందఱును నందీశ్వరుడాహ్వానింపగా వారు
శంకరునియంతఃపురము బ్రవేశించి శంకరునిఁజూచివిస్మయమందిరి.

౪౫-౪౬ అనంతరము బ్రహ్మదేవుడు లోకసుఖంకరుడగు శంకరునిజూచి
నమస్కరించి దేవతలతోఁగూడ శంకరునిముందునిలిచి యివ్విధ
ముగబలికెను.

మహాప్రభో! శంకరా! దుష్టరాక్షసుడగు రావణుని సంహారమునకు
దగినప్రయత్నమునుఁజేయుమని బ్రహ్మాదిదేవతలు ప్రార్థించిరి.

తదా శంభు రువాచేదం వచనం తాన్దివౌకసః
భవదాగమవృత్తాంతః।జ్ఞాతఏవ మయాధునా॥ ४८
వరప్రదోऽ హంతు పురారావణస్య పితామహా!
విషవృక్షంచ సంవర్ధ్య స్వయంఛేత్తుమసాంప్రతం॥ ४८
తస్మాద్విష్ణుసమీపంతు యూయంగచ్ఛత సత్వరం
లోకరక్షావహః కుర్యాత్కార్యం వస్సఫలంహరిః॥ ४९
* ఏతస్మిన్నంతరే నందీ వచనం ప్రాహ తాన్పునః
ఏకదా రావణోऽమాఖ్యాత్కప్యాస్యంమాంశశాపసః॥ ५०

---

* రావణస్తు పురానందినే కిమర్థం శాపం దత్తవా నితిచే దత్రోచ్యతే. ఏకదా దశాననే పుష్పక మారుహ్య సంచార్యచ దేవలోకా న్కైలాసోర్ధ్వభాగాద్విమానేనా గచ్ఛతిసతి తదాశంకరశ్చకైలాసేతపశ్చరతిస్మ. తదానందీశ్వర శ్శంకరస్యోర్ధ్వభాగాదాగచ్ఛంతంవిమానం దృష్ట్వా స్వమా హాత్మ్యేన తం తత్రైవ స్థాపయామాస రావణేన సర్వథా కృతేపియత్నే నచచాల తదాదశా ననస్తస్మాదవరుహ్య నందీశసన్నిధి మాగత్య స్వవిమానం త్వేనైవ నిరోధిత మితిజ్ఞాత్వా వానరాస్యో భవేతి తం శశాప. తదానందీశోऽపి వానరానేవ పురస్కృత్య నరస్త్వాం హన్యాదితి రావణం శశాపేతి కథాత్రానుసంధేయా.

౪౭ అప్పుడుశంకరుడు దేవతలతో నివ్విధముగఁబలికెను. ఓదేవతలారా! మీరువచ్చిన వృత్తాంతము నాకుఁదెలిసినది.

౪౮ ఓపితామహా! నేను పూర్వమునందు రావణునకు వరములనిచ్చి యుంటిని. వరప్రదుడనగు నేనెట్లువానిసంహారమునకుఁ బ్రయత్నింపను. విషవృక్షమునైనను చేతులతోఁబెంచి ఛేదించుట యుక్తము కాదుగదా,

౪౯ ఆకారణమువలన మీరలు శీఘ్రముగా విష్ణుసమీపమునుగూర్చి వెళ్ళుడు. లోకములనురక్షించుభారమునువహించు శ్రీహరి, మీకార్యమును సఫలముఁజేయును (అనిశంకరుడుచెప్పెను.)

౫౦ ఈసమయమునందు నందీశ్వరుడు దేవతలనుగూర్చి యివ్విధముగఁబలికెను ఓదేవతలారా! పూర్వమునం దొకప్పుడు రావణుడు మూర్ఖత్వముతోనన్ను వానరముఖునిగా శపించెను.

---

* రావణుడు నందీశ్వరునకుఁబూర్వము శాపమేలయిచ్చెననగా నొకప్పుడు। రావణుడు విమానారూఢుడై దేవలోకములను సంచరించి తనపట్టణమునకు వచ్చునెడ కైలాసపర్వతముమీద తపముజేయుచున్న శంకరునిపైభాగముగఁ దనవిమానమువచ్చుచున్న కారణముచే నందీశ్వరుడు రావణునివిమానమును తనమహిమచే నిలిపివేసెను. రావణుడెంతప్రయత్నించినను విమానముకదలనందునఁ గ్రిందిభాగమునకుదిగివచ్చి నందిచేఁదనవిమానము నిరోధింపఁబడినదని తెలిసికొని వానరముఖునిగా, నందినిశపింపగా నందీశ్వరుడు తిరిగిశాపమును రావణునకిచ్చెను (ఏమన) ఓరావణుడా! ఒకనరుడు వానరులనుఁ బురస్కరించుకొని నిన్నుసమూలముగా నశింపఁజేయుఁగాక యని”

శప్తో భవన్మయాసద్యః। రావణోపి భయావహం
వానరాంస్తు పురస్కృత్య నరస్త్వాం హంతుసత్వరం॥ ౫౧
తస్మాల్లోకావనే దీక్షావహం । శ్రీహరి మద్య వై।
గత్వాయూయం ప్రార్థయధ్వం కార్యంవస్సఫలంభవేత్ ॥ ౫౨
ఇత్యుక్తా శ్శివనందిభ్యాం బ్రహ్మాద్యా దేవతా స్తదా।
క్షీరాబ్ధినికటం గత్వాస్తువంతిస్మ జనార్దనం॥ ౫౩
జయమాధవ దేవేశ జయభక్త జనార్తిహా
కృపాం కురు మహాదేవ విలోకయ స్వసేవకాన్॥ ౫౪
వీరధుర్ధర వర్మానచ-క్రూరకర్మా దశాననః
సర్వాన్నో బాధతేనిత్యం కింపునర్మానుషాన్ప్రతి॥ ౫౫
సోయం బిడౌజసంకర్తుం నిస్తేజసమలంభవేత్।
తనూనపాతంచ తదాఽనూనపాతం కరిష్యతి॥ ౫౬
తదగ్రే సమవర్తీ స్యాచ్ఛ్రీమవర్తీ మహాప్రభో।
తదంతికే ప్రచేతాశ్చ విచేతాస్తు భవిష్యతి॥ ౫౭
జగత్ప్రాణో గళత్ప్రాణః ధనేశో ఘనబాధితః
రావణేనకృతో భూమ్యాం కారాస్థో తారకాపతిః॥ ౫౮
ఏవం సబాధయత్యద్య సర్వానస్మాన్దివౌకసః
కింపునర్మానుషాన్దేవ రక్షాస్మా న్శరణాగతాన్॥ ౫౯
ఇతి దేవవచశ్శ్రుత్వా పరిచింత్య హరి స్తదా
జగాద దుఃఖశమనం వచనం త్రిదివౌకసః॥ ౬౦

౫౧ అప్పుడు నేనుకూడ రావణుని భయంకరముగ శపించితిని (ఏమన) ఓ రావణా! శీఘ్రములోనే యొకనరుడు వానరులనుఁ బురస్కరించుకొని నిన్ను సంహరించుగాకయని,,

౫౨ ఆకారణమువలన లోకరక్షణమునకు దీక్షవహించిన శ్రీహరినిగూర్చి యిప్పుడు మీరలువెళ్ళి ప్రార్థించిన, మీకార్యము సఫలమగుననియెను.

౫౩ ఇవ్విధముగ శివుడును నందీశ్వరుడును చెప్పగా బ్రహ్మాదిదేవతలు పాలసముద్రసమీపమునకేగి జనార్దనుని క్రిందివిధముగ స్తవము చేసిరి.

౫౪ సర్వదేవాధీశుడవగుమాధవా. నీకు జయముకలుగుగాక, భక్తజనుల బాధలను నివారించునీకు జయముకలుగుగాక ఓమహాదేవా! నీసేవకులగు మమ్ములను కృపారసముతో జూడుము.

౫౫ వీరులకజేయుడును క్రూరకృత్యములుకలవాడునగు రావణుడు మమ్ములను బాధించుచుండెను. మనుష్యులసంగతి జెప్పనదియేమి.

౫౬ ఆయీరావణుడు దేవేంద్రునిఁ దేజోహీనునిగాఁ జేయసమర్థుడగును అగ్నిహోత్రుని, మిక్కిలిపతనముకలవానినిగాఁ జేయగలడు.

౫౭ ఆరావణునిముందు నిలుచుటకు యముడును శ్రమజెందును వానియెదుర వరుణుడు చైతన్యములేనివాడైయుండగలడు.

౫౮ వాయుదేవుడు రావణునియెదుట కంఠగతప్రాణుడై యుండును కుబేరుడు వానిచే బాధింపబడియుండెను సూర్యుడు వానిముందు తేజస్సుతగ్గియుండెను చంద్రుడు కారాగృహమునబంధింపఁబడెను.

౫౯ ఇవ్విధముగ మమ్ములనందఱను రావణుడు బాధించుచుండెను దేవతలస్థితి. యిట్లుండ మనుష్యులసంగతి చెప్పనదియేమి, కాన శరణాగతులగు మమ్ములను రక్షింపుము.

౬౦ ఈప్రకారము దేవతలుచెప్పగా శ్రీహరి విని యాలోచించి యప్పుడు దేవతలనుగూర్చి దుఃఖోపశమనమగు వాక్యమునుబలికెను.

భో బ్రహ్మాదిసురాస్సర్వే యూయం శృణుత మద్వచః
జానే దశగ్రీవభయం భవతాం సముపస్థితం॥ ౬౧
విజ్ఞాపితోఽహం సమయే భవన్త స్తద్వధం ప్రతి
ధృత్వాఽవతారమద్యైవ హనిష్యేతం సురోత్తమాః॥ ౬౨
పురీత్వయోధ్యా సున్నృపైః పాలితా సూర్యవంశజైః
విరాజతే భూమితలే కృశయాగాదిసత్క్రియైః॥ ౬౩
తస్యాం దశరథోరాజా నిరసత్య శ్రియాన్వితః
యాజత్యద్య సుతార్థం వై పాలయన్ధర్మతః ప్రజాః॥ ౬౪
* పూర్వం తు తపసా తేనశోషితోఽహం సుతార్థినా
తస్యపత్నీషు తిసృషుచతుర్ధా ప్రభవామ్యహం॥ ౬౫

---

* పూర్వమితి. కశ్యపప్రజాపతిః సుతార్థం శ్రీహరిం ప్రతితప స్తేపే. తదా శ్రీహరిర పరోక్షీభూయ వరం వృణ్వితి కశ్యపమవ్రోచత్ · త్రిషుజన్మ సు మమపుత్రో భవేత్యుక్తే హరిఃపి తథేత్యంగీచకార. స్వవరానుసారేణ కశ్యపస్య పురా వామనరూపేణాజని తస్యకశ్యపస్య దశరథత్వే నాద్యజాతత్వాత్ పునశ్చ స్వవరానుసారేణ తస్యపుత్రత్వేనావతరితు ముద్యుక్త ఇత్యూహ్యం॥

౯౧ ఓ బ్రహ్మాదిదేవతలారా! మీరలందరు నావాక్యమునువినుడు మీకం దఱకు రావణునివలన భయము సంప్రాప్తమైనదని, నే నెఱుగుదును

౯౨ ఓ బ్రహ్మాదిదేవతలారా! మీరలు మంచిసమయములో రావణవధ విషయమై నాకు విన్నవించితిరి ఇప్పుడే నేనవతరించి వాని వధో పాయ మాలోచించెదను.

౯౩ ఓదేవతలారా యాగాదులను బాగుగఁజేసినసూర్యవంశీయులగు రాజులచేఁ బరిపాలింపఁబడిన యయోధ్యయను పట్టణము భూమి యందొప్పుచుండెను.

౯౪ ఆపట్టణమునందు దశరథమహారాజు తనప్రజలను ధర్మముగఁబాలిం చుచు మహాధైర్యవంతుడై సంతానార్థమై యిప్పుడుయాగము చేయు చుండెను.

* ౯౫ పూర్వమునందు కశ్యపుడు పుత్రార్థియై నన్నుగూర్చి తపస్సుచేసి సంతోషపెట్టిన హేతువచేతను నతడేయిపుడు దశరథుడుగా నవత రించినహేతువుచేతను నతనిభార్యలగు కౌసల్యాసుమిత్రాకైకేయుల ముగ్వురియందును నేను నాలుగువిధములుగా జన్మింపగలను

---

* కశ్యపప్రజాపతి పుత్రార్థియై శ్రీహరినిగూర్చి పూర్వము తపస్సుచే యగా శ్రీహరిప్రత్యక్షమై వరమునుగోరుకొనుమనగాఁ గశ్యపుడిట్లు వరముఁగోరెను ఓశ్రీహరీ! నీవు నాకు మూడుజన్మలయందు పుత్రు డవుగా పుట్టుమనికోరగా శ్రీహరియు నట్లేయని వరమిచ్చెను. తన వరానుసారముగా కశ్యపునకు మొదట వామనుడుగా పుట్టెను ఆక శ్యపుడే దశరథుడుగా పుట్టినందున తనవరానుసారముగా కశ్యపాం శజుడగు దశరథునకు బుత్రుడుగా బుట్టుటకు శ్రీహరి యుద్యుక్తు డయ్యెనని యూహింపనగు

భయాం త్యజతభద్రం వో హితార్థం యుధిరావణం
సపుత్రపౌత్రం సామాత్యం సమిత్రజ్ఞాతి బాంధవం
హత్వాక్రూరం దురాత్మానం దేవర్షీణాం భయావహం
దశవర్షసహస్రాణి దశవర్షశతానిచ
వత్స్యామిమానుషేలోకేపాలయన్పృథివీమిమాం॥ ౬౬-౬౭
భవంతోపి స్వకైరంశైరవతీర్యచరంత్వితః
ఋక్షవానరరూపేణ సర్వత్ర పృథివీతలే॥ ౬౮
ప్రాజాపత్యనరం తత్ర పేషయాద్య పితామహ
కరోతి పుత్రకామేష్టిం రాజాదశరథోభువి। ౬౯
అన్యద్వక్ష్యామి భోదేవాః లంకాయాం యోగినీగణైః
గౌరీ నివాసం కురుతే తత్పురీ పరిపాలినీ॥ ౭౦
* సుపక్షిన్నాయథా గౌరీతథా కుర్వంతు వై గతాః
ఇత్యుక్త్వా భగవాన్సద్య స్త్వంతర్ధానం గతోహరిః। ౭౧
తత స్తేపి సురాస్సర్వే పితామహపురోగమాః
గౌరీనికట మాగత్య తుష్టువు ర్లోకమాతరం। ౭౨
మాతః పౌలస్త్యతనయో రావణో రాక్షసాధిపః
త్వదనుగ్రహ దర్పేణ బాధతే సకలం జగత్॥ ౭౩
కరోషి వసతిం తస్య పురే త్రిదశవందితే
విశేషత స్త్వమేవాసి స్వయం లంకేశ్వరీ శివే
దేవి త్వ మపి సాహాయ్యం కురులోకహితాయ వై॥ ౭౪

---

* 1 జై॥ దే॥ భా॥

౯౯-౭౪ ఓ దేవతలారా! మీరలు భయమును వదలుఁడు మీకు శుభము కలుగుఁ గాక! మీహితముకొఱకు పుత్రపౌత్రజ్ఞాతిబంధసహితముగా దురాత్ముఁడగు రావణుని యుద్ధములోఁ జంపి పదునొకండు వేల సంవత్సరములు మనుష్యలోకమునందు భూమినిఁ బరిపాలించుచునుండఁగలను

౬౯౪ మీరలు మీమీయంశములతో వానరరూపములనుధరించి నాసహాయార్థమై భూమియందు సంచరించెదరుగాక.

౯౬౪ ఓపితామహా! భూలోకమున దశరథమహారాజు పుత్రకామేష్టియాగమును నిపుడు చేయుచున్నాఁడు. కావున నచ్చటకు ప్రాజాపత్యపురుషునిఁ బంపుము,

౦౪ ఓ దేవతలారా! మఱియొకసంగతినిఁ జెప్పెదను. లంకాపట్టణమున గౌరీదేవి తనపరిచారికులగు యోగినీగణములతోఁ గూడి లంకాపురినిఁ బరిపాలించుచుండెను.

౭౧౪ గౌరీదేవి, యెవ్విధమున మీకుఁ బ్రసన్నురాలగునో యవ్విధముగఁ బ్రయత్నింపుము, ఇవ్విధమునఁ జెప్పి భగవంతుడగు శ్రీహరి వెంటనే యంతర్ధానము నొందెను.

౭౨h అనంతరము బ్రహ్మమొదలగు దేవతలందఱు గౌరీదేవియొద్దకువచ్చి యాలోకమాతయగు గౌరీదేవిని స్తోత్రము చేసిరి,

౭౩౪ ఓతల్లీ! విశ్రవసబ్రహ్మకుమారుఁడును రాక్షసరాజునగు రావణుఁడు నీయనుగ్రహముచేతను సమస్తజగత్తును బాధించుచుండెను

౭౮౪ ఓ దేవవందితురాలా! నీవు రావణునిపట్టణమున నివాసమునుఁ జేయుచుంటివి. నీవే స్వయముగా లంకేశ్వరివి, ఓ దేవి! లోకహితార్థమై నీవు రావణసంహారవిషయమై సహాయమునుఁ జేయుమని ప్రార్థించిరి.

1 గా॥ హరౌ మానుషతాం యాతే కమలాపి మదంశజా
మానుషం దేహమాశ్రిత్య సంభవిష్యతి భూతలే॥ ౭౫

తాం దృష్ట్వా చాతిలోభేన హరిష్యతి సదుర్మతిః
త్యక్ష్యామి నైతదా లంకాం వినాశాయ దురాత్మనః
శంభుర్వానరరూపేణ భస్మసాత్తాం కరిష్యతి॥ ౭౬-౭౭

ఇత్యాఖ్యాతా మహాదేవ్యా తదాజ్ఞాం ప్రాప్య దేవతాః
వసుంధరాం సాంత్వయిత్వా స్వం స్వం లోకం గతాస్తదా॥ ౭౮

దేవాశ్చ సర్వే హరిరూపధారిణో స్థితాస్సహాయార్థమితస్తతో హరేః। మహాబలాః పర్వతవృక్షయోధినః ప్రతీక్షమాణా భగవంతమీశ్వరం॥ ౭౯

ఆశ్చర్యరామాయణే నవమస్సర్గస్సమాప్తః.

---

* అయం పూర్వానువాద ఇతి కేచిత్.

1. జై॥ దే॥ భా॥

౨౩౪ గౌరీదేవి యిట్లు చెప్పదొడగెను ఓ దేవతలారా! శ్రీహరి మానుషరూపముతో నవతరించుటతోడనే లక్ష్మియును నాయంశముతో మానుషదేహమునాశ్రయించి భూలోకమున జనింపగలదు.

౨౯౨౨ ఆదురాత్ముడగు రావణుడు లోభముతో నామెనుహరింపగలడు. అప్పుడు నేనామరాత్ముని వినాశనమునకై లంకాపట్టణమును విడువగలను. నేనువిడచుటతోడనే శివాంశసంభూతుడగు నొకవానరుడు లంకనుభస్మముజేయును, (అనిగౌరీదేవి దేవతలతో(జెప్పెను)

౨౭ ఇవ్విధముగా గౌరీదేవిచెప్పగా దేవతలు తదాజ్ఞనొంది భూదేవినోదార్చి తమతమలోకములకేగిరి.

* ౩౯ అనంతరము సమస్తదేవతలు శ్రీహరిసహాయార్థమై వానరరూపములనుధరించి మహాబలపరాక్రమశాలురై పర్వతములయందు వృక్షములయందు సంచరించుచు భగవంతునిసహాయమునకు నిరీక్షించుచుండిరి"

ఆశ్చర్యరామాయణమున తొమ్మిదవసర్గ ముగిసెను.

---

* ఈపైకథ యనువాదమని తెలుసుకొనదగు.

## దశమసర్గప్రారంభః.

బ్రహ్మాఽథ పాయసం దివ్యం కల్పయిత్వా సువర్ణకే
పాత్రే నిధాయ దత్వాఽహ ప్రాజాపత్యాయ తంప్రతి॥ ౧

ప్రాజాపత్యనర! క్షిప్రం గత్వాఽయోధ్యాం పురీంప్రతి
పాయసం దేహి రాజ్ఞే త్వం తత్పత్నీగర్భదాయకం॥ ౨

ఇత్యుక్త్వా పాయసం పాత్రం తస్మై దత్వా పితామహః
ప్రాజాపత్యం నరం తత్ర ప్రేషయామాస సత్వరం॥ ౩

సాకేతే నృపపుత్రేష్టిసమాప్తిసమయే పునః
ప్రాదుర్భూతో వీతిహోత్రాత్ ప్రాజాపత్యనర స్తతః॥
తప్తజాంబూనదమయీం పాత్రీం పుత్రీమివ ప్రియాం
ప్రగృహ్యవిపులాందోర్భ్యాంసమీక్ష్య నృపమబ్రవీత్॥ ౪-౫

ప్రాజాపత్యం నరం విద్ధి మా మిహాఽభ్యాగతం నృప
ఇదం తు పాయసం దివ్యం పత్నీభ్యో దేహి సత్వరం॥ ౬

తాసుత్వం ప్రాప్స్యసేపుత్రాన్యదర్థం యజసేనృప
తథేతి నృపతిః ప్రీతః ప్రతిజగ్రాహ తాం తదా॥ ౭

ప్రాజాపత్యనరశ్చాథ తత్రైవాంతరధీయత॥ ౭½

అథ రాజా ప్రవిశ్యాంతః కౌసల్యా మిద మబ్రవీత్
పాయసం ప్రతిగృహ్ణీష్వపుత్రీయం త్విదమాత్మనః॥౮½

## దశమసర్గప్రారంభము.

౧ అనంతరము బ్రహ్మదేవుడు దివ్యమగుపాయసమునుఁ గల్పించి సువర్ణపాత్రమునందుంచి ప్రాజాపత్యపురుషునకిచ్చి యాపురుషునితో నిట్లుఁబలికెను.

౨ ఓప్రాజాపత్యపురుషుడా! శీఘ్రముగ నయోధ్యకేగి దశరథపత్నులకు గర్భధారణకరమగు నీపాయసమును దశరథునకీయుము.

౩ అని బ్రహ్మప్రాజాపత్యపురుషునితోఁజెప్పి సువర్ణపాయసపాత్రి నతనికిచ్చి యాపురుషుని శీఘ్రముగఁబంపెను.

౪-౫ ఆప్రాజాపత్యపురుషుడు నయోధ్యాపురికేగి దశరథునిపుత్రకామేష్టిసమాప్తమగుసమయమున, నగ్నిహోత్రమ నుండి ప్రాదుర్భవించి మేలిమిబంగారపు పాయసపాత్రను ప్రియపుత్రికనువలె చేతులతో గ్రహించి దశరథునిగూర్చి యిట్లుఁబలికెను.

౬ ఓదశరథా! నేను ప్రజాపతిచేఁ బంపబడినపురుషుడను దేవనిర్మితమైన పాయసమును శీఘ్రముగ నీభార్యలకీయుము.

౭ ఓరాజా! నీవు పుత్రికామేష్టినిఁ జేసినదానికిఫలముగ నీభార్యలందు పుత్రులనుఁబడయగలవు. అని చెప్పగా నవ్విధమునసే చేయుదునని దశరథుడు సంతోషముతోఁ బాయసపాత్రనుగ్రహించెను.

౮ ప్రాజాపత్యపురుషుడును నచ్చటనే యంతర్ధానమునొందెను.

౯ అనంతరము దశరథుడంతఃపురమునుఁ బ్రవేశించి కౌసల్యనుగూర్చి యిట్లుఁబలికెను. ఓప్రేయసి! పుత్రప్రదమైన యీపాయసమును గ్రహింపుమనెను.

* కౌసల్యాయై నరపతిః పాయసార్థం దదౌ తదా
అర్ధా దర్ధం దదౌ చాపి సుమిత్రాయై నరాధిపః
కైకేయ్యై చావశిష్టార్ధం దదౌ పుత్రార్థకారణాత్ ॥౯-౧౦
ప్రదదౌ చావశిష్టార్ధం పాయసస్యామృతోపమం
అనుచింత్య సుమిత్రాయై పునరేవ మహీపతిః॥ ౧౧

---

## పాయస విభాగ విచారః.

*కౌసల్యేతి. నరపతిః దశరథః కౌసల్యాయై(పాయసార్థం) పాయసస్యార్థం. దదౌ. అత్రార్థ శబ్దః సమప్రవిభాగవాచీ. సుమిత్రాయై(అర్ధాదర్ధం)చతుర్భాగం దదౌ-అవశిష్టస్య చతుర్థాంశస్య అర్ధం. అష్టమాంశం. కైకేయ్యై దదౌ. పునరవశిష్టార్థ మష్టమాంశం సుమిత్రాయై దదావితి పర్యవసితం-- నన్వేతత్పాయస విభాగస్త్వితరపురాణరామాయణాదీనాం విరుధ్యతే కుతఇతిచేదుచ్యతే.తత్ర్వసంగ్రహారామాయణే దశరథం ప్రతివిష్ణోర్వచనే- తస్మాత్త్వవ జనిష్యేహం మావిభజ్య చతుర్విధ మిత్యుక్త్యా చతుర్ధా విభాగ ఏవసూచితః.

అపిచాగస్త్య రామాయణే, చతుర్థాంశ స్తురామస్స్యాదిత్యుక్త్యాసర్వేషాం రామాదీనాం సదృశ భాగఏవనిశ్చీయతే కించ పాద్మేపి, తథైవవర్తతే, అపిచ స్కాందేపి. ఆత్మానం చతురో భాగానితి దేవా న్ప్రతిహరే రుక్త్యాచ చతుర్ణాం సమానభాగత్వమేవ స్పష్టీభవతి. కించాధ్యాత్మరామాయణేపి. కౌసల్యాయై స కైకేయ్యై అర్థమర్ధం ప్రయత్నతః।

* ౯-౧౦-౧౧ అప్పుడు దశరథమహారాజు సంతానార్థమై యాపాయసములో సగభాగమును గౌసల్యకిచ్చెను, మిగిలినసగములో సగమును సుమిత్రకిచ్చెను. సుమిత్రకివ్వగా మిగిలినసగభాగములో సగమును గైకేయికొసగెను. పిదప సుమిత్రాదేవి, కైకేయికంటె నెక్కుడుగా దినదగినదియని యాలోచించి తిరిగి యాకైకేయి కివ్వగా మిగిలిన పాయసభాగమును సుమిత్రాదేవికిచ్చెను.

---

## పాయసవిభాగవిచారము.

* పైవాక్యముచే దశరథుడు భార్యలకు పాయసమునిచ్చుటలో కౌసల్యకుసగమును, సుమిత్రకు నాల్గవపాలును, కైకేయికి ఎనిమిదవపాలును, మిగిలిన యెనిమిదవపాలును తిరిగి సుమిత్రకు నిచ్చెనని పర్యవసానము తేలినది.

2 * వ్యా॥ ఈపాయసవిభాగ మితరపురాణ రామాయణములకు విరుద్ధముగానుండెనని కొందఱుశంకించెదరు. (ఎట్లన) తత్త్వసంగ్రహరామాయణమున దశరథునిగూర్చి విష్ణుమూర్తి చెప్పుటలో "నన్ను నాలుగు విధములుగ విభజించుకొని నీకుపుట్టగలను, అని చెప్పుటచే రామాదుల నల్వురకు సమానభాగమే సూచింపబడుచున్నది. మఱియును, అగస్త్యరామాయణమున రాముడు చతుర్థాంశమని చెప్పుటచే రామాదులు నల్వురకు సమానభాగమే నిశ్చితమగుచున్నది. మఱియు పాద్మమున నవ్విధముననేయుండెను. మఱియుస్కాందమునందును దేవతలనుగూర్చి శ్రీహరి చెప్పుటలో తనను నాల్గుభాగములుగ విభజించుకొనిపుట్టెదనని చెప్పుటచే సమానభాగమే స్పష్టమగుచున్నది. మఱియు నధ్యాత్మరామాయణమునందును దశరథుడు కౌసల్యకు సగభాగమిచ్చినట్లును కైకేయికిని సగభాగమిచ్చినట్లును పిదప సుమిత్రయు పుత్రప్రదమగు పాయసమును తానును భుజింపవలెననెడియాశతోఁ గౌసల్యాకైకేయిల సమీపమునకురాగా వారలిద్దరు తమతమభాగములలో సగముసగము కౌసల్యాకైకేయులు సుమిత్ర

ఏవం తాసాం దదౌ రాజా భార్యాణాం పాయసంపృథక్
తాస్త్వేతత్పాయసం ప్రాజ్యం నరేంద్రస్యోత్తమాస్త్రియః
సంమానం మేనిరేసర్వాః ప్రహర్షోదితచేతసః॥ ౧౨౪

---

తతస్సుమిత్రా సంప్రాప్తా జగృహుః పౌత్రికంచరుం
కౌసల్యా తు స్వభాగార్ధం దదౌ తస్మై ముదాన్వితా।
కైకేయీచ స్వభాగార్ధం దదౌ ప్రీతిసమన్వితా॥

ఇత్యాదినా చ స్పష్టతయా సమానభాగత్వం ప్రతిపాదితం. అపిచ భోజకృతచంపూరామాయణే" కౌసల్యాయై ప్రథమమదిశద్భూపతిః పాయసార్ధ మిత్యాదినా సమానభాగతైవ ప్రతిపాదితా-ఏవంచ చతుర్ణాం రామాదీనాం పూర్వోక్తరీత్యా సమానాంశతా పర్యవసితా- సత్యేవం వాల్మీకినా పూర్వోక్తగ్రంథ విరోధేన కథం పాయసవిభాగః కృత ఇతి సమాగతే పూర్వపక్షే కేచిద్వాల్మీకికృతపాయస విభాగరూపశ్లోకత్రయస్యార్థమిత్థం వర్ణయంతిస్మ. కౌసల్యాయై పాయసార్ధం దదౌ విభజితవానిత్యర్థః సుమిత్రాయై అర్ధాదర్ధం దదౌ-కౌసల్యాయై యదర్ధం విభక్తం తస్మాదేవార్ధం దదావిత్యర్థః, కైకేయ్యై అవశిష్టార్ధం అవశిష్టే అర్ధే అర్ధం చతుర్థాంశం దదావిత్యర్థః సుమిత్రాయై పునరవశిష్టార్ధం అవశిష్టంచ తదర్ధంచ చతుర్థాంశం దదావితి-ఏతేన విష్ణోః పుత్రత్వమాగచ్ఛన్కృత్వాత్మానం చతుర్విధ మితి దేవోక్తిశ్చ సంగచ్ఛత ఇతి. అపిచోత్తరత్ర లక్ష్మణశత్రుఘ్నౌ, విష్ణోరర్ధసమన్వితావితి కథనంచ" భరతః సాక్షాద్విష్ణో శ్చతుర్భాగ ఇతి కథనంచ సంగచ్ఛత ఇత్యాహుః" తన్నసమంజసతయా

౧౨౪ ఈప్రకారము దశరథుడు తనభార్యలమువ్వురకు వేఱ్వేఱుగా బాయసమునివ్వగా వారలు పూజనీయమగు పాయసమునుభుజించి దశరథపత్నులుమువ్వురు సంతోషాంతరంగులైసమానముగ గౌరవించెనని తలచిరి.

---

కిచ్చిరని చెప్పుటచే రామాదులునల్వురకుసమానభాగమేప్రతిపాదింపబడుచున్నది. మఱియు భోజుడు చేసిన చంపూరామాయణమునందును కౌసల్యకుముందుగా సగభాగమిచ్చినట్లు పిదప కైకేయికిమిగిలిన సగభాగమిచ్చినట్లు వారలిద్దరు సుమిత్రాదేవికి తమతమభాగములలో సగముసగమిచ్చినట్లును చెప్పియుండుటచే రామాదులు నల్వురుపూర్వోక్తరీతిచే సమానభాగవంతులని స్పష్టమగుచుండగాఁ బూర్వోక్తగ్రంథవిరుద్ధముగా వాల్మీకిమహర్షి పాయసవిభాగముజేసెననుట యసంగతమని యాశంకరాగా గోందప్రివ్యాథముగ సర్వకామరస్యాగా వాల్మీకికృతపాయసవిభాగశ్లోకముల కర్థమునువర్ణించిరి. (ఏమన) దశరథుడు కౌసల్యకొఱకు పాయసములో సగము (దదౌ) అనగా యిచ్చుటకు కొఱకుగ విభజించెననియర్థమనియు, సుమిత్రకుసగములో సగమునిచ్చెననగా కౌసల్యకు నీయుటకు విభజింపబడిన సగభాగములో సగభాగమనియర్థమనియు నిట్లుచెప్పినఁ గౌసల్యకునాల్గవభాగము సుమిత్రకు నాల్గవభాగమని పర్యవసానము తేలినదియనియు, అవశిష్టార్థమునుఁ గైకేయికిచ్చెనను నప్పుడు మిగిలినదానిలో సగమునుఁ గైకేయికిచ్చెనని యర్థము గాన నాల్గవభాగమే కైకేయికిచ్చెనని తేలినదియనియు మిగిలిన నాల్గవభాగమును సుమిత్రకిచ్చెననియు నిర్విభయముగ నర్థమును వర్ణించిరి.

ఇట్లుచెప్పుటచే దేవతలు విష్ణుమూర్తినిఁబ్రార్థించుటలో, ఓ శ్రీహరీ! నీవు నాలుగు భాగములుగ దశరథునకుఁ బుత్రుడుగాఁబుట్టుమని చెప్పుటకూడ సంగతమగుననియు మఱియు నుత్తరగ్రంథములో లక్ష్మణశత్రుఘ్నులిద్దరు విష్ణుమూర్తియొక్క సగభాగముతోఁబూ

తతస్తు తాః ప్రాశ్య తదుత్తమస్త్రియో మహీపతే రుత్తమపాయసం పృథక్ । హుతాశనాదిత్యసమాన తేజస శ్చిరేణ గర్భాన్ ప్రతిపేదిరే తదా॥ ౧౩౫

---

భాతి- విష్ణోరర మిత్యుత్తరత్ర వక్ష్యమాణ గ్రంథాసంగతేః- చతుర్ణాం సమానభాగవత్త్వే సమానశక్తిప్రతిపత్త్యాదిక మేవస్థాతవ్యం న తథావర్తతే. రామావతార ఇతి ప్రతీతిరివ ఇతరేషామపి తథా ప్రతీతే రభావాత్తస్మిన్భాగాధిక్యం వర్తత ఇత్యేవాఽఙ్గీకర్తవ్యం.

నను పూర్వోక్త వాక్యానాం కావాగతిరితి చేత్ ప్రతికల్పం భవేద్రామ ఇత్యాదికాళికా పురాణవచనేన, తేషుభేదః క్వచిత్క్వచిత్, ఇతీతరపురాణ వచనేనచ, తేషాం కల్పాంతరీయత్వేన సమాధాతుం శక్యతే. నను తథాపి సాక్షాద్విష్ణో శ్చతుర్భాగ ఇత్యుత్తరగ్రంథవిరోధ ఇతిచేన్న, చతుర్భాగ ఇత్యత్ర, విష్ణోరర్ధస్య రామాంశస్య చతుర్థోభాగ ఇత్యర్థః వర్ణనీయః యద్వా, చతుర్థస్యభాగః చతుర్భాగః అష్టమాంశ ఇత్యర్థః- అర్ధసమన్వితా విత్యత్ర అర్ధశబ్దః ఏకదేశవాచీతివర్ణనే నకాపిక్షతిః.

అపిచ వాల్మీకిరామాయణస్థపాయసవిభాగశ్లోక త్రయసాధారణీభూతదదావిత్యేకజాతీయపదస్యాతి క్లిష్టార్థ కల్పనే పాయసవిభాగవిషయక విరోధ పరిహారేపి పాయసప్రదానకర్తృత్వాంశే విరోధో దుష్పరిహారఏవ

౧౩౫ అనంతరము దశరథుని యుత్తమభార్యలగు కౌసల్యా సుమిత్రా కైకేయిలు మువ్వురు నుత్తమమైన పాయసమును వేఱ్వేఱుగా భుజించి సూర్యాగ్నులతో సమానమగు తేజస్సుగల గర్భములను వేంటనే చిరకాలమునకు ధరించిరి.

---

డినవారలను వాక్యమును సంగతమగుననియు భరతుడు సాక్షాద్విష్ణుమూర్తియొక్క నాలుగవభాగమను నర్థమిచ్చు (సాక్షాద్విష్ణోశ్చతుర్భాగః) అనువాక్యము సంగతమగుననియు చెప్పెదరు. కాని యది సమంజసమైన యర్థముకానేరదు (ఏలనన) రాముడు విష్ణుమూర్తియొక్క సగభాగమనునర్థమిచ్చు (విష్ణోరర్థం) అనువాక్యమునకు విరోధముసంభవించును.

ఆవాక్యమునకు వేఱువిధముగ నర్థకల్పనజేసినను రామాదులకు నల్వురకును సమానభాగకల్పనయందు సమానమగుశక్తియు సమానపూజ్యతయు సమానజ్ఞానము మొదలగునవియే యుండవలెననెడి దోషాపత్తి గలుగును. అట్లైనచోఁ బూర్వోక్తములగు నితరపురాణ రామాయణాదివాక్యములకు గతియేమియనిన, ప్రతికల్పమునరామావతారముండుననుకాళికాపురాణవచనమువలనను,ఆయవతారములలో కొంచెము భేదముండునను నితరపురాణవచనమువలనను నితరపురాణరామాయణాదులలోని పాయసవిభాగము కల్పాంతరములకు సంబంధించినదని సమాధానము చేసికొనదగినది. ఇవ్విధము గావర్ణించినచో విష్ణుమూర్తియొక్క నాల్గవభాగము భరతుడనునర్థమిచ్చు (సాక్షాద్విష్ణోశ్చతుర్భాగః) అనునుత్తరవాక్యమునకు విరోధముకదా యని శంకవచ్చును. కాని యాశంకకుసమాధానమిట్లు చెప్పవచ్చును చతుర్భాగమనగా విష్ణుమూర్తియొక్క సగభాగమైన రామావతారములో నాల్గవభాగము (అనగా నెనిమిదవభాగమని)యర్థము చెప్పిన దోషముపోయినది

తతస్తు రాజా ప్రసమీక్ష్య తాః స్త్రియః ప్రరూఢగర్భాః ప్రతిలబ్ధమానసః । బభూవ హృష్టస్త్రిదివే యథా హరిస్సురేంద్రసిద్ధర్షిగణాభిపూజితః॥ ౧౮౫

---

(శ్రుతః) అధ్యాత్మరామాయణే, కౌసల్యాకైకేయీభ్యామేవ దశరథః పాయసం దత్తవానితి. వాల్మీకిరామాయణే దశరథ ఏవ తిసౄణాం పాయసం దత్తవానితి విరోధో దుష్పరిహార ఏవ. దదావిత్యత్ర ణిజంతార్థకల్పనాపి న. భార్యాణామనురూపాణామశ్నీతేతి ప్రయచ్ఛ వై, ఇతి తిసౄణామవిశేషేణ ప్రాయసప్రదానస్య ప్రాజాపత్యపురుషవిహితత్వాత్. అన్యథాకరణే ప్రాజాపత్యవచనోల్లంఘనదోషాపత్తిశ్చ స్యాదితి-తస్మాద్యథాశ్రుత వాల్మీకి ప్రతిపాదితపాయసవిభాగక్రమ ఏవ సమ్యగిత్యలం శాఖాచంక్రమణేన.

౧౪॥ అనంతరము దశరథుడు గర్భవతులగు భార్యలనుఁజూచి తనమనోరథము సఫలమైనదియని సంతోషముతో స్వర్గమున దేవర్షిసిద్ధసాధ్యులచే సేవింపఁబడుచున్న యింద్రుడువలెనుండెను.

---

లక్ష్మణశత్రుఘ్నులు విష్ణుమూర్తియొక్క సగభాగముగలవారని యర్థమిచ్చు (విష్ణోరర్ధసమన్వితౌ). అనునుత్తరవాక్యమునకు విరోధపరిహారమెట్లనగా, అర్ధమనగా ఏకదేశమని యర్థము చెప్పిన కుదురును. మఱియు వాల్మీకిరామాయణమునందలి పాయసవిభాగశ్లోకత్రయములో సాధారణమైన (దదౌ) అనునేకజాతీయపదమునకునొకచోట విభజించెనను నర్థమునుఁ గల్పించుటయు వేఱొకచోట ఇచ్చెనను నర్థమునుగల్పించుటయు నతిక్లిష్టముగానుండును. అట్టి క్లిష్టార్థమునుఁ గల్పించినను పాయసవిభాగవిషయకమగు విరోధము పరిహారమయినను పాయసప్రదానకర్తృత్వాంశమున విరోధము దుష్పరిహారమే (ఎట్లన) అధ్యాత్మరామాయణమున కౌసల్యాకైకేయీల కిద్దరకు దశరథుడు పాయసమునిచ్చినట్లుండెను వాల్మీకిరామాయణమున దశరథుడే ముగ్వురిభార్యలకు పాయసమిచ్చినట్లుండెను కాన తద్విరోధము దుష్పరిహారమేయైయున్నది.

(దదౌ) అనుచోట ఇప్పించెనని ప్రేరణార్థమునుఁ గల్పించుటయు కూడదు(ఏలనన) ప్రాజాపత్యపురుషుడు దశరథునకు పాయసపాత్రనిచ్చి నీభార్యలకుమువ్వరకు భేదములేకుండగ భుజించుటకునీయుమని చెప్పినహేతువువలన ననియె యగునది. ప్రాజాపత్యపురుషుడు చెప్పినదానికి విరుద్ధముగజేసిన తద్వచనోల్లంఘనదోషాపత్తి కలుగును కాన యథాశ్రుత వాల్మీకిప్రతిపాదిత పాయసవిభాగక్రమము సమంజసమని తెలియనగు (శాఖాచంక్రమణముచాలును.)

కౌసల్యాయా స్స్వప్నకాలే సాక్షాత్కృత్య జనార్దనః
పీతాంబరధర శ్శ్రీమాన్ బహుభూషణభూషితః
శ్రీవత్సకౌస్తుభోరస్కః వనమాలావిభూషితః
పద్మపత్రవిశాలాక్ష శ్చతుర్బాహు రుదారధీః
వరదోఽస్మీతి తామాహ కౌసల్యాం భక్తవత్సలః॥ ౧౫-౧౬
తం దృష్ట్వా సర్వలోకేశం కౌసల్యా హర్షసంయుతా
వవందే దేవదేవేశం ప్రహృష్టేనాఽతరాత్మనా॥ ౧౭
ప్రాంజలిః ప్రణతా భూత్వా హర్షగద్గదయా గిరా
పుత్రత్వం భజ మే దేవ ప్రహృష్టేనాఽంతరాత్మనా
తతః ప్రసన్నో భగవాన్ కౌసల్యాం ప్రాహ వై హరిః॥ ౧౮-౧౯
ఉత్పత్స్యేఽహం తథైవాద్య లోకకల్యాణహేతవే
ఇత్యుక్త్వాఽంతర్దధే విష్ణుః। కౌసల్యా జాగ్రతీ తతః
స్మరంతీ స్వప్నవృత్తాంతం విస్మితాఽభూచ్ఛుభాననా॥ ౨౦
తాసాం గర్భేషు వృద్ధేషు క్రమా త్పద్మభవాదయః
అవతారోన్ముఖే శ్రీశే సమాగత్య స్తువ న్హరిం॥ ౨౧
* చైత్రే మాసి సితే పక్షే నవమ్యాం చ పునర్వసౌ
మధ్యాహ్నే కర్కటే లగ్నే ఉచ్చస్థే గ్రహపంచకే
కౌసల్యా జనయామాస రామం రాజీవలోచనం॥
కౌసల్యాయాః పురస్సోఽయం సూతికాభవనే ఽచిరం
ఆవిరాసీ జ్జగన్నాథః నిజరూపం ప్రదర్శయన్॥ ౨౨-౨౩

---

శ్రీ రామావతారఘట్టః

* అత్ర సంవత్సరఃఖోత్తరాయణవసంతచైత్ర మాసశుక్లపక్షదేవనక్షత్రదివాభిజిల్లగ్నపుణ్యనక్షత్రాద్య

౧౫-౧౬-౧౭-౧౮-౧౯ పీతాంబరధారియును, ననేకములగు సువర్ణరత్నా భరణాములను ధరించినవాడును, శ్రీవత్సమనుపుట్టుమచ్చయు,కౌస్తుభ మణియు వక్షస్థలమునందుఁ గలవాడును, పాదములపర్యంతము వ్రేలాడు వనమాలచే నలంకరింపఁబడినవాడును, పద్మపత్రముల వలె విశాలమగు నేత్రములుగలవాడును నాలుగు బాహువులుగల వాడును, ఉదారబుద్ధిగలవాడు భక్తవత్సలుడు నైయుండిన, శ్రీహరి యొకదినమున కౌసల్యకు స్వప్నములో సాక్షాత్కరించి నీకు వరము నిచ్చెదను వేడుకొనుమనగా కౌసల్యయును సర్వలోకేశ్వరుడగు నా శ్రీహరినిఁబూజించి సంతుష్టాంతరంగముతో చేతులుజోడించి గద్గదస్వరముతో నిటులఁబల్కెను "ఓదేవా! నీవునాకు పుత్రు డవుగా జనింపుమనికోరగా భగవంతుడును కౌసల్యనుగూర్చి తిరిగి యిటులపల్కెను.

౨౦౪ ఓదేవి! నీకోర్కెప్రకారము లోకకల్యాణార్థమై నేను నీకవతరింప గలవాడనని చెప్పి భగవంతుడంతర్ధానముకాగా, కౌసల్య,మేల్కా నినదై, స్వప్నవృత్తాంతమును దలచి యాశ్చర్యమొందెను.

౨౧౪ కౌసల్యమొదలగు దశరథపత్నుల గర్భచిహ్నములు క్రమముగా వృద్ధినొందగా భగవానుడవతారాభిముఖుడుకాగా, బ్రహ్మాదిదేవ తలు వచ్చి గర్భస్థుడగు శ్రీహరిని స్తుతించిరి

* ౨౨-౨౩౪ చైత్రశుద్ధనవమీదినమున, పునర్వసునక్షత్రమున,మధ్యాహ్న సమయమున, కర్కాటలగ్నమున నైదుగ్రహములు స్వోచ్చస్థాన మందుండగ, కౌసల్య లోకాభిరామునిఁగనెను లోకనాథుడగుపర మాత్మ,వెంటనే తనదివ్యరూపమునుఁజూపదలచి సూతికాగృహమున కౌసల్యయొక్క పురోభాగమున దివ్యరూపముతోఁబ్రత్యక్షమయ్యెను.

---

వ్యా॥ * ఇచ్చట సంవత్సరారంభము, ఉత్తరాయణము, వసంతఋతువు, చైత్రమాసము, శుక్లపక్షము, దేవనక్షత్రము, పగటిజననము, అభి జిల్లగ్నము, పుణ్యనక్షత్రము, కర్కాటలగ్నము మొదలగు సత్కా

తత్కృష్టకాలే కర్కటలగ్నే ఉచ్చస్థగ్రహపంచకే గురుచంద్ర యోగే శ్రీరామోత్పత్తిః తస్య సర్వోత్కృష్టతాం సకల గుణాభిరామతాం సకలశిష్టాదరణీయసంపత్తిం మహాపరాక్రమం చ సూచయతి.

వ్యా॥ అథ ప్రశస్తఫలాని- తత్ర సంవత్సరముఖస్య ప్రశస్తతాచ- "చిత్రాపూర్ణమాసే దీక్షేర న్ముఖం వా ఏతత్సంవత్సరస్య" ఇతిశ్రుత్యా చిత్రాపూర్ణమాసస్య సంవత్సరముఖత్వేన ప్రశస్తతాప్రతిపాదనా త్సిద్ధా- ముఖం వా ఏతదృతూనాం యద్వసంతః ఇతిశ్రుత్యా వసంతస్య" యం కామయేతేతి శ్రుత్యా పూర్వపక్షస్య, యాన్యేవ దేవన క్షత్రాణి తేషు కుర్వీతేతి శ్రుత్యా దేవనక్షత్రస్య చ ప్రశస్తతా సిద్ధా-పుణ్యాహేషు కార్యాణి ఇతి సూత్రేణ మధ్యాహ్నకాలపుణ్యనక్షత్రసంగ్రహకృద్భిరాపస్తంబాచార్యైః, ఉదగయనపూర్వపక్ష ఇతి వదద్భిసూత్రకృద్భిః ద్రాహ్యాయణాచార్యైశ్చ, ఉక్తానా ముదగయనమధ్యాహ్నశుక్లపక్ష రూపాణాం సర్వోత్కృష్టకర్మసు నియమనా త్ప్రశస్తతా సిద్ధా-అతఏవ, ఏతద్వ్యతిరిక్తకాలోత్పన్నస్య దుష్టఫలం, ఉక్త కాలోత్పన్నస్య ప్రశస్తంఫలం ప్రతిపాదయద్భి ర్జ్యోతిషికై రప్యుక్తకాలానాం ఫలముఖేన ప్రాశస్త్యమేవ ప్రతిపాద్యతే ప్రశస్తఫలాని జ్యోతిశ్శాస్త్రీయజాతకాభరణకీర్త్యా ప్రతిపాద్యంతే. తత్రోత్తరాయణస్య- శ్లో॥ నరస్సదాచారపరో ఉత్యుదారో ధీరశ్చ సౌమ్యాయనజాతజన్మా॥

సమయమున గ్రహపంచకము స్వోచ్చస్థానములందుండగా గురుచంద్రయోగము కలిగియుండగా, శ్రీరామోత్పత్తి యయ్యెను ఇట్టిమహత్తరమగు సమయమునఁ బుట్టిన జాతకుడు సర్వోత్కృష్టుడగుననియు, సర్వగుణాభిరాముడగుననియు, సకలశిష్టాదరణీయ సంపత్తి కలవాడనియు మహాపరాక్రమవంతుడనియు సూచింపబడుచున్నది. ప్రశస్తఫలములు తెలుపబడుచున్నవి.

సంవత్సరారంభమునకు ప్రాశస్త్యము "సంవత్సరమునకు ముఖము గాన చిత్తానక్షత్రయుక్తమగు పూర్ణిమతోఁగూడిన మాసమందు (అనగా చైత్రమాసమున) యాగాదిశుభకర్మదీక్షలనుఁ బొందవలయునని శ్రుతిచేఁ జెప్పబడెను (అనగా చైత్రమాసము సంవత్సరారంభము గనుక ప్రశస్తమనిపర్యవసానము.)

సమస్తఋతువులకు వసంతఋతువు ముఖము (ఆరంభము) కాన శుభప్రదము" అను శ్రుతిచే వసంతఋతువునకు ప్రాశస్త్యము చెప్పబడినది. యం కామయేత" అను శ్రుతివలన శుక్లపక్షమునకు ప్రాశస్త్యము చెప్పబడినది.

ఏ దేవనక్షత్రములుండెనో యానక్షత్రములందే శుభకర్మలనుఁ జేయవలెననెడి శ్రుతిచే దేవనక్షత్రమునకు ప్రాశస్త్యము చెప్పబడినది.

పుణ్యాహములందు శుభకర్మలనుఁ జేయవలయుననెడిసూత్రముచే మధ్యాహ్నకాలపుణ్యనక్షత్ర సంగ్రహమునుఁజేసిన యాపస్తంబాచార్యులును, ఉత్తరాయణము శుక్లపక్షము మధ్యాహ్నకాలము సర్వోత్కృష్టములని శుభకర్మలందు ముఖ్యమనిచెప్పినసూత్రకారులగు ద్రాహ్యాయణాచార్యులును, పై యుత్తరాయణ మధ్యాహ్న శుక్లపక్షాదికాలము లుత్కృష్టములనిచెప్పుటచేవానికి ప్రాశస్త్యము సిద్ధము. కావునే పూర్వోక్తములగు కాలములకు వ్యతిరిక్తమగు కాలమునఁ బుట్టినవానికి మష్టఫలమున్ను, పూర్వోక్త శుభకాలములందు బుట్టినవానికి ప్రశస్తఫలమునుఁజెప్పిన జ్యోతిష్కుల చేతను పైనచెప్పబడినకాలములకు ఫలముఖముచే ప్రాశస్త్యము చెప్పబడుచున్నది. ప్రశస్తఫలములు జ్యోతిశ్శాస్త్రాంతర్గతజాతకాభరణ గ్రంథరీత్యా ప్రతిపాదింపబడుచున్నవి.

వసంతస్య- కందర్పరూపో మతిమా న్ప్రతాపీ వసంతజన్మా మనుజః ప్రసన్నః, - చైత్రమాసస్యాపి - సత్కర్మవిద్యావినయోపపన్నః భోగీ నర స్స్యా న్మధురాన్నభోక్తా సత్పాత్రమిత్రానురత శ్చ మంత్రీ చైత్రోద్భవ శ్చాపి విచిత్రమంత్రః- శుక్లపక్షస్య- సదా సదానందవినీతకాల శ్చే జ్జన్మకాలస్తు వళర పక్షే - నక్షత్రస్య దాతా ప్రతాపీ వసుధా వసుశ్చ పునర్వసూ యస్య భవే త్ప్రసూతిః.

దివా జననస్య- తేజస్వీ పితృసాదృశ్యః శుభదృష్టిర్నృపప్రియః। బంధుపూజ్యో ధనాఢ్యశ్చ దివాజాతో నసంశయః, కర్కాటలగ్నస్య- మృష్టాన్నభు క్సాధురతో వినీతో విలోలబుద్ధి ర్జలకేళిశీలః। ప్రహృష్టసారో ఽలితరా ముదారో లగ్నే కుళీరే హి నరో భవే త్సః-ఉచ్చగ్రహయోగస్య-నభశ్చరాః పంచనీచోచ్చసంస్థాః యస్య ప్రసూతౌ స తు సార్వభౌమః- గురుచంద్రయోగస్య-పరోపకారాదరణైకచిత్తః సితద్యుతౌ వాక్పతినా సమేతే-మేషగతసూర్యస్య-క్షితిపతి స్సుహితశ్చ సదా శుచి స్సుమహసాం మహసా మధిపే క్రియే-బలవతాం శుభగ్రహాణాం-పుష్పాంబరోత్తమవిభూషణసాదరాశ్చ సౌమ్యగృహై ర్బలయుతైః పురుషా భవంతి. ఇతి-తస్మాదేతేషాం కాలానాం జననే ప్రశస్తత్వాత్. సాధారణానామస్మిన్కాలే జననాసంభవాత్. అస్య చ శ్రీరామస్యతాదృశకాలే సముత్పన్నత్వాత్ సర్వోత్కృష్టత్వం సకలలోకాదరణీయాచారవత్వం చ సిద్ధం.

ఉత్తరాయణమునకు ఫలము-ఉత్తరాయణమునఁ బుట్టినవాడు సదాచారము కలవాడును ధీరుడు నగునని-

వసంతఋతుఫలము- వసంతఋతువునందు పుట్టిన జాతకుడు మన్మథునితో సమానమగు రూపముగలవాడును, ప్రతిభాశాలియును, ప్రతాపవంతుడును, ప్రసన్నుడునగునని- చైత్రమాసఫలము- చైత్రమాసమునందు జన్మించినమనుజుడు సత్కార్యాసక్తియు, విద్యయు, వినయము గలవాడును, భోగవంతుడును, మధురాన్నము భుజించువాడును, సజ్జనులయందు, మిత్రులయందు దయగలవాడును, ఆలోచనపరుడగునని-

శుక్లపక్షఫలము- శుక్లపక్షమున జన్మించిన జాతకుడెల్లప్పుడును బ్రహ్మానందముచే కాలము గడుపువాడగునని-

నక్షత్రఫలము - పునర్వసునక్షత్రమునందు జన్మించినవాడు ధనముగలవాడును, ప్రతాపవంతుడుగునని.

దివాజననమునకు ఫలము- పగటియందు పుట్టినజాతకుడు తేజస్సుగలవాడును, పితృతుల్యుడును, శుభదృష్టికలవాడును, రాజతుల్యుడు ధనాఢ్యుడగునని.

కర్కాటకలగ్నఫలము- కర్కాటకలగ్నమందు బుట్టినజాతకుడు మృష్టాన్నమును భుజించువాడును, సాధువులయందనురాగము కలవాడును, జలక్రీడాసక్తుడును, మహాబలవంతుడును, మిక్కిలి యౌదార్యము కలవాడునగును.

ఉచ్చగ్రహయోగమునకు ఫలము- ఐదుగ్రహములుచ్చయందున్నను నైదుగ్రహములు నీచయందున్నను నట్టిసమయమునఁబుట్టినజాతకుడు సార్వభౌముడగునని.

గురుచంద్రయోగమునకు ఫలము- చంద్రుడు బృహస్పతితో కలసియుండగాఁ బుట్టినజాతకుడు పరోపకారచిత్తము కలవాడును, పరుల నాదరించువాడు నగునని.

మేషగతసూర్యునకు ఫలము- సూర్యుడు మేషమునందుండగాఁబుట్టిన జాతకుడు భూపాలకుడును, మంచిమిత్రులు కలవాడును, శుచిత్వము

శ్రీరామచంద్రజన్మపత్రికా లిఖ్యతే-

స్వస్తిశ్రీ వైవస్వతమన్వంతరాంతర్గతాష్టావింశతి మహాయుగాంతర్భూతత్రింశత్సహస్రావశిష్టత్రేతాయుగే విళంబిసంవత్సరే మేషసంక్రమణే చైత్రమాసే శుక్లపక్షే నవమ్యాం బుధవాసరే పునర్వసునక్షత్రే మధ్యాహ్న సమయే కటకలగ్నే రవికుజగురుశుక్రశనిరూప పంచగ్రహేషు స్వోచ్ఛస్థానగతేషు శ్రీరామచంద్రావిర్భావః-

తత్కాలగ్రహసంపత్తిః-

| | | | | | |
|---|---|---|---|---|---|
| అశ్వనీ | 3 | రవిః | పుష్యమీ | 4 | గురుః |
| పునర్వసు | 4 | చంద్రః | రేవతీ | 4 | శుక్రః |
| శ్రవణ | 3 | కుజః | స్వాతీ | 4 | శనిః |
| ఉ-భా | 3 | బుధః | పుబ్బా | 4 | రాహుః |
| | | | పూ-భా | 2 | కేతుః |

గురుదశాశేషసంవత్సరాః-4 మాం౦-ది-౦-

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| శుబు | ర | | | శకు | | కే | రకు |
| కే | రాశిచక్రం | | గుచల | | అంశచక్రం | | చం |
| కు | | | రా | | | | గు |
| | | శ | | | రా | బు | |

కలవాడగునని. శుభగ్రహబలఫలము- శుభగ్రహములు బలయుతములుగానున్నపుడు పుట్టినజాతకుడు పుష్పములు, వస్త్రములు, అలంకారములు మొదలగువానియందాదరము కలవాడగునని.

పైకాలములు జననమునందు ప్రశస్తములగుటవలనను సాధారణమైన మనుజులకీకాలమున జననము సంభవించదు కావునను, శ్రీరాముడిట్టికాలమునఁ బుట్టుటవలన సర్వోత్కృష్టతయు, సర్వలోకాదరణీయత్వము సిద్ధమయ్యెను.

### శ్రీరాముని జననపత్రిక.

స్వస్తిశ్రీ వైవస్వతమన్వంతరమున, నిరువదియెనిమిదవ మహాయుగమున, మూప్పదివేల సంవత్సరములు మిగులఁగాగల త్రేతాయుగమున, విళంబి సంవత్సరమున, చైత్రమాసమునందు, శుక్లపక్షమున నవమీ బుధవారమున పునర్వసునక్షత్రమున మధ్యాహ్నసమయమున కర్కాటక లగ్నమున, రవికుజగురుశుక్రశను లుచ్చయందుండగా శ్రీరామచంద్రమూర్తియొక్క జననమయ్యెను.

### తత్కాలగ్రహసంపత్తి.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 3 | పాదమున | సూర్యుడు | పుష్యమి | 4 | ,, | గురుడు |
| పునర్వసు | 4 | ,, | చంద్రుడు | రేవతి | 4 | ,, | శుక్రుడు |
| శ్రవణ | 3 | ,, | కుజుడు | స్వాతి | 4 | ,, | శని |
| ఉత్తరాభాద | 3 | ,, | బుధుడు | పుబ్బ | 4 | ,, | రాహువు |
| | | | | పూభా | 2 | ,, | కేతువు |

జననకాలమునకు గురుదశాశేషసంవత్సరములు 4 నె-౦-ది-౦-

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| బుశు | ర | | | శశు | | కే | రకు |
| కే | రాశిచక్రము | | చగుల | | అంశచక్రము | | చం |
| కు | | | రా | | | | గు |
| | | శ | | రా | బు | | |

నీలోత్పలదళశ్యామః । కోటికందర్పసంనిభః
పద్మపత్రవిశాలాక్షః సర్వాభరణశోభితః
అనేకసూర్యసంకాశః తేజసా మహతా వృతః॥ ౨౪-౨౫

ఈశాన స్సర్వలోకానాం యోగిధ్యేయ స్సనాతనః
ఏతాదృశగుణోపేతం ప్రాదుర్భూతం పుర స్తదా
కౌసల్యా సంనిరీక్ష్యాఽథ నత్వా ప్రాంజలి రబ్రవీత్॥ ౨౬

ధన్యాస్మి దేవదేవేశ లబ్ధ్వా త్వాం తనయం ప్రభో
ప్రసీద మే జగన్నాథ పుత్రస్నేహం ప్రదర్శయ॥ ౨౭

సంసారగర్తపతితాం మహామోహాంధకారతః
దీనభావంగతాం మాం త్వం సముద్ధర మహాప్రభో॥ ౨౮

లోకసంమోహినీం మాయాం త్వదీయాం మయి కేశవ
మా ప్రసారయ విజ్ఞానం దేహి మే త్రిజగద్గురో॥ ౨౯

భక్తవత్సలతా తేఽద్య దర్శితా మయి మాధవ।త్వన్మా
యయా మోహితాఽహం తత్త్వం తే వేత్తు మక్షమా॥ ౩౦

అలౌకిక మిదం రూపం హిత్వా దర్శయ శైశవం
యచ్ఛిశుక్రీడనాలాపాలోకాన్వేష్టి చిరం మనః॥ ౩౧

1 ఇతి స్తుతోఽథ భగవా న్కౌసల్యా మాహ మాధవః
రూప మేత త్త్వయా దృష్టం ప్రాక్తనం తపసః ఫలం
మద్దర్శనం విమోక్షాయ కల్పతే హ్యన్యదుర్లభం॥ ౩౨-౩౩

---

1 అ॥ రా॥

౨౪-౨౫-౨౬ నల్లకలువరేకులవలె శరీరచ్ఛాయ గలవాడును కోటిమన్మథులతో సమానమగు సౌందర్యముగలవాడు, పద్మపత్రములవంటి విశాలమగు నేత్రములుఁగలవాడును, సమస్తాభరణములచే బ్రకాశింపఁబడుచున్నవాడును, కోటిసూర్యప్రకాశమానుడును, సమస్తలోకాధీశుడును, యోగులచే ధ్యానింపఁగినవాడును, సనాతనుడును, నిట్టి బహుగుణములతోఁగూడి తనపురోభాగమున నావిర్భవించి దివ్యరూపముతో నొప్పుచుండిన యా భగవానుని కౌసల్య జూచి చేతులుజోడించి స్తుతించెను.

౨౭-౨౮-౨౯ మహాప్రభో! నిన్ను పుత్రునిగా బొందుటచే నేనుధన్యాత్మురాలనైతిని. ఓలోకనాయకా! నాయందనుగ్రహముంచి పుత్రస్నేహమునుఁ జూపింపుము మోహాంధకారమువలన సంసారమను గోతిలో పడియున్నట్టియు, దైన్యమునుఁబొందినట్టియునగు నన్ను నీవుద్ధరింపుము-లోకములను మోహింపఁజేయు నీమాయను నాయందుఁ బ్రసరింపఁజేయకుము. ఓజగద్గురూ! నాకు విజ్ఞానమునుఁగలుగఁజేయుము.

౩౦ ఓమాధవా! నీయొక్క భక్తవాత్సల్యమును నాయందిపుడు చూపితివి. నీమాయచే నేను మోహితురాలను-నీతత్త్వమునుఁ దెలిసికొనుటకు సమర్థురాలనుఁగాను.

౩౧ దివ్యరూపమునువిడచి బాలభావమునుఁ జూపింపుము నామనస్సు చిరకాలమునుండి బాలునిక్రీడలను తత్సంభాషణములను జూడనపేక్షించుచున్నది.

౩౨-౩౩ ఇవ్విధముగ కౌసల్యచే స్తుతింపబడి భగవంతుడామెనుగూర్చి యివ్విధముగఁబలికెను. ఓదేవి! నీవు నాదివ్యరూపమునుఁ జూడగల్గుట, నీపూర్వజన్మ తపఃఫలము- ఇతరులకు సులభముకాని నాదర్శనము మోక్షకారణమగును.

త్వయా దశరథేనాఽహం తపసారాధితః పురా
మత్పుత్రత్వాభికాఙ్క్షిణ్యా తథా కృత మనిందితే॥ 3౮
భూభారహరణార్థాయ బ్రహ్మాద్యై రమరై రపి
హంతుం దశాననం పూర్వం ప్రార్థితో మర్త్యతాంగతః॥ 3౯
ఇత్యుక్త్వామాతరం రామః బాలోభూత్వా రురోదహ॥ 3౯౫
అథ రాజా దశరథః శృత్వా పుత్రోద్భవోత్సవం
ఆనందార్ణవమగ్నోఽహ వాయయా గురుణాసహ॥ 3౬౫
రామం రాజీవపత్రాక్షం దృష్ట్వా హర్షాశ్రుసంప్లుతః
పురోధసా వసిష్ఠేన జాతకర్మ తదాఽకరోత్॥ 3౭౫
జగన్నాథే సముత్పన్నే దేవదుందుభయో దివి
వినేదుః పుష్పవర్షాణి వవృషు స్సురసత్తమాః॥ 3౮౫
ప్రజాపతిముఖా స్సర్వే తుష్టువు శ్చ నభస్థలే
జగు ర్గంధర్వపతయో ననృతు శ్చాప్సరోగణాః 3౯౫

తతః పుణ్యా శ్శివా వాతాః సుప్రభో ఽభూ దివాకరః
జజ్వలు శ్చాగ్నయ శ్శాంతాః విమలా శ్చ దిశో దశ॥ ౪౦౫
కైకేయీ చాథ భరత మసూత కమలేక్షణా
సుమిత్రాయాం యమౌ జాతౌ పూర్ణేందుసదృశాననౌ॥ ౪౧౫
పుష్యే జాత స్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః
సార్పే జాతస్తు సౌమిత్రిః కుళీరేఽభ్యుదితే రవౌ॥ ౪౨౫
తేషాం పురోధసా రాజా జాతకర్మాణ్య కారయత్॥ ౪3

3౪ నీవును దశరథుడును బూర్వము నన్ను పుత్రునిగా కోరి తపమునుఁ జేసియుంటిరి నేను మీకు వరమిచ్చినకారణముచే నవ్విధముగ నాచరించితిని.

3౫-3౬ మఱియు రావణునిసంహరించి భూభారమును తొలగింపుమని బ్రహ్మాదిదేవతలు పూర్వము నన్ను బ్రార్థింపగా, నేను మనుష్యభావము నొందితినని యివ్విధముగ కౌసల్యతోఁ జెప్పి శిశురూపుడై యేడ్చుచుండెను.

3౭ అనంతరము దశరథుడు పుత్రోత్సవమును విని యానందసముద్రమున మునిగి గురువగు వసిష్ఠునితోఁగూడ, నచ్చటను వచ్చెను.

3౮ పద్మపత్రములవంటి విశాలమగు నేత్రములుగల యాశిశువునుఁ జూచి యానందబాష్పములను విడచుచు, పురోహితుడగు వసిష్ఠునిచే జాతకర్మనుఁ జేయించెను.

3౯ భగవానుడుఁ పుట్టినపుడు దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవర్షములను దేవతలు వర్షించిరి.

3౯ బ్రహ్మాదిదేవతలాకాశముననుండి యనేకవిధములుగ స్తవములఁ జేసిరి మఱియు గంధర్వరాజులు గానములను, నప్సరస్త్రీలు నృత్యమునుఁ జేసిరి.

౪౦ మలయమారుతమువీచెను. సూర్యుడు దివ్యమైన తేజస్సుగలవాడయ్యెను అగ్నులు ప్రజ్వరిల్లెను. దశదిక్కులు నిర్మలములయ్యెను.

౪౧ అనంతరము కైకేయియును భరతునిఁగనెను. పిమ్మట పూర్ణచంద్రునితో సమానమగు ముఖములుగల కవలులగు లక్ష్మణశత్రుఘ్నులను సుమిత్ర కనెను.

౪౨-౪౩ భరతుడు దశమీదినమున పుష్యమీనక్షత్రమున మీనలగ్నమున జన్మించెను. ఏకాదశీదినమున ఆశ్లేషానక్షత్రమునందు మధ్యాహ్నసమయమున కర్కాటలగ్నమున లక్ష్మణశత్రుఘ్నులు జన్మించిరి. వారలను దశరథుడు, వసిష్ఠునిచే క్రమముగ జాతకర్మలను జేయించెను.

* రామాదిజన్మకాలే తు బ్రాహ్మణేభ్యో ముదా నృపః
గోభూమిస్వర్ణదానాని చకార విధినా పృథక్
ప్రదేయాంశ్చ దదౌ రాజా సూతమాగధవందినాం॥ ౨౨౫

---

* అన్యత్ర పుణ్యకాలః ఉత్సవకాలో నభవతి, ఉత్సవకాలః పుణ్యకాలో నభవతి పుత్రోత్పత్తికాలస్తు పుణ్యోత్సవోభయాత్మకః తథాచవ్యాసః- దేవాశ్చ పితరశ్చైవ పుత్రే జాతే ద్విజన్మనాం। ఆయాన్తి తస్మాత్తదహః పుణ్యం పూజ్యం చ సర్వదా। తత్ర దద్యాత్సువర్ణం చ భూమిం గాం తురగం రథం॥ ఇతి- అత్ర పుణ్యపూజ్యశబ్దాభ్యా ముభయరూపత్వం స్పష్టం।తస్మిన్కాలే దేవానాం పితౄణాం చ జాతేష్టివృద్ధిశ్రాద్ధాదినా తృప్తిః కార్యా- తథాచబోధాయనః- వైశ్వానరం ద్వాదశకపాలం నిర్వపేత్పుత్రే జాతే ఇతి. విష్ణుపురాణేపి, సచేలస్య పితుః స్నానం జాతే పుత్రే విధీయతే। జాతకర్మ తదా కుర్యాచ్ఛ్రాద్ధ మాభ్యుదయాంచరేత్ -త్రివిధాని చ దానాని దేయాని-అదృష్టార్థంబ్రాహ్మణేభ్యో గవాదిదానం, ఉత్సవప్రియుక్తతయా బాంధవానాం ప్రియశంసినే జనాయ చ యత్ప్రీతిదానం- కీర్త్యర్థం నటనర్తకాదిభ్యోదానం, ఇతి- ఏవంశ్రౌతస్మార్తోత్సవయోగ్యః పుత్రోత్పత్తిదినసదృశో ఽన్యో దివసో నాస్తి, కింబహునా, పుత్రస్తేజాతఃఇతిశబ్దోచ్చారణం ప్రియసత్యహితరూపత్వాత్ వాఙ్మయతపోరూపం- తథాచగీతాయాం- అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।స్వాధ్యాయాభ్యసనం

* ౪౪౫ ప్రత్యేకముగ రామాదుల జన్మకాలమున దశరథుడు బ్రాహ్మణులకు గో,భూమిసువర్ణదానములను యథావిధిగఁజేసెను. మఱియు బంధుమిత్రాదులకు సంతోషపూర్వకముగ గౌరవములనుఁజేసెను. వందిమాగధులు మొదలగువారికి నీయదగినవానినన్నిటినిచ్చెను.

---

* మఱియొకస్థలమున బుణ్యకాలము, ఉత్సవకాలముకానేరదు, ఉత్సవకాలము పుణ్యకాలముకానేరదు పుత్రోత్పత్తికాలమైతే పుణ్యోత్సవోభయరూపకమైనది. వ్యాసుడునవ్విధముననే చెప్పెను. దేవతలు పితృదేవతలు ద్విజులకుఁ బుత్రోత్పత్తి కలుగునెడ వచ్చెదరని యున్నందువలన, ఆపుత్రోత్పత్తిదినము పుణ్యము పూజ్యమునియును తత్సమయమున సువర్ణగోభూమిదానముల జేయవలయుననియు జెప్పబడినది- ఇచ్చట పుణ్యపూజ్యశబ్దములవలన పుత్రోత్పత్తి టనము పుణ్యపూజ్యోభయరూపమని స్పష్టమయ్యెను. ఆకాలమున దేవతలుకును పితృదేవతలకును జాతేష్టియు వృద్ధిశ్రాద్ధము మొదలగు వానిచేఁ దృప్తినిఁజేయవలయునని చెప్పఁబడినది. పుత్రోత్పత్తి యగుటతోడనే పండ్రెండు పెంకులయందు హవిస్సునుంచి హోమమును జేయవలయునని బోధాయనుడుచెప్పెను. పుత్రుడు పుట్టుటతోడనే తండ్రి, సచేలస్నానముచేసి వృద్ధిశ్రాద్ధము చేయవలయునని విష్ణుపురాణమునందుఁజెప్పఁబడినది- మఱియుఁ బుత్రోత్పత్తికాలమున త్రివిధములగు దానములఁ జేయవలయునని యున్నది. త్రివిధదానము లేవియన, 1 పుణ్యముకొఱకు బ్రాహ్మణులకీయబడు గోస్వర్ణభూమిదానము 2 ఉత్సవములకు సంబంధించినట్టియు, సంతోషముతో బాంధవులకు; ప్రియవార్తను జెప్పువారలకు నీయబడు ప్రీతిదానము. 3 కీర్తికొఱకు నటనర్తకాదులకీయబడు కీర్తిదానము, అని

ఇవ్విధముగ శ్రౌతస్మార్తోత్సవములకుఁదగినట్టియుఁ బుత్రోత్పత్తితో సమానమైనట్టిదినము మఱియొకటిలేదనిస్పష్టము-అధికప్రసంగమేల, నీకు పుత్రుడుపుట్టెనని వచనము నుచ్చరించుటయును ప్రియసత్యహిత

* కారయామాస గురుణా తేషాం నామాని భూపతిః
యస్మిన్రమంతే మునయో విద్యయాఽజ్ఞానవిప్లవే
తం గురుః ప్రాహ రామేతిరమణాద్రామఇత్యపి॥౭౫-౭౬

---

చైవ వాఙ్మయం తప ఉచ్యతే, ఇతి- భాష్యకారా అపి సత్యప్రియహితవచనత్వేన, పుత్రస్తేజాతః, ఇతి వాక్య ము దాజహ్రుః ఏతాదృశవాక్యవక్తురపి సర్వం దేయమిత్యాహ కాళిదాసః॥శ్లో॥జనాయ శుద్ధాంతచరాయ శంసతే కుమారజన్మాఽమృతసంమితాక్షరం। అదేయ మాసీ త్త్రయమేవ భూపతేః శశిప్రభం ఛత్రముభేచచామరే॥ ఇతి॥ అతో దశరథేన దానానిదత్తాని ఇతరైరపి పుత్రజన్మన్యేవం సమాచరణీయ మితిసూచితం.

---

రామనామ నిర్వచనం.

* రమంతే యోగినో ఽస్మిన్నితి రామః సమాధికాలే సచ్చిదానందరూపే తస్మిన్యోగినః క్రీడంతీతిభావః రమయతీతి రామః సౌలభ్యసౌశీల్యాదిభిస్స్వాశ్రితాన్సంతోషయతీతి భావః. అథవా రామః అభిరామః లోకోత్తర దివ్యమంగళవిగ్రహసౌందర్యవానితి భావః। తథాచారణ్యకాండే" జితేంద్రియాఽఅపిమహర్షయస్తస్యదివ్యమంగళవిగ్రహ

*౮౫-౮౯ అనంతరము దశరథుడు గురువగు వసిష్ఠునితో బాలురకు నామకరణముఁ జేయించెను. వసిష్ఠుఁడు కౌసల్యాపుత్రునకు రామయను నామకరణముఁ జేసెను. (దానిభావమేమన) అజ్ఞాననాశనమైనపుడు జ్ఞానబలముచే యోగులు సమాధికాలమున నితనియందు రమించెదరు. (క్రీడించెదరు) కావునను, లేక, సౌందర్యాదులచే జనులను సంతోషపెట్టువాఁడు కావునను రాముఁడను భావముతో నామకరణము చేసెను.

---

రూపముకాన వాగ్రూపమగుతపస్సని చెప్పబడినది. అవ్విధముననే గీతయందుఁ జెప్పఁబడినది. భీతినిగలుగఁజేయనదియును ప్రియము సత్యము హితము నగు వాక్యము, స్వాధ్యాయము నభ్యసించుటయు, వాఙ్మయమగుతపస్సనిఁ జెప్పబడినది-భాష్యకారులును నీకుఁబుత్రుఁడు పుట్టెను, అను వాక్యమును సత్యప్రియహితవచనమునుగానుదహరించిరి. ఇట్టివాక్యమునుఁ జెప్పినవానికని సర్వమునీయదగునని కాళిదాసుడు చెప్పెను, (ఏమన) దిలీపమహారాజుతో నీకుపుత్రుడుపుట్టెనని యంతఃపురజనము చెప్పగా నావాక్యమును విని దిలీపుడు ప్రియవార్తను జెప్పినజనులకు ఛత్రచామరములుతప్ప, మిగిలినయావత్తుధనము నిచ్చెనని (చెప్పెను) ఈకారణమువలన దశరథుడు దానముల నిచ్చెను. పైకథవలనఁ దెలిసికొనదగిన నీతియేమనగా నితరులును పుత్రోత్సవమునందివ్విధముగ నాచరింపవలయునని సూచితము.

---

* రామనామనిర్వచనము.

పైనచెప్పినవిధముగ సచ్చిదానందరూపునియందు సమాధికాలమున యోగులు క్రీడించెదరుకావున రాముడనియు, లేక, సౌలభ్యసౌశీల్యాదిగుణములచే స్వాశ్రితులను సంతోషపెట్టువాడుగాన రాముడనియు చెప్పఁబడును. లేక, రాముడనగా, అభిరాముడని యర్థము. (లోకోత్తర దివ్యమంగళవిగ్రహసౌందర్యముగలవాడని భావము.) అరణ్యకాండలో నీవిషయము స్పష్టమగును. రాముడు

భరణా ద్భరతో నామ లక్ష్మణం లక్షణాన్వితం

శత్రుఘ్నం శత్రుహంతార మేవం గురు రభాషత॥ ४८

---

రూపం దృష్ట్వా మోహితాఃఏకవార మాలింగనభాగ్యం దేహీతి రామం ప్రార్థయామాసుః'' తదారామః కృష్ణావ తారే భవతా మభీప్సితం సఫలంభ వేదిత్యాహ- యద్వా రామః శ్యామఇత్యర్థః, అథవా వైకుంఠవాసీ భగవాన్ రాతి రాజతే మహీతలఇతి రామః యద్వా నామ్నైకదేశే నామగ్రహణ మితిన్యాయేన, రకారః రాక్షసవాచకః మకారః మరణవాచకః ఏవంచ రాక్షసా యేన మరణం యాన్తి సరామ ఇతి.

యద్వా రకారో ఽనలబీజం స్యాత్। భస్మకర్మ కరోతి చ, అకారో భానుబీజం స్యా దవిద్యాం నాశయే త్తమః। మకార శ్చంద్రబీజం స్యా త్తాపం హరతి వై సదా॥ ఇత్యగ్నే ర్దాహకత్వశక్తిః భానో రంధకారనివర్తక త్వశక్తిః చంద్రస్య తాపనివారకత్వశక్తి ర్వర్తతే ఏత త్త్రితయం రామనామ్ని వర్తత ఇతి. తథాచ పాపదాహ కత్వా ఽజ్ఞానాంధకార నివర్తకత్వ తాపత్రయనివారకత్వ

౪౭ కైకేయీపుత్రునకు భరతుడని వసిష్ఠుడునామకరణముజేసెను భరతుడనగా రాముడరణ్యమునకు వెళ్ళినపుడు రాజ్యమునుభరించువాడగునని తెలిసికొని వసిష్ఠుడు నామకరణమట్లు చేసెనని భావము సుమిత్రాపుత్రులలో జ్యేష్ఠునకు లక్ష్మణుడని నామకరణముఁజేసెను. (లక్ష్మణుడనగా భగవత్సేవారూపమగు లక్ష్మిగలవాడగునని వసిష్ఠుడా విధముగ నామకరణము చేసెననిభావము.) సుమిత్రాపుత్రులలో రెండవవానికి శత్రుఘ్నుడని నామకరణము చేసెను (శత్రుఘ్నుడనగా నిత్యశత్రువులగు కామక్రోధాదులను జయించువాడగునని యవ్విధముగ నామకరణము చేసెను)

---

దండకారణ్యమునకేగినపుడు జితేంద్రియులగుమహర్షులు రాముని దివ్యమంగళవిగ్రహమునుఁజూచి మోహితులై యొకపర్యాయము మాకు నీశరీరాలింగనభాగ్యమునుఁ గలుగఁజేయుమని ప్రార్థించిరి. అప్పుడు కృష్ణావతారకాలములో మీకోరిక నెరవేరునని రామచంద్రమూర్తి సమాధానమునుఁజెప్పెను. కాన జితేంద్రియులనుగూడ మోహింపజేయు దివ్యసౌందర్యము గలవాడనిభావము.

లేక, రాముడనగా శ్యామవర్ణముగలవాడనియు శ్రుతిలోజెప్పబడినది. లేక, వైకుంఠవాసియగు విష్ణుమూర్తియే మహీతలమునందు ప్రకాశించుచున్నాడు కాన రాముడనియర్థము. (అనగా రా, యనగా 'ప్రకాశించువాడని, మ అనగా మహీతలమునందని) నామములో నేకదేశమును గ్రహించినను, ఆనామమంతయు వచ్చుననెడిసంస్కృతన్యాయము చేతను. రా, అనగా రాక్షసులనియర్థము, మ, అనగా మారణము చేయువాడు? అనగా రాక్షసమారకుడని యర్థము, లేక రామ, అను పదములో రకారము-అకారము-మకారము మూడువర్ణములుండెను. రకారము, అగ్నిబీజము, దానిలో పాపములను భస్మముచేయుశక్తికలదు. అకారము సూర్యబీజము ఆబీజములో తమస్సునుఁ బోగొట్టుశక్తిగలదు- మకారము చంద్రబీజము, దానియందు తాపమునుఁబోగొట్టుశక్తికలదు, పైవాక్యమువలన, అగ్నికి దాహకత్వశక్తియు, సూర్యునకంధకారనివర్తకత్వశక్తియు,

ఏవం వసిష్ఠో బాలానాం కృత్వా నామాని వై పృథక్
రాజ్ఞా సంపూజిత స్సమ్యగ్గామ స్వాశ్రమం పునః॥ ౨౮

---

రూపశక్తిత్రయవదాద్రామనామేతి పర్యవసితం - అపిచాగ్ని వంశే పరశురామః సూర్యవంశే శ్రీరామః చంద్రవంశే బలరామశ్చ సంబభూవుః. అగ్నేః కలాత్రయం, చంద్రస్యైక కలా, సూర్యస్య ద్వాదశకలా, స్సంఘీభూయ షోడశకలా స్సమభవన్, తాదృశషోడశకలాపరిపూర్ణః రామ ఇతి. యద్వా, నామైకదేశన్యాయేన రాజ్ఞాం మహీస్థితానాం నీతిబోధకత్వాద్రామ ఇతి అయమర్థస్త్వయోధ్యాకాండే రామేణభరతముద్దిశ్యకుశలప్రశ్నవ్యాజేన శ్లోకే సర్వరాజన్యా నాంధర్మాన్బోధయామాసఅథవాపూర్వోక్తన్యాయేన రాకా రః రావణవాచకఃమకారః మారణవాచకః తథాచరావణ మారకత్వాద్రామఇతి యద్వా పురామహర్షయః లోకోప కారాయ సప్తకోటిమహామంత్రమధ్యే మంత్రద్వయం పంచాక్షర్యష్టాక్షరీరూప మైహికాముష్మికఫలప్రద త్వేన సర్వ మంత్రసారభూతత్వేన చాగణయన్. వసిష్ఠస్తుకౌసల్యాసుతస్య నామకరణే సప్తకోటిమహామంత్రసారభూతాష్టాక్షరీపంచా క్షరీ రూపమంత్రద్వయం యదస్తి, తద్ద్వయేసారభూతం రా, మ, ఇతి వర్ణద్వయం సంయోజ్యరామఇతి నామ చకారేతి తథాచరామనామ్నైహికాముష్మికఫలప్రదమితిపర్యవసితం ఏవంచ, రామో హరిహరాత్మక ఇత్యుక్తిశ్చ సంగచ్ఛత ఇతి అథవా, రకార స్తత్పదార్థస్స్యాత్ మకార స్త్వం

౪౭ ఈవిధముగ దశరథపుత్రులకు వసిష్ఠుడు నామకరణములనుఁజేసి దశరథానుమతిచేఁదననివాసమునకేగెను.

---

చంద్రునకు తాపనివారకత్వశక్తియుఁ గలదు, అమూఁడుశక్తులు,రామ యను నామమునందుఁ గలవు. కాన రాముడన, పాపములనుదహింపఁ జేయువాడును తాపత్రయమును నివారింపశక్తిగలవాడును, అజ్ఞా, నాంధకారమునుఁ బోగొట్టువాడునని పర్యవసానము-

మఱియు, అగ్నివంశమునఁబరశురాముడును, సూర్యవంశమున శ్రీరాముడును, చంద్రవంశమున బలరాముడును పుట్టిరి. అగ్నికిమూఁడు కళలును, చంద్రునకొకకళయును, సూర్యునకుఁబండ్రెండుకళలును గలసి షోడశకళలయ్యెను. (పదునారుకళలయ్యెను.) అట్టి షోడశ కలాపరిపూర్ణుడు రాముడనిపర్యవసానము. లేక. నామైకదేశన్యా యముచే (అనగా నొకనామములో నొకమొదటియక్షరమునుచ్చ రించిన నామమంతయు వచ్చుననున్యాయముచే) మ,అనగా మహీ తలమునందున్న, రా,యనగా, రాజులకు నీతినిబోధించువాడుగాన రాముడనియర్థము. ఈవిషయమయోధ్యాకాండమున, రాముడు భర తుని (గుశలప్రశ్నలడుగుట యను మిషచే, సమస్తరాజులకు నీతిని బోధించుట సూచింపఁబడినది. లేక, పూర్వోక్తన్యాయముచే, రా,అనగా రావణుని, మ,అనగా, మారణముచేయనవతరించినవాడు గానరాముడని, లేక, పూర్వకాలమున మహర్షులు లోకోపకారము కొఱకు సప్తకోటిమహామంత్రములఁ బరిశీలించి వానిలో శివపంచా క్షరీనారాయణాష్టాక్షరీరూపమగు మంత్రద్వయమునైహికాముష్మిక ఫలప్రదమును గా సమస్తమంత్రసారమును గాఁ బరిగణించిరి. వసి ష్ఠుడు కౌసల్యాపుత్రునకు నామకరణముచేయునెడ సప్తకోటిమహా మంత్రములసారమైన, యష్టాక్షరీపంచాక్షరీరూపమగు మంత్ర ద్వయములోసారమగు రా,మ, అనువర్ణద్వయమునుఁగూర్చి రామ యను నామకరణమునుఁజేసెను. కాన రామనామమైహికాముష్మిక

పదార్థకః॥ తయో స్సంయోజన మసీ త్యేత త్త్వవిదో వి
దురితి” శ్రుత్యా ప్రతిపాదితమహావాక్యలక్ష్యార్థరూపః రామశ
బ్దార్థః-అథవా నామైకదేశేనా మగ్రహణమితిన్యాయేన, సత్య
భామాయాః భామేతివత్ పరశురామస్య రామఇతివత్
శ్రీరామస్యాపిరామఇతి, నామ, పూర్వోక్తన్యాయేనకృతంవసి
ష్ఠేన “ఏవంచ” శ్రియా రమత ఇతి శ్రీరామః, యథాపరశు
నారమతఇతి పరశురామః” తథా చ లక్ష్మీపతి రేవాయ మిత్యర్థ
స్సంభవతి-అథవా, శ్రీశబ్దాప్రయోగేఽప్యయమర్థ స్సమా
యాతి, కథమితిచేత్. (రమయా సహితః రామ ఇతివ్యుత్ప
త్త్యా లక్ష్మీపతి రే వాఽయమితి-తథాచ వాక్యే=శ్రియః కమల
వాసిన్యారమణోఽయంమహాప్రభుః తస్మాచ్ఛ్రీరామఇత్యస్య
నామ సిద్ధం పురాతనమితి॥-నచుక్షత్రియస్య ద్వాదశాహం
సూతకమితిన్యాయేనత్రయోదశదినే శుద్ధేః ద్వాదశదినే నామ
కరణం కథముపపన్నం భవేదితిచేన్న లక్ష్మ్యాజనకాదార భ్యేతి

ఫలములనిచ్చునదియని పర్యవసానము. కావుననే రాముడు హరి హరోభయస్వరూపుడనుమాట సంగతమగుచున్నది మఱియు రకారమునకు జీవబ్రహ్మైక్యమును బోధించు (తత్త్వమసి) అను, మహావాక్యములోని తత్పదార్థంబగు పరబ్రహ్మయని యర్థము మ, అనగా జీవుడు, రా మ, అను రెండు వర్ణముల యొక్క కలయికయే జీవబ్రహ్మైక్యమును బోధించు" అసి, అను పదార్థముకాన మహావాక్యలక్ష్యార్థమే రామశబ్దార్థము.

కౌసల్యాపుత్రునకు రాముడని నామకరణమును జేసినను నామైకదేశన్యాయముచే (అనగా నామములోఁ గొంతభాగమును జెప్పినను నామమంతయు జెప్పినట్లగు నను న్యాయముచే) శ్రీరాముడనియే వసిష్ఠునియాశయము. సత్యభామను భామయని పిలిచినట్లును, పరశురాముని, రాముడని పిలచినట్లును, బలరాముని, రాముడనినట్లును నిచ్చటఁగూడ రాముడనగా పై న్యాయముచే శ్రీరాముడనియే వసిష్ఠుని యాశయము- అట్లు కాకపోయినచో రాముడను నామము పూర్వమే పరశురామునకుండగ నా రామయను నామము కౌసల్యాపుత్రునకు బెట్టుటలో విశేషమేమియుండును- పైవిధముగనైతే "శ్రీ" అనగా లక్ష్మిచే) రాముడు) క్రీడించువాడు, అనగా వైకుంఠవాసుడగు లక్ష్మీపతియే యితడని తెలను(ఎట్లన) (పరశు) గండ్రగొడ్డలిచే (రాముడు) క్రీడించువాడుగాన పరశురాముడని యెట్లయ్యెనో "బల" (బలముచే) రాముడు, క్రీడించువాడుగాన బలరాముడనియెట్లయ్యెనో యటులనే "శ్రీ" (లక్ష్మిచే) రాముడు క్రీడించువాడు, అనగా లక్ష్మీపతియే యీరాముడని యభిప్రాయముతోనే వసిష్ఠుడు నామకరణమునుఁ జేసెను. పాద్మపురాణమునందు నవ్విధముననే చెప్పబడినది- (శ్రియః) లక్ష్మీదేవికి (రామః) రమణుడుగాన శ్రీరాముడను నామము పురాతనమైనదియు, సిద్ధమయినదనియు (చెప్పబడినది)

ఇచ్చట నొక యాశంక కలుగుచున్నది. (ఏమన) క్షత్రియులకు పండ్రెండుదినములు సూతకమనియుఁ బదుమూడవదినమున శుద్ధియనియు శ్రుతియందుఁ జెప్పఁబడియుండినందున పండ్రెండవదినమున నెట్లు నామకరణము చేయఁబడినదియనగా లక్ష్మణజననము

జ్ఞేయం - అత్రదశరథస్తు స్వపుత్రాణాం నామాన్య కృత్వా పురోహితేన కిమర్థం కారితవానితిచేత్, క్షత్రియాణాం నామ పురోధాఏవ కుర్యాదితి సంప్రదాయానుసారేణ వసిష్ఠ ఏవ కృతవా నిత్యలంపల్లవితేన.

ఇత్యాశ్చర్యరామాయణే దశమస్సర్గ స్సమాప్తః



మొదలుకొని యని తెలిసికొననగు-దశరథుడు పుత్త్రులకు నామకరణము లనుఁ జేయకుండగ వసిష్ఠునిచేఁ జేయించుటకుఁ గలకారణమేమనగా క్షత్త్రియులకు నామకరణమ్మనుఁ బురోహితుడే చేయవలయుననెడి సంప్రదాయానుసారముగా వసిష్ఠుడే నామకరణములనుఁ జేసెనని తెలియనగు- శాఖాచంక్రమణము చాలును.

పదియవసర్గము ముగిసెను.



## ఏకాదశసర్గ ప్రారంభః.

పా॥ పరమేశ్వరప్రశ్న శ్లో॥ కౌసల్యాజసుతాభ్యాం తు కిం తప్తం
తప ఉత్తమం । యత్తో హరి స్స్వయం జాత స్తయో
ర్వద మహాప్రభో॥ ౧
సుమిత్రా కైకయీ వాపి పూర్వజన్మని కేవర ।
ఇతి దేవ్యాఽనుయుక్తోఽథ ప్రాహ తాం శంకరప్రభుః॥ ౨
1 కశ్యపేన సదారేణ పుత్రార్థం తప ఉత్తమం ।
కృతం వర్షసహస్రం చ తత స్తుష్టో దభూద్ధరిః॥ 3
మత్తో వరం వృణీష్వేతి మునిం తం ప్రాహ వై హరిః॥ ౩½

ముని॥ పుత్రత్వం భజ దేవేశ త్రీణి జన్మాని చాఽచ్యుత
త్వాం పుత్రలాలనత్వేన భజామి పురుషోత్తమం॥ ౪½
ఇత్యుక్త స్తేన లక్ష్మీశః ప్రోవాచ సుమహాగిరా
భవిష్యతి మునిశ్రేష్ఠ యత్తే మనసి కాంక్షితం॥ ౫½
మమైవ చ మహాప్రీతి స్తవ పుత్రత్వహేతవే
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి తవాఽనఘ॥
ఏవం దత్వా వరం తస్మై తత్రైవాఽంతర్దధే హరిః॥ ౬-౭½
అస్యాఽభూత్ప్రథమం జన్మ మునే ర్వామనరూపిణః
కశ్యపోఽద్య త్వజసుతో జాత స్తస్యాఽద్య వై హరిః
పూర్వదత్తవరం స్మృత్వా రామత్వేనాఽవతీర్ణవాన్॥ ౮-౯

1. స్కాందే॥

## ఏకాదశసర్గప్రారంభము.

౧-౨ పార్వతీదేవి పరమేశ్వరునిగూర్చి యివ్విధముగఁ బ్రశ్నించెను- ఓపరమేశా! కౌసల్యాదిరాణులగర్భమున శ్రీహరి జన్మించుటకుఁబూర్వమునందు వారలిట్టి యుత్తమతపస్సునుఁ జేసిరో యనుగ్రహించి చెప్పుము. మఱియు సుమిత్రాకైకేయిలు పూర్వజన్మమున నెట్టి రోయాదినము నుఁ జెప్పుమని పార్వతి పరమేశునిఁ బ్రశ్నింపగా పరమేశ్వరుఁడు పార్వతితో నిట్లుచెప్పదొడగెను

౩½ ఓ ప్రేయసి! పూర్వమునందుఁ గశ్యపప్రజాపతి, భార్యాయుతుడై పుత్రార్థము బహుసంవత్సరములు, తపస్సు చేయగా వెయ్యసంవత్సరములు గడచిన పిమ్మట భగవంతుఁడగు శ్రీహరి, ప్రత్యక్షమై వరమునుఁ గోరుకొనుమని కశ్యపునిగూర్చి పలికెను.

౪-౫½ అప్పుడు కశ్యపుఁడివ్విధముగఁ జెప్పెను. ఓశ్రీహరి! మూడుజన్మములలో నాకుఁబుత్రుడవుకమ్ము. పురుషోత్తముఁడవగు నిన్ను బుత్రునిగాఁగోరి సేవించుచుంటిని యని చెప్పగా శ్రీహరియును గంభీరమగు వాక్యముతో నీయభీష్టము సిద్ధింపఁగలదని చెప్పెను.

౬-౮½ మఱియు భగవంతుఁడిట్లుఁ జెప్పెను. ఓకశ్యపుడా! నీకుఁబుత్రుండనుగాఁ బుట్టుటలో నాకును మిగుల సంతసమే యైయున్నది. సజ్జనులను రక్షించుటకును దుర్మార్గులను శిక్షించుటకును ధర్మసంస్థాపనమునకును నీకుఁబుట్టుదును. అని కశ్యపునకు వరమిచ్చి భగవానుఁడంతర్థానమయ్యెను.

౧౦-౧౧ ఈకశ్యపునకు మొదటిజన్మలో శ్రీహరి వామనుడుగాఁబుట్టెను. ఆకశ్యపుడే యిప్పుడు దశరథుఁడుగా జన్మించెను. ఆదశరథునకు, నిప్పుడు శ్రీహరి పూర్వమిచ్చిన వరమునననుసరించి రాముడుగా నవతరించెను.

కౌసల్యా సమభూ త్పత్నీ కశ్యపస్యాఽదితి స్తు సా
మాతృభావం హరే రద్య గతా పూర్వతపోబలాత్॥ ౧౦

సుమిత్రా కైకయీ పూర్వవృత్తాంతం వచ్మి సంశ్రుణు
వినతాయాం కశ్యపేన సంగతాయాం కదాచన
కద్రూ స్సమాగతా దృష్ట్వా వినతా మశప త్తదా
నియతే మమ కాలే త్వం యతో భర్త్రాఽసి సంగతా
తత స్తే గర్భగోళేఽ గ్నిసర్పా నూనం జనిష్యతః॥౧౨-౧౩

వినతా తద్వచ శ్శ్రుత్వా శాపం తస్యై దదౌ పునః
లోకే ఽపకీర్తి ర్భవతా చ్చాభ్వతీ తవ తామసి॥ ౧౪

ఏతస్మి న్సమయే జ్యేష్ఠా ఽదితి శ్చాఽగత్య తత్ర హి
వినతాపక్ష మాశ్రిత్య కద్రూ మేవ చుకోప తాం॥ ౧౫
అదిత్యాః పక్షమాశ్రిత్య పతిః కద్రూమదూషయత్॥౧౬

అథ కద్రూః కశ్యపం చాఽదితిం చాఽప్యశప దృషా
నరజన్మ యువాం భూమ్యాం భజతం సత్వరంత్వితి॥౧౭

౧౦ మఱియు పూర్వము కశ్యపునిభార్యయగునదితి యిప్పుడుకౌసల్యగా నయ్యెను కౌసల్య. పూర్వజన్మమునఁజేసిన తపోబలముచే శ్రీహరికి మాతృభావమునొందెను.

౧౧ ఓపార్వతి! శ్రీహరి, నిజాంశములతో సుమిత్రాకైకేయీల గర్భమున జన్మించుటకుఁగల వారలపూర్వజన్మచరిత్రమును జెప్పెదను వినుమని శంకరుడనియె"

౧౨-౧౩ కశ్యపునకు, దేవమాతయగునదితియు, గరుత్మంతునితల్లియగు, వినతయు, సర్పమాతయగు కద్రువు, మొదలగు భార్యలనేకముగ నుండిరి. వారలతో నొక్కొకదినమున నొక్కొకరితో నియమిత మునుఁజేసికొని కశ్యపుఁడు గ్రీడించుచుండును. ఇట్లుండ నొకదిన మున వినత, కశ్యపునితోఁగలసియుండగా. కద్రువనుభార్య, తత్సమ యమున నచటకువచ్చి చూచి వినతనిటుల శపించెను. ఓవినతా! నీవు, నాకు నియమితమగుకాలములో భర్తయైన కశ్యపుని తోఁ గలసినందున నీగర్భమునందు, నాగర్భమునందువలె సర్పమును, మఱియు, అగ్నిజ్వాలయును పుట్టుగాకయని శపించెను.

౧౪ వినత, యాకద్రువువాక్యమును విని, యాకద్రువుకుఁ దిఱిగిప్రతిశాప మిచ్చెను. (ఏమన) ఓతామసి! నీకు లోకమున శాశ్వతమైన యప కీర్తిగలుగుగాకయని"

౧౫ ఈసమయమునందుఁ గశ్యపుని జ్యేష్ఠభార్యయగు నదితి, యచటకువచ్చి వినతపక్షము ననుసరించి కద్రువునే కోపగించెను, కశ్యపుడును అదితిననుసరించి కద్రువునే దూషించెను.

౧౬ అప్పుడు కద్రువు,కోపముతో" వినతపక్షముగా మాట్లాడుచున్న తన సవతియగు నదితిని, అదితిపక్షమునవలంబించి తననుదూషించుచున్న తనభర్తయగు కశ్యపునిని" మీరుశీఘ్రముగ నరజన్మమునుఁబొందు డని శపించెను.

పశ్చాత్తాపయుతా కద్రూర్వినతా చ హరింప్రతి
స్వస్వశాపవిముక్త్యర్థం తేపతుః పరమం తపః। ౧౭
ఏవంబహుగతే కాలే ప్రాదుర్భూయ హరి స్తతః
తయో ర్ద్వయో స్సపత్న్యో శ్చదత్వా దర్శన మాహ సః
స్వస్వశాపో ఽచిరా న్నస్యా త్ఫలకారీ హ జన్మని॥
జన్మాంతరే ద్వయో గర్భభూత్వా ఽహం స్వాంశతః
పృథక్ । శాపం నివారయిష్యామి త్యజతం శాపజం
భయం॥ ౧౮-౧౯-౨౦
ఏవం దత్వా ఽభయంశ్రీశ స్తయో స్సద్య స్తిరోహితః
చిరాయ కశ్యపాంశేన జాతో దశరథో భువి॥
అదితి శ్చాభవ ద్దేవి కౌసల్యారూపతో ఽధునా॥ ౨౧
వినతాఽభవతాం కద్రూ ర్వ్యే సుమిత్రా ఽస్య కైకయీ
కద్రూశాపవశా త్తస్యా శ్శేషాంశో లక్ష్మణో ఽజని
సుదర్శనో ఽగ్నిరూపో ఽస్యాశ్శ త్రుఘ్నో ఽప్యభవచ్ఛివే ౨౨
కైకేయీ వినతాశాపాదకీర్తిం ప్రాప్స్యతే భువి॥ ౨౩
అపదానం తు తాసాం తే యత్పృష్టం చ త్వయా శివే
కథితం విస్తరా త్పశ్చాత్కథాం శృణు సమాహితా॥ ౨౪

ఇత్యాశ్చర్య రామాయణే బాలకాండే
ఏకాదశసర్గ స్సమాప్తః.

౧౪ కద్రువు పిదప పశ్చాత్తాపముకలదియై తనశాపవిముక్తికి శ్రీహరిని గూర్చి తపము చేయుచుండెను. వినతయు నా శ్రీహరినిగూర్చి శాప విముక్తికై గొప్పతపమునుఁజేసెను.

౧౫-౧౯-౨౦ ఇవ్విధముగ బహుకాలముగడచినపిదప శ్రీహరిప్రత్యక్షమై యా సవతులగు వినతాకద్రువులకు నివ్విధముగఁజెప్పెను ఓవినతా కద్రువులారా! మీ శాపములు వెంటనే యీజన్మమున ఫలకారులు కానేరవు. జన్మాంతరమున మీగర్భములందు స్వాంశములతో నేను వేర్వేఱుగజన్మించి మీశాపములను నివారింపఁజేయఁగల వాడను. శాపజన్యమగు భయమును మీరలువదలుఁడనియె.

౨౧ ఈప్రకారముగఁ బరమేశ్వరుడు వినతాకద్రువులకు వరములనిచ్చి యంతర్ధానమునొందెను. చిరకాలమునకు కశ్యపుడే దశరథుడుగా జన్మించెను. ఆ యదితియే కౌసల్యగాజన్మించెను.

౨౨-౨౩ ఓపార్వతి! ఆవినతాకద్రువులిర్వురును, క్రమముగా సుమిత్రా కైకేయులైరి. కద్రుశాపమువలన సుమిత్రాగర్భమునందు శేషాంశము తోలక్ష్మణుడును, అగ్నిరూపమగు చక్రాంశముతో శత్రుఘ్నుడు నుదయించిరి. కద్రువుయొక్క యంశముతోజన్మించినకైకేయియును. వినతాశాపమువలన నపకీర్తినిఁబొందెను.

ఓపార్వతి! కౌసల్యాసుమిత్రాకైకేయుల ముగ్గురిచరిత్రమును నీకు విస్తరించి చెప్పితిని. అనంతరకథను సావధానమనస్కురాలవైవినుమని పార్వతితోఁ బరమేశ్వరుడు చెప్పెనని సూతుడు శౌనకాది మహర్షులకుఁజెప్పెను.

---

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున, ఏకాదశసర్గముముగిసెను

---

## ద్వాదశసర్గ ప్రారంభః.

ఏకదా డోలికాయాం తు నిక్షిప్య స్వశిశుం ముదా
మహానసగతా దేవీ కౌసల్యా దేవమందిరం॥
గత్వా దేవం సమభ్యర్చ్య భక్ష్యభోజ్యాదికం బహు
నివేదనాయ సంస్థాప్య తతోఽగచ్ఛద్గృహాంతరం॥౧-౨
ఏతస్మిన్నంతరే బాలః భక్షయం స్తాన్యదృశ్యత
విస్మితా డోలికాం గత్వా తతోఽపశ్య త్స్వబాలకం।
ఏవం చ బహువారం సా గత్వా దృష్ట్వా ఉత్రి తత్రిచ
విభ్రిమా సా త్వభూ త్తస్యాః విశ్వరూపం ప్రదర్శయన్
మోహయిత్వా చ కౌసల్యాంతిరోభూత స్తతోహరిః3-౪

అథైకదా దేవతా స్తు బ్రహ్మాద్యా స్తం దిదృక్షవః
సరయూస్నాననామ్నా తే సమాజగ్ము శ్ఛలేవ హి॥ ౫

విమానేభ్యోఽవతీర్ణా స్తే స్నాత్వావాసాంసి పర్యధుః
తస్మిన్కాలే వసిష్ఠోఽపి విధేఃపార్శ్వం సమాగతః॥
అనామయం పర్యపృచ్ఛదాజ్ఞో రామస్య సర్వశః॥ ౬

వసిష్ఠః॥ యేషాంకుశలకామోఽసి భవ్యంతేషాంతువిద్యతే॥

ఆగమిష్యతి రాజాఽపిపుత్రైస్సా మభినందితుం॥ ౭

## ద్వాదశసర్గ ప్రారంభము.

## రామలీలా ప్రారంభము.

౧-౨ ఒకప్పుడు కౌసల్యాదేవి శిశువుగానుండిన రాముని నుయ్యాలలో బరుండబెట్టి నిద్రపుచ్చి వంటయింటిలోనికివెళ్ళి పాకమును సిద్ధము నుంజేసి. దేవతాగృహమునకువెళ్ళి, దేవునకు షోడశోపచార పూజలుచేసి భక్ష్యభోజ్యాదులను నివేదనముచేయుటకు నచ్చటనుంచి వంటయింటిలోనికివెళ్ళి తిరిగివచ్చెను.

౩-౪ప ఈసమయమున శిశురూపుడుగానున్న రాముడు నివేదనమునకై దేవతాగృహమునందుంచబడిన భక్ష్యభోజ్యాదులనన్నిటిని భక్షించుచుండెను. కౌసల్య, యాశ్చర్యమునొంది, యుయ్యేలలో బరుండబెట్టిన బాలుడిచ్చటికెటులవచ్చెనని యూయలదగ్గరకువెళ్ళి చూడగా నుయ్యాలయందును బాలుడుండెను. భ్రాంతినొందితి నేమోయని యనేకపర్యాయములువెళ్ళి యచ్చటనిచ్చటనుగూడ శిశువునుజూచి కౌసల్య విభ్రమమును జెందియుండ నాశిశువు దివ్యరూపమును జూపి వెంటనే యంతర్ధానమొందెను.

౫-౬ప అనంతరమొకానొకప్పుడు, బ్రహ్మాదిదేవతలు రామచంద్రమూర్తిని జూడదలచి సరయూనదిలో స్నానముచేయుటకనే నెపముతో బయలువెడలి యయోధ్యకువచ్చి తమతమ విమానములనుండిదిగి సరయూనదిలో స్నానముచేసి వస్త్రములనుధరించుచుండగ, వసిష్ఠమహర్షి బ్రహ్మసమీపమునకువచ్చెను. అప్పుడు బ్రహ్మదేవుడు దశరథతత్పుత్రుల క్షేమసమాచారముల నడిగెను.

౭ప వసిష్ఠుడు బ్రహ్మతోనిట్లుచెప్పెను. తండ్రీ! నీవెవరి క్షేమమునుం గోరుచుంటివో వారలందఱును క్షేమముగానేయుండిరి. దశరథుడును మీరలు వచ్చినారని తెలుసుకొనినహేతువుచే మిమ్ములను గౌరవించుటకుం దనపుత్రులతోంగూడ నిచటకురాగలడనియె.

బ్రహ్మా॥ అహమేవాఽగమిష్యామి గృహం రాజ్ఞో మహాత్మనః
దేవైస్సహామునేయాహి బ్రూహి బ్రూహి మమాజ్ఞయా॥ ౮

రామో నారాయణస్సాక్షాత్ మమోపాస్యస్సదా ద్విజ
ఏవం సజ్ఞాయతే పుత్ర త్వయా కిం మమ చోచ్యతే॥ ౯
సంగోపనీయ్యమస్మాభిః రామతత్త్వాంచ సాంప్రతం
వసిష్ఠం ప్రేషయిత్వా తే రాజగేహం గతాస్తతః॥ ౧౦

ప్రణనామ మహారాజో బ్రహ్మాణం చ సురాంస్తథా
పాదయోః పాతయామాస రామచంద్రంచ వేధసః॥ ౧౧

రాజానం వర్ధయిత్వా తు రామంచాఽంకేన్యవేశయత్
ఏతస్మిన్నంతరే తత్ర నారదోఽపి సమాగతః॥
జనకాంకగతం రామం దృష్ట్వా వినయసంయుతః
తుష్టావ పరయా భక్త్యా మానసే ధ్యానమాస్థితః॥ ౧౨-౧౩
* జ్ఞానానందం జ్ఞానగమ్యం జ్ఞానరూపం సనాతనం
కారణం భుక్తిముక్తీనాం నరకార్ణవతారకం॥ ౧౪

నారదోపి మహాయోగీ విరక్తానాం శిరోమణిః
పస్పర్శ బాలం పాణిభ్యాం రక్షావ్యాజేన మస్తకం॥ ౧౫

ధాతాఽపి పునరుత్థాయ రక్షార్థం బాలకస్య చ
చతుర్భిర్వదనైస్తాత తాతతాతేత్యువాచ హ॥ ౧౬

౮॥ బ్రహ్మ వసిష్ఠునితో నిట్లనియెను ఓపుత్రా! నేనే దేవతలతోఁ గూడ దశరథునిగృహమునకు వచ్చెదనని నాయానతిచే వానితోఁ జెప్పుము.

౯॥-౧౦॥ పుత్రా! రాముడు సాక్షాన్నారాయణమూర్తియని యెఱుగుము మఱియు నేను సేవింపవలసినవాడనని నీకుఁ దెలియదా! నీవు నాకు జెప్పవలయునా! కాని, రామచంద్రతత్త్వమును మన మెప్పుడు వెల్లడిచేయఁగూడదని బ్రహ్మదేవుడు వసిష్ఠునితోఁ జెప్పి యమ్మునిని ముందుగా దశరథుని గృహమునకుఁ బంపి దేవతలతోఁ గూడ, రామునిఁ జూచుటకు దశరథునిగృహమునకు వచ్చెను.

౧౧॥ మహారాజగు దశరథుడు సంతోషముతో బ్రహ్మాదిదేవతలకు నమస్కరించి బాలుడుగానున్న రామునిచే బ్రహ్మపాదములకు నమస్కరింపఁ జేసెను.

౧౨॥-౧౩॥-౧౪॥ బ్రహ్మయు, దశరథునాశీర్వదించి రామునిఁ దనతొడయందు గూర్చుండబెట్టుకొని ముద్దులాడుచుండగా నీసమయమున నారదుడును వచటకువచ్చి, తనతండ్రియగు బ్రహ్మచే, లాలింపఁబడుచున్న రామునిఁ జూచి సచ్చిదానందరూపుడును, జ్ఞానవేద్యుడును, సనాతనుడును, భుక్తిముక్తికారణుడును, నరకోద్ధారకుడు, నగురామచంద్రుని మనస్సులో పరమభక్తితో ధ్యానించెను.

౧౫॥ దేవర్షియగు నారదుడు వైరాగ్యవంతులలో నుత్తముడయ్యును. రాముని దివ్యసౌందర్యమునుఁ జూచి మోహితుడై యెత్తుకొనవలెనని తలంపుగలిగి రక్షయనెడిమిషచే బాలునిశిరస్సును చేతులతో స్పృశించెను.

౧౬॥ బ్రహ్మదేవుడును తిరిగిలేచి బాలరక్షయనెడిమిషచే నాలుగుముఖములచే తాత, తాత, తాత, తాత యనుచు బాలుని దనయొద్దకుఁ దీసికొని ముద్దులాడుచుండెను.

ఏవం చ నిఖిలా దేవాః స్పృష్ట్వా తం బాలకం పునః
అహోరాఘవ తే రూపమిత్యాశ్చర్యం గతాశ్చ తే॥
దేవాబ్రహ్మాదయస్సర్వేస్వంస్వంస్థానంగతాశ్చ తే॥౧౭-౧౮

భిక్షురూపధరశ్శంభు రాయయౌ రాఘవాంతికం

దృష్ట్వా శిశుంరాఘవం తం బ్రహ్మానందగతోఽవ్రజత్ ॥౧౯

ఆశ్చర్యరామాయణే బాలకాండే
ద్వాదశసర్గ స్సమాప్తః.



౧౭-౧౮ ఇవ్విధముగ బ్రహ్మాదిదేవతలందఱును, బాలకుని స్పృశించి ముద్దులాడి, రామచంద్రునిరూపమునకాశ్చర్యము నొందుచుఁ దమతమ స్థానములకేగిరి.

౧౯ శివుడు భిక్షురూపముధరించి రామునియొద్దకువచ్చి దివ్యమంగళ విగ్రహమునుఁజూచి సంతోషించి యతనిగుణములను గొనియాడుచు కైలాసమునకేగెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున

ద్వాదశసర్గము సమాప్తము.



త్రయోదశసర్గప్రారంభః.

తస్మిన్కాలే నారదస్తు లంకాం గత్వా దశాననం
దృష్ట్వా సన్మానితస్తేన విశేషాం స్తన్ముదే ఽవదత్॥ ౧

కౌసల్యాయాం దశరథాజ్జాత స్తే మారకో హరిః
రామనామ్నా రఘోర్వంశే జాగృహి త్వం దశానన॥
ఇత్యుక్త్వా దేవలోకం తు గతవాన్నారదోమునిః॥ ౨
దశాననో ఽథ తం రామం పరీక్షితుమనా ద్రుతం
భిక్షురూపేణ చాగత్య రుదంతం వీక్ష్య రాఘవం
నినింద నారదమునిం స్తావకో ఽనృతవానితి॥ ౩-౪

భిక్షురూపం దశాస్యం తం జ్ఞాత్వా రామ స్తదాపునః
స్వమాయయా మోహయితుంఅరుదత్ప్రాకృతో యథా॥౫
తాదృశం బాలకం రామం మత్వా సామాన్యబాలకం
దశాననో ఽథ. గతవాన్ లంకాం మాయావిమోహితః॥౬
రామరూపేణ భగవా నవతీర్ణ స్సతాం ముదే
ధర్మసంస్థాపనాయేతి మునయో ద్రష్టు మాగతాః
దృష్ట్వాతదద్భుతంరూపంగాయ న్తస్స్వాశ్రమంయయుః౭-౮

నరభావం దశాస్యస్య స్వపిత్రో స్సుతభావనాం
మునీనాం దివ్యరూపం చ దర్శయన్రాఘవో ఽప్యభూత్ ౯॥

## త్రయోదశసర్గ ప్రారంభము.

౧ శ్రీరామచంద్రమూర్తి జననానంతరము నారదుడు, లంకాపురికేగి రావణునిఁజూచి యతనిచే సన్మానింపఁబడి విశేషములేమియని యడుగబడి వానిసంతసమునకై కొన్నివిశేషములనుఁ జెప్పనారంభించెను.

౨-౪ ఓరావణుడా! శ్రీహరి నిన్నుజంపుటకు రఘువంశమున దశరథునకుఁగౌసల్యయందు రాముడనుపేరుతో జన్మించెను. కాన నీవు జాగ్రతగా నుండుమనియెను. ఇవ్విధముగ నారదుడు రావణునితోఁజెప్పి దేవలోకమునకేగెను.

౩-౮ అనంతరము రావణుడు శ్రీరామునిఁ బరీక్షించుటకు వెంటనే భిక్షురూపముతో దశరథునిగృహమునకువచ్చి తననుఁజూచి యేడ్చుచున్న యాశిశురూపుడగు రామునిఁజూచి నారదమహర్షి మూలకముగ వ్యర్థముగవచ్చితినని యనుకొనుచు, స్తోత్రపాఠకుడనియు వన్యతవాదియనియు నారదుని నిందించెను.

౫ (వాస్తవికమేమనగా") బాలుడగురాముడు భిక్షురూపముతోరాగా వానిని, రావణుడని తెలిసికొని తనమాయచే వానిని మోహింపఁజేయుటకు సామాన్యశిశువువలె నేడ్చుచుండెను.

౬-౪ అవ్విధముగ నేడ్చుచున్న బాలకుడగురాముని సామాన్యబాలకునిగఁదలచి మాయామోహితుడై తన లంకాపట్టణమునకేగెను.

౭-౦ భగవంతుడగు శ్రీహరి శిష్టరక్షణమునకై ధర్మస్థాపనమునకై రామరూపముగ నవతరించెనని మునులు తెలిసికొని రామదేవునిఁజూచుటకువచ్చి రామచంద్రుని దివ్యమంగళవిగ్రహరూపమునుఁజూచి రామునిగుణములనుఁ గొనియాడుచు బ్రహ్మానందమునొంది తమయాశ్రమములకేగిరి.

౬ రామచంద్రమూర్తి తనదర్శనమునకువచ్చిన మహర్షులకుఁ దనదివ్యరూపమునుఁజూపి యానందింపఁజేయుచుఁ దనమాతాపితృవులకుఁ బుత్రభావమునేచూపుచు రావణుడు పరీక్షార్థమై వచ్చినపుడు సామాన్యమానవశిశురూపముఁజూపుచుండెను.

పురస్త్రీయ స్సమాగత్య దృష్ట్వారామం మనోహరం
శ్లాఘయంత్యో౽గతాకాశ్చిత్కౌసల్యానియతింముహుః౧౦
శాయయిత్వా చ డోలాయాం లాలయిత్వా చ కాశ్చన
రామంశిశుంహ స్తతాళైర్మోదమానాయయుః స్త్రియః౧౧

సర్వథా జలసంస్థం స్వం దేవ మంతఃపురస్త్రియాం
జలేన స్నాపయంతీనాం శ్రమం దృష్ట్వా జహాస సః॥౧౨

రామః క్రీడ న్మాతు రంకం గత్వా స్తన్యం పిబం స్తదా
ఊం,శబ్దేనచ భ్రాతౄణాం స్తన్యం దేహీత్యబోధయత్ ౧౩

మకర్యా వశగో భూత్వా౽వా౽వే తి రుదితం గజం
పురారరక్షయో దేవ్యో౽ద్యా౽వా౽వేతిరురోద సః॥౧౪

స్తన్యపానస్య కాలే౽పి సాపత్నీ మాతృమందిరం
నయేతి సంజ్ఞాం కృత్వా వైరురోదా౽జసుతాత్మజః॥౧౫.

ఆశ్చర్యరామాయణేః బాలకాండే త్రియోదశసర్గ
స్సమాప్తః.

---

౧౦-౧౧ పురస్త్రీలు కొందఱు వచ్చి లోకాభిరాముడగు రామునిఁజూచి యానందించి కౌసల్యాదేవియొక్క పూర్వపుణ్యమునుఁ గొనియాడుచు వెళ్ళుచుండిరి. మఱియుఁగొందఱు స్త్రీలు వచ్చి రాముని నుయ్యలలోఁబరుండబెట్టి కరతాళధ్వనులుచేసి యాడించి సంతోషించుచు వెళ్ళుచుండిరి.

౧౨ ఎల్లప్పుడును జలమున శయనించెడిదేవుడగు తనను నంతఃపుర స్త్రీలు జలముచేస్నానమునుఁ జేయించుచుండగా వారిశ్రమనుఁ జూచి యాశిశురూపముతోనున్న రాముడు నగుచుండెను.

౧౩ రాముడు విలాసముగ నాడుకొనుచు తిరిగి తల్లియొక్క తొడమీదఁ గూర్చుండి స్తన్యపానమునుఁజేయుచు, తనసోదరులకుఁగూడ స్తన్యమునీయుమని ఊ, ఊ,, యని సంజ్ఞను జేయుచుండెను.

౧౪ పూర్వము మొసలిచేఁబట్టుకొనఁబడి కావుకావుమని రోదనముఁ జేసినగజేంద్రుని నే దేవుడు రక్షించెనో యా దేవుడగు రాముడు కావుకావుమని యేడ్చుచుండెను.

౧౫ శిశురూపుడగు రాముడు స్తన్యపానముఁజేయుకాలమునను సవతితల్లి యింటికిఁ దీసికొనివెళ్ళుమని సంజ్ఞజేసి యేడ్చుచుండెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున, పదమూడవసర్గము

సమాప్తమయ్యెను.

---

## చతుర్దశసర్గ ప్రారంభః.

* కాకో నామ్నా భుశుండ స్తు కదాచి చ్చాఽజగామ సః
రామభక్తాగ్రణీ రేత్య రామం తం సందదర్శ హ॥ ౧

రామం శష్కులిహ స్తం తం ఖాదంతం చ పునః పునః
తం దృష్ట్వా బాలకం కాక ఇతి సందిగ్ధమానసః
కథ మేష పరం బ్రహ్మ వేదేన పరిగీయతే॥ ౨

ఇతి సందిహ్య మనసా రామహస్తా చ్ఛ శష్కులీం
ఆకృష్య రభసోడ్డీనో రామో మాం కిం కరిష్యతి॥ ౩

సర్వాత్మా రామచంద్రోఽపి తస్య విజ్ఞాయ మానసం
యత్ర యత్ర భుశుండోఽపి తత్ర తత్ర రఘూద్వహః॥ ౪

రామం నిశామ్య కాకోఽపి శమనస్య గృహం గతః
అంతకో రామచంద్రస్య పురతో భాతి దండధృత్॥ ౫

---

* కాకభుశుండో నామ పురా కశ్చనమహర్షిః "హేత్వంత రేణ కస్యచి న్మహర్షేశ్శాపా త్కాకోఽభవత్" తథాపి రామభక్తాగ్రిణీ రనేకకల్పేభ్య స్తిష్ఠతీత్యనేకరామావతా రపారదృశ్వేతి చ వాసిష్ఠరామాయణే దరీదృశ్యతే.

## చతుర్దశసర్గ ప్రారంభము.

* ౧ రామభక్తాగ్రేసరుడగు కాకభుశుండుడు రామచంద్రునిఁజూచుటకు వచ్చి రాముని సందర్శించెను.

౨-౩౫ బాలుడగు రాము డప్పుడెట్లుండెననగా చక్కిలము నోటిలోపెట్టుకొనిఁ దినుచుండెను. చక్కిలమునుఁ దినుచుండిన యారామునిఁ గాకభుశుండుడు చూచి యితడెట్లు వేదవేద్యుడగు పరబ్రహ్మమగునని సందేహము కలిగి, యీరాముడు నన్నేమిచేయునో చూచెదనని వాని చేతిలోని చక్కిలమును లాగుకొని పైకి యెగిరి పారిపోవుచుండెను.

౪౫ సర్వాంతర్యామియగు, రామచంద్రుడును కాకభుశుండుని మానసమునుఁ దెలుసుకొని, కాకభుశుండుడు పారిపోవుచుండగాఁ దానును వెంబడించి యదలించుచుండెను.

౫౫ కాకభుశుండుడును తనను వెంబడించుచువచ్చుచున్న రామునిఁజూచి భయపడి యమునిగృహమునకేగెను అచ్చటను రామచంద్రమూర్తి సింహాసనమునందుండెను. యముడారామునిముందు దండధరుడై నిల్వబడియుండెను.

---

౧ * కాకభుశుండుడును పూర్వమొకమహర్షియై యుండెను కాని కారణాంతరముచే మఱియొకమహర్షిచే కాకియగునట్లు శపింపబడెను. ఆకారణమువలన కాకిరూపముతోనుండెను. అట్లయ్యును రామభక్తిగలవాడును ననేకకల్పములనుండి యున్నవాఁడును, అనేకరామావతారములనుఁ జూచినవాడని వాసిష్ఠరామాయణమునఁ జెప్పబడినది.

శూలినో నగరం గత్వా రామం దృష్ట్వాఽతి వేగతః
ఉత్పపాత తత శ్చోర్ధ్వం స్వర్గలోకాయ వాయసః॥
తత్రఽహా గ్రే హి గచ్ఛంతం బాలకం సందదర్శ సః॥
సత్యలోకం మనశ్చక్రే గంతుం కాకో భుశుండకః
తత్ర గత్వా శిశుం రామ మజపార్శ్వే దదర్శ సః॥ ౬-౭-౮
స్వయం తు పర్వతాకారో దీర్ఘతుండో భయానకః
తదా రామో మహాతేజాః తార్క్ష్యం సస్మార వాహనం॥ ౯
స్మరణా ద్రామదేవస్య సంప్రాప్తో వినతాసుతః
ఖగాధిపం సమారుహ్య రామో ధావతి వాయసం॥ ౧౦
గరుడేన పునః కాకః పాతితః పృథివీతలే
భుశుండోఽపి భయావిష్ట స్తోతుం సముపచక్రమే॥ ౧౧
నమ ఆద్యాయ బీజాయ శుద్ధాయ పురుషాయ తే
దర్శనార్థం మహిమ్న స్తే శిష్యాల్యాకరణంకృతం॥ ౧౨
అహో భాగ్యం హి మే భూరి పాదస్పర్శో హి తే కిల
ముచ్యతాం ముచ్యతాం రామ దీనోఽహం కరుణానిధే
ఇతి విజ్ఞాపితో రామః భుశుండం ముముచే ప్రభుః॥ ౧౩-౧౪

ఆశ్చర్యరామాయణే చతుర్దశసర్గ స్సమాప్తః

౬-౭-౮ అక్కడనుండి కాకభుశుండుడు కైలాసమునకు వెళ్ళుచుండగా నచ్చటను రాముడుండెను. అక్కడనుండి పైభాగమున స్వర్గమునకేగెను. అచ్చటను తనకు ముందుభాగమున నడచుచున్న రామునిం జూచి దిగ్భ్రమము జెంది సత్యలోకమునకు వెళ్ళగా. నాలోకమునందు బ్రహ్మదేవుని పార్శ్వమున రాముడు కన్పడెను

౯ అప్పుడు కాకభుశుండుడు పర్వతాకారమునుధరించి పొడుగైన ముక్కుగలిగి భయంకరాకారుడై పరుగిడుచుండగా మహాతేజస్సు గల రాముడును తనవాహనమగు గరుడుని స్మరించెను.

౧౦ గరుడుడు రాముని స్మరణమాత్రము చేత రాగా గరుడునెక్కి రాముడు కాకభుశుండుని వెంబడించెను గరుడుడు కాకభుశుండునిం దన పాదములతోం దన్నిపడవేయగా కాకభుశుండుడప్పుడు భయమంది రామచంద్రుని స్తోత్రముచేసెను.

౧౧ ఓరామచంద్రప్రభూ! నీవు సమస్తజగత్కారణభూతుండవనియు పరమపురుషుడవనియు లోకములకాదిభూతుడవనియు నిష్కలంకుడవనియు నెఱిగితిని-అట్టినీకు నమస్కారము. నీమహిమనుంజూడగలందులకు నీచేతిలోనిచక్రమును నేను లాగుకొని పరుగిడితిని.

౧౨-౧౩-౧౪ ఓహో! నీపాదస్పర్శము నాకయ్యెను. ఏమి నాభాగ్యము. రామప్రభో! నేను దీనుడను నీవుకరుణానిధివి నాతప్పును మన్నించి నన్ను విడిచిపెట్టుము విడిచిపెట్టుము, అని కాకభుశుండుడు తననుం బ్రార్థింపగా రాముడు కరుణించి తనభక్తుడగు కాకభుశుండుని విడిచెను.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమునం బూర్వభాగమున పదునాల్గవసర్గము ముగిసెను.

---

## పంచదశసర్గప్రారంభః

రాజా దశరథో రామం శ్యామసుందరవిగ్రహం
పాదయో స్స్వర్ణకటకం దధానం మణినూపురం॥ ౧
కంఠాభరణసంయుక్తం ముక్తాహారవిరాజితం
కరయో ర్వలయద్వంద్వం దధానం చాఽంగదే భుజే॥ ౨
తథా వ్యాఘ్రనఖం చోరఃస్థలేస్వర్ణపరిష్కృతం
గజముక్తాం చ నాసాయాం కర్ణయోః కుండలే శుభే॥ ౩
అలకై రావృతముఖం బిందునా చాఽంజనేన చ
ఈదృశంబాలకం చాఽంకే నివేశ్యాఽనందవాంస్థితః॥ ౪
ఏతస్మి న్నంతరే దేవగంధర్వా స్తు సమాగతః
స్త్రియో దశరథస్యాఽపి స్వస్వపుత్ర సమన్వితాః
తేన గానం కారయిత్వా ముముచు స్సకలా స్తదా॥ ౫
కించిత్కాలం తు గంధర్వః గానం కృత్వా దివం పునః
గంతుకామోఽభవ త్తే చ బాలకా రురుదుర్ముహుః॥ ౬
తదా తం కైకయీ క్రుద్ధా వాక్య మేత దువాచ సా
బాలకా న్మోహయిత్వా నః కుత్ర యాస్యసి కైతవ॥
ఇంద్రోఽస్మాకం గృహే గాతుం త్వాంనిషేత్స్యతినోకదా।
తథాకుర్యా ద్యది మదా త్పీడితోఽథః పతిష్యతి॥
అథసా బాణ మానీయ ప్రక్షిప్య నృపతేః పురః
బాణేపత్రం సమావేష్ట్య చేంద్రలోకం చ ప్రేషయ॥
గంధర్వోఽత్రయథా తిష్ఠేత్ తథా కుర్యాచ్ఛ వృత్రహా॥
౭-౮-౯-౧౦

## పంచదశసర్గ ప్రారంభము.

౧-౨-౩-రపాదములయందు బంగారపుకడియములును, మణులగజ్జెలును, కంఠమునందు ముత్యాలహారములు చేతులయందు గంకణములు, బాహువులయందు బుజబందులు, వక్షస్థలమునందు బంగారపుపులిగోరు, ముక్కున మంచిపెద్దముత్యము, కర్ణములయందు గుండలములు, ముఖమున ముంగురులు, కస్తూరీతిలకమును, ఈమొదలగునాభరణములచే నొప్పుచు దివ్యమంగళవిగ్రహము గలిగియున్న రామునిఁ దన తొడమీద గూర్చుండబెట్టుకొని యొకదినమున దశరథుడు సంతోషముతో నుండెను.

౪-౫ అట్టిసమయమున నింద్రలోకమున గానముచేయు నొకగంధర్వుడు దశరథునిగృహమునకు రాగా దశరథపత్నులుమువ్వురును తమపుత్రులతో గూడినవారలై యాదేవగంధర్వునిచే సంగీతమును బాడించి యందఱును సంతోషించిరి

౬-౭ అనంతరము దేవగంధర్వుడు కొంతకాలము సంగీతమునుఁబాడి వెళ్ళబోవగా బాలురు, సంగీతమును జాలించిన కారణముచే నేడ్వనారంభించిరి.

౮-౯-౧౦ అప్పుడు కైకేయి కోపించినదై దేవగంధర్వునితో నిట్లుపలికెను; ఓధూర్తుడా! మాపిల్లలను నీసంగీతముచే మోహింపజేసి, యెచ్చటకువెళ్ళెదవు,, మాప్రభువగు దేవేంద్రుడైనను మాగృహమునందు నీవు గానముచేయుటకు యెప్పుడును నడ్డుపెట్టడు. ఒకవేళ మదముచే నతఁడు నిషేధించినచో నధఃపతితుఁడు కాగలడని దేవగంధర్వునితో కైకేయిచెప్పి యానంతరము ధనుర్బాణములనుఁదెచ్చి దశరథునిముందుంచి, యోనాథా! దేవేంద్రుడీగంధర్వు నిచటనుండునట్లు చేయవలసినదిగా నొకయుత్తరమునువ్రాసి, బాణమునకుఁ జుట్టి యింద్రునిసమీపమునకుఁబంపుము (ఈవిధముగ కైకేయి దశరథునితోజెప్పెను.)

వాక్యం రాజ్ఞ్యా స్సమాశ్రుత్య తథా చక్రే చ తద్వశః
శక్రస్యచ పపాతాఽగ్రే సురాణాంపశ్యతాం చ సః
బాణాత్తరం విలోక్యాఽశు దూత మప్రేషయ చ్చ సః॥౧౧౪

అయోధ్యా మాగతో రాజ్ఞా ప్రాహ దూతో శచీపతేః౧౨
సర్వేత్వదీయ్యాగంధర్వా దేవా శ్చాఽపి మహాప్రభో
యదివాఽజ్ఞా భవే ద్రాజన్ ద్వారపాలా భవేమహి
ఇతి త్వయా వదేత్యద్య ప్రేషయామాస మాం పునః॥౧౩౪

ఇత్యుక్త్వా దేవదూతోఽపి దివం గత్వాఽవదచ్చ తం
బాలకాన్లాలయ న్నాస్తే గంధర్వ స్తు తదాజ్ఞయా॥౧౪౪

అథ క్రీడంతి తే సర్వే మాతృభిః పరిరక్షితాః
శ్రీరామో బాలరూపేణ భ్రాతృభి స్సహ సుందరః
జానుభ్యాం సహపాణిభ్యాం ప్రాంగణే విచచారహ॥౧౫-౧౬

రత్న స్తంభేషు మత్వా స్వం ద్వితీయం ప్రతిబింబితం
తస్యాఽననే స్వం సంయోజ్య చోచ్చైః కూజతిరాఘవః॥౧౭

జలపాత్రే రాఘవ స్తు చంద్రబింబం విలోక్యసః
గ్రహణే తస్య హస్తం తు జలే చ కురుతే ప్రభుః॥ ౧౮

౧౧॥ దశరథుడు కైకేయియొక్క వాక్యమును విని యవ్విధముగ పత్రికనువ్రాసి బాణమునగట్టి యాబాణమునువిడువగా నాబాణమువెళ్ళియింద్రునిసమీపమున దేవతలు చూచుచుండగఁ బడెను. ఇంద్రుడును బాణమునకుఁజుట్టబడిన పత్రికలోని సమాచారమునుజూచి వెంటనే దూతను దశరథుని సమీపమునకుఁబంపెను.

౧౨-౧౩॥ దేవేంద్రునిదూతయును శీఘ్రముగ నయోధ్యకువచ్చి దశరథునితో దేవేంద్రునివాక్యములను జెప్పెను. ఓరాజా! దేవతులు గంధర్వులు మేమందరము నీపరిచారికులము నీయాజ్ఞయైనచో ద్వారపాలకులుగకూడ నుండెదమనియు దేవగంధర్వుని నిచ్చట నేయుంచుకొనుమనియు మాదేవేంద్రుడు మీతో జెప్పుమని నన్నుబంపెను. (అని దేవదూత దశరథునితోఁజెప్పెను)

౧౪॥ ఇవ్విధముగ దేవదూత దశరథునితో జెప్పి స్వర్గమునకువెళ్ళి యావద్వృత్తాంతమును దేవేంద్రునితో జెప్పెను. ఇంద్రునియాజ్ఞాప్రకారము దేవగంధర్వుఁడును గానముచేయుచు బాలకులనుసంతోషపెట్టుచు దశరథుని గృహమునందే యుండెను.

౧౫-౧౬ అనంతరము బాలురందఱు తమతల్లులచే రక్షింపఁబడుచు నాడుకొనుచుండిరి. సుందరుడైన శ్రీరాముడు బాలరూపముతోఁదన సోదరులతోఁగూడ మోకాళ్ళతో ప్రాకుచుఁ జేతులతో దేకుచు ముంగిలియందు విహరించుచుండెను.

౧౭ రామునకు రత్నవికారమైన స్తంభములయందుఁదన ప్రతిబింబమునుఁజూచి యాప్రతిబింబమునందు ముఖమునుంచి బిగ్గరగా కేకవేయుచుండెను.

౧౮ శ్రీరామునకు జలపాత్రయందుఁ బ్రతిఫలించిన చంద్రబింబమునుఁజూచి దానినిఁబట్టుకొనుటకుఁ దనహస్తమును నీటిలో బెట్టుచుండెను.

పంజరస్థం శుకం దృష్ట్వా కురుతే తత్ర తర్జనీం
సారికా యత్ర రణతి కర్ణం దత్వా శృణోతి సః॥ ౧౯
రామచంద్రం తు కౌసల్యా చాలనం శిక్షతే ముహుః
రామస్య దక్షిణం బాహుం పాణినా గృహ్య భామినీ॥ ౨౦
మాతృపాణిం సమాలంబ్య మందం మందం చచాల స ॥ ౨౦౪

కౌసల్యా తస్య రామస్య దంతపంక్తిం నిరీక్ష్య సా
కుందముక్తాసమాకారాం జిహ్వాం బంధూకసన్నిభాం॥ ౨౧౪
ఓష్ఠం సిందూరసంకాశం కపోలౌ చేంద్రనీలభౌ
తిలకం మృగనాభస్య ముఖే వీక్ష్య ముమోద సా॥ ౨౨౪
లక్ష్మణో రామచంద్రేణ శత్రుఘ్నో భరతేన చ
ద్వంద్వీభూయ చరంతౌ తౌ పాయసాంశానుసారతః॥ ౨౩౪
ఇంద్రనీలనిభో రామః చిక్రీడే బాలకైః సహ
కందుకం చ కరే గృహ్య వీథీం వీథీం చ సంచరన్
ఉచ్చాల్య కందుకం ప్రోచ్చైః బిభర్తి స్మ స్వపాణినా
దూరే నిక్షిప్య వేగేన పతంతం ధావతి ద్రుతం
గృహీత్వా కందుకం వేగాత్ శీఘ్రం రామాయ చార్పయన్
కోలాహలం తు బాలానాం శృణ్వంతి జనతాస్తదా
౨౮-౨౯-౨౬౪

క్రీడిత్వా నగరే బాలాః పునరాయాంతి బాలకాః
తదా బాలాశ్చ తే సర్వే ప్రాతరుత్థాయ వై పునః
రామస్యనికటే సర్వే సమాయాంతి స్మ నిత్యశః॥ ౨౭_౨౮

౧౯ పంజరములోనున్న చిలుకనుఁజూచి రాముడు యాపంజరములోఁ దనవ్రేలినిఁ బెట్టుచుండెను. గోరింక, మధురముగ ధ్వనిచేయగాఁ జెవినుంచి రాముడు వినుచుండెను

౨౦ కౌసల్య, రామునికుడిచేతినిఁ దనహస్తముచే గ్రహించి నడకను మాటిమాటికి నేర్పుచుండెను.

౨౦½ రాముడును తనతల్లిచేతి నాధారముగాఁ జేసికొని మెల్లమెల్లగ నడచుచుండెను.

౨౧-౨౨½ మల్లెమొగ్గలవలెను ముత్తెములవలెను నొప్పుచున్న రాముని దంతపంక్తిని, బంధూకపుష్పములవలె నెఱ్ఱగానున్న రామునినాలుకను, గంగసిందూరముతో సమానముగానున్న పెదవిని, ఇంద్రనీలముతో సమానమైనకాంతిగలిగియున్న చెక్కిళ్ళను, రాముని ముఖమునందలి కస్తూరితిలకమును కౌసల్య చూచి యానందము నొందుచుండెను.

౨౩½ లక్ష్మణుడు రామునితోడను శత్రుఘ్నుడు భరతునితోడను ప్రాయసాంశానుసారముగ జంటలుగా సంచరించుచుండిరి.

౨౪-౨౫-౨౬½ ఇంద్రనీలమణితో సమానమైన యాకారముగల రామచంద్రమూర్తి, బాలురతోఁగూడ నాడుకొనుచుండెను. బంతినిఁ దనచేతితోఁబట్టుకొని ప్రతివీధినిసంచరించుచు బంతిని నొకప్పుడు పైకియెగఱవేసి తనచేతితో దానినిఁబట్టుకొనుచు నొకప్పుడుబంతిని దూరముగావిసరి క్రిందపడుచున్న బంతినిఁబట్టుకొనుటకుఁ దానుగూడ వేగముగఁబరుగిడుచునుండెను. మఱియుఁరామునిచే నెగఱవేయబడినబంతిని బాలురు పట్టుకొనివచ్చి రామునకిచ్చుచుండిరి. ఈబాలురకోలాహలమును పురవాసులు వినుచు నానందించుచుండిరి.

౨౭-౨౮ ఈప్రకారముగఁ బ్రతిదినమున, రాముడు మొదలగుబాలురు, ఇతరబాలురతోఁగూడ నాడుకొనుటకువెళ్ళి తిరిగివచ్చుచుండిరి. ఇతరబాలురందఱును ప్రాతఃకాలముననే లేచి రామునిసమీపమునకు వచ్చుచుండిరి. (ఇవ్విధముగ బాలక్రీడలలో రాములుండిరి)

ఉపనీతావసిష్ఠేన గురోర్రాశ్రమవాసినః
అవిప్లుతబ్రహ్మచర్యాశ్చత్వారో రాఘవాదయః
* చతుర్దశసు విద్యాసుకుశలాశ్శీఘ్రకాలతః
స్నాతకవ్రతకర్మాఽపితే సర్వే చక్రు రంజసా॥ ౨౯-30

ఇత్యాశ్చర్యరామాయణే బాలకాండే పూర్వభాగే
పంచదశసర్గస్సమాప్తః

శ్లో॥ మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాత్మనే। చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళం॥

శ్రీవణపరవకృతాం సన్మంగళానిభవంతు.

శ్రీరామచంద్రచరణకమలసేవాతత్పరేణ విశ్వామిత్ర గోత్రజేన రామాయణతీర్థేత్యాదిబిరుదాంకితేన లక్కావఝుల వేంకటకృష్ణశాస్త్రిణా సంగ్రథితే ఆశ్చర్యరామాయణే బాలకాండే
ప్రథమభాగస్సమాప్తః.

శ్రీ రామార్పణమస్తు.

---

* చతుర్దశవిద్యాస్వరూపమాహ మనుః-పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితా। వేదాఃస్థానాని విద్యానాం ధర్మస్యచచతుర్దశ॥ ఆయుర్వేదంధనుర్వేదం గాంధర్వంచాఽర్థశాస్త్రకం। మిళిత్వాష్టాదశాఽభూవన్విద్యా ఇతివదంతి చ॥ ఉపపురాణాని పురాణేష్వంతర్గతాని, పూర్వమీమాంసా, మీమాంసాంతర్గతా, వేదాంతశాస్త్రమహాభారతరామాయణాదికం సాంఖ్యాపాతంజల్యాదికంచభిన్నమార్గతః పురుషార్థసాధకత్వాద్ధర్మశాస్త్రేష్వంతర్భావ ఇతిజ్ఞేయః.

* ౨౯-౩౦½ అనంతరము రాముఁడు మొదలగు బాలురు క్రమముగా వృద్ధిఁ బొందిరి. పిమ్మట వసిష్ఠునిచే నుపనయనములు చేయింపఁబడినవారలై గురుకులవాసము చేసి బ్రహ్మచర్యమును యథావిధిగ జరుపుచుఁ బదునాలుగువిద్యలయందుఁ గొలఁదికాలములోనే పాండిత్యమును సంపాదించి స్నాతకవ్రతమును (అనగా విద్యాసమాప్తివ్రతమును) జేసికొని గృహమునకు వచ్చిరి.

ఆశ్చర్యరామాయణమున బాలకాండమున పూర్వభాగమున

పదునైదవసర్గ ముగిసెను.

మొదటి భాగము—సంపూర్ణము.

---

పదునాలుగువిద్యల స్వరూపమును మనువు వివరించియుండెను. పురాణములు, న్యాయశాస్త్రము, మీమాంసాశాస్త్రము, ధర్మశాస్త్రము వేదములు (4) వేదాంగములు (6) మొత్తము పదునాలుగు విద్యలని చెప్పబడినవి. ఆయుర్వేదము ధనుర్వేదము, గాంధర్వము అర్థశాస్త్రము, కలిసి పదునెనిమిది విద్యలని. చెప్పఁబడెను. ఇతరములైనవి వీనిలోనే యంతర్భూతములు (ఎట్లన) ఉపపురాణములు పురాణములలోను, పూర్వమీమాంస, మీమాంసాశాస్త్రములోను, మహాభారతము రామాయణము సాంఖ్యము పాతంబలి మొదలగునవన్నియు వేర్వేరు మార్గములతో పురుషార్థసాధకములైనందున ధర్మశాస్త్రాంతర్గతములని యెఱుఁగనగు.

| పే. | పు. | త. | ఒ. |
| --- | --- | --- | --- |
| 4 | 9 | శ్రీరామరామేతి | శ్రీరామరామరామేతి |
| 6 | 10 | తాత్ | తాస్ |
| 6 | 14 | తత్వ | తత్త్వ |
| 14 | 16 | తత్వ | తత్త్వ |
| 15 | 19 | విస్తృత | విస్మృత |
| 17 | 1 మొదట | ఆ రామకథయనియుండవలెను | |
| 18 | 4 | రామాణం | రామాయణం |
| 22 | 2 | ణికీ | ణికా |
| 23 | 14 | హా | హ |
| 23 | 15 | నుక | ముక |
| 24 | 12 | మనం | మనుం |
| 26 | 10 | పురాణే | వాయుపురాణే |
| 27 | 21 | సంజా | సంజ్ఞా |
| 33 | 16 | సాధా | సావధా |
| 34 | 6 మొదట | వసిష్ఠఃఅనియుండవలెను | |
| ,, | ,, | థాసం | ధానం |
| 35 | 6 | మనునోకా | మనువృకా |
| 37 | 18 | మత్యు | మత్స్య |
| 40 | 14 | సద్య | సదృ |
| 42 | 15 | బలాత్కృత్య | బలాత్కృతవాన్ |
| 43 | 23 | నాబ్రదే | నాపరిదే |
| 44 | పేజీలో కామాలుతప్పు పడినవి | | |

| | | | |
|---|---|---|---|
| 45 | 10 | జెప్స | జెప్ప |
| 51 | 11 | ఏపృధుపలన | ఏపృధువువలన |
| 53 | 8 | నీతతో | నీతితో |
| ,, | 10 | లమ | లము |
| 54 | 1 | మి | మ |
| 55 | 10 | లోప | లోపల |
| 58 | 8 | న్నపః | న్నృపః |
| ,, | 14 | సమా | స్నమా |
| 60 | 9 | నంధా | సంధా |
| 61 | 18 | వులన | వలన |
| 62 | 12 | మాధా | మాంధా |
| 63 | 21 | తజస్సు | తేజస్సు |
| 64 | 14 | స్వాభరిః | స్సాభరిః |
| ,, | 21 | విషుపురాణే | విష్ణుపురాణే |
| 65 | 21 | మత్య | మత్స్య |
| 68 | 1 | నీయ్య | నీయ |
| 70 | 9 | మేఽతరాత్మా; | మేంతరాత్మా |
| ,, | 10 | అమృ | ఆమృ |
| 78 | 10 | తధ్ధాహి | తథాహి |
| | 11 | మమూర | మయూర |
| 82 | 18 | పురాణై | పురాణే |
| 83 | 8 | సంతుష్ఠు | సంతుష్టు |
| 84 | 4 | పుత్రి | పుత్త్రి |
| 85 | 5 | డండిన | దుండిన |

| | | | |
|---|---|---|---|
| 86 | 14 | శృత | శ్రుత |
| 87 | 12 | చండాలు | చండాల |
| 91 | 2 | నంవత్స | సంవత్స |
| | 16 | వైష్ణువుల | వైష్ణవుల |
| | 24 | ఆ | అ |
| 93 | 7 | బాహుకని | బాహుకుని |
| 94 | 3 | వాజ | వాజి |
| | 7 | అనీయ్యతాం | ఆనీయతాం |
| | 10 | షష్టి | షష్ఠి |
| | 15 | ఆనీయ్య | ఆనీయ |
| 97 | 24 | దపము | తపము |
| 100 | 8 | న్శోత్రాభ్యాం | శ్రోత్రాభ్యాం |
| | 16 | శృతసేన | శ్రుతసేన |
| 102 | 15 | త్తమః | త్తమం |
| 104 | 17 | శ్చరా | శ్చర్యరా |
| | 17 | స్సమాస్తేః | స్సమాప్తః |
| 107 | 3 | పాన | పాలన |
| 109 | 14 | స్వగృహ | స్వగృహ |
| 109 | 19 | వసిష | వసిష్ఠ |
| 112 | 2 | పరివ్యృతో | పరివృతో |
| | 5 | రావణే | రావణో |
| 113 | 14 | మిఃభావ | మిత్రభావ |
| | 14 | తనర్య | తనభార్య |

| | | | |
|---|---|---|---|
| 117 | 14 | బిలుడను | బిలుడును |
| | 20 | మంతిని | యంతిని |
| 119 | 4 | అనిజయ | అనియ |
| | 19 | విష్టు | విష్ణు |
| 120 | 10 | నైశాఖ | వైశాఖ |
| | 15 | దిలప నైత్సు | దిలీపసైత్సు |
| 121 | 19 | సుదర్మనుడు | సుదర్శనుడు |
| 122 | 10 | వూర్ధ్వ | ఊర్ధ్వ |
| 124 | 3 | శ్వత్వా | శ్రుత్వా |
| 127 | 17 | ష్నాత | స్నాత |
| 128 | 3 | వినిర్గితః | వినిర్గతః |
| | 8 | తత్ | ఆర |
| | 16 | శ్పత్వా | శ్రుత్వా |
| 130 | 15 | పుణ | పురాణ |
| 130 | 18 | నేన | వచనేన |
| 132 | 8 | గుర్దోరే | గురోర్దే |
| 134 | శ్లో $87\frac{1}{2}$ తరువాత $86\frac{1}{2}$ శోకముండవలెను | | |
| 139 | 6 | నావికా | నౌకా |
| | 18 | నావికా | నౌకా |
| 143 | 15 | అసమ | ఆసమ |
| | 21 | వభూ | వధూ |
| 144 | 10 | కారయత్వా | కారయిత్వా |
| 145 | 21 | తుమ్యు | త్యుము |
| 146 | 3 | త్వదాన్ | త్వదః |

| | | | |
|---|---|---|---|
| | 15 | ్రామో | రామః |
| 151 | 14 | నహిత | సహిత |
| 152 | 13 | కోదా | కోదా |
| 154 | 8 | గృహ్ణీం | గృహీధ్ణా |
| 155 | 12 | స్నప | స్నంప |
| 157 | 11 | శక్తి | శక్తి |
| 167 | 14 | తోషే | తోషి |
| 167 | 21 | ఆయో | అయో |
| 168 | 1 | శృత్వా | శ్రుత్వా |
| 177 | 7 | త్స | త్ప |
| 178 | 6 | నుఖం | సుఖం |
| 179 | 12 | (జూపిరి) తరువాత అనగాఅనే బ్రాకెట్టులైను చదువవలెను | |
| | 14 | హా | హ |
| 180 | 17 | శ్వ | శ్రు |
| 182 | 11 | సమా | స్సమా |
| 184 | 2 | యాం॥శఃతృ | యాశృతః॥ం |
| | 3 | ఆ | అ |
| 185 | 9 | హా | హ |
| 187 | 6 | సృష్ణి | సృష్టి |
| 187 | 10 | శాఫ | శాప |
| 189 | 7 | దు | డు |
| | 21 | లంఋ | లందఋ |
| 204 | 14 | ఆపిచ | అపిచ |
| 208 | 19 | ణీయ్యం | ణీయం |

| | | | |
|---|---|---|---|
| 209 | 25 | విఫ | సఫ |
| 210 | 12 | ఆష్ట | అష్ట |
| 212 | 6 | నుజ్దా | నుజ్ఞా |
| 216 | 10 | శృగ | శృంగ |
| 219 | 18 | నూచిం | సూచిం |
| 220 | | నృప | నృపః |
| | 14 | అంత | అంతః |
| 222 | 15 | శృ | శ్రి |
| 223 | 20 | శృ | శ్రి |
| 224 | 12 | శృ | శ్రి |
| | 19 | త్వు | త్వి |
| 225 | 16 | శృ | శ్రి |
| 226 | 8 | య్యా | యా |
| 228 | 18 | శ క్తా | శక్తా |
| 232 | 4 | శ్చ | శ్శ |
| 233 | 10 | కారమ | కారణ |
| | 17 | యొద్ధ | యొద్ద |
| 236 | 9 | ర్మానచ | ర్మాచ |
| | 19 | శ్శల | శ్శ్ర |
| 237 | 1 | నేన | నేను |
| 241 | 2 | బంధ | బంధు |
| 249 | 13 | స్యగా | స్యముగా |
| 250 | 4 | రర | రర్ధ |
| | 15 | య్యః | యః |

| | | | |
|---|---|---|---|
| 253 | 19 | క్షిష్టటము | క్షిష్టము |
| 255 | 26 | నుత్కృ | నుత్కృష్ట |
| 272 | 12 | మారా | మార |
| | 10 | రామేణ | రామః |
| 274 | 3 | బారః | బారః |
| 276 | 5 | సీధ్ద్య | సీద్ధయ |
| 291 | 1 | దుశ | దుడు |
| 294 | 15 | ష్ట | ష్ఠ |
| 295 | 29 | ష్ట | ష్ఠ |
| 301 | 16 | బాల | బాలు |
| 302 | 5 | స | సః |
| | 10 | త్రి | తు్రి |

---



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 104 B118 |
| పుస్తకం పేరు | శ్రీకృష్ణ రామాయణం |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 361 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | B,306,8 ,D |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Kasimbi |
| పేజీలు విడదీసినది | Kasimbi |
| స్కాన్ చేసినది | K Daveed |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనిది | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |